వెంకటరాయ పండిత్, తెన్మరం

# స్త్రీధర్మరత్న భాండాగారము

Madras, 1924

Record no. 604

Veṅkaṭarāya Paṇḍit, Tenmaṭhaṃ

Strīdharmaratna bhāṇḍāgāramu

Madras, 1924

Record no. 604

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వెంకటరాయ పండిత్, తెన్మఠం.

స్త్రీధర్మరత్న భాండాగారము : పాకశాస్త్ర సహితము / Tenmatam Venkatacharya Pandit.- 2. కూర్పు.- Madras : Bremner Press, 1924.

4, 6, 204 p. ;20 cm.

Record no. 604

Veṅkaṭarāya Paṇḍit, Tenmaṭhaṃ.

Strīdharmaratna bhāṇḍāgāramu : pākaśāstra sahitamu / Tenmatam Venkatacharya Pandit.- 2. kūrpu.- Madras : Bremner Press, 1924.

4, 6, 204 p. ;20 cm.

Record no. 604

35 mm microfilm

Image placement: IA IIA IB IIB　　Date filming began:

# STREE DHARMARATNA BHANDAGARAM.

BY

**TENMATAM VENKATACHARYA PANDIT**

శ్రీరస్తు.

# స్త్రీ ధర్మరత్న భాండాగారము.

(పాకశాస్త్ర సహితము)



ఈ గ్రంథము

స్త్రీ పురుషుల హితార్థము

ఆంధ్ర తాత్పర్యముకోడ

తెన్మఠం - శ్రీరంగాచార్యులచే

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

---

రెండవ కూర్పు.

---

Printed By: HADDON & Co, at the BREMNER PRESS,

MADRAS.

**1924.**

*Registered-Copyright.*

దీని వెల రూ. 2—8—0.

శ్లో.—"యస్య భార్యా శుచిర్దక్షా భర్తారమనుగామినీ ।
నిత్యం మధురవక్త్రీ చ సా రమా న రమా రమా॥"

# ప్రకటన.

ఈగ్రంథము, తొలుత 1891-వ సంవత్సరమున ముద్రింపఁబడినది. తత్కాలముద్రితములైనప్రతులన్నియు నచిరకాలంబుననె సెలవయ్యె. పదంపడి ముద్రింపించుటకుఁగొన్ని కారణంబులవలనవీలుపడకచిరకాలముగడచెను అందువలన నేతద్గ్రంథాభిలాషగల స్త్రీపురుషులకు గ్రంథములుఁలభింపకుండెను. అట్టికొఱంత దీఱునట్లు ఇప్పుడీ ద్వితీయముద్రణము గావింపబడినది.

---

| | | | |
|---|---|---|---|
| సుందరకాండము:—ప్రతిపద ఆంధ్రటీకాతాత్పర్య విశేషార్థ ప్రతిమా సహితము ... ... ... | 5 | 0 | 0 |
| పద్మపురాణోత్తరఖండము - ఆంధ్రవచన సహితము ... | 8 | 0 | 0 |
| మానవధర్మచంద్రిక:—ఆయుర్వేద చికిత్సాసంగ్రహ సహితము | 2 | 8 | 0 |
| బృహద్వైద్య రత్నాకరము:—వైద్యశాస్త్రము, కర్మవిపాక - జ్యోతిశ్శాస్త్ర-చికిత్సాప్రకరణములు గలది ... | 4 | 0 | 0 |
| స్వరశాస్త్రము:—సూర్య, చంద్ర నాడీసంచార, రేచక - పూరక-కుంభకాదిక్రమ - జలక్రీడా - తాంబూలచర్వణక్రమ-శారీరాది విషయంబుల దెల్పునది ... ... | 1 | 8 | 0 |
| పాండురంగ మాహాత్మ్యము:—పద్యకావ్యము, తెనాలి రామకృష్ణకవి విరచితము. సటిప్పణము ... ... | 2 | 0 | 0 |
| తారకనామ రామాయణము:—తెలుఁగువచనము, రామకథాసుధారస సహితము ... ... ... | 1 | 0 | 0 |
| సంగీతానందరత్నాకరము:—ప్రథమభాగము, స్వరావళి-తాళ-గీత-వర్ణ-త్యాగరాజాది కృతిసహితము. సంగీతవిద్యను అభ్యసించు స్త్రీపురుషుల కత్యంతోపయుక్తమైనది ... ... | 1 | 8 | 0 |

ఈగ్రంథములును, ఇతర సంస్కృత ఆంధ్రగ్రంథములును విక్రయింపఁబడును.

వి. పి. తపాల్ కర్చులు ప్రత్యేకముగ నియ్యవలెను.

విలాసము:— తె. శ్రీరంగాచార్యులు,
9, పల్లియప్పన్ వీధి, సాహుకారుపేట, మదరాస్.

# భూమిక.

"గృహాశ్రమాత్పరో నాస్తి యది పత్నీ వశానుగా ।
తదా ధర్మార్థకామాఖ్యం త్రివర్గఫల మశ్నుతే ॥
అనుకూల్యం కళత్రస్య స్వర్గో భవతి నిశ్చితం ।
ప్రాతికూల్యం కళత్రస్య నరకో నాస్తి సంశయః ॥
గృహాశ్రమసుఖస్థస్య పత్నీమూలం హి తత్సుఖం ।
సా పత్నీ యా విధిజ్ఞా తు చిత్తజ్ఞా వశవర్తినీ "॥ ఇతిదక్షః.

వశవర్తిని యగుభార్యకలవానికి గార్హస్థ్యమునకంటె నుత్తమమైన యాశ్రమములేదు. అట్టియిల్లాలు కలిగినయెడ-ధర్మము అర్థము కామము అనెడి త్రివర్గఫలమును గృహస్థుఁడు పొందును. భార్యయొక్క ఆనుకూల్యము స్వర్గమును బొందించును అనునది నిశ్చయము. ఆ భార్యయొక్క ప్రాతికూల్యము (అనుకూలత్వములేమి) నరకము. అందులకు సంశయము లేదు. గృహస్థాశ్రమమందున్నవారికిఁ బొందఁదగిన సుఖము భార్యయే ముఖ్యకారణముగాఁగలది; అట్టిభార్య శాస్త్రపరిజ్ఞానము కలిగినదగునేని భర్తమనసెఱిఁగి వశవర్తినియై యుండును అని దక్షవచనము.

లోకమునందు మనుష్యసామాన్యమునకు, సతి ఆనుకూల్యవతియగునేని గార్హస్థ్యమే స్వర్గాది పుణ్యలోక సుఖానుభూతి ననాయాసముగ లభింపఁజేయును. అట్టిత్రివర్గఫలదం బగుగృహస్థధర్మవృక్షమునకు నాలవాలంబు శీలవతియగు నిల్లాలు;శీలంబు శాస్త్రపరిశీలనంబునంగానిసిద్ధింపదు; శాస్త్రపరిశీలనక్షమత్వము విద్యాభ్యాసంబునంగాని కలుగనేరదు. ఇక్కాలంబుననేకారణముచేతనో అట్టివిద్యాభ్యాసము మనయాఁడువారియందు నింద్యంబై యున్నయది; అయినను ఇప్పుడిప్పుడు కొందఱు గుణగ్రాహులు "విద్యనేర్చిన తరుణులు పురుషులను లక్ష్యముచేయరు, అత్తమామలనుల్లంఘింపకోయరు, గృహకృత్యములయందు ప్రమత్తలై వర్తింతురు" అనునివి మొదలగు దుర్దోషముల నారోపించి స్త్రీవిద్యాభ్యాసమును బరిహరించు వారికి, చదువులేనియాఁడువారు భర్తలనిరసించుటలేదా? అత్తమామల నుల్లంఘింపరా? గృహకృత్యములయందప్రమత్తలై వర్తించెదరా? వ్యభిచరింపరా? అని పెక్కుదృష్టాంతములనుజూపిచెప్పి, వారి దురాక్షేపముల నివారించి,విద్యయనునదిమంచి తెలివినిబుట్టించును, తెలివివలనయుక్తాయుక్త

పరిజ్ఞానముగలుగును, యుక్తాయుక్తపరిజ్ఞానమువలన భార్యాభర్తలకుఁ బరస్పరముగల తారతమ్యమును, వారు ఒకరియెడల నొకరు నడపఁదగిన మర్యాదలను దెలిసికొని భర్తల కనుకూలురై వర్తింతురు అని బోధించి, స్త్రీవిద్యాభ్యాస పాఠశాలలను స్థాపించి బాలికలకు విద్యనేర్పుటకుఁ దగిన సాహాయ్యమును జేయుచున్నారు. అందులకు నిదర్శనముగా మృగాదులకును మనుష్యులకును ఆహారనిద్రాది ధర్మములు తుల్యములు, జ్ఞానాజ్ఞానములు మనుష్యేతరములకును మనుష్యులకును భిన్నత్వమును సూచించుచున్నవి అనువిషయము మనకుఁ దనంతనే తెలియుచున్నది; కనుక జ్ఞానమే మనుష్యులను మృగాదులకంటె నుత్కృష్టులనుగాఁ జేయుచున్నదనియు, అట్టిజ్ఞానము స్త్రీపురుష సామాన్యమునకు ముఖ్యమైనదనియు, అది విద్యలేక కేవల వ్యవహారానుభవముచేత లభించునదికాదనియు, ఒకవేళ లభించినను కోఁతులు మొదలగువానికి నేర్పఁబడిన యాటలవలె ఇతరుల తోడుపాటులేక ఉపయోగింప నేరదనియుఁ దెలిసి, ఎల్లవారును తమ యాఁడుబిడ్డలకు ముఖ్యముగఁ జదువునేర్పి తెలివిగలవారిఁగాఁజేయుదురని నమ్ముచున్నాఁడ. విద్యయనునది పురుషులకేకాని స్త్రీలకు నభ్యసనీయముకాదని యేశాస్త్రమందును జెప్పఁబడదు; భారతాది గ్రంథములయందు, వేదములయందును గార్గి సావిత్రి లోనగు గొందఱుస్త్రీలు విద్యావతులై స్వధర్మముల నెఱింగి శీలమునుగాపాడుకొని రనుకథలు కొన్ని కానవచ్చుచున్నవి.

మఱియు సత్యభామ ధనుర్విద్యావిశారదయై నరకాసురుతోడ యుద్ధంబుసేసెను. మహేశ్వరుండు పార్వతికి అనేకశాస్త్రములు బోధించెను. యాజ్ఞవల్క్యుఁడు తనభార్యకుఁ దత్త్వశాస్త్రముపదేశించె. ఆండాళ్, అవ్వయార్, కల్యాణదేవి, మొల్ల, తరిగొండవెంగమ్మ, అనువారలు గ్రంథకర్త్రులై ప్రసిద్ధిం జెందిరి. ఆధునికులలో, జస్వంతరావుభార్యయగు తులసీబాయి యుద్ధవిద్యయందునేర్పరియై యేనుఁగునెక్కి మహారాష్ట్రుల గుఱ్ఱపుదండును నడిపించెను. రామాబాయియను నామె సంస్కృతపండితురాలై యొప్పెను. కావున నీదృష్టాంతములచే స్త్రీలకు విద్యనింద్యముకాదనుటయు, అవశ్యము విద్య అభ్యసనీయమనుటయు విస్పష్టమగుచున్నది. అయి



నను స్త్రీలు కేవలబాల్యదశయందేగాని యౌవనదశయందుఁ బురుషులవలెఁ బాఠశాలలకుఁబోయి చదువ ననువుకాదనవచ్చును. ఆపక్షమున అక్షరపరిజ్ఞానపర్యంతము పాఠశాలలందుఁ జదివించి అనంతరము పితృసోదరాదులును, అటుపిమ్మట యౌవనదశయందు భర్తయును శాస్త్రపరిజ్ఞానము గలుగునట్లు చదివింపవచ్చును; అట్లుచదివింపఁబడినవారు స్త్రీధర్మవిధాయకగ్రంథములను, స్వధర్మకర్మములందు ముఖ్యంబగు పాకకర్మప్రకారము తేటపడఁ బాకశాస్త్రంబునుం జదివి, పతిభక్తియు, గృహకృత్యములయం దాసక్తియు హెచ్చి చూపఱుమెచ్చ వర్తింతురు.

ఆర్యులారా! మనవారు కామసుఖానుభవమాత్రమే స్త్రీలవలని ప్రయోజనముగా నెంచి వారినిఁ గేవల గృహధర్మసాధనములైన పశ్వాదులవలె జ్ఞానలేశములేనివారినిఁగాఁ జేయుచున్నారు అట్లుచేయుటవలన స్త్రీలు కర్తవ్యాకర్తవ్యములెఱుంగక దుష్ప్రవర్తనాదులచేతఁ దాము చెడుటయేగాక తమసహవాసముగల పురుషులనుగూడ ఇహపరములకుఁగాక చెఱచుచున్నారు; కాఁబట్టి మీఁద నుదహరించినచొప్పున విద్యాభ్యాసాదులచేత స్త్రీలు విద్యావతులును, వివేకినులును, స్వధర్మజ్ఞలును, భర్తృభక్తిరతలును, గృహకృత్యచతురలునగునట్లుగావించి యనుగ్రహింపుఁడు.

ఇదిగాక—"సైవ సాధ్వీ సుభక్తశ్చ సుస్నేహా స్సరసోజ్వలః ।
పాక స్సంజాయతే యస్యాః కరాద ప్యుదరా దపి"॥

ఏస్త్రీయొక్క చేతినుండియు కడుపు నుండియు మంచిస్నేహము గలిగి సరసమై ప్రకాశించునట్టి మంచి యన్నము యొక్కయు, మేలైన భక్తిగల కొడుకుయొక్కయు పాకము పుట్టునో అదియే పతివ్రత. అనఁగా మంచినేయివడియునట్టిదియు షడ్రసయుక్తమునైన మంచియన్నము ఏస్త్రీచేత వండఁబడునో, మంచి మైత్రియు (శృంగారాది) రసములు తెలిసిన రసికత్వమును గలిగి మంచి భక్తిగల కొడుకు పరిపక్వమైన జ్ఞానము గలవాఁడుగా ఏస్త్రీ కడుపునందుఁబుట్టునో ఆస్త్రీయే పతివ్రత అనియర్థము కాఁబట్టి, ఈచెప్పఁబడిన శ్లోకార్థమును విచారించునెడ ఉత్తమస్త్రీకి రసవంతముగాఁ బాకముసేయునేర్పును నొక ముఖ్యలక్షణముగా నేర్పడుచున్నది. కనుక పాకశాస్త్రంబునభ్యసనీయమని యూహింపవలసియున్నది

అందులకు, పరంపరగా మనయాండువారికి లభించియుండు వంటచేయు సామర్థ్యము చాలదా? వారువండిన పదార్థములు రుచ్యములై మనకుఁ దృప్తిగా భుజింప ననువుపడి యుండలేదా ? ఇంక శాస్త్రపరిజ్ఞానమువలనఁ గలుగఁబోవు లాభమేమియని యెవరేని అనిన ననవచ్చును; అయినను శాస్త్రపరిజ్ఞానమువలనఁ బదార్థముల గుణములును, ఆయాపదార్థములను వండునపుడు ఉపయోగింపఁదగిన పరిమాణాదులును దేశభేదమునుబట్టి క్రమమైన పరిమాణమునకంటెఁ దగ్గింప వలసినవియు హెచ్చింపవలసినవియు నైన పదార్థము.లివియివియనియుఁ దెలియఁబడును. అట్లు తెలిసి పాకముసేయుటచే భుజించువారికి దేహారోగ్యమును బలపుష్టులును గలుగును; ఇంతేకాదు, పదార్థముచక్కఁగాఁ బక్వముకానియెడ అది భుజించువారికిఁ గలుగఁజేయురోగాదులును అజీర్ణత్వాది దుర్గుణములును ఇట్టివి యని తెలిసికొనుటకు శాస్త్రపరిజ్ఞానమే ముఖ్యసాధనమగును.

కనుక, మీఁద నుదాహరించిన లోపంబులను నివారింపఁదగిన పాకశాస్త్ర సహితంబగు "శ్రీధర్మరత్నభాండాగారము" అను నీగ్రంథమును ముద్రింపించిన లోకోపకారముగ నుండునని తలఁచి. స్త్రీలకుఁగూడ సులభముగాఁ దెలియునట్టి సులభమైన మాటలతోఁడి తాత్పర్యముతో ముద్రింపించి ప్రకటించుటయ్యెను.

ఇది సతీహితార్థులగుఁబురుషులకును, చదువరులగు నాఁడువారికిని మిక్కిలి పరిగ్రహణీయమగుఁగాక. భ్రిమప్రమాదాదులు మానవ సామాన్యమునకు సహజంబులుగావున నిందేమేనివిశేషదోషములున్నను గుణంబులకాఁ బరిగ్రహించి యాదరింప దోషజ్ఞరాజహంసంబులం బ్రార్థించెద.

తే. వేంకట నరసింహాచార్యులు.

---

శ్రీరస్తు.

# విషయసూచిక.

పుటసంఖ్య.



---



పుటసంఖ్య.

## తృతీయ ప్రకరణము.



## భరతశాస్త్ర ప్రకరణము.





పుటసంఖ్య.



## భావ ప్రకరణము.



పుటసంఖ్య.

విషయసూచిక ముగిసెను.

ఓం శ్రీ గణాధిపతయే నమః.

# శ్రీ ధర్మరత్నభాండాగారము.

## ప్రథమ ప్రకరణము

శ్లో. ఉత్తుంగ స్తనమండలోపరి లసత్ప్రాలంబ ముక్తామణే
రంతర్బింబిత మింద్రనీలనికరచ్ఛాయం మురారే ర్వపుః ।
లజ్జావ్యాజ ముపేత్య నమ్రవదనా స్పష్టం ముదా సుందరం
పశ్యంతీ ముద మాతనోతు సతతం లక్ష్మీ ర్వివాహోత్సవే॥

తా. వివాహ సమయమున శ్రీకృష్ణమూర్తియొక్క ఇంద్రనీలమణి కాంతివంటి కాంతిగల సుందరమైన శరీరము తనవక్షస్థలముపై ప్రకాశించుచున్న ముక్తామణియందు ప్రతిఫలింపఁగా సిగ్గు అనెడి నెపముచే తలవంచికొని మణియందలి కృష్ణుని దేహమును అత్యాదరముతోఁ జూచుచున్న శ్రీలక్ష్మీదేవి యెల్లప్పుడు సంతోషము నిచ్చుఁగాత.

శ్లో. శ్రీవేంకటార్య సుమహా శ్రీనాథపదచింతనః ।
శ్రీగౌతమాన్వయేజాత శ్శ్రీశుక శాస్త్ర విశారదః॥
ఆలోక్య ధర్మశాస్త్రాణి శాస్త్రాణ్యన్యానియత్నతః ।
తనోమ్యహం ధర్మరత్నభాండాగారం వనూముదే ॥

తా. శ్రీమన్నారాయణ పదధ్యానపరాయణుండను, గౌతమవంశమునఁ బుట్టినవాఁడను, శ్రీమంతుఁడను, శ్రీమద్వేంకటాచార్యాహ్వయుండ నగు నేను ధర్మశాస్త్రములను ఇతరములగు ననేక శాస్త్రములను బాగుగఁజూచి స్త్రీల హితముకొఱకు "స్త్రీధర్మరత్నభాండాగారము" అను గ్రంథమును రచియించుచున్నాను.

తత్రాదౌ జాతకర్మాది నిరూప్యతే—

శ్లో. జాతే ఉపత్యే పితు స్స్నానం సచేలం తు విధీయతే ।
ప్రాఙ్నాభివర్ధనా త్తస్య జాతకర్మ విధీయతే॥
అమంత్రకా తు కార్యేయం స్త్రీణా మావృ దశేషతః ।
సంస్కారార్థం శరీరస్య యథాకాలం యథాక్రమం॥

తా. సంతానము గలిగిన వెంటనే బొడ్డుగోయకమునుపు తండ్రి కట్టుపుట్టముతో స్నానముచేసి జాతకర్మమును జేయవలయు. ఈజాతకర్మాదులు స్త్రీలకు శరీరశుద్ధి కొఱకు శాస్త్రోక్త కాలములయందు క్రమము దప్పక మంత్రవర్జితముగఁ జేయవలయు.

## నామకరణవిధి.

శ్లో. నామధేయం దశమ్యాం తు ద్వాదశ్యాం వా థ కారయేత్ ।
పుణ్యే నక్షత్రదివసే ముహూర్తే వా గుణాన్వితే ।
అహ న్యేకాదశే నామ పితా కుర్వీత శాస్త్రవిత్ ।
వ్యవహారర్క్ష మాసానా మనురూపం యథోదితం ॥

తా. శాస్త్రమునెఱింగి తండ్రియగువాఁడు ౧౦-౧౧-౧౨ దినములయందైనను, పుణ్యనక్షత్రముగల మఱి యేదినమందైనను వ్యవహార మాసనక్షత్రనామములనిడవలయు.

శ్లో. స్త్రీణాం సుఖోద్య మక్రూరం విస్పష్టార్థం మనోహరం ।
మంగళం దీర్ఘవర్ణాంత మాశీర్వాదాభిధానవత్ ॥
ఈకారాంతం కృతే నామ్ని పవిత్రం చ భవే త్కులం ।
అయుజాక్షరనామ శ్రీ ర్యశోదా పార్వతీతివత్ ॥

తా. స్త్రీలకు వ్యవహారనామము సుఖముగా నుచ్చరింపఁదగినదియు, క్రూరముగానిదియు, స్పష్టమైన అర్థముగలదియు, రమణీయమైనదియు, మంగళకరమైనదియు దీర్ఘమైన అంత్యవర్ణముగలదియు, ఆశీర్వాదవాచియు, శ్రీ-యశోదా-పార్వతీశబ్దములవలె ఈకారాంతమై - బేసియక్షరములు గలదియుఁగా నుంచఁబడునేని యావంశ మతిపవిత్రమగును.

## నక్షత్రమాస నామములు.

శ్లో. రోకేమమృజ్యేచిషు వృద్ధిరాదా ష్ఠాత్పేచవాంత్యశ్రవణాశ్వయుక్షు ।
శేషేషునార్క్ష్యోవః కపరస్స్వరోఽంత్య స్స్యాద్వోరదీర్ఘ స్సవిసర్గఇష్టః ॥

తా. రౌహిణీ, రైవతీ, మాఘీ, మార్గశీర్షీ, జ్యైష్ఠీ, చైత్రీ, పూర్వప్రోష్ఠపదీ, ఉత్తరప్రోష్ఠపదీ, ఆపభరణీ, శ్రావణీ, శాతభిషజీ, ఆశ్వయుజీ, కృత్తికా, తిష్యా, ఫల్గునీ, హస్తా, విశాఖీ, అనూరాధా, శ్రవిష్ఠా, ఆర్ద్రికా, మూలకా, స్వాతిః, పునర్వసుః, ఇట్లు నక్షత్రనామములను ఆయానక్షత్రములందుజన్మించిన స్త్రీకి నుంచవలయు. మిగిలిన నక్షత్రములు వర్జ్యములు.

శ్లో. మార్గశీర్షే చ వాగ్దేవీ పుష్యే పద్మావతీ భవేత్ ।
శ్రీదేవీతి చ సావిత్రీ భూమిః కళ్యాణికా స్మృతా ॥



సత్యభామా పుణ్యవతీ రూపిణీ చేందుమ త్యపి ।
చంద్రావతీ చ లక్ష్మీ చ స్త్రీనామకరణే విదుః ॥

తా. మార్గశీర్షమున-వాగ్దేవి, పుష్యమియందు-పద్మావతి, మాఘమున-శ్రీదేవి, ఫాల్గునమున-సావిత్రి, చైత్రమున-భూమి, వైశాఖమున-కల్యాణి, జ్యేష్ఠమున-సత్యభామ, ఆషాఢమున-పుణ్యవతి, శ్రావణమున-రూపిణి, భాద్రపదమున-ఇందుమతి, ఆశ్వయుజమున-చంద్రావతి, కార్తీకమున-లక్ష్మి అని యిట్లు ఆయా మాసములయందు జన్మించిన స్త్రీలకు ఆయా నామముల నిడవలయు.

## స్త్రీజాతకపద్ధతి.

శ్లో. కృతకృత్య శ్శిశుం దృష్ట్వా స్నానదానై స్స్వధర్మతః ।
పూర్వా న్నీతై స్తు దైవజ్ఞై ర్లేఖయే జ్జన్మపత్రికాం ।
వక్ష్యామి సంగ్రహేణా థ స్త్రీణాం జాతకలక్షణం ॥

తా. జన్మించిన తోడనే శిశువునుజూచి స్వస్వవర్ణ ధర్మోచితంబుగ స్నానాదులాచరించి జననకాలమందే రప్పించిన దైవజ్ఞులచే జన్మపత్రికను వ్రాయించవలయు; కావున నిఁక స్త్రీల జాతకలక్షణమును వక్కాణించెద.

శ్లో. సౌభాగ్యం సప్తమస్థానే శరీరం లగ్న చంద్రయోః ।
వైధవ్యం నిధనస్థానే పుత్రే పుత్రీం విచింతయేత్ ॥

తా. జన్మలగ్నమునకు సప్తమస్థానమును పట్టి సౌభాగ్యచింతయు, లగ్నమును చంద్రునిపట్టి శరీరచింతయు, అష్టమస్థానమునుపట్టి వైధవ్యచింతయు, పంచమస్థానమునుపట్టి పుత్రీచింతయు స్త్రీలకుఁ జేయఁదగినది.

శ్లో. సౌమ్యాభ్యాం ప్రవరా శుభత్రయయుతే జాయాభవేద్భూపతే
స్సౌమ్యైకేన పతిప్రియా మదనభే దృష్టే యుతే జన్మని ।
పాపైకేన పునర్విలోలనయనా పాపద్వయేనాధమా,
పాపానాం త్రితయేన సా పరకులం హత్వా పతిం గచ్ఛతి ॥

తా. జన్మలగ్నమునకు సప్తమస్థానము రెండుశుభగ్రహములచేఁ జూడఁబడినను లేక కూడియున్నను ఉత్తమురాలగును. అటులనే మూడుశుభగ్రహములచేత రాజభార్యయగును. ఒక శుభగ్రహముచే మగనికి ఇష్టురాలగును. సప్తమస్థానము ఒక పాపగ్రహముచేఁజూడఁబడినను-యుతమైనను చంచలనేత్రయగును. రెండు పాపగ్రహములచే అధమురాలగును. మూడు పాపగ్రహములచే మగనిజంపి అన్యకులమునఁ జేరునదియగు.

శ్లో. జనుఃకాలే యస్యా మదనభవనే వాసరమణౌ,
పతిం త్యక్త్వా నూనం కుపితహృదయా భూమితనయే ।
అవశ్యం వైధవ్యం సపది కమలాక్షీ రవిసుతే ।
జరాం పాపైర్దృష్టే నిజపతివిరోధం వ్రజతి వా ॥

తా. స్త్రీజన్మలగ్నమునకు సప్తమస్థానమున సూర్యుఁడుండిన కోపవతియు, పతిని విడుచునదియు నగును. అంగారకుఁడుండిన వైధవ్యమును బొందును. శని యుండిన శీఘ్రముగ వార్ధక్యమును జెందును. సప్తమస్థానము పాపగ్రహములచేఁ జూడఁబడినయెడల భర్తతోఁ గలహించునదియగును.

శ్లో. యస్యాశ్శశాంకే జనిలగ్నగే వా సమర్క్షగే సా ప్రకృతిస్థిరా స్యాత్ ।
శుభేక్షితే రూపవతీ గుణజ్ఞా పతిప్రియా చారువిభూషణాఢ్యా ॥

తా. చంద్రుఁడు జన్మలగ్నమందున్నను సమరాశియందున్నను స్థిరస్వభావము గలది యగును. చంద్రుఁడు శుభగ్రహములచేఁ జూడఁబడినయెడల రూపవతియు, గుణవంతురాలును, భర్తకు ఇష్టురాలును, మంచియాభరణములతోఁ గూడినదియు నగును.

శ్లో. యదాంగచంద్రావసమే భవేతాం తదా నరాకారసమా కురూపా ।
పాపేక్షితౌ పాపయుతౌ విశేషాద్గదాతురా రూపగుణైర్విహీనా ॥

తా. లగ్నచంద్రులు అసమరాశియందుండిన, పురుషునివంటి యాకారము గలదియును కురూపము గలదియునగును. ఆ లగ్నచంద్రులకు పాపగ్రహ వీక్షణముగాని పాపగ్రహసంబంధముగానిగలిగినయెడల - రోగపీడితురాలును, సౌందర్యగుణవిహీనురాలును అగును.

## రాజయోగములు.

శ్లో. జనుఃకాలే యస్యా మదనసదనే దానవగురౌ,
శుభాభ్యామాక్రాంతో గతవతి తదా సా విధుముఖీ ।
గజేంద్రాణాం ముక్తాఫలవిమలమాలావృతకుచా,
ప్రియా పత్యుర్నిత్యం ప్రభవతి శచీవ క్షితితలే ॥

తా. సప్తమస్థానమున శుక్రుఁడు రెండు శుభగ్రహములచేఁగూడియుండినపుడు జనించిన కన్యక చంద్రునివంటి ముఖముగలిగి-యేనుఁగుకుంభస్థలమునందలి ముక్తామణిహారములచేఁ గప్పఁబడిన కుచములుగలదియై - శచీదేవివలె భర్తకు నెల్లప్పుడు ఇష్టురాలగును.



శ్లో. సమాక్రాంతే లగ్నే త్రిదశగురుణా వాథ భృగుణా,
బుధేకన్యారాశౌ మదనభవనే భూమితనయే ।
మృగే కర్కే చంద్రే సతి భవతి లావణ్యలతికా,
తపోరేఖా యోషా ప్రభవతి విశేషాత్క్షితిపతేః ॥

తా. లగ్నమునందు గురువుగాని శుక్రుఁడుగాని యుండి- కన్యయందు బుధుఁడును, సప్తమమునందు అంగారకుఁడును, మకరమునందుగాని కర్కాటకమునందుగాని చంద్రుడును ఉండినయెడల కన్యక-లావణ్యము తపస్సునుగలదియై రాజపత్నియగును

శ్లో. శశాంకే కర్కస్థే భవతి హి యువత్యాం విధుసుతే,
తనౌ జీవే మీనే గవి భృగుసుతే జన్మసమయే ।
సహస్రాలీమాన్యా జగతి నృపకన్యా గుణవతీ,
విశేషాద్యోషా స్యాన్నృపతిపతికా పుణ్యలతికా ॥

తా. కర్కాటకమున చంద్రుఁడును, కన్యయందు బుధుఁడును, లగ్నమందు గురువును, మీనమందుఁగాని వృషభమునందుఁగాని శుక్రుఁడును ఉండినయెడల వేయిమంది చెలికత్తెలు గలదియును, లోకమందుఁబూజ్యురాలును, రాజపుత్రియు, గుణవంతురాలును, పుణ్యవంతురాలును, రాజపత్నియు నగును.

## సప్తమస్థానఫలము.

శ్లో. దినపగావిహ కామనికేతనం గతవతి ప్రవరా న్యపరా భవేత్
జనుషి వల్లభభావవివర్జితా సుజనతారరహితా వనితా భృశం ॥

తా. సూర్యుఁడు సప్తమమందుండిన-భర్తృప్రీతియు- సంస్వభావంబునులేని ఉత్తమురాలైనను అన్యపురుషాసక్తయగును.

శ్లో. వృషే రాకానాథే భవతి మదనే జన్మసమయే,
భవేదేషా యోషా విమలవసనా చారువదనా ।
వినమ్రా ముక్తాళీవళితకుచభారేణ నితరాం,
పరాలీలా లక్ష్మీ రతిపతిరమేవ క్షితితలే ॥

తా. వృషభము సప్తమమై అందు చంద్రుఁడుండినయెడల నిర్మలవస్త్రముగలదియు, సుందరముఖముగలదియు, ముత్తియముల దండచేఁగప్పఁబడినకుచములయొక్క భారముచే మిక్కిలివంగినదియు, రెండవలక్ష్మివలెను రతీదేవివలెను ఒప్పునదియునగును.

శ్లో. అంగారకే మదనమందిర మిందుభావం,
మందాన్వితే హరిభగే జననేఽంగనాయాః ।

వైధవ్య మేత్య నియతం కపటప్రబంధా
ద్వారాంగనా భవతి సైవ వరాంగనాపి ॥

తా. చంద్రరాశి సప్తమమై అందు అంగారకుఁడుండి-సింహరాశియందు శనియుండిన వైధవ్యమును పొంది యెల్లప్పుడు కపటపుమాటలు గలిగి తానుశ్రేష్ఠురాలైను వేశ్యాంగన యగును.

శ్లో. అనేకస్త్రీభర్తా భవతి మఖకర్తా చ మదనే,
బుధే తుంగే యస్యా జనుషి ఖలు తస్యాః పతి రిహ ।
స్వయం వామా కామాకులిత హృదయా మోదకలయా,
పరీతా ముక్తాళీ రజతకనకాళీ మణిగణైః ॥

తా. సప్తమము ఉచ్చమై అందు బుధుఁడుండినయెడల, ఆ స్త్రీభర్త అనేకస్త్రీలు గలవాఁడును, యజ్ఞము జేయువాఁడును అగును. ఆ స్త్రీ అతికామవంతురాలును, సంతోషయుక్తురాలును, వెండి బంగారు ముత్తెములు మణులు మొదలగువానియాభరణములు గలదియు నగును.

శ్లో. పరిక్రాంతే యస్యా మదనసదనే దేవగురుణా,
గుణజ్ఞా ధర్మజ్ఞా నిజపతి పదాబ్జం భజతి సా ।
మణీనాం మాలాభిః కనకఘటితాభి శ్చ శిరసా,
సమాక్రాంతా కాంతా రతిపతిపతాకేవ శశిభే ॥

తా. సప్తమస్థానము చంద్రరాశియై అందు బృహస్పతి యుండిన - గుణజ్ఞురాలును, ధర్మజ్ఞురాలును, పెనిమిటి పాదముల భజించునదియు, బంగారుతోఁగట్టఁబడిన మణులయొక్క యాభరణముల ధరించునదియు, మన్మథుని వైజయంతివలె మనోహరాలును అగును.

శ్లో. కవౌ యస్యా జన్మ న్యపి మదనగే మీనభవనే,
తదా కాంతో దాంతో రతిపతికళా కౌతుకపటుః ।
ధనుర్ధర్తా భర్తా స్వయ మపి చ సంగీతరసికా,
విలోలా పద్మాక్షీ వసనలసితా భూషణవృతా ॥

తా. సప్తమస్థానము మీనరాశియై అందు శుక్రుఁడుండినపుడు జనించిన స్త్రీయొక్క పెనిమిటి తపోవంతుఁడును, మన్మథశాస్త్రమునందు కుశలుండును, మనోహరుండును, ధనుర్ధారియునగును. స్త్రీ-సంగీతరసికురాలును, పద్మదళములవంటి చంచలనేత్రములును మంచి వస్త్రాభరణములును గలదియు నగును.



శ్లో. మదనభావగతే తపనాత్మజే పతి రతీవ గదాకులితో భవేత్ ।
మలినవేషధరోవిబలో మహాన్ జనుషి తుంగగతే ప్రవరో ధనీ

తా. సప్తమస్థానమున శని యుండినయెడల భర్త మిక్కిలివ్యాధిపీడితుఁడును మలినవేషమును ధరించువాఁడును, బలహీనుఁడును అగును. ఆ సప్తమము శనికి ఉచ్ఛమయినయెడల - భర్త గొప్పవాఁడును శ్రేష్ఠుఁడును ధనవంతుఁడును అగును.

శ్లో. సప్తమే సింహికాపుత్రే కులదోషవివర్ధినీ ।
నారీ సుఖపరిత్యక్తా తుంగే స్వామిసుఖాన్వితా ॥

తా. సప్తమమున రాహువుండిన కులమునకు దోషముల వృద్ధిజేయునదియును, సుఖహీనురాలును అగును. ఆసప్తమస్థానము రాహువునకు ఉచ్ఛమైనయెడల భర్తృసౌఖ్యము గలది యగును.

## అన్యయోగములు.

శ్లో. మిథ స్స్థౌ శుక్రార్కీ యది లవగతౌ వీక్షణమితౌ,
భవేతాం వా లగ్నే ఘటలవగతే శుక్రభవనే ।
అనంగేనాలోలా కలితనరరూపాభి రనిశం,
స్థితాభిః కాంతాభిః ఖలు మదనశాంతిం వ్రజతి సా ॥

తా. శుక్రనవాంశయందు శనియు - శని నవాంశయందు శుక్రుఁడును కూడినను పరస్పరము చూచుకొన్నను, శుక్ర క్షేత్రము లగు వృషభతులలలో నొకటి జన్మలగ్నమై ఆ లగ్ననవాంశ కుంభనవాంశ యయినను ఆస్త్రీ మన్మథోద్రేకముచేత పురుషులచేఁ దృప్తినొందక-చర్మమయ లింగమును ధరించిన స్త్రీలచే రమింపఁబడి మదనశాంతిని జెందును.

శ్లో. క్షపానాథే యస్యా గతవతి కుళీరాంగ మథవా,
మదాగారం సారం సురగురు బుధాభ్యా మపి యుతం ॥
మహాంతోపి భ్రాంతాః కతి కతి మనోజాధికతయా,
పుర స్తాం పశ్యంతో దధతి పరమానందలహరీం ॥

తా. కర్కాటకము సప్తమమై అందు చంద్రుఁడుండినను- లేక - గురు బుధులు బలిష్ఠులై సప్తమమందుండినను అనేకు లగు జితేంద్రియులైనను భ్రాంతులై కామవికారముగలిగి యాస్త్రీనిజూచి పరమానందము నొందుదురు.

శ్లో. మృగాగారే సారే గతవతి విసారం సురగురౌ,
కవౌ వా పాతాళం తపనతనయే నాపి మిళితే ।

జనుఃకాలే యస్యాః కరిముకుట ముక్తాఫలమణీ,
ప్రజానాంమాలాభి ర్వలితయుతవక్షోజయుగళే ॥

తా. మకరమున గురువు బలహీనుఁడైనను - శుక్రుఁడు శనితోఁగూడి నాలుగవ ఇంటియందుండిన యెడల - కన్యక యేనుఁగు కుంభస్థలముల యందలి ముత్యముల హారముల ధరించునది యగును.

వైధవ్యయోగములు.

శ్లో. నిశాకరా త్సప్తమభావసంస్థా మహీజమందారదివాకరాశ్చేత్ ।
తనో రిమే జన్మని నైధనేవా దిశంతి వైధవ్య మలం మదేవా ॥

తా. అంగారక శని రాహు సూర్యులు - చంద్రలగ్నమునకు సప్తమమందుగాని, జన్మలగ్నమందుగాని, జన్మలగ్నమునకు అష్టమమందుగాని, సప్తమమందుగాని ఉండినయెడల ఆకన్యకకు అవశ్యము వైధవ్యము గలుగు.

శ్లో. లగ్నాధిపో వాథ మదాలయేశో వర్గే గతః పాపనభశ్చరాణాం ।
మదే తనౌ వా ఖలఖేటవర్గా స్తదా కులం ముంచతి చంచలాక్షీ ॥

తా. లగ్నాధిపుఁడుగాని సప్తమాధిపతిగాని పాపగ్రహవర్గమును బొందినను, సప్తమమందుగాని లగ్నమందుగాని పాపగ్రహవర్గములుండినను జనించిన స్త్రీ స్వకులమును విడుచును.

శ్లో. పాపాంతరాళే యదిలగ్నచంద్రౌ స్యాతాంశుభాలోకనవర్జితౌతౌ ।
అనంగలోలా ఖలసంగమేన కులద్వయం హంతి తదా మృగాక్షీ ॥

తా. లగ్నచంద్రులు పాపగ్రహమధ్యమునందుండి శుభగ్రహవీక్షణముగూడ లేని యెడల-కన్యక-మన్మథాతురయై దుష్టసాంగత్యముచే పితృభర్తృకులములరెంటిని చెఱచునది యగును.

శ్లో. వ్యయేఽష్టమేభూమిసుతస్యరాశౌ విధౌసపాపే నవతీ హ రండా ।
మదే కుళీరే సరవౌ కుజేఽపి ధవేన హీనా రమతేఽన్యలోకైః ॥

తా. లగ్నమునకు ద్వాదశమందును అష్టమమందును అంగారక క్షేత్రమందును రాహువు పాపయుక్తుఁడైనయెడల-స్త్రీ-వైధవ్యము జెందును. సప్తమమందును కర్కాటకమందును సూర్యాంగారకులుండినయెడల ధనములేనిదై ఇతరులతోఁ గ్రీడించును.

శ్లో. తనౌచతుర్థే నిధనేవ్యయేవా మదాలయే పాపయుతః కుజశ్చేత్ ।
అనంగశీలాం ప్రకరోతి జాతైః పతిం తిరస్కృత్యవిలోలనేత్రా ॥



తా. ౧-౪-౭-౮-౧౨ - ఈస్థానములయందు కుజుఁడు పాపయుక్తుఁడై యుండినయెడల- స్త్రీ మగనినిధిక్కరించి విటులతో మన్మథక్రీడలఁ జేయును.

శ్లో. పరస్పరాంశోపగతౌ భవేతాంమహీజశుక్రౌ జననేఽంగనాయాః ।
స్వయంమృగాక్షీత్వభిసారికేవ ప్రయాతి కామాకులితాన్యగేహం ॥

తా. కుజశుక్రులు ఒకరియంశమున నొకరు చేరినయెడల జనించినస్త్రీ-అభిసారికవలె కామాతురయై పరపురుషసాంగత్యమునిమిత్తము అన్యగృహమునకుఁ బోవును.

శ్లో. పాపగ్రహేసప్తమగేఽవలోకనే శుభేన దృష్టే పతిసౌఖ్యహీనా ।
స్యాతాంమదే భౌమకవీసచంద్రౌ పత్యాజ్ఞయాసావ్యభిచారిణీస్యాత్ ॥

తా. పాపగ్రహము సప్తమస్థానమందుండినను సప్తమమును చూచినను, సప్తమస్థుఁడై పాపగ్రహముచేఁ జూడఁబడినను పతిసౌఖ్యము లేనిదగును. సప్తమమున అంగారకశుక్రులు చంద్రునితోఁ గూడియుండిన పతియాజ్ఞచే వ్యభిచరించునదియగును.

శ్లో. పాపగ్రహే సప్తమలగ్నగేహే భర్తా దివం గచ్ఛతి సప్తమాబ్దే ।
నిశాకరే చాష్టమవైరిభావే తదాష్టమాబ్దే నిధనం ప్రయాతి ॥

తా. పాపగ్రహము సప్తమమందుగాని లగ్నమందుగాని ఉండినయెడల-ఏడవ సంవత్సరమున భర్త మృతిజెందును. చంద్రుఁడు అష్టమమందుగాని శత్రుక్షేత్రమందుగాని ఉండినయెడల- ఎనిమిదవ సంవత్సరమున భర్త మృతిజెందును.

శ్లో. సప్తమేశోఽష్టమే యస్యా స్సప్తమే నిధనాధిపః ।
పాపేక్షణయుతో బాలా వైధవ్యం లభతే ధ్రువం ॥

తా. సప్తమాధిపతి అష్టమమందును, అష్టమాధిపతి సప్తమమందును పాపగ్రహములచేఁ జూడఁబడిన - బాలిక నిశ్చయముగ వైధవ్యమును జెందును.

శ్లో. సప్తాష్టమపతీ షష్ఠే వ్యయే వా పాపపీడితౌ ।
తదా వైధవ్య మాప్నోతి నారీ నైవాత్ర సంశయః ॥

తా. సప్తమాధిపతియు అష్టమాధిపతియు షష్ఠమందుగాని ద్వాదశమందుగాని పాపపీడితులై యుండిరేని - స్త్రీ-వైధవ్యమును బొందును.

శ్లో. మందారరాశౌ ససితే శశాంకే ఖలేక్షితే లగ్నగతే మృగాక్షీ ।
మాత్రాసహైవవ్యభిచారిణీస్యా త్స్మందేకుజాంశే వ్రణవిద్ధయోనిః ॥

తా. శని కుజ రాశులలో నొకటి లగ్నమై అందు చంద్రుఁడు శుక్రునితోఁ గూడి పాపగ్రహములచేఁ జూడఁబడినయెడల - స్త్రీ - తల్లివలె వ్యభిచారిణి యగును. కుజాంశయందు శనియుండిన వ్రణముతోఁగూడిన యోనిగలది యగును.

శ్లో. యదాంగచంద్రౌ కుజభే కుజస్య త్రింశాంశకే దుష్టతమైవ కన్యా।
మందస్య దాసీహిగురోస్తు సాధ్వీ మాయావిసేజ్ఞస్యకవేః కువృత్తా॥

తా. లగ్నచంద్రులు కుజరాశిలో కుజుని త్రింశాంశయందున్నయెడల అధిక దుర్మార్గురాలును, ఇటులనే శని త్రింశాంశయందున్నయెడల. దాసియునగును. గురు త్రింశాంశయందు పతివ్రతయగును. బుధుని త్రింశాంశయందు మాయావంతురాలగును. శుక్రత్రింశాంశయందు కుత్సిత చారిత్రముగలది యగును.

శుక్రరాశౌ—శ్లో. శుక్రభే కుజభాగ్నయంశే దుష్టా సౌరేః పునర్భవా।
గురోర్గుణాఢ్యా విజ్ఞా జ్ఞస్య ఖ్యాతా గుణై ర్భృగోః॥

తా. శుక్రరాశి లగ్నమయి అందు కుజత్రింశాంశయుండిన దుష్టురాలును, లేక-శనిత్రింశాంశయుండిన మారుమనువు గలదియు, అటులనే గురుత్రింశాంశయుండిన గుణవంతురాలును అగును. బుధ త్రింశాంశయుండిన జ్ఞానవంతురాలగును. శుక్ర త్రింశాంశయుండినను గుణములచే ఖ్యాతిగాంచును.

బుధస్య—శ్లో. బుధభేభూమి పుత్రస్య కాపటీ క్లీబ నచ్ఛనేః।
గురోస్సతీ విధో ర్విజ్ఞా కవేః కామాతురా భవేత్॥

తా. బుధరాశిలగ్నమై అందు కుజత్రింశాంశయుండిన కపట స్వభావము గలదియు, శని త్రింశాంశయుండిన స్త్రీత్వము లేనిదియు, గురుత్రింశాంశయందు పతివ్రతయు చంద్రత్రింశాంశయందు తెలిసినదియు, శుక్రత్రింశాంశయందు కామాతురురాలును అగును.

చంద్రభే—శ్లో. కుళీరభే భూమిసుతస్యవేశ్యా శనేః పతిప్రాణవిఘాతకర్త్రీ।
గురోర్గుణవ్రాతవతీబుధస్య శిల్పక్రియాజ్ఞా కులటాభృగోస్స్యాత్॥

తా. కర్కాటకరాశి లగ్నమై అందు కుజత్రింశాంశగనుండగా జనించిన స్త్రీ వెలయాలగును. శని త్రింశాంశయుండిన మగనిఁజంపును. గురు త్రింశాంశయుండిన సుగుణములు గలదియగును. బుధ త్రింశాంశయందు శిల్పనైపుణ్యము గలదగును. శుక్ర త్రింశాంశయందు అంకుటాలగును.

సింహభే—శ్లో. సింహేనిరాకారధరా కుజస్యవరాంగనాభానుసుతస్యనారీ।
గురో ర్నిలాధీశవధూ ర్బుధస్య దుష్టా కవే రంగజగామినీ స్యాత్॥

తా. సింహరాశి లగ్నమై అందు కుజత్రింశాంశయుండిన పురుషాకారము గలదగును. శని త్రింశాంశయందు శ్రేష్ఠురాలగును. గురుత్రింశాంశయందు భూమీశుని భార్యయగును. బుధత్రింశాంశయందు దుర్మార్గురాలగును. శుక్ర త్రింశాంశయందు కామోద్రేకము గలది యగును.



శ్లో. గుణై ర్విచిత్రా గురుభే కుజస్య మందస్య మందా గుణతత్వవిజ్ఞా।
జీవస్య విజ్ఞా శశినందనస్య శుక్రస్య రమ్యాపి భవే దరమ్యా॥

తా. గురురాశి లగ్నమై అందుకుజత్రింశాంశయుండఁగా జనించిన స్త్రీ-గుణములచే చాతుర్యము గలదియగును. శని త్రింశాంశయందు మాంద్యముగలదగును. గురు త్రింశాంశయందు గుణతత్త్వముల నెఱుంగును. బుధ త్రింశాంశయందు బాగుగ దెలిసినదగును. శుక్ర త్రింశాంశయందు ఎటువంటిదయినను మనోహరురాలుకాఁజాలదు.

శనిరాశౌ-శ్లో. మందాలయేభూమిసుతస్యదాసీ శనేరసాధ్వీ భవతీహసాధ్వీ
గురో ర్నిశానాథసుతస్య దుష్టా శుక్రస్యవంధ్యా క్రమతః ప్రదిష్టా॥

తా. శనిరాశి లగ్నమయి అందు అంగారక త్రింశాంశయుండిన దాసి, శని త్రింశాంశయందు వ్యభిచారిణి, గురు త్రింశాంశయందు పతివ్రత, బుధ త్రింశాంశయందు దుష్టురాలు, శుక్రత్రింశాంశయందు గొడ్రాలును అగును.

ఇతర యోగములు.

శ్లో. మందే మధ్యబలే కవీందు శశిజై ర్వీర్యచ్యుతైః ప్రాయశ
శ్శేషైర్వీర్యసమన్వితైః పురుషవ న్నారీ యదోజే తనుః।
జీవాంగార రవీందుజై ర్బలయుతై శ్చే దంగరాశౌ సమే
గీతా తత్త్వవిచార సారచతురా వేదాంతవాదిన్యపి॥

తా. బేసిరాశిలగ్నమై-శని మధ్యమబలుఁడుగాను- శుక్ర చంద్ర బుధులు బలహీనులుగాను - తక్కిన గ్రహములు బలయుక్తులుగానుండినయెడల- జనించిన స్త్రీ-పురుషునివలెనగును. సమరాశి లగ్నంబును - గురు అంగారక రవి బుధులు బలయుక్తులైయుండిన - భగవద్గీతాశాస్త్రతత్త్వము నెఱింగినదియు వేదాంతవాదినియునగును.

శ్లో. యదాష్టమే దేవగురౌ భృగౌ వా వినష్టగర్భా మృతపుత్రకాహి।
కుజేఽష్టమేసాకులటామృగాక్షీ చంద్రేఽష్టమేస్వామిసుఖేనహీనా॥

తా. అష్టమస్థానమున బృహస్పతిగాని శుక్రుఁడుగాని ఉండినయెడల గర్భస్రావమయినను మృతపుత్ర సంతానమయినను గలుగును. కుజుఁడుండిన అంకుటాలగును. చంద్రుఁడుండిన పతిసౌఖ్యము లేనిదగును.

శ్లో. మందేఽష్టమే రోగరతస్యభార్యా దినాధిపే సా పరితాపతప్తా।
అనంగరంగా పరకాంతసంగా మృతావగౌ సా కులధర్మభంగా॥

తా. అష్టమమున శనియుండిన రోగికి భార్య, సూర్యుఁడుండిన చింతచే తపిం

చునదియు, రాహు వుండిన ఇతర స్త్రీభర్తతో మన్మథ యుద్ధము సేయునది-కులధర్మముల విడుచునదియు నగును.

### పుత్త్రీభావవిచారము.

శ్లో. పంచమే శుభసందృష్టే పంచమాధిపతావపి ।
కేంద్రకోణే తదా నారీ బహుపుత్త్రవతీ భవేత్ ॥

తా. పంచమస్థానము శుభగ్రహముచేఁ జూడఁబడి - పంచమాధిపతి కేంద్రకోణములయందుండినయెడల-స్త్రీ-బహుపుత్త్రులు గలదగును.

శ్లో. పంచపుత్త్రవతీ జీవే సబలే చ సితే విధౌ ।
సుతాసుఖవతీ పాపే నారీ సంతానవర్జితా ॥

తా. పంచమమునందు గురువు బలయుక్తుఁడైయుండిన ఐదుగురు పుత్రులు గలుగుదురు. శుక్రచంద్రులు బలయుక్తులైనయెడల పుత్రికా సౌఖ్యము గలుగును. పాపగ్రహముండిన-సంతాన హీనురాలగును.

### విషయోగము.

శ్లో. భద్రాసార్పానలవరుణభే భాను మందారవారే,
యస్యా జన్మప్రభవతి తదా సా విషాఖ్యా కుమారీ ।
పాపో లగ్నే శుభఖగయుతః పాపఖేటౌ వరిష్ఠౌ,
స్యాతాం యస్యా జననసమయే సా కుమారీ విషాఖ్యా॥

తా. భద్రకరణము - ఆశ్లేష-కృత్తిక-శతభిషము-సూర్య శని మంగళవారములును-జన్మకాలమున గలిగియుండినప్పుడు జనించిన స్త్రీ విషకన్యక యగును. లగ్నమందు పాపగ్రహము మఱియొక పాపగ్రహముతోఁ జేరియున్నను, రెండు పాపగ్రహములు శత్రుస్థానమందుండినను అప్పుడు జనించినకన్య - విషకన్య యనంబడు.

శ్లో. ఆదిత్యసూనోర్దివసేద్వితీయా భుజంగభే భౌమదినే ఽంబుపర్వే ।
చేత్సప్తమేవాథరవౌ విశాఖా హారే స్థితావాపిచ సా విషాఖ్యా ॥

తా. శనివారము-విదియ-ఆశ్లేష మంగళవారము - సప్తమి-శతభిషము, ఆదివారము-ద్వాదశి-విశాఖ ఈయోగములయందుఁ బుట్టినది విషకన్యయగును.

శ్లో. ధర్మగేహగతే భౌమే లగ్నగే రవినందనే ।
పంచమే దేవసాధీశే సా విషాఖ్యా కుమారికా ॥

తా. నవమమున అంగారకుఁడును, లగ్నమున శనియు, పంచమమున సూర్యుడును ఉండిన విషకన్యయగును.



శ్లో. విషాఖ్యా శోకసంతప్తా దుర్భగా మృతపుత్త్రికా ।
వస్త్రాభరణహీనా చ పురాణైరుదితా బుధైః ॥

తా. విషకన్యక-దుఃఖముగలదియు-భాగ్యము లేనిదియు - మృతపుత్రికలు గలదియు - వస్త్రాభరణములు లేనిదియు నగునని ప్రాచీనులగు పండితులు వచించిరి.

### విషయోగభంగము.

శ్లో. సప్తమే సప్తమాధీశశ్శుభో చ లగ్నచంద్రయోః ।
విషయోగమలం హంతి సద్యో హరిరిభం యథా ॥

తా. సప్తమమున సప్తమాధిపతి శుభుఁడైనను- లగ్నచంద్రులకు సప్తమాధిపతి శుభుఁడైనను, సింహము ఏనుఁగును హరించునట్లు, తక్షణము విషయోగమును హరించును.

శ్లో. ఇత్థం వివాహకాలేఽపి జ్ఞాతవ్యం లగ్నచంద్రయోః ।
తదధీనం యతః స్త్రీణాం శుభాశుభఫలం భవేత్ ॥

తా. ఈప్రకారము వివాహకాలములయందుఁగూడ లగ్నచంద్రులనుపట్టి స్త్రీలకు శుభాశుభఫలములఁ దెలిసికొనవలెను.

### వైధవ్యభంగోపాయము.

శ్లో. వైధవ్యయోగయుక్తాయాః కన్యాయాః శాంతిపూర్వకం ।
వేదోక్తవిధినోద్వాహం కారయేచ్చిరజీవినా ॥

తా. స్త్రీకి వైధవ్యయోగ ముండినయెడల అది హరించుటకై చిరంజీవి యగు పురుషునికిచ్చి శాంతి పూర్వకముగ వేదోక్తవిధిప్రకారము వివాహముజేయవలయు.

---

### కర్ణవేధనము.

శ్లో. కార్తికే పౌషమాసే వా చైత్రే వా ఫాల్గునేఽపి వా ।
కర్ణవేధం ప్రశంసంతి శుక్లపక్షే శుభే దినే ।
శిశోరజాతదంతస్య మాతురుత్సంగ సర్పిణః ।
సౌచికో వేధయేత్కర్ణౌ సూచ్యా ద్విగుణసూత్రయా॥

తా. కార్తిక పుష్య చైత్ర ఫాల్గున మాసములలో దేనియందైనను శుక్లపక్షమందు శుభదినంబున తల్లితొడిలోనుండెడి పండ్లురాని ఆడశిశువునకు సూదిలో దారము రెండుపేటలు వచ్చునట్లు గ్రుచ్చి చెవులు కుట్టవలయు.

### నిష్క్రమణము.

శ్లో. ద్వాదశేఽహని మాసే వా తృతీయే చ తథాపరే ।
చతుర్థే మాసి కర్తవ్యం శిశో ర్నిష్క్రమణం గృహాత్ ॥
తత స్తృతీయే కర్తవ్యం మాసి సూర్యస్య దర్శనం ।
చతుర్థే మాసి కర్తవ్యం శిశో శ్చంద్రస్య దర్శనం ॥

తా. పండ్రెండవదినమందైనను, మూడవ మాసమందైనను, నాలవ మాసమందైనను బిడ్డను ఇంటనుండి వెలుపలికిఁ దేవలయు. మూడవమాసమందు సూర్యదర్శనమును నాలవమాసమునందు చంద్ర దర్శనమును జేయించవలయు.

### డోలారోహణము.

శ్లో. తృతీయే పంచమే మాసి తన్మాసే వా శుభే దినే ।
ధాతృ మూలోత్తరాత్రీణి తిర్యగ్భేషు ద్విదైవభే ॥
చంద్రతారాబలయుతే చాష్టమే శుద్ధిసంయుతే ।
డోలా మారోపయే ద్బాలాం ద్విజపుణ్యాంగనాదిభిః ॥

తా. ౧- ౩- ౫- ఈ మాసములలో దేనియందైనను - రోహిణి - మూల- ఉత్తర- ఉత్తరాషాఢ- ఉత్తరాభాద్ర- రేవతి- పునర్వసు- హస్త- చిత్త- స్వాతి - అశ్విని- మృగశీర్ష- అనూరాధ- జ్యేష్ఠ- విశాఖ ఈనక్షత్రములయందు చంద్ర తారాబలయుతమై యుండఁగా అష్టమశుద్ధిగలముహూర్తమునందు బ్రాహ్మణాది ముత్తైదువలు బిడ్డను ఉయ్యాలలో నునిచి యూఁచవలయును.

### అన్నప్రాశనము.

శ్లో. అన్నప్రాశన మర్భకస్య శుభదం మాస్యేవ యుగ్మే శుభం,
షష్ఠాదా వథ పంచమాదివిషమే మాసే వధూనాం శుభం ।

తా. పురుషశిశువున కన్నప్రాశనము ౬ మొదలు సరినెలలయందును, ఆడుశిశువునకు ౫ మొదలు బేసినెలలయందును చేసిన శుభకరము.

శ్లో. మాతులాంకగతస్యాస్య దేవతాపురత స్తదా ।
అలంకృతస్య దాతవ్య మన్నం పాత్రే చ కాంచనే ।
మధ్వాజ్యకనకోపేతం ప్రాశయే త్పాయసం శుభం ।
కృతప్రాశ మథోత్సంగా ద్డోలాయాం తు సముత్సృజేత్ ॥

తా. పైఁజెప్పిన శుభ ముహూర్తమున దేవునియెదుట మేనమామ ఒడిలో



అలంకరించి పెట్టుకొనియున్నబిడ్డకు బంగారుపాత్రమునందు తేనె నెయ్యి బంగారు తాఁకించిన పాయసమును తినిపించి పిమ్మట తొట్లయందు విడువవలయు.

### చూడాకర్మ.

శ్లో. తతోఽర్ధవత్సరే పూర్ణే తూష్ణీం స్త్రీణా మమంత్రకం ।
ద్వితీయే వా తృతీయే వా పంచమే శ్రుతిచోదనాత్ ।
యథాకులం యథాశాఖం చూడా కార్యా ద్విజాతిభిః ।
సర్వాన్ కేశాన్ సముద్ధృత్య ఛేదయే దంగుళద్వయం ॥

తా. ఆఱవమాసము- మొదటి సంవత్సరపూర్తి - రెండవవత్సరము - మూడవవత్సరము- ఐదవవత్సరము వీనియందెప్పుడైనను కులశాఖోచితముగ జన్మనక్షత్రమును విడిచి సుముహూర్తంబున నాఁడుబిడ్డకు అమంత్రకముగ వెండ్రుకలనెత్తిపట్టి రెండంగుళములు మాత్రము పుట్టువెండ్రుకలు దీయవలయు.

### అక్షరాభ్యాసము.

శ్లో. ప్రాప్తే తు పంచమే వర్షే ఉదగర్కే చ భాసతి ।
షష్ఠీం ప్రతిపదం కుంభం వర్జయిత్వా తథాష్టమీం ॥
రిక్తాం పంచదశీం చైవ సౌర భౌమదినే తథా ।
ఏవం సునిశ్చితే కాలే విద్యారంభం తు కారయేత్ ॥

తా. అయిదవ సంవత్సరమునందు ఉత్తరాయణమున- కుంభము- షష్ఠి- పాడ్యమి- అష్టమి- శూన్యతిథులు- అనధ్యయనతిథులు- ఏకాదశి- ద్వాదశి వీనిని, ఆది- మంగళ- శని వారములను వదలి- అష్టమశుద్ధి (అనఁగా అష్టమస్థానమున గ్రహములులేకుండుట) గల ముహూర్తమునందు స్త్రీలకు విద్యారంభము జేయవలయు.

### ఉపనయనము.

శ్లో. వైవాహికో విధిః స్త్రీణా మౌపనాయనికః స్మృతః ।
పతిసేవా గురౌ వాసో గృహార్థో ఽగ్నిపరిక్రియా ।

తా. స్త్రీలకు వివాహవిధియే యుపనయన మనంబడును. పతిసేవయే గురువునాశ్రయించుట. గృహకృత్యకరణమే అగ్ని పరిచర్య.

### వివాహము.

శ్లో. కాలాతీతే తు సంస్కారాన్ హోమపూర్వాం స్తు కారయేత్ ।
వర్షేఽష్టమే తు నారీణాం కర్మ వైవాహికం శుభం ॥

తా. ఈపైఁజెప్పిన సంస్కారములకు కాలాతీతమయ్యెనేని- వ్యాహృతిహోమమును ప్రాయశ్చిత్తముగాచేసి కార్యముల నెరవేర్చవలయు. స్త్రీలకు ఎనిమిదవ సంవత్సరమున వివాహము శుభకరము.

### వివాహభేదములు.

శ్లో. అష్టా వివాహాః సమాసేన స్త్రీవివాహే న్నిబోధత ।
బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః ।
గాంధర్వో రాక్షస శ్చైవ పైశాచ శ్చాష్టమో మతః ॥
౧—ఆచ్ఛాద్యచార్చయిత్వా చ శ్రుతశీలవతే స్వయం ।
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః ॥
౨—యజ్ఞే తు వితతే సమ్య గృత్విజే కర్మ కుర్వతే ।
అలంకృత్య సుతాదానం దైవం ధర్మం ప్రచక్షతే ॥
౩—ఏకం గోమిథునం ద్వే వా వరా దాదాయ ధర్మతః ।
కన్యాప్రదానం విధివ దార్షో ధర్మ స్స ఉచ్యతే ॥
౪—సహోభౌ చరతాం ధర్మ మితి వాచా నుభాష్య తు ।
కన్యాప్రదాన మభ్యర్చ్య ప్రాజాపత్యో విధి స్స్మృతః ॥
౫—జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయై చ స్వశక్తితః ।
కన్యాప్రదానం స్వాచ్ఛంద్యా దాసురో ధర్మ ఉచ్యతే ॥
౬—ఇచ్ఛయా న్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్య చ ।
గాంధర్వ స్స తు విజ్ఞేయో మైథున్యః కామసంభవః ॥
౭—హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశంతీం రుదతీం గృహాత్ ।
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధి రుచ్యతే ॥
౮—సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి ।
స పాపిష్ఠో వివాహ స్తు పైశాచః ప్రథితో౽ష్టమః ॥

తా. బ్రాహ్మము-దైవము-ఆర్షము-ప్రాజాపత్యము-ఆసురము- గాంధర్వము-రాక్షసము-పైశాచము అని వివాహము ఎనిమిదివిధంబులు. వేదాధ్యయనము చేసిన వాఁడును, సదాచారసంపన్నుఁడును అగువానిని తానుగా బిలిచి మధుపర్కాదుల నిచ్చి పూజించి కన్యనిచ్చుట- బ్రాహ్మము. ౧. యజ్ఞమునందు కర్మను చక్కఁగ చేసిన ఋత్విక్కునకు భూషణాదులచే నలంకరింపఁబడిన కన్యనిచ్చుట-దైవము. ౨. ఒకటి-రెండుగోమిథునములను వరునివలన ధర్మముగ దీసికొని విధ్యుక్తముగఁగన్యనిచ్చుట



ఆర్షము. ౩ - మీరిద్దఱు గృహస్థాశ్రమమందుండి ధర్మమును ఆచరింపవలయునని వరుని అడిగి యట్లే ఆచరించెదమని వరుఁడు ప్రతిజ్ఞ చేసినమీఁదట వరునిసత్కరించి కన్య నిచ్చుట ప్రాజాపత్యము. ౪. కన్యయొక్క జ్ఞాతులకు లేక-పితలకు-లేక- కన్యాదాతలకు విశేషముగ ధనమిచ్చి స్వేచ్ఛానుసారముగఁ గన్యను దీసికొనుట ఆసురము. ౫. కన్యావరులయొక్క పరస్పరేచ్ఛచేతజరిగిన సంయోగము గాంధర్వము. ౬. వివాహ నిరోధకులగువారిని కొట్టి చంపి రోదనము చేయుచున్న కన్యను ఇంటనుండి బలవంతముగఁ గొనిపోవుట రాక్షసము. ౭. నిదురజెందియు మైమఱచియు, ఏమఱుపాటుజెందియు నున్న స్త్రీని రహస్యముగ నెత్తికొనిపోవుట పైశాచము. ౮.

శ్లో. చత్వారో బ్రాహ్మణస్యాద్యా శ్శస్తా గాంధర్వ రాక్షసౌ ।
రాజ్ఞ స్తథా సురో వైశ్యే శూద్రే చాంత్య స్తు గర్హితః ।
అశుల్కా బ్రాహ్మణాద్యాశ్చ తారయంతి కులద్వయం ॥

తా. బ్రాహ్మము-దైవము-ఆర్షము-ప్రాజాపత్యము ఈనాలుగును బ్రాహ్మణయోగ్యములు. గాంధర్వము-రాక్షసము ఇవి క్షత్రియయోగ్యములు. ఆసురము- వైశ్యశూద్ర యోగ్యము. పైశాచము-ఎల్లవారలకును నిషేధము. బ్రాహ్మణులు శుల్కమునీయక కన్యాదానము చేసినయెడల రెండుకులములు తరించును.

### కన్యాశుల్కగ్రహణమహాదోషము.

శ్లో. ఆదదీత న శూద్రో౽పి శుల్కం దుహితరం దదత్ ।
శుల్కం హి గృహ్ణన్ కురుతే ఛన్నం దుహితృవిక్రయం ॥
కన్యావిక్రయిణో మూఢా మహాపాపస్య కారకాః ।
పతంతి నరకే ఘోరే దహం త్యాసప్తమం కులం ॥
కన్యాం తు జీవనార్థాయ య శ్శుల్కేన ప్రయచ్ఛతి ।
ఉపభుంక్తే పురీషం చ మూత్రం తస్యాః పరత్ర చ ॥
క్రయక్రీతా తు యానారీ న సా పత్నీ విధీయతే ।
సా తు దైవే చ పిత్ర్యే చ దాసీ స్యా న్న చ సంశ్రితా ॥
య స్తాం వివాహయే త్కన్యాం బ్రాహ్మణో మదమోహితః ।
అసంభాష్య స్త్వపాంక్తేయ స్స విప్రో వృషలీపతిః ॥
న కన్యాయాః పితా విద్వాన్ గృహ్ణీయా చ్ఛుల్క మణ్వపి ।
స్త్రీధనాని తు యో మోహా దుపజీవంతి బాంధవాః ।
నారీవిత్తాని వస్త్రం వా తే పాపా యాంత్యధోగతిమ్ ॥

తా. శూద్రుఁడైనను కన్యనిచ్చి శుల్కమును దీసికొనఁగూడదు. అట్లు దీసి కొనునేని యది కన్యావిక్రయ మనఁబడును. కన్యావిక్రయము జేయు మూర్ఖులు మహాపాపాత్ములు. ఘోరమగు నరకమందుఁబడి తనకుముందు ఏడుతరములవారిని నరకమున ద్రోసి దహింపంజేయుదురు. జీవనముకొఱకు శుల్కము దీసికొని కన్యనిచ్చువాఁడు ఆకన్యయొక్క మూత్రపురీషములను భుజించువాఁడగుచున్నాఁడు. అట్లుక్రయముచేఁ గొనఁబడినకన్యను పత్నియనఁజనదు. దేవ పితృకార్యములయందు చేరనీయక దాసివలె నుంచవలయును. ఎవఁడైనబ్రాహ్మణుఁడు కామమోహితుఁడై శుల్కగృహీత యగుకన్యను వివాహమాడునేని వాఁడు భాషింపఁదగనివాఁడును పంక్తికి అనర్హుఁడునై శూద్రాపతి యనిపించుకొనును. కన్యయొక్కతండ్రి అణుమాత్రమునైనను శుల్కమును దీసికొనఁగూడదు. స్త్రీధన మగు వస్త్రాభరణములను బాంధవు లెవరైనను జీవనముగ జేసికొనిరేని వారలు అధోగతిపాలగుదురు

### కన్యాదానకాలము.

శ్లో. అష్టవర్షా భవే ద్గౌరీ నవవర్షా తు రోహిణీ ।
దశవర్షా భవే త్కన్యా అతఊర్ధ్వం రజస్వలా ॥
మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతా తథైవ చ ।
త్రయ స్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలాం ॥
పితుర్గృహే తు యా కన్యా రజః పశ్యత్యసంస్కృతా ।
భ్రూణహత్యా పితు స్తస్యా స్సా నారీ వృషలీ స్మృతా ॥
దత్వా చ వృషలీం దాతా గృహీత్వా తు వర శ్చ తాం ।
ఇహజన్మని శూద్రత్వం మృతో శ్వానా తు జన్మతః ॥

తా. ఎనిమిది సంవత్సరములచిన్నది గౌరి. తొమ్మిదిసంవత్సరములది రోహిణి. పది సంవత్సరములది కన్య. అటుపైని రజస్వల యనంబడు. కన్య వివాహమునకు ముందు రజస్వల యగునేని తల్లి తండ్రులును అన్నయును నరకము నొందుదురు. తండ్రికి భ్రూణహత్యాదోషము సంభవించును. అదియును శూద్రస్త్రీ యగును. దానిని దానము జేసినవాఁడును పరిగ్రహించినవాఁడును ఈలోకమున శూద్రులయి మరుపుట్టుకయందు కుక్కలయి పుట్టుదురు.

### రజస్వలాదాననిషేధము.

శ్లో. జాతిభ్రంశభయా ద్విప్రో నైనాం దద్యా ద్రజస్వలాం ।
అన్యేషు క్షత్రియాద్యేషు నైతద్విధి రవశ్యకః ॥



తా. బ్రాహ్మణులలో రజస్వలయగుటకుఁ బూర్వమే పెండ్లి జరుగవలయు. అట్లుజరుగనియెడల జాతిభ్రంశము నొందుదురు. క్షత్రియాదుల కీవిధి పట్టింపుగాదు.

### కన్యాలక్షణము.

శ్లో. న శ్మశ్రువ్యంజనవతీం న చైవ పురుషాకృతిం ।
నఘుర్ఘురస్వరాం క్షామాం తథాకాకస్వరాం న చ ॥
నానిబద్ధేక్షణాం తద్వ ద్వృత్తాక్షీం నోద్వహే ద్బుధః ॥
యస్యా శ్చ రోమశే జంఘే గుల్ఫౌ యస్యా స్తథోన్నతౌ ।
గండయోః కూపకౌ యస్యా హసంత్యాం స్తాం చ నోద్వహేత్ ॥
నాతిరూక్షచ్ఛవిం పాండు కరజా మరుణేక్షణాం ।
ఆపీనహ స్తపాదాం చ న కన్యా ముద్వహే ద్బుధః॥
న వామనాం నాతిదీర్ఘాం నోద్వహే త్సంహతభ్రువాం ।
నచాతిచ్ఛిద్రదశనాం నకరాళముఖీం నరః ।
పార్ష్ణిస్థూలాం రోమశీలాం యమళాం శ్యావదంతినీం ॥
మాతులాన్ భజతే పుత్రః కన్యకా భజతే పితౄన్ ।
యథా శీలా భవే న్మాతా తథాశీలా భవే త్సుతా ॥
పితు ర్వా భజతే శీలం మాతు ర్వో భయమేవ వా ।
సుశీలవర్తనా త్కన్యా కులా ద్గ్రాహ్యా సుచారిణీ ॥

తా. గడ్డము-మీసము-పురుషాకారము-ఘుర్ఘురస్వరము-కాకస్వరము-శుష్కించుట - మనస్సునకు చూపునకు ఇంపులేకుండుట - చిన్నకన్నులు-నవ్వినప్పుడు చెక్కిళ్ళయందు గుంటలుపడుట - తెల్లగనుండుగోళ్లు - పిక్కలయందు రోమములు-ఎత్తుడు చీలమండలు - ఎఱ్ఱని చూపులు-బలిసిన కాళ్లుచేతులు - పొట్టితనము- పొడుగుతనము- ముడిబడిన కనుబొమలు-మిట్టలు సందులు కోఱలుగల పండ్లు-దేహమాద్యంతము రోమములు ఈలక్షణములుగల స్త్రీలు వివాహమునకు అయోగ్యలు. పుత్రుఁడు మేనమామను పోలియుండును. కూఁతురు తండ్రిపోలిక నుండును. తల్లిదండ్రుల స్వభావము కూఁతునకమరియుండును. కాఁబట్టి సచ్ఛీలవర్తనములుగల కుటుంబమునుండి సుచారిణి యగువధువును దీయవలయు.

శ్లో. అసపిండా చ యా మాతు రసగోత్రా చ యా పితుః ।
సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణ్యమైథునీ॥

తా. తల్లికి అసపిండయు, తండ్రికి సగోత్రముకానిదియు నగు అక్షతయోనియైన కన్యను వివాహమాడవలయు.

# స్త్రీ సాముద్రికము.

శ్లో. ఆపాదతల మారభ్య యావత్కేశశిరోరుహం క్రమాత్ ।
శుభాశుభాని వక్ష్యామి లక్షణాని మృగీదృశాం ॥
కంఠ శ్శిరః కరౌ పాదౌ వక్ష శ్చాంగాని దేహినాం ।
ఉపాంగా న్యంగుళీనేత్రనాసాస్య శ్రవణాని చ ॥

తా. స్త్రీలయొక్క అఱకాళ్లు మొదలుకొని తలవెండ్రుకల వఱకు వరుసగ నన్నియవయవముల శుభాశుభలక్షణములను చెప్పెదను. కంఠము-శిరము-హస్తములు-పాదములు- ఱొమ్ము ఇవి అంగములనఁబడును. వ్రేళ్లు- నేత్రములు- ముక్కు-నోరు- చెవులు ఇవి ఉపాంగములనఁబడును.

## పాదములు.

శ్లో. స్త్రీణాం పాదతలం స్నిగ్ధం మాంసలం మృదులం సమం ।
అస్వేద ముష్ణ మరుణం బహుభోగా దిదం స్మృతం ।
రూక్షం వివర్ణం పరుషం ఖండితం చ వివర్ణకం ।
శూర్పాకారం చ శుష్కం చ దుఃఖదౌర్భాగ్యసూచకం ॥
చక్ర స్వస్తికవజ్రాంకం ధ్వజమీనాతపత్రవత్ ।
యస్యాః పాదతలం బ్రహ్మన్ ! సా భవే త్క్షితిపాంగనా ॥
భవే దఖండభోగాయోర్వ్యాం మధ్యాంగుళి సంగతం ।
నఖా స్సువర్ణవర్ణాభా దుఃఖదారిద్ర్యసూచకాః ॥
ఉన్నతో మాంసలోఽంగుష్ఠో వర్తులోఽతులభోగదః ।
వక్రో హ్రస్వ శ్చ చిపిట స్సుఖసౌభాగ్యవర్జితః ॥
విధవా విపులేన స్యా ద్దీర్ఘాంగుష్ఠేన దుర్భగా ।
మృదుహ్యాంగుళయ శ్శస్తా ఘనా వృత్తా స్సమున్నతాః ॥
దీర్ఘాంగులీభిః కులటా కృశాభి రతినిర్ధనా ।
హ్రస్వాయుష్యా తిహ్రస్వాభి ర్భుగ్నాభిః కులనాశినీ ॥
చిపిటాభి ర్భవే ద్దాసీ విరళాభి ర్దరిద్రిణీ ।
పరస్పరం సమారూఢాః పాదాంగుళ్యో భవంతిచేత్ ।
హత్వా బహూ నపి పతీ న్పరప్రేష్యా తథా భవేత్ ॥



యస్యాః కనిష్ఠికా భూమిం సగచ్ఛంత్యాః పరిస్పృశేత్ ।
సా ద్రుతం స్వపతిం హత్వా జారేణ రమతే పునః ॥
అనామికా చ మధ్యా చ యది భూమిం న సంస్పృశేత్ ।
పతిద్వయం నిహంత్యాద్యా చాపరా తు పతిత్రయం ॥
ప్రదేశినీ భవే ద్యస్యా అంగుష్ఠా దతిరేకిణీ ।
కన్యైవ కులటా సా స్యా దేష ఏవ వినిశ్చయః ॥
స్నిగ్ధా స్సమున్నతా స్తామ్రా వృత్తాః పాదనఖా శ్శుభాః ।
రాజ్ఞీత్వసూచకం స్త్రీణాం పాదపృష్ఠం సమున్నతం ।
అస్వేద మసిరాఢ్యం చ మసృణం మృదు మాంసలం ॥
దరిద్రా మధ్యనమ్రేణ సిరాళే నాధ్వగా వధూః ।
రోమాఢ్యేన భవే ద్దాసీ నిర్మాంసేన చ దుర్భగా ॥

తా. స్త్రీలకు అఱకాలు నునుపుగ బలిసినదిగ మెత్తగ సమముగ చెమటలేనిదిగ ఉష్ణముగ ఎఱ్ఱగ నుండెనేని అనేకభోగాదులనిచ్చునది యగును. అఱకాళ్లు నిగ్గుగల్లవిగ వివర్ణముగ కఠినముగ పగుళ్లుగలవిగ కాంతిలేనివిగ చేఁటలవలె నుండునవిగను ఎండినవిగను నుండిన దారిద్ర్యసూచకములగును. అఱకాళ్లయందు-చక్రము-స్వస్తికము-వజ్రము ధ్వజము- మత్స్యము-గొడుగు వీనియాకారమువంటి రేఖలుండిన రాజపత్నియగును. కాలివ్రేళ్ల నడిమిభాగము భూమియందు తాఁకియుండిన నఖండభోగములు గలుగును. బొటనవ్రేలు ఎత్తుగను గుండ్రముగను నుండిన విశేషసౌఖ్యము గలుగును. గోళ్లు సువర్ణవర్ణముగనుండిన దుఃఖదారిద్ర్యములు గలుగును. బొటనవ్రేలు వంకరగ పొట్టిగ చప్పిగ నుండిన సుఖసౌభాగ్యములు గలుగవు. వెడల్పుగ నుండిన విధవయగును. మిక్కిలి పొడువుగనుండిన దౌర్భాగ్యము గలుగును. వ్రేళ్లు మెత్తగను లావుగను ఉన్నతములుగను ఉండిన శుభసూచకములు. వ్రేళ్ళుపొడవైయుండిన లంజెయగును. కృశించియుండిన ధనహీనురాలగును. మిక్కిలి పొట్టిగనుండిన స్వల్పాయువుకలది యగును. వంకరగనుండిన కులనాశనియగును. చప్పిగనుండిన దాసియగును. ఎడములు గలిగియుండిన దరిద్రురాలగును. ఒకదానిమీఁద నొకటియెక్కిన అనేకపతులనుజంపి పరపురుషులచే తీసికొనిపోఁబడును. నడుచునప్పుడు చిటికెనవ్రేలు భూమిని తాఁకకుండిన తనమగనిఁ జంపి జారునితోఁ గ్రీడించును. దానిప్రక్కదియగు అనామికవ్రేలు నేలను తాఁకకుండిన నిద్దఱు పతులనుజంపును. నడిమివ్రేలు తాఁకకుండిన ముగ్గురు పతులనుజంపును బొటనవ్రేలికంటె ప్రక్కవ్రేలు మించియుండిన కన్యాత్వమునందే వ్యభిచారిణియగును. నును పు-ఔన్నత్యము-ఎఱుపు-వర్తులవయు గలిగినగోళ్ళు శుభప్రదములు. మీఁగాలు

గను చెమటలేనిదిగను నరములు తెలియనిదిగను నునుపుగను ఎత్తుగను బలిసినదిగను నుండిన రాజపత్నీత్వము గలుగును. మీగాలి నడిమిభాగము వంగియుండిన దరిద్రురాలగును. నరములు తెలియుచుండిన మార్గము నడుచునదియగును. రోమములుండిన దాసియగును. మాంసహీనమై చెక్కవలె నుండిన అదృష్టహీనురాలగును.

చీలమండలు.

శ్లో. గూఢౌ గుల్ఫౌ చ శుభదౌ వసిరాళౌ సువర్తులౌ ।
విపులౌ శిథిలౌ దృశ్యౌ స్యాతాం దౌర్భాగ్యసూచకౌ ॥
యస్యాః పథి సమాయాంత్యా రజో భూమే స్సముచ్ఛరేత్ ।
సా పాంసులా ప్రజాయేత కులత్రయవినాశినీ ॥

తా. చీలమండలు ఎముకలు తెలియక గూఢములుగను, గుండ్రములుగను నరములు తెలియనివిగనునుండిన శుభప్రదములు. విశాలముగను సడలినవిగను పెద్దనరములు పైకి తెలియునవిగనునుండిన దారిద్ర్యసూచకములు. దారి నడుచునపుడు భూమినుండి దుమ్ము ఎగురుచుండిన జారిణియై కులత్రయమును నశింపజేయునదియగును.

మడమలు.

శ్లో. సమపార్ష్ణి శ్శుభా నారీ పృథుపార్ష్ణి శ్చ దుర్భగా ।
కులటోన్నతపార్ష్ణి స్స్యాత్ దీర్ఘపార్ష్ణి శ్చ దుఃఖభాక్ ॥

తా. కాలిమడమలు సమముగనుండిన శుభకరము. లావుగనుండిన దౌర్భాగ్యము గలది, ఎత్తుగనుండిన వ్యభిచారిణి, పొడువుగనుండిన దుఃఖమును పొందునదియగును.

పిక్కలు.

శ్లో. రోమహీనే శుభే స్నిగ్ధే యజ్జంఘే క్రమవర్తులే ।
సా రాజపత్నీ భవతి హ్యాసిరే సుమనోహరే ॥
ఏకరోమా రాజపత్నీ ద్విరోమా తిసుఖాన్వితా ।
త్రిరోమా రోమకూపేషు భవే ద్వైధవ్యదుఃఖభాక్ ॥

తా. పిక్కలు రోమములులేక నునుపై గుండ్రముగను, నరములు తెలియక రమ్యముగనునుండిన రాజపత్ని యగును. రోమకూపములయం దొకరోమముండిన రాజపత్నియును, రెండు రోమములుండిన సుఖవంతురాలును, మూడు రోమములుండిన వైధవ్య దుఃఖములు గలదియు నగును.

మోకాళ్లు.

శ్లో. వృత్తం పిశితసంలగ్నం జానుయుగ్మం ప్రశస్యతే ।
నిర్మాంసం స్వైరచారిణ్యా దరిద్రాయా శ్చ విశ్లథమ్ ॥



తా. మోకాళ్ళు వట్రువలై మాంసమునందణగియుండిన ప్రశస్తములు. మాంసహీనమైయుండిన వ్యభిచారిణి యగును. సడలియుండిన దరిద్రురాలగును.

తొడలు.

శ్లో. సుదృఢైః కరభాకారై రూరుభి ర్మసృణై ర్ఘనైః ।
సువృత్తై రోమరహితై ర్భవేయు ర్భూభుజవల్లభాః ॥
వైధవ్యం రోమశై రుక్తం దౌర్భాగ్యం చిపిటై రపి ।
మధ్యచ్ఛిద్రై ర్మహాదుఃఖం దారిద్ర్యం కఠినత్వచైః ॥

తా. తొడలు దృఢములుగను, ఏనుగు తొండమువలెను, నునుపుగను, లావుగను, గుండ్రముగను, రోమహీనములుగను నుండిన రాజపత్నులగుదురు. రోమములు గలిగియుండిన వైధవ్యమును, చప్పిగనుండిన దౌర్భాగ్యమునుగలుగును, నడుమ పల్లములుగలిగియుండిన మహాదుఃఖమును, చర్మము కఠినముగనుండిన దారిద్ర్యంబునుగలుగును.

మొల- నడుముక్రిందిభాగము.

శ్లో. చతుర్భి రంగులై శ్శస్తా కటి ర్వింశతిసంయుతైః ।
సమున్నతనితంబాఢ్యా చతురశ్రా మృగీదృశాం ॥
వినతా చిపిటా దీర్ఘా నిర్మాంసా శకటాకృతిః ।
హ్రస్వరోమయుతా నార్యా దుఃఖవైధవ్యసూచకా ॥
నితంబబింబో నారీణా మున్నతో మాంసలః పృథుః ।
మహాభోగాయ సంప్రోక్త స్తదన్యోఽశర్మణే మతః ॥

తా. మొల(నడుముక్రిందిభాగము)ఇరువదినాలుగంగుళముల వెడల్పుగలిగి ఉన్నతములైన పిఱుదులు గలదిగను చదరముగను నుండిన రాజపత్నియగును. వంగినదియు చప్పిగను పొడువుగను మాంసహీనముగను శకటాకారముగను పొట్టిగను రోమములు గలదిగను నుండిన దుఃఖవైధవ్యసూచకమగును. నితంబబింబము (పిఱుదులుండెడిచోటు) ఉన్నతముగను బలిసినదిగను విశాలముగను నుండిన మహాభోగమునిచ్చు. దీనికి వ్యతిరిక్తముగనుండిన సౌఖ్యహీనమగును.

పిఱుదులు.

శ్లో. కపిత్థఫలవద్వృత్తౌ మృదులౌ మాంసలౌ ఘనౌ ।
స్ఫిచౌ వళివినిర్ముక్తౌ రతిసౌఖ్యవివర్ధనౌ ॥

తా. పిఱుదులు వెలగపండ్లవలె గుండ్రముగను మెత్తగను బలిసినవిగను, [illegible]విగను ముడుతలులేనివిగను నుండిన సురతసౌఖ్యము నిచ్చునవి యగును.

## గుహ్యము.

శ్లో. శుభః కమఠపృష్ఠగజస్కంధోపమో భగః ।
వామోన్నత స్తు కన్యాదః పుత్త్రదో దక్షిణోన్నతః ॥
ఆఖురోమా గూఢమణి స్సుశ్లిష్ట స్సంగతః పృథుః ।
తుంగః కమలవర్ణాభ శ్శుభో ఽశ్వత్థదళాకృతిః ॥
కురంగఖురరూపో య శ్చుల్లీకోటరసన్నిభః ।
రోమశో వివృతాస్య శ్చ దృశ్యనాసోఽతిదుర్భగః ॥
శంఖావర్తో భగో యస్యా స్సా గర్భ మిహ నేచ్ఛతి ।
వంశవేతసపత్త్రాభో ఘనరోమాఘనాసికః ।
వికటః కుటిలాకారో లంబగల్ల స్తథాఽశుభః ॥
భగస్యజాలం జఘనం విస్తీర్ణం తుంగమాంసలం ।
మృదులం మృదురోమాఢ్యం దక్షిణావర్తపీడితం ॥
వామావర్తం చ నిర్మాంసం భుగ్నం వైధవ్యసూచకం ।
సంకటం స్థపుటం రూక్షం జఘనం దుఃఖదం సదా ॥

తా. గుహ్యము-తాఁబేటివీఁపువలెను, ఏనుఁగుమూఁపురమువలెను నుండిన శుభప్రదము. ఎడమప్రక్క ఉన్నతముగనుండిన స్త్రీసంతానంబును, కుడిప్రక్క ఉన్నతముగనుండిన పురుషసంతానంబును గలుగును. మృదువై సూక్ష్మమగు రోమములుగలిగి బాగుగకలిసినదిగను, విశాలముగను, ఉన్నతముగను, పద్మమువంటి వర్ణముగలదిగను నుండు గూఢమణితోఁగూడి, అశ్వత్థదళాకారమగు భగము శుభప్రదము. లేడియడుగు వంటి రూపముగలదియు, ప్రొయ్యితొఱ్ఱవలెనుండునదియు, రోమములచే దట్టమైనదియు ముఖము తెఱచుకొనియుండునదియునగు భగము దౌర్భాగ్యసూచకము. శంఖావర్తమువంటి సుడిగల భగము గర్భమును గ్రహింపనేరదు. వెదురాకు-ప్రబ్బలియాకు వీని యాకారముగలిగి ఘనమయిన రోమములుగల నాసికగలిగి హెచ్చుతక్కువయై వంకరయై వ్రేలాడుచున్న పార్శ్వస్థానములు గలిగియుండు మదనమందిరము అశుభప్రదము. భగస్థానమునకు పార్శ్వదేశము విశాలముగను, ఉబికిన మాంసముగలదిగను, మెత్తగను, మెత్తని రోమములతోఁ గూడినదిగను, దక్షిణపు సుడి కలదిగనునుండిన శుభసూచకము. ఆప్రదేశము మాంసములేక వంగినదై యెడమ సుడి గలిగియుండిన వైధవ్యము కలుగును. ఇరుకైనదియు నడుమవంగినదియు రోమములచే దట్టమయినదియునగు జఘ అనఁగా - మడికట్టు-దుఃఖప్రదము.



## పొత్తికడుపు.

శ్లో. వస్తిః ప్రశస్తా విపులా మృద్వీ స్తోకసమున్నతా ।
రోమశా చ సిరాళా చ రేఖాంకా నైవశోభనా ॥

తా. పొత్తికడుపు విశాలమై మృదువై కొంచెము ఎత్తుగలిగియుండిన శ్రేష్ఠము. రోమములు నరములు గీఱలు గలిగియుండిన మంచిదికాదు.

## బొడ్డు.

శ్లో. గంభీరా దక్షిణావర్తా నాభి స్స్యా త్సుఖసంపదే ।
వామావర్తా సముత్తానా వ్యక్తగ్రంథి ర్న శోభనా ॥

తా. బొడ్డు లోఁతై కుడిపార్శ్వముగా సుడితిరిగియుండిన సుఖసంపదలు కలుగును. ఎడమసుడియు లోఁతులేనిదియు వీడినముడిగలదియు నగుబొడ్డు అశుభకరము.

శ్లో. సూతే సుతాన్ బహూ న్నారీ పృథుకుక్షి స్సుఖాస్పదం ।
క్షితీశం జనయే త్పుత్త్రం మండూకాభేన కుక్షినా ॥
ఉన్నతే నోదరేణేవ వంధ్యా నారీ ప్రజాయతే ।
ఆవర్తయుతేనైవ దాసికా భవతి ధ్రువం ॥
కోమలై ర్మాంసనంయుక్తై స్సమానైః పార్శ్వకై శ్శుభం ।
యస్యా దృశ్యసిరే పార్శ్వే ఉన్నతే రోమసంయుతే ।
నిరపత్యా చ దుశ్శీలా సా భవే ద్దుఃఖ శేవధిః ॥
ఉదరేణాతితుచ్ఛేన విసిరేణ మృదుత్వచా ।
యోషి ద్భవతి భోగాఢ్యా నిత్యం మృష్టాన్న సేవినీ ॥
కుంభాకారం దరిద్రాయా జఠరం చ మృదంగవత్ ।
సువిశాలోదరీ నారీ నిరపత్యా చ దుర్భగా ।
ప్రలంబజఠరా హంతి. శ్వశురం చాపి దేవరమ్ ॥

తా. కడుపు పెద్దదిగనుండిన బహుపుత్రులను కనును. కప్పయాకారమువంటి కడుపుగలది భూపతినిగనును. ఉన్నతముగనుండిన గొడ్రాలగును. కడుపున సుడియుండిన దాసియగును. పార్శ్వములు సమముగను మృదువుగను మాంసముగలదిగనునుండిన శుభకరము. నరములు తెలియుచు రోమములతోఁగూడి యున్నతములుగనుండిన సంతానహీనురాలును దుశ్శీలురాలునై దుఃఖవంతురాలగును. కడుపునరములు తెలియక మెత్తని చర్మముగలిగి సూక్ష్మముగనుండిన భోగములతోఁ గూడినదియు, మృష్టాన్నమును భుజించునదియు నగును. కుండవలెను మద్దెలవలెను ఉండిన దరిద్రురాలు

మిక్కిలి విశాలమైన యుదరముగలది సంతానహీనురాలును దరిద్రురాలును అగును. వ్రేలాడుపొట్టగలది మామగారిని మఱఁదులను చంపును.

వళిత్రయము - (కడుపుమీఁది ముడుతలు.)

శ్లో. మధ్యే క్షామా చ సుభగా భోగాఢ్యా సవళిత్రయా ॥

తా. నడుము సన్నమై త్రివళుల(మూడుముడతల)తోఁ గూడియుండిన సౌభాగ్యవంతురాలును ఐశ్వర్యభోగములు గలదియునగును.

నూగారు.

శ్లో. ఋజ్వీ తన్వీ చ రోమాళీ యస్యాస్సా శర్మ నర్మభూః ।
కుటిలా కపిలా స్థూలా విచ్ఛిన్నా రోమరాజికా ।
చౌర్యం వైధవ్యదౌర్భాగ్యే విదధ్యా దిహ యోషితాం ॥

తా. నూగారు వంకరలేనిదిగను సూక్ష్మముగను నుండిన సుఖము, ప్రీతియుఁ గలిగియుండును. వంకరై కపిలవర్ణముగలిగి స్థూలమై నడుమ తెగియుండిన స్త్రీలకు చౌర్య దౌర్భాగ్య వైధవ్యముల నిచ్చును.

ఱొమ్ము.

శ్లో. నిర్లోమ హృదయం యస్యాస్సమం నిమ్నత్వవర్జితం ।
ఐశ్వర్యం చా ప్యవైధవ్యం ప్రియప్రేమ చ సా లభేత్ ॥
విస్తీర్ణ హృదయా యోషా పుంశ్చలీ నిర్దయా తథా ।
ఉద్భిన్నరోమహృదయా పతిం హంతి వినిశ్చితం ॥
అష్టాదశాంగుళతత మురః పీవర మున్నతం ।
సుఖాయ దుఃఖాయ భవే ద్రోమశం విషమం పృథు ॥

తా. ఱొమ్ము రోమరహితమై లోఁతులేక సమముగనుండిన ఐశ్వర్యమును, మగనిప్రేమముపొంది వైధవ్యము జెందకుండును. విశాలవక్షస్థలముగల స్త్రీ వ్యభిచారిణియై నిర్దయురాలగును. హృదయమునందు పైకి స్పష్టముగాఁ దెలియుచున్న రోమములుగల స్త్రీ పతిని జంపును. పదునెనిమిది అంగుళములు వైశాల్యము గలిగి బలిసియుండిన సుఖప్రదము. రోమములును- ఎచ్చుతక్కువయు గలిగియుండిన దుఃఖకరము.

స్తనములు.

శ్లో. ఘనౌ వృత్తౌ సమౌ పీనౌ దృఢౌ శస్తౌ పయోధరౌ ।
స్థూలాగ్రౌ విరళౌ శుష్కౌ వామోరూణాం న శర్మదౌ ॥



దక్షిణోన్నతవక్షోజా పుత్రిణీ వ్వగ్రజా మతా ।
వామోన్నతకుచా సూతే కన్యాం సౌభాగ్యసుందరీం ॥
పీవరాస్యౌ సాంతరాళౌ పృథూపాంతౌ న శోభనౌ ।
మూలే స్థూలౌ క్రమకృశౌ వగ్రే తీక్ష్ణౌ ప్రశస్తకౌ ॥
సదృశం చూచుకయుగం శస్తం శ్యామం సువర్తులం ।
అంతర్మగ్నం చ దీర్ఘం చ కృశం క్లేశాయ జాయతే ॥

తా. స్తనములు గొప్పవిగను గుండ్రముగను సమానముగను బలిసినవిగను దృఢముగను ఉండిన ప్రశస్తములు. మొనలు లావుగను ఎడముగను ఎండినవిగను నుండిన సుఖకరములుగావు. దక్షిణకుచము ఉన్నతమైయుండిన పుత్రవతి యగును. ఎడమకుచము ఉన్నతమైయుండిన - మంచిభాగ్యము సౌందర్యముగల స్త్రీని కనును. కొనలు బలిసియుండుట, రెంటికినడుమ విశాలముగనుండుట, స్తనములయొక్క అంతప్రదేశములు లావుగనుండుట ఇవి ప్రశస్తములుకావు. మొదట లావుగను, క్రమముగ సన్నముగను, మొనలు తీక్ష్ణముగనునుండిన ప్రశస్తములు. చనుమొనలు సమానములుగను గుండ్రములుగను నల్లగను నుండిన ప్రశస్తములు. లోన మునిఁగినవియు, పొడవైనవియు, కృశించినవియు నగు చనుమొనలు క్లేశకరములగును.

మెడకొంకులు.

శ్లో. పీవరాభ్యాం చ జత్రుభ్యాం ధనధాన్యనిధి ర్వధూః ।
శ్లథాస్థిభ్యాం చ నిమ్నాభ్యాం విషమాభ్యాం దరిద్రిణీ ॥

తా. మెడకొంకులు బలిసి వల్లము దెలియకుండిన ధనధాన్యములుగలదియగును. సడలిన యెముకలుగలిగి లోఁతును ఎచ్చుతక్కువయుఁ గలిగియుండిన దరిద్రురాలగును.

భుజశిరస్సులు.

శ్లో. సుబద్ధావనతౌ స్కంధా వదీర్ఘౌ వకృశౌ శుభౌ,
వక్రౌ స్థూలౌ చ రోమాఢ్యౌ యది వైధవ్యసూచకౌ ॥
నిగూఢసంధీ శస్తాగ్రౌ శుభౌ వంసౌ సుసంహతౌ ।
వైధవ్యదౌ సముచ్ఛ్రాగ్రౌ నిర్మాంసౌ పతిదుఃఖదౌ ॥

తా. భుజశిరస్సులు దృఢముగను వంగినవిగను పొడవు లేనివిగను బలిసినవిగనునుండిన శుభకరములు. వంకరగలిగినవియు లావైనవియు రోమములుగలవియునైన యెడల వైధవ్యముగలుగును. గూఢములగుసంధులుగలవియు ప్రశస్తమైన కొనలు

యును బాగుగ గూడినవియునైనయెడల శ్రేష్ఠము. కొనలు ఉన్నతముగ నుండినయెడల వైధవ్యముగలుగును. మాంసరహితములైనయెడల మిక్కిలి దుఃఖకరములు.

చంకలు.

శ్లో. కక్షౌ సుసూక్ష్మలోమౌ చ తుంగౌ స్నిగ్ధౌ చ మాంసలౌ ।
శస్తౌ న శస్తౌ గంభీరసిరాఢ్యౌ స్వేదమేదురౌ ॥

తా. చంకలు సన్ననిరోమములు కలవిగను మిట్టగను నునుపుగను బలిసినవిగను నుండిన ప్రశస్తములు. లోఁతై నరములుగలవై చెమట గలిగియుండిన అప్రశస్తములు.

బాహువులు.

శ్లో. స్యాతాం బాహూ సునిర్దోషౌ గూఢాస్థిగ్రంథిరోమశౌ ।
ససిరౌ స్థూలరోమాణౌ హ్రస్వౌ దౌర్భాగ్యసూచకౌ ॥

తా. బాహువులు పైకి దెలియని యెముకలు ముళ్ళుగలిగి సూక్ష్మరోమములతోఁ గూడిన శుభకరములు. పైకి తెలియుచున్న నరములు గలవియు, స్థూలరోమములుగలవియు, పొట్టివియు నగు బాహువులు దౌర్భాగ్యసూచకములు.

అఱచేతులు - రేఖలు.

శ్లో. మృదు మధ్యోన్నతం రక్తం తలం పాణ్యో రరంధ్రకం ।
ప్రశస్తం శస్తరేఖాఢ్య మల్పరేఖం శుభాశ్రయం ॥
విధవా బహురేఖేణ విరేఖేణ దరిద్రిణీ ।
భిక్షుకీ సుసిరాఢ్యేన నారీ కరతలేన వై ॥
విరోమ విసిరం శస్తం పాణిపృష్ఠం సమున్నతం ।
వైధవ్యహేతు రోమాఢ్యం నిర్మాంసం స్నాయుమ త్త్యజేత్ ॥
రక్తా వ్యక్తా గభీరా శ్చ స్నిగ్ధాః పూర్ణా శ్చ వర్తులాః ।
కరరేఖా స్త్రియో యస్యా శ్శుభా భాగ్యవతీ చ సా ॥
మత్స్యేన సుభగా నారీ స్వస్తికేన వసుప్రదా ।
పద్మేన భూపతేః పత్నీ జనయే ద్భూపతిం మతం ॥
చక్రవర్తిస్త్రియః పాణౌ నంద్యావర్తః ప్రదక్షిణః ।
శంఖాతపత్రకమలా నృపమాతృత్వసూచకాః ॥
తులా మానాకృతీ రేఖే వణిక్పత్నీత్వసూచకే ।
గజవాజివృషాకారా కరే వామే మృగీదృశాం ॥



రేఖాః ప్రాసాద వజ్రాభా బ్రూయు రర్థకరా శ్శుభాః ।
కృషీవలస్య పత్నీ స్యా చ్ఛకటేన హలేన వా ॥
చామరాంకుశకోదండై రాజపత్నీ భవే ద్ధ్రువం ।
అంగుష్ఠమూలా న్నిర్గత్య రేఖా యది కనిష్ఠికాం ॥
యది సా పతిహంత్రీ స్యా ద్దూరత స్తాం వివర్జయేత్ ।
త్రిశూలాది గదాశక్తి దుందుభ్యాకృతిరేఖయా ॥
నితంబినీ కీర్తిమతీ త్యాగేన పృథివీతలే ।
వృక మండూక జంబూక ఋక్ష వృశ్చికభోగినః ।
రాసభోష్ట్రబిడాలా స్స్యుః కరస్థా దుఃఖదా స్త్రియః ॥

తా. అఱచేయి మృదువై నడుమనున్నతమై వ్రేళ్ళసందున రంధ్రములు తెలియకుండిన శుభప్రదము. బహురేఖలుండిన విధవయును, రేఖలు లేకుండిన దరిద్రురాలు నగును. నరములు తెలియుచుండిన భిక్షుకి యగును. మీఁజేయి రోమములులేక నరములు దెలియక యెత్తుగనుండిన శుభప్రదము. రోమములతోఁ గూడినదియు, మాంసములేనిదియు, తెలియుచున్న యెముకలు గలదియు నగుమీఁజేయి వైధవ్యమునకుఁ గారణమగును. రేఖలు- ఎఱుపు, స్పష్టత, లోఁతు, నునుపు, సంపూర్ణతయుఁగలిగి వర్తులముగనుండిన భాగ్యవంతురాలగును. మత్స్యరేఖ యుండిన సౌభాగ్యవంతురాలగును. స్వస్తికముండిన మంచివ్రతము గలది. పద్మాకారరేఖయుండిన రాజుభార్యయై భూపతినికనును. చేతియందు నంద్యావర్తాకారముగను ప్రదక్షిణముగను రేఖలుండిన చక్రవర్తిభార్యయగును. శంఖము-గొడుగు-కమలము వీనివలెరేఖలుండిన రాజమాతయగును. త్రాసువంటి రేఖయుండిన వైశ్యుని భార్యయగును. ఎడమచేతియందు గజ వృషభములవంటి రేఖలు, దేవాలయ రాజగృహములవంటి రేఖలును, వజ్రాయుధమువంటి రేఖలునుండిన ధనము కలుగును, శుభకరములు. బండివలెను నాగలివలెను రేఖలుండిన భూమిదున్నెడివాని పెండ్లామగును. చామరము-అంకుశము- విల్లు వీనివంటి రేఖలుండిన రాజపత్నియగును. అంగుష్ఠమూలమునుండి ప్రారంభించి చిటికెనవ్రేలివఱకు రేఖయుండిన మగనిజంపునది యగును; దానిని వర్జింపవలయు. త్రిశూలము-గద-శక్తి-భేరి వీనివంటి రేఖలుండిన స్త్రీ భూతలంబున త్యాగముచే కీర్తివంతురాలగును. తోఁడేలు-కప్ప-నక్క-ఎలుఁగుగొడ్డు-తేలు-పాము-గాడిద-ఒంటె-పిల్లి వీని యాకారముగల రేఖలుండిన స్త్రీలు దుఃఖవంతులగుదురు.

వ్రేళ్లు.

శ్లో. శుభద స్సరళో౽ంగుష్ఠో వృత్తో వృత్తనఖో మృదుః ।
అంగుళ్య శ్చ సుపర్వాణో దీర్ఘవృత్తాః కృశాః క్రమాత్ ॥

అంగుష్ఠోదరమధ్యే తు యవో యస్యా విరాజతే ।
ఉత్పన్నభక్ష్యభోజ్యా సా కనిష్ఠాంత్యేపి పర్వణి ॥
అంగుష్ఠమూలప్రభవాస్తురేఖాః పుత్రాస్స్యుర్బృహత్యః ప్రమదాస్తుతన్వ్యః।
అచ్ఛిన్నదీర్ఘాబృహదాయుషాంతాస్స్వల్పాయుషాంఛిన్నలఘుప్రమాణాః॥
చిపిటాః స్ఫుటా రూక్షాః పృష్ఠా రోమయుజశ్శుభాః ।
అతిహ్రస్వాః కృశా వక్రా విరళా దోషహేతుకాః ॥
దుఃఖాయాంగుళయః స్త్రీణాం బహుపర్వ సమన్వితాః ।
అరుణా స్సుశిఖా స్తుంగాః కరజా స్సదృశా శ్శుభాః ॥
నిమ్నా వివర్ణా శ్శుక్లాభాః పీతా దారిద్ర్యదాయకాః ।
నఖేషు బిందవ శ్శ్వేతాః పాపా స్స్యు స్స్వైరిణీ స్త్రియః ।
పురుషా అపి జాయంతే దుఃఖినః పుష్పితై ర్నఖైః ॥

తా. చేతిబొటనవ్రేలు సరళమై గుండ్రమై గుండ్రముగ నుండెడి గోరుగలదై మృదువుగనుండిన శుభప్రదము. వ్రేళ్ళు మంచిగణుపులుగలిగి పొడవై గుండ్రమై క్రమముగ సన్నములై యుండిన శుభప్రదములు. బొటనవ్రేలిగణుపు దగ్గరను, చిటికెనవ్రేలి కడపటి గణుపునను గోధుమగింజవంటి రేఖయుండిన భక్ష్యభోజ్యాదిసౌఖ్యము గలిగియుండును. బొటనవ్రేలికి మొదటపుట్టిన దీర్ఘములగు రేఖలు పుత్రసూచకములు. ఆరేఖలు సూక్ష్మముగనుండిన పుత్రికాసూచకములు. నడుమ తెంపులు లేక దీర్ఘములగురేఖలు దీర్ఘాయుష్యకారకములు ఆరేఖలు తెంపులుగలిగి పొట్టిగా నుండిన స్వల్పాయుస్సూచకములు. వ్రేళ్ళ వెనుకటి పార్శ్వములు - చప్పిగను, నడుమ వంగినవిగను, నిగ్గు గలవిగను, సూక్ష్మరోమములు గలవిగనునుండిన శుభకరములు. మిక్కిలి పొట్టి సన్నము ఎడము గలవిగ, వంకరగ నుండిన అశుభకరము. వ్రేళ్ళయందు గణుపులనేకములుండిన దుఃఖము కలుగును. ఎఱ్ఱనై మిట్టలై పొడవులై పలుచనములై యుండిన శుభకరములు. నడుమ పల్లమై కాంతిలేనివై తెల్లగ పచ్చగనుండిన దారిద్ర్య దాయకములు. గోళ్ళయందు తెల్లనిబిందువులుండిన పాపాత్ములై వ్యభిచారిణులగుదురు. గోళ్లు పుష్పించియుండిన పురుషులుగూడ దుఃఖవంతులగుదురు.

## వీఁపు ఎముక.

శ్లో. అంతర్నిమగ్నవంశాస్థియష్టి స్స్యాన్మాంసలా శుభా
పృష్ఠేన రోమయుక్తేన వైధవ్యం లభతే ధ్రువం ।
భుగ్నేన వినతేనాపి ససిరేణా తిదుఃఖితా ॥



తా. వెన్నెముక లోపలనణఁగినదై చుట్టుకండగలదై యుండిన శుభకరము. వీఁపున రోమములుండిన వైధవ్యమును పొందును. విఱిగినట్టుగను వంగినట్లుగను తెలియుచున్న నరములుగలదిగనుండిన దుఃఖవంతురాలగును.

## ముచ్చిలిగుంట.

శ్లో. ఋజ్వీ కృకాటికా శ్రేష్ఠా సమాంసా చ సమున్నతా ।
శుష్కా సిరాళా రోమాఢ్యా విశాలా కుటిలా శుభా ॥

తా. ముచ్చిలిగుంట సమముగను మాంసముతోఁ గూడినదిగను ఉన్నతముగను నుండిన శ్రేష్ఠము. శుష్కించినదియు, తెలియుచున్న నరములు- రోమములు-వెడల్పు వంకరయుగల ముచ్చిలిగుంట అశుభకరము.

## కంఠము - మెడ.

శ్లో. మాంసలో వర్తులః కంఠః ప్రశస్త శ్చతురంగుళః ।
శస్తా గ్రీవా త్రిరేఖాఢ్యా త్వవ్యక్తాస్థి స్సుసంహతా ॥
నిర్మాంసా చిపిటా దీర్ఘా స్ఫుటా న శుభప్రదా ।
స్థూలగ్రీవా చ విధవా హ్రస్వగ్రీవా చ కింకరీ ।
వంధ్యా హి చిపిటగ్రీవా కుబ్జగ్రీవా చ దుఃఖభాక్ ॥

తా. కంఠముబలిసి గుండ్రనై నాలుగంగుళముల ప్రమాణము గలిగిన ప్రశస్తమైనది. మెడ మూడురేఖలుగలిగి ఎముకలు దెలియక బాగుగకూడినదై యుండిన ప్రశస్తమైనది. మాంసములేక చప్పియై పొడవై నడుమవంగినదై యుండిన నశుభకరము. మెడ స్థూలముగనుండిన విధవయగును. పొట్టిగనుండిన పనికత్తెయగును. చప్పిగనుండిన గొడ్రాలగును. మరుగుజ్జుగనుండిన దుఃఖము గలది యగును.

## గడ్డము.

శ్లో. చుబుకం ద్వ్యంగుళం శస్తం వృత్తం పీనం సరోమలం ।
స్థూలం ద్విధా సంవిభక్త మాయతం రోమశం త్యజేత్ ॥

తా. గడ్డము రెండంగుళముల ప్రమాణముగలిగి గుండ్రనై బలిసి మృదువుగనుండిన ప్రశస్తమైనది స్థూలమైనదియు రెండుగా విభజింపఁబడినదియు పొడవైనదియు రోమములు గలదియునైనయెడల మంచిదికాదు.

## కటుమర్లు.

శ్లో. హను శ్చుబుకసంలగ్నా నిర్లోమా స్యాద్ఘనా శుభా ।
వక్రా స్థూలా ఘనా హ్రస్వా రోమశా న శుభప్రదా ॥

తా. కంటిక్రింద మొదలుకొని చెక్కిళ్ళ ముందుభాగము గడ్డమునందంటుకొని రోమరహితమై దట్టమైయుండిన మంచిది. వంకరై స్థూలమై పొట్టిదై రోమములు గలిగియుండిన మంచిదికాదు.

చెక్కిళ్లు.

శ్లో. శస్తౌ కపోలౌ వామాక్ష్యాః పీనౌ వృత్తౌ సమున్నతౌ ।
రోమశౌ పరుషౌ నిమ్నౌ నిర్మాంసౌ పరివర్జయేత్ ॥

తా. చెక్కిళ్లుబలిసి గుండ్రనై యెత్తుగలిగియున్నయెడల ప్రశస్తములు. రోమములు గలవియు కఠినములును పల్లముగనుండునవియు మాంసహీనములు నైనయెడల ప్రశస్తములుకావు.

ముఖము.

శ్లో. సమం సమానం సుస్నిగ్ధం స్వామోదం వర్తులం ముఖం ।
సునేత్రం సురదచ్ఛాయం ధన్యానా మిహ జాయతే ॥

తా. ముఖము సమమయి మాంసముతోఁగూడి నును పై మంచిపరిమళముగలదై గుండ్రనై మంచినేత్రములు కలదై మంచి దంతకాంతిగలదై యుండిన ధన్యురాండ్రగుదురు.

అధరము.

శ్లో. పాటలో వర్తుల స్స్నిగ్ధో రేఖాభూషితమధ్యమః ।
సీమంతినీనా మధరో ధరాజానిప్రియా భవేత్ ॥
కృశః ప్రలంబ స్స్ఫుటితో రూక్షో దౌర్భాగ్యసూచకః ।
శ్యామస్థూలోఽధరోష్ఠ స్స్యా ద్వైధవ్యకలహప్రదః ।
మసృణో మత్తకాశిన్యా శ్చోత్తరోష్ఠ శ్శుభప్రదః ।
కించిన్మధ్యోన్నతోఽరోమో విపరీతో విరుద్ధకృత్ ॥

తా. పెదవి ఎఱుపువర్ణము గుండ్రన నునుపు నడుమరేఖయు గలిగియుండిన రాజపత్నియగును. చిక్కినదియు వ్రేలునదియు పగుళ్లుగలదియు నిగ్గుగలదియు నైనయెడల దౌర్భాగ్యసూచకమగును. నల్లగ లావుగనుండినయెడల వైధవ్యమును కలహమును గలుగజేయును. పై పెదవి నున్నగ నడుమ కొంచెము ఎత్తుగ రోమములులేనిదిగ నుండినశుభప్రదము. దీనికివిపరీతముగనుండిన ఈచెప్పినఫలమునకు విరుద్ధఫలముగలుగు.

పలువరుస.

శ్లో. గోక్షీరసన్నిభా స్స్నిగ్ధా ద్వాత్రింశ ద్దశనా శ్శుభాః ।
అధస్తా దుపరిష్టా చ్చ సమాః స్తోకసమున్నతాః ॥



పీతా శ్శ్యావా శ్చ దశనాః స్థూలా దీర్ఘా ద్విపంక్తయః ।
శుక్త్యాకారా శ్చ వికలా దుఃఖదౌర్భాగ్యకారకాః ॥
అధస్తా దధికై ర్దంతై ర్మాతరం భక్షయే త్స్ఫుటం ।
పతిహీనా చ వికలైః కులటా విరళై ర్భవేత్ ॥

తా. దంతములు క్రిందను మీఁదను కొంచెమెత్తుగ, పాలవలె, తెల్లగ, నున్నగ, సమముగ ముప్పదిరెండుండిన శుభకరములు పచ్చనివియు, నలుపు వనుపు వన్నెగలవియు, స్థూలములును, పొడవులును, రెండుపంక్తులు గలవియు, చిప్పలవంటివియు, ఎడముగలవియు నైనయెడల దుఃఖ దౌర్భాగ్యములు గలుగును క్రింద నధికముగ దంతములుండిన-తల్లిలేనిదియగును. విఱిగినవిగను ఎచ్చు తగ్గులుగను నుండిన- పతిలేనిది యగును. ఎడములుకలిగియుండిన వ్యభిచారిణి యగును.

నాలుక.

శ్లో. జిహ్వా చ మృష్టభోగా స్యా త్స్నిగ్ధా మృద్వీ తథారుణా ।
దుఃఖాయ మధ్యసంకీర్ణా పురోభాగే సవిస్తరా ॥
సితయా తోయమరణం శ్యామయా కలహో భవేత్ ।
దరిద్రా స్యా న్మాంసలయా లంబయా ఽభక్ష్యభక్షిణీ ।
విశాలయా రసనయా ప్రమదా తిప్రమాదభాక్ ॥

తా. నాలుక నునుపు ఎఱుపు గలిగి మృదువుగనుండిన మంచిపదార్థముల ననుభవించునది యగును. నడుమ సన్నమై కొన లావుగనుండిన దుఃఖకరమగు. నాలుక తెల్లనైయుండిన నీటివలన మరణముగలుగును. నల్లగనుండిన కలహము చేయును. మొద్దుగనుండిన దరిద్రురాలగును. మిక్కిలి పొడవుగ వ్రేలాడుచుండిన అభక్ష్యభక్షిణియగును. వెడల్పుగనుండిన గొప్పప్రమాదమును బొందును.

దౌడ.

శ్లో. స్నిగ్ధం కోకనదాభాసం ప్రశస్తం తాలు కోమలం ।
సితే తాలుని వైధవ్యం పీతే ప్రవ్రజితా భవేత్ ॥
కృష్ణేఽపత్యవియోగార్తా రూక్షం చోరకుటుంబినీ ।
కంఠే స్థూలా సువృత్తా చ క్రమతీక్ష్ణా చ లోహితా ।
అప్రలంబా శుభా ఘంటీ స్థూలా కృష్ణా చ దుఃఖదా ॥

తా. దౌడ- నునుపు బంగారుకాంతి మెత్తనగలిగియుండిన ప్రశస్తము. తెల్లగనుండిన వైధవ్యము గలుగును పచ్చగనుండిన సన్యసించును. నల్లగ నుండిన సంతా

5

వియోగమువలనదుఃఖితురాలగును నిగ్గుగలదిగనుండిన చోరకుటుంబము గలదియగును. గొంతునందలి కాయ స్థూలముగాక గుండ్రనై క్రమముగ సన్ననై యెఱుపుగ, వ్రేలు నదిగనుండిన శుభకరము. అతిస్థూలమయి నల్లగనుండిన దుఃఖకరము.

చిఱునవ్వు.

శ్లో. అలక్షితద్విజం కించి త్కించిత్ఫుల్ల కపోలకం ।
స్మితం ప్రశస్తం సుదృశా మనిమీలితలోచనం ॥

తా. చిఱునవ్వు - దంతములు మిక్కిలి కనుపడక చెక్కిళ్ళు కొంచెమువికసించినట్లును కండ్లు మూయకుండునట్లును ఉండిన ప్రశస్తమయినది.

ముక్కు.

శ్లో. సమవృత్తపుటా నాసా లఘుచ్ఛిద్రా శుభావహా,
స్థూలాగ్రా మధ్యనమ్రా చ న ప్రశస్తా సమున్నతా ॥
ఆకుంచితారుణాగ్రా చ వైధవ్యక్లేశదాయినీ,
పరప్రేష్యా చ చిపిటా ప్రలంబా చ కలిప్రియా ॥

తా. ముక్కు-సమానములై గుండ్రములై సన్ననిరంధ్రములుగల పుటములుగలిగియుండిన శుభావహము. కొన లావై నడుమువంగి ఎత్తుగ నుండిన ప్రశస్తముకాదు. ముక్కుకొన వంగి యెఱ్ఱగనుండిన వైధవ్యము గలుగును. చప్పిగ నుండిన దాసియగును. వ్రేలాడుచుండిన పాపాసక్తురాలగును.

నేత్రములు.

శ్లో. లలనాలోచనే శస్తే రక్తాంతే కృష్ణతారకే ।
గోక్షీరవర్ణవిశదే సుస్నిగ్ధే కృష్ణపక్ష్మణీ ॥
ఉన్నతాక్షీ చ దీర్ఘాయు ర్వృత్తాక్షీ కులటా భవేత్ ।
మేషాక్షీ మహిషాక్షీ చ మకరాక్షీ చ శోభనా ॥
పారావతాక్షీ దుశ్శీలా రక్తాక్షీ భర్తృఘాతినీ ।
కోటరానయనా ధృష్టా గజనేత్రా న శోభనా ॥
పుంశ్చలీ వామకాణాక్షీ వంధ్యా దక్షిణకాణికా ।
మధుపింగా చ రమణీ ధనధాన్యసమృద్ధినీ ॥
పక్ష్మభి స్సుఘనై స్స్నిగ్ధైః కృష్ణై స్సూక్ష్మై స్సుభాగ్యభుక్ ।
కపిలై ర్విరళై స్స్థూలై ర్నింద్యా భవతి భామినీ ॥



తా. కొనలయం దెఱుపువర్ణమును - నల్లని కనుపాపలును గలవియు, పాలవలె తెల్లనైనవియు, నునుపుగలవియు, నల్లని ఱెప్పలు గలవియు నగు కన్నులు శ్రేష్ఠములు. కన్నులు మిట్టగనుండిన దీర్ఘాయువుగలుగును. కన్నులు గుండ్రముగ నుండిన వ్యభిచారిణియగును. గొఱ్ఱె-బఱ్ఱె - మొసలి వీని కన్నులవలెనుండిన మంచిది. పావురపు కన్నులవలెనుండిన దుస్స్వభావముగలది యగును. ఎఱ్ఱగ నుండిన మగనినిజంపును. తొఱ్ఱలవలెనుండిన భయములేనిదియగును. ఏనుఁగు కన్నులవలె నుండిన మంచిదికాదు. ఎడమకన్ను గ్రుడ్డి అయినయెడల వ్యభిచారిణియగును. కుడికన్ను గ్రుడ్డి అయినయెడల గొడ్రాలగును. తేనెవలె పింగళవర్ణముగనుండిన ధనధాన్య సమృద్ధులు గలుగును. కనురెప్పలు విశాలముగ, నునుపుగ, నల్లగ, సూక్ష్మముగ నుండిన మంచి భాగ్యానుభవము గలుగును. నలుపు పసుపువన్నె కలిసి విరళములుగ, లావుగ నుండిన స్త్రీ నింద్యురాలగును.

కనుబొమలు.

శ్లో. భ్రువౌ సువర్తులా తన్వ్యౌ స్నిగ్ధే కృష్ణే త్వసంహతే,
ప్రశస్తా మృదురోమాణౌ సుభ్రువః కార్ముకాకృతీ ॥
ఖరరోమా చ పృథులా వికలా సరళా స్త్రియః ,
న భ్రూః ప్రశస్తా మిళితా దీర్ఘరోమా చ పింగళా ॥

తా. కనుబొమలు గుండ్రముగను, నునుపుగను, నలుపుగను, ఒకటొకటికలియకను, మెత్తనివెండ్రుకలుగలవిగను, విల్లులవలెవంగియునుండిన ప్రశస్తములైనవి. కఠినరోమములు గలవియు, పెద్దవియు, ఛిద్రమైనవియు, వంపులేనివియు, ఒకటొకటికలిసినవియు దీర్ఘరోమములుగలవియు, పింగళవర్ణముగలవియునై యుండిన ప్రశస్తముకాదు.

చెవులు.

శ్లో. ప్రలంబౌ చ తథా కర్ణౌ శుభావర్తౌ శుభప్రదౌ ।
శష్కులీరహితౌ నింద్యౌ సిరాళౌ కుటిలౌ కృశౌ ॥

తా. చెవులు వ్రేలాడునవిగ, మంచి సుడిగలవిగ నుండిన శుభప్రదములు. నుళ్ళులేక సిరలుగలిగి వంకరలై చిక్కియుండిన నింద్యంబులు.

నుదురు.

శ్లో. ఫాల స్సిరావిరహితో నిర్లోమా ఽర్ధేందుసన్నిభః ।
అనిమ్నస్త్ర్యంగుళో నార్యా స్సౌభాగ్యారోగ్యకారణః ॥
వ్యక్తస్వస్తికరేఖం చ లలాటం భాగ్యసంపదే ।

ఫాలగేన త్రిశూలేన నిర్మితేన స్వయంభువా ॥
నితంబినీసహస్రాణాం స్వామిత్వం యోపి దాప్నుయాత్ ।
ప్రలంబ మళికం యస్యా దేవగం హంతి సా ధ్రువం ।
రోమశేన సిరాలేన పాంసులా గోధినా మతా ॥

తా. నుదురు నరములు తెలియనిదియు, రోమములు లేనిదియు, అర్థచంద్రుని బోలినదియు, వల్లము లేనిదియు, మూఁడంగుళముల ప్రమాణము గలదియునైనయెడల సౌభాగ్యారోగ్యములు గలుగును. నుదుట స్వస్తికరేఖ కనబడుచుండిన భాగ్యసంపద గలుగును. ఫాలమునందు త్రిశూలరేఖయుండిన వేయిమందిస్త్రీలకు నాయకురాలగును. వ్రేలాడుచుండిన మఱఁదిని జంపును. రోమములుగలిగి నరములు దెలియుచుండిన వ్యభిచారిణి యగును.

## పాపట - శిరస్సు.

శ్లో. సీమంత స్సరళ శ్శస్తో మౌళి శ్శస్త స్సమున్నతః,
గజకుంభనిభో వృత్త స్సౌభాగ్యైశ్వర్యసూచకః ॥
స్థూలమూర్ధా చ విధవా దీర్ఘశీర్షా చ బంధకీ ।
విశాలేనాపి శిరసా భవే ద్దౌర్భాగ్యభాజనం ॥

తా. పాపట-వంకరలేక సమముగను, శిరస్సు ఎత్తుగనునుండిన శ్రేష్ఠము. ఏనుఁగు కుంభస్థలమువలెను, గుండ్రముగనునుండిన సౌభాగ్యైశ్వర్యములుగలుగును. శిరస్సు లావుగనుండిన విధవయగును. దీర్ఘముగనుండిన వ్యభిచారిణియగును. విశాలముగనుండిన దౌర్భాగ్యము కలుగును.

## వెండ్రుకలు.

శ్లో. కేశా అళికులచ్ఛాయా స్సూక్ష్మా స్స్నిగ్ధా స్సుకోమలాః ।
కించిదాకుంచితాగ్రా శ్చ కుటిలా శ్చాతిశోభనాః ॥
పరుషా స్స్ఫుటితాగ్రా శ్చ విరళా శ్చ శిరోరుహాః ।
పింగళా లఘవో రూక్షా దుఃఖదారిద్ర్యహేతవః ॥

తా. తలవెండ్రుకలు తుమ్మెదగుంపువలె నల్లనైనవియు, సన్ననివియు, నున్ననివియు, మెత్తనివియు, కొంచెము వంగినకొనలు గలవియు, వంపులు గలవియునయినయెడల ప్రశస్తములు. కఠినములయి చిట్లినకొనలుగలవియు, ఎడముగ నుండునవియు, గోరోచనమువంటి వన్నెగలవియు, పొట్టివియు, నిగ్గులేనివియునైనయెడల దుఃఖదారిద్ర్యములుఁ గలుగఁజేయును.



## పుట్టుమచ్చలు.

శ్లో. భ్రువో రంత ర్లలాటే వా * మశకో రాజ్యసూచకః ।
వామే కపోలే మశక శ్శోణో మృష్టాన్నదః ప్రియః ॥
† తిలకం ‡ లాంఛనం వా పి హృది సౌభాగ్యకారణం।
అస్యా దక్షిణవక్షోజే శోణే తిలక లాంఛనే ॥
కన్యాచతుష్టయం సూతే సూతే సా చ సుతత్రయం ।
తిలకం లాంఛనం శోణం యస్యా వామకరే భవేత్ ॥
ఏకం పుత్రం ప్రసూయాదౌ తత స్సా విధవా భవేత్ ।
గుహ్యస్య దక్షిణే భాగే తిలకం యది యోషితః ।
తథా క్షితిపతేఃపత్నీ సూతే సా చ సుతత్రయం ॥
నాసాగ్రే మశక శ్శోణో మహిష్యా శ్చైవ జాయతే ।
కృష్ణ స్స ఏవ భర్తృఘ్న్యాః పు శ్చల్యా వా ప్రకీర్తితః ॥
నాభే రధస్తా త్తిలకం మశకో లాంఛనం శుభం ।
మశక స్తిలక శ్చిహ్నం గుల్ఫదేశే దరిద్రకృత్ ॥
కరే కర్ణే కపోలే వా కంఠే వా సంస్పృశే ద్యది ।
దీర్ఘాయు ర్భామణవతీ [redacted]

తా. [redacted] మలనడుమగాని లలాట [redacted]
రాజ్యసూచక [redacted]
కలదియగును. తి [redacted] యందుండిన సౌ
భాగ్యమునిచ్చును. [redacted] లాంఛనములుండిన నలుగురు కొఁ
తులను ముగ్గురు కొడుకులను గనును. ఎఱ్ఱని తిలకలాంఛనములు ఎడమచేతియందుండిన ఒకపుత్రునిగని విధవయగును. గుహ్యమునకు కుడిపార్శ్వమున పుట్టుమచ్చయుండిన రాజపత్నియై ముగ్గురు కొమరులనుకనును. ముక్కుకొనను ఎఱ్ఱనిమశకముండిన రాజపత్నియగును. అది నల్లగనుండిన భర్తనుచంపి అంకులాడియగును. నాభికి దిగువ-తిలకము,మశకము, లాంఛనము ఇవియుండిన శుభప్రదములు. మశకము తిలకము చిహ్నము చీలమండయందుండిన దారిద్ర్యమును గలుగఁజేయును. పుట్టుమచ్చ చేతియందును చెవియందును చెక్కిలియందును కంఠమునందును యుండినయెడల - దీర్ఘాయువు, సొమ్ములు, తొలిచూలున కొడుకుఁను గలుగును.

---

* మశకము-దోమవంటి సన్నమచ్చ. † తిలకము-బొట్టువంటి గుండ్రని మచ్చ.
‡ లాంఛనం-కొంకణమువంటి వెడల్పైన మచ్చ.

## సుళ్లు.

శ్లో. శిరసో దక్షిణావర్తా పితరం హంతి కన్యకా ।
వామే చ జననీం హంతి త్రివర్షాభ్యంతరే స్తనే ॥
స్తనద్వయే యదావర్తో యస్యా స్సాఽపతికా భవేత్ ।
ముఖావర్తా ధవం హంతి భుజావర్తా పతివ్రతా ॥
ఉదరే శ్వశురం హంతి లలాటే హంతి దేవరం ।
యా నారీ చూచుకావర్తా సా భవే త్త్వరగామినీ ॥
కర్ణమూలే యదావర్తా శీర్షావర్తద్వయం భవేత్ ।
కించి త్సౌభాగ్య మాప్నోతి సా కన్యా విధవా భవేత్ ॥
భ్రువో ర్మధ్యే భ్రువోర్వ్యగ్రే పాదావర్తా స్తథా స్త్రియః ।
విధవా జారిణీ వా స్యా ద్భ్రమణం చ యథేచ్ఛయా ॥
త్రీణ్యావర్తాః ప్రదృశ్యంతే లలాటే చోదరే కటౌ ।
శ్వశురం చైవ భర్తారం హన్యా త్సా దేవరం క్రమాత్ ॥
భుజమధ్యే యదావర్తం సమం మధ్యే చ సంస్థితం ।
ప్రదక్షిణం భవే త్తచ్చ ధనపుత్రప్రవర్ధనం ॥
జానుద్వయే యదావర్తో గుల్ఫావర్తోఽప్రదక్షిణః ।
దుశ్శీలా భ్రమతే నిత్యం పరపుంసి గతా భవేత్ ॥
పాణ్యోః ప్రదక్షిణావర్తా ధర్మ్మే వామా న శోభనా ।
నాభౌ శ్రిత శ్చోరసి వా దక్షిణావర్త ఈరితః ॥
సుఖాయ దక్షిణావర్తః పృష్ఠవంశస్య దక్షిణే ।
అతః పృష్ఠం నాభిసమం బహ్వాయుఃపుత్రవర్ధనం ॥
గుహ్యావర్తా యదా నారీ పరపుంసిరతా భవేత్ ।
రాజపత్న్యాః ప్రకాశ శ్చ భగమాలౌ ప్రదక్షిణః ॥
న చే చ్ఛకటభంగీ స్యా త్తత్స్వపత్యవినాశనః ।
స్యాత్తా ముదరదేశే చ పృష్ఠావర్తా న శోభనా ॥
ఏకేన హంతి భర్తారం భవే దన్యేన పుంశ్చలీ ।
కంఠగో దక్షిణావర్తో దుఃఖవైధవ్యహేతుకః ॥
శీర్షే వాథ లలాటే వా త్యాజ్యా దూరా త్ప్రయత్నతః ।



ప్రదక్షిణా వా వామా వా రోమ్ణా మావర్తకా స్త్రియాః ॥
ఏకో వా మూర్ధని ద్వౌ వా దశాహా ద్ధంతి సా పతిం ।
సుప్తా పరస్పరం యా తు దంతా న్కటకటాపయేత్ ।
సులక్షణాపి న సా శస్తా వివాహే కుంభసంభవ ! ॥

తా. శిరమున కుడిసుడియుండిన తండ్రియు, ఎడమసుడియుండిన తల్లియు లేనిదగును. స్తనమునందు సుడియుండిన మూఁడుసంవత్సరములలో తల్లిమరణించును. స్తనద్వయమున సుళ్లుండిన పతిహీనురాలగును. ముఖమునందు సుడియుండిన మగనిఁ జంపును. భుజములయందుండిన పతివ్రతయగును. కడుపునందుండిన మామగారిని జంపును. నుదుటనుండిన మఱఁదినిజంపును. చనుమొనలయందుండిన అంకులాడియగును. చెవుల మొదట రెండుసుళ్ళును శిరమునందు రెండుసుళ్ళును ఉండిన-కొంచెము సౌభాగ్యమును పొంది పిదప విధవయగును. కనుబొమల నడుమను రెండుకనుబొమలయందును, పాదములయందును సుళ్లుండిన-విధవయు జారిణియు యథేచ్ఛముగఁ దిరుగునదియు నగును. లలాటము-పొట్ట-కటిప్రదేశము వీనియందు మూఁడేసి సుళ్ళుండిన- మగఁడు-మామ-మఱఁది వీరిని చంపునదియగును. భుజమధ్యమునందు సమముగ ప్రదక్షిణాకారముగ నుండిన ధనమును పుత్త్రిలను గలిగించును. రెండు మోకాళ్లయందును చీలమండలయందును అప్రదక్షిణమగు సుడియుండిన నెల్లప్పుడు దుస్స్వభావముగలిగి పరపురుషాసక్తురాలయి తిరుగునదియగును. చేతులయందు సుడులు ప్రదక్షిణముగనుండిన ధర్మముగలిగియుండును. ఎడమసుళ్ళుండిన అశుభకరము. నాభియందును ఱొమ్మునందును వెన్నెముకకు దక్షిణపార్శ్వమునను కుడిసుడియుండిన - సుఖము ఆయుష్యము పుత్రసంతానము గలుగును. గుహ్యమునందు సుడియుండిన పరపురుషులను గూడునదియగును. భగమాలియందు ప్రదక్షిణమగు సుడియుండిన రాజపత్నియగును. అదియే శకటాకారముగనుండిన పుత్రనాశము గలదియగును. కడుపునందును వీఁపునందును రెండు సుళ్ళుండిన పతిని జంపునదియు అంకులాడియునగును. కంఠమునందు కుడిసుడియుండిన వైధవ్యముగలదియగును. శిరమునందును లలాటమునందును సుడులుండిన స్త్రీని విడువవలయు. శిరమునందు కుడి యెడమసుళ్ళలో ఒకటిగాని రెండుగాని పెండ్లికల తోడ తిరిగియుండిన పదిదినములలో మగనిఁజంపును. నిద్రించునపుడు దంతములను కటకట కొఱికెడుస్త్రీ సులక్షణవతియయినను పురుషునకు వివాహమునకు తగదు.

## ఋతుమతీ లక్షణము

శ్లో. పీనప్రసన్నవదనాం ప్రక్లిన్నాత్మముఖద్విజాం,
నరకామాం ప్రియకథాం ప్రస్తకుక్ష్యక్షిమూర్ధజాం ॥
స్ఫురద్భుజకుచశ్రోణినాభ్యూరుజఘనస్ఫిచం,
హర్షాత్సుక్యపరాం చాపి విద్యా దృతుమతీ మితి ॥

తా. ఋతుమతి యగుకన్యకు ముఖము కొంచెము బలిసి నిర్మలముగ గనిపించు. దేహము ముఖము దంతములు మిక్కిలిచల్లనైయుండును. పురుషులయందును ప్రియమైన మాటలయందు నిచ్ఛగలిగియుండును. కడుపు-కన్నులు-తలవెండ్రుకలు-జారియుండును. భుజములు- స్తనములు - నడుముక్రిందిభాగము- నాభి-తొడలు - నాభిక్రిందిభాగము- పిఱుదులు ఇవి అదరుచుండును. అతిసంతోషము మైథునాసక్తియు గలిగియుండును.

---

## ఆర్తవ విషయము.

శ్లో. అనుపచయస్థే చంద్రే ధరణీసుతవీక్షణా దపి చ ।
ప్రథమరజోదర్శనత శ్శుభం భవతి వనితానామ్ ॥

తా. చంద్రుఁడు రజోలగ్నమున నుపచయస్థానములయందు లేకుండునపుడు రజోలగ్నమునకు అంగారక వీక్షణము కలుగుచుండునపుడును స్త్రీలకు ప్రథమ రజోదర్శనకాలమునందు శుభంబు కలుగును.

## తిథి ఫలము.

శ్లో. సంతానహీనా ప్రతిపద్దినే చ భవేద్ద్వితీయేఽల్పసుఖాతృతీయే,
సమస్తసౌభాగ్యవతీ చతుర్థ్యాం పాపాలయా భోగవివర్జితా చ॥
పంచమ్యాం బహుపుత్ర భోగసహితా షష్ఠ్యాం తు దుర్భాషిణీ,
సప్తమ్యాం ధనధాన్య భూషణయుతా శౌర్యాన్వితా హ్యష్టమే।
దుఃఖార్తా నవమేదినే ఒహ్నిదశమే సౌభాగ్య యుక్తా పరా,
శుద్ధా రుద్రదినే తథార్క దివసే స్యాద్దూషిణీ సర్వదా ॥
త్రయోదశ్యాం తు సంతుష్టా భూతాయాం పాపినీ భవేత్
పూర్ణిమాయాం తు సంపుష్టాచామాయా మల్పభోగినీ ॥

తా. పాడ్యమినాడు రజస్వలయైన కన్య సంతానములేనిదియు, విదియయందు అల్పసౌఖ్యము కలదియు, తదియయందు సకలైశ్వర్యములు గలదియు, చవితినాడు [illegible]కలదియు- భోగసుఖములులేనిదియు, పంచమియందు అనేకపుత్రికా పుత్ర



లును భోగమునుకలదియు, షష్ఠియందు దుష్టవాక్యములఁబలుకునదియు, సప్తమియందు ధనధాన్యాభరణంబులు గలదియు, అష్టమియందు మిక్కిలిశౌర్యము గలదియు, నవమియందు దుఃఖముచే పీడింపఁబడునదియు, దశమియందు సౌభాగ్యవతియు-శ్రేష్ఠురాలును, ఏకాదశియందు శుచిర్భూతురాలును, ద్వాదశియందు ఎల్లప్పుడు పరులదూషించునదియు, త్రయోదశియందు సంతోషవతియు, చతుర్దశియందు పాపాత్మురాలును, పున్నమయందు శరీరపుష్టికలదియు, అమావాస్యయందు స్వల్పభోగములు కలదియు నగును.

## దుష్టతిథ్యాదులు.

శ్లో. అమా రిక్తా ష్టమీ షష్ఠీ ద్వాదశీ ప్రతిపత్స్వపి ।
పరిఘస్య చ పూర్వార్ధే వ్యతీపాతే చ వైధృతౌ ।
సంధ్యాసూపప్లవే విష్ట్యా మశుభం ప్రథమార్తవమ్ ॥

తా. అమావాస్యయందును, రిక్తతిథులయందును, ఉభయాష్టములయందును, ఉభయషష్ఠులయందును, ఉభయ ద్వాదసులయందును, ఉభయప్రతిపత్తులయందును, పరిఘనామ యోగముయొక్క పూర్వభాగమందును, వ్యతీపాతనామయోగమునందును వైధృతినామ యోగమునందును, సంధ్యాకాలములయందును అశనిపాతము మొదలయిన యుపద్రవకాలములందును. భద్రవకరణమందును, స్త్రీలుతొలిసమర్తాడిన నశుభకరము.

## వారఫలము.

శ్లో. రోగిణీ రవివారే చ సోమవారే పతివ్రతా,
దుఃఖితా భౌమవారే తు బుధే సౌభాగ్యసంయుతా ।
శ్రీసంయుతా గురోర్వారే పతిభక్తి ర్భృగోర్దినే,
మలినా మందవారే తు రాత్రావపి తథైవచ॥

తా. ఆదిత్యవారమునందుఁ బుష్పించినకన్యక వ్యాధిపీడితురాలగును. సోమవారమునందు పతివ్రతయు, మంగళవారమునందు దుఃఖవంతురాలును, బుధవారమునందు సౌభాగ్యవతియు, గురువారమునందు సంపన్నురాలును, శుక్రవారమునందు పతిభక్తికలదియు, శనివారమునందు కలుషస్వభావము కలదియు నగును.

## శుభనక్షత్రములు.

శ్లో. కరాదిపంచోత్తరమూలపూష విష్ణుత్రయాశ్విద్య విధీందు భేషు।
ఆద్యంరజస్స్యాత్సుతాయురర్థం సౌభాగ్యవృద్ధిం కురుతేఽంగనానామ్॥

తా. హస్త-చిత్త-స్వాతి - విశాఖ . అనూరాధ- -ఉత్తర - ఉత్తరాషాఢ- ఉత్తరాభాద్ర-మూల-రేవతి-శ్రవణము-ధనిష్ఠ-శతభిసము-అశ్విని-పుష్యమి- రోహిణి

మృగశిర యీనక్షత్రములయందు రజస్వలయైనయెడల - సౌఖ్యము, పుత్రులు, ఆయుష్యము, ధనము, సౌభాగ్యంబును కలుగును.

## దుష్టనక్షత్రములు.

శ్లో. పూర్వత్రయేయామ్యభుజఙ్గధిష్ణ్యే తామ్బూలతైలం కుసుమంహరిద్రాం।తద్భర్తృసందర్శనమేవవర్జ్యంతాత్కాలికంశాంతివిధింప్రకుర్యాత్॥
రౌద్రే మఘేశోకయుతా దితేర్భే సా బంధకీంద్రే ప్యనలే దరిద్రా॥

తా.. పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్ర-భరణి-ఆశ్లేషయీనక్షత్రములయందు రజస్వలయైనయెడల - తాంబూల చర్వణమును, తైలాభ్యంగమును, పుష్పధారణమును హరిద్రాలేపనమును, పెనిమిటిని జూచుటయును ఆయానక్షత్రమునకుఁ జెప్పఁబడిన మాసపర్యంతము వర్జింపవలయు. మఱియు ఆరజోదర్శనకాలోచితంబైన శాంతికర్మ విధానము చేయదలయు. ఆర్ద్రి, మఖ యీ నక్షత్రములయందు రజోవతియైన స్త్రీ దుఃఖవతియు, పునర్వసు జ్యేష్ఠ వీనియందు వ్యభిచారిణియు, కృత్తికా నక్షత్రమందు దరిద్రురాలు నగుమ.

శ్లో. కృత్తికాదిత్య రౌద్రేఽపి మఖాజ్యేష్ఠే రజస్వలా,
ఆదిపాదే శుభం ప్రోక్తం సా కన్యా మంగళప్రదా।
ద్విపాదేచే ద్రజో దృష్టం పంచవింశతిభోజనం,
త్రిపాదే చ చతుష్పాదే శాంతిం కుర్యా ద్యథావిధి॥

తా. కృత్తిక-పునర్వసు-ఆర్ద్రి-మఖ-జ్యేష్ఠ యీనక్షత్రములయందు ప్రథమపాదమునందు రజస్వలయైనయెడల శుభకరము. రెండవపాదమునందైనయెడలఁ దచ్ఛాంతికొఱకు నిరువదియయిదుగుర్కి షడ్రసోపేతంబుగా భోజనంబు పెట్టవలయు. మూఁడవపాదమునందును నాలవపాదమునందునైనయెడల శాస్త్రమునందుఁ జెప్పఁబడినప్రకారము శాంతి చేయవలయు.

## శుభనక్షత్రఫలము.

శ్లో. ధనిష్ఠావిష్ణుమూలాసు నార్యా స్స్యు స్సుతపంచకమ్,
మృగోత్తరకరత్వాష్ట్ర శతతారాసు వై దశ।
ద్విదైవస్వాతిమూలాశ్విమైత్రేషు చ సుతాష్టకం,
ప్రాజాపత్యే సుతా స్సప్త చాంత్యే చ నవకం భవేత్।



తా. శ్రవణము ధనిష్ఠ మూల యీనక్షత్రంబులయందు రజస్వలయైన స్త్రీకి అయిదుగురు పుత్రులును,మృగశిర-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర-హస్త-చిత్త-శతభిషము ఈనక్షత్రములయందైనయెడల పదుగురు పుత్రులును, విశాఖ - స్వాతి-మూల-అశ్విని-అనూరాధ యీనక్షత్రములయందు ఎనమండ్రు పుత్రులును, రోహిణియందు ఏడ్గురుపుత్రులును, రేవతియందు తొమ్మండ్రు పుత్రులును గలుగుదురు.

## దుష్టనక్షత్రఫలము.

శ్లో. పూర్వత్రయే దరిద్రా స్యా త్కృత్తికాయాం తు దుర్భగా,
ఆర్ద్రాయాం పుత్రనాశ స్స్యా ద్భరణ్యాం స్వమృతి ర్భవేత్।
మఖాయాం భర్తృనాశ స్స్యా త్సార్పే చాండాలగామినీ,
దరిద్రిణీ చ జ్యేష్ఠాయాం రతిహీనా చ జాయతే॥

తా. పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్ర-వీనియందు రజస్వలయైనకన్యక దరిద్రురాలును, కృత్తికయందు దౌర్భాగ్యురాలును, ఆర్ద్రియందు పుత్రసంతానములేనిదియు, భరణియందు మృతురాలును, మఖయందు పతివియోగము కలదియు, ఆశ్లేషయందు చండాలపురుషులతో విహరించునదియు, జ్యేష్ఠయందు దరిద్రురాలును, సురతవిహీనురాలును అగును.

శ్లో. పూర్వత్రయే భుజంగర్క్షే యామ్యర్క్షే చ రజస్వలా।
ప్రథమాంశే పతిఘ్నీ స్యా ద్ద్వితీయే మృతపుత్రకా।
తృతీయే తు దరిద్రా స్యా చ్చతుర్థే త్వశుభావహా॥

తా. పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్ర-ఆశ్లేష-భరణి ఈ నక్షత్రములయందు మొదటి పాదమునందు రజోవతియైనయెడల మగనిని చంపునదియు, రెండవ పాదమునందు చచ్చిపోయెడు పుత్రసంతానముకలదియు, మూడవ పాదమునందు భాగ్యహీనురాలును, నాలవపాదమునందు అమంగళకరురాలును అగును.

శ్లో. భరణ్యాం దశమాసం తు త్రిపూర్వే చాష్టకం తథా,
మఖాద్వాదశమాసాని షణ్మాసం రౌద్రభం తథా।
జ్యేష్ఠాశ్లేషా కృత్తికాసు మాసా శ్చత్వార ఈరితాః,
పునర్వసౌ పంచమాసా ఇత్యేతే భర్తృదర్శనే॥

తా. భరణినక్షత్రమునందు రజస్వలయయినయెడల ౧౦ మాసములును,కృత్తిక-ఆశ్లేష-జ్యేష్ఠవీనియందు ౪ మాసములును పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్రవీనియందు ౮ మాసములును, ఆర్ద్రియందు ౬ మాసములును, మఖయందు [illegible] మాసములును, పున

ర్వాసుయందు ౫ మాసములును భర్తృ దర్శనమును తాంబూల చర్వణాదులను వర్జింప వలయు; పిదప నాయా నక్షత్రశాంతిని శాస్త్రోక్తప్రకారము చేయవలయు.

## యోగఫలము.

విష్కంభమునందు రజస్వలయైన కన్య-వ్యసనము కలదియు, ప్రీతియందు సంతోషవంతురాలును, ఆయుష్మద్యోగమందు దీర్ఘాయుష్యము కలదియు, సౌభాగ్యమునందు విశేషసంపద కలదియు, శోభనయోగమునందు శుభకరురాలును, అతిగండమునందు పాపకృత్యము కలదియు, సుకర్మమునందు సౌఖ్యము కలదియు, ధృతియందు ధైర్యస్థైర్యములు కలదియు, శూలయందు దుర్మరణముకలదియు, గండమునందు పాపకృత్యముకలదియు, వృద్ధియందు సంతుష్టచిత్తము కలదియు, ధ్రువమునందు పతివ్రతయు, వ్యాఘాతమునందు విధవయు, వజ్రమునందు సౌభాగ్యవంతురాలును, సిద్ధియందు సకలసంపదలుకలదియు, వ్యతీపాతమునందు దుఃఖవంతురాలును, వరీయాన్యోగమందు సదా ధర్మచింత కలదియు, శివమునందు మంచిమనస్సుకలదియు, సిద్ధమునందు సంపద కలదియు, సాధ్యమునందు సర్వభోగములు గలదియు, శుభమునందు సంతోషము కలదియు, శుభ్రమునందు మంచి కీర్తి గలదియు, బ్రాహ్మమునందు పాపకృత్యములు కలదియు, మాహేంద్రమునందు రోగములచే మరణముకలదియు, వైధృతియందు ప్రాణహత్యజేయు స్వభావము కలదియునగును.

## కరణఫలము.

బవకరణమునందు రజస్వలయైనకన్య సౌఖ్యవతియు, బాలవయందు సౌభాగ్యవతియు, కౌలవయందు సౌందర్యవతియు, తైతులయందు దాక్షిణ్యవతియు, గరజియందు వైధవ్యముకలదియు, వణజియందు విశేషదానము చేయునట్టి స్వభావముకలదియు, భద్రయందు ప్రీతికరురాలును, చతుష్పాత్తుయందు అసంతుష్టికలదియు, నాగవమునందు ప్రీతికరురాలును, కింస్తుఘ్నమునందు దరిద్రురాలును అగును.

## ఆర్తవలగ్నశుభాశుభ ఫలము.

శ్లో. మేషే తు వ్యభిచార స్స్యాద్వృషభే సౌఖ్యవర్ధనం ।
మిథునే స్యాత్పుత్రవతీ కర్కటే చాతిజారిణీ ॥
సింహే పుత్రవతీ నారీ కన్యాయాం శ్రీమతీ భవేత్ ।
భాగ్యయుక్తా తులాయాం చ వృశ్చికే వ్యభిచారిణీ ॥
దుశ్చరీ ధనుషః పూర్వే హ్యపరే తు పతివ్రతా ।
మకరే మానహీనా స్యాత్కుమ్భే ధన వతీ భవేత్ ।
మీనే పుత్రిణీ చైవ ప్రథమర్తౌ విదంఫలమ్ ।



తా. మేషలగ్నమునందు రజస్వలయైనకన్య వ్యభిచారిణియు, వృషభమునందు సౌఖ్యాభివృద్ధి కలదియు, మిథునమునందు పుత్రవంతురాలును, కటకమునందు మిక్కిలి జారసాంగత్యముకలదియు, సింహమునందు సత్పుత్రవంతురాలును, కన్యాలగ్నమునందు సంపద్యుక్తురాలును, తులాలగ్నమునందు భాగ్యవంతురాలును, వృశ్చికలగ్నమునందు వ్యభిచారముకలదియు, ధనుర్లగ్నముయొక్క పూర్వభాగమునందుజారిణియు, ధనుస్సుయొక్క ఉత్తరభాగమునం దైనయెడల పతివ్రతయు, మకరలగ్నమునందు మానాభిమానములులేనిదియు, కుంభమునందు ధనధాన్యసమృద్ధికలదియు, మీనలగ్నమునందు పుత్రవంతురాలును అగును.

## రజోదర్శనస్థాననిర్ణయము.

శ్లో. మేషేపి సింహేపి చ కన్యకాయాం
గ్రామస్య బాహ్యే ప్రథమార్తవంస్యాత్ ।
వృషే చ గోష్ఠే ధనుషి స్వగేహే
గ్రామే ఘటేఽన్యస్య గృహేఽంగనాయాః ॥
మీనే మృగేకర్కటకే ఘటేఽంబు తీరేన్నృయుగ్మే తు దిగమ్బరా స్యాత్ ।
వనే చ మధ్యే పృథ వృశ్చికే చ గర్గాదయో హ్యేవ ముదీరయన్తి ॥

తా. మేషమునందును సింహరాశియందును కన్యారాశియందును గ్రామమునకు వెలుపట ప్రథమరజోదర్శనమగుననియు, వృషభలగ్నమునందు గోస్థానమందనియు, ధనుర్లగ్నమునందు తనయింటిలోననియు, తులయందు స్వగ్రామమునం దన్యునిగృహములోననియు, మీనరాశియందును మకరమునందును కర్కటకరాశియందును జలసమీపమునందనియు, మిథునమునందైనయెడల దిసమొలగ నుండునపుడనియు, వృశ్చికరాశియందైనయెడల అరణ్యమధ్యంబునందనియు పృచ్ఛకునకు దైవజ్ఞుండు చెప్పవలయు.

## రజోదర్శనస్థానఫలము.

శ్లో. గ్రామబాహ్యే పరగ్రామే సా స్త్రీ స్యాద్వ్యభిచారిణీ ।
పతివ్రతా పశుస్థానే సుజీవా గృహమధ్యమే ॥
గ్రామమధ్యే సువృద్ధి స్స్యాద్విధవా స్యాద్దిగమ్బరా ।
అన్యస్యగేహే దుశ్శీలా దీర్ఘాయు ర్జలసన్నిధౌ ।
వనమధ్యే తు సౌభాగ్యధనధాన్యసమన్వితా ॥

తా. గ్రామంబునకు బహిఃప్రదేశమందును అన్యగ్రామమునందును రజోవతియైన స్త్రీ వ్యభిచారముకలదియు, గొడ్లదొడ్డియందు పాతివ్రత్యముగలదియు, స్వకీయ

గృహాభ్యంతరమునందైనయెడల సమీచీనమైనజీవనముగలదియు, స్వగ్రామమధ్యమునం దైనయెడల మిక్కిలి వృద్ధిచే నొప్పుచుండునదియు, దినమొలతో రజస్వలయైనపడతి వైధవ్యము బొందునదియు, పరగృహమునందు దుష్టస్వభావము కలదియు, జలసమీప మునందు దీర్ఘాయుష్మంతురాలును, అరణ్యమధ్యంబునందైనయెడల ధనధాన్యైశ్వర్య ములతోడ గూడియుండునదియు అగును అని పృచ్ఛకునికిఁజెప్పవలయు.

ఆర్తవనక్షత్రమునందున్నగ్రహములఫలము

శ్లో. ప్రథమార్తవనక్షత్రే సమహీజే మృతప్రజా,
జ్ఞశుక్రసహితే వంధ్యా సగురౌ స్యాత్తపస్వినీ ।
సాదిత్యే తు పతిఘ్నీ స్యాద్రాహుయుక్తే తు జారిణీ,
శనౌ తిష్ఠతిచే ద్దాసీ గ్రహహీనే సువాసినీ ॥

తా. ఋతువైననక్షత్రమునందు అంగారకుఁ డుండినయెడల మృతశిశువులుగల దియు, బుధశుక్రులుండినయెడ గొడ్రాలును, బృహస్పతియున్నయెడ తపోవంతురాలు ను, సూర్యుఁడుండిన పెనిమిటిని జంపునదియు, రాహువుండినయెడలజారులుకలదియు, శనియుండినదాస్యము చేయునదియు, ఏగ్రహమును లేకయుండిన దీర్ఘసుమంగలియునగు.

శ్లో. కేంద్రత్రికోణాయధనస్థితాశ్చశుభాస్త్రిషష్ఠాయగతాశ్చపాపాః।
శుభప్రదాస్స్యుః ప్రథమర్తుకాలే తథావిధిజ్ఞా జగురార్యవర్యాః॥

తా. స్త్రీలకు ప్రథమరజోదర్శనకాలంబునందు- కేంద్ర-త్రికోణ-లాభస్థానంబు లయందు శుభగ్రహములును, తృతీయ-షష్ఠ-లాభస్థానంబులయందు క్రూరగ్రహంబులును ఉండినయెడల మిక్కిలి శుభకరమని పెద్దలు వచించెదరు.

శ్లో. అష్టమస్థే నిశానాథే భర్తురైశ్వర్యకారకమ్,
చంద్ర తారాబలయుతే రజః పుత్రార్థ సంపదః ।
లగ్నా ద్వా జన్మలగ్నా ద్వా భూమిజే వా థవా విధౌ,
సత్పుత్రా ప్రథమర్తౌ స్యాత్కన్యాచోపచయే స్థితే ॥

తా. చంద్రుఁడు రజోదర్శనలగ్నంబునకు అష్టమస్థానమందుండినయెడల విశా లకరురాలగును. చంద్రతారాబలసంపన్నమగునపుడు పుత్ర ధన సంపత్తులు కలది యగును. రజోలగ్నంబునకుగాని, జన్మలగ్నమునకుగాని, అంగారకుఁడైనను, చంద్రుఁడై నను తృతీయ షష్ఠ దశమ లాభస్థానంబులఁజెందియుండఁగా సమర్తాదినకన్యక సద్గుణ సంపన్నులగు కొమరులను కలదియగును.



సప్తమస్థానఫలము

రజోదర్శనలగ్నంబునకు సప్తమస్థానమున సూర్యుఁడుండిన వైధవ్యము, చం ద్రుఁడుండిన పుత్రసంపద, అంగారకుఁడుండిన వ్యభిచారము, బుధుఁడుండిన వంధ్యా త్వము, గురువుండిన దారిద్ర్యము, శుక్రుఁడుండిన విదేశగమనము,శనియుండిన వ్యాధి, రాహువుండిన జారత్వము, కేతువుండిన బంధువిరోధంబును కలది యగును.

కాలఫలము.

శ్లో. పుష్పవత్యా శ్శుభం ప్రాతః పూర్వాహ్ణే తీర్థగామినీ ।
మధ్యాహ్నే సుత సౌభాగ్యా చా పరాహ్ణే తు జారిణీ ॥
సాయాహ్నే బహుపత్నీ స్యాత్సంధ్యయో ర్వేశ్యతాం వ్రజేత్।
పూర్వరాత్రే చిరాయు స్స్యా న్నిశీథే విధవా భవేత్ ।
నిశాంతే సుఖహీనా స్యా ద్దుర్భగా సర్వసంధిషు ॥

తా. ప్రాతఃకాలమందు రజస్వలయైన కన్యక మంగళకరురాలగును. పూర్వా హ్ణమునందైనయెడల దివ్యక్షేత్రముల సేవించునదియు, మధ్యాహ్నమునందైనయెడల పుత్రధనములు కలదియు, పగటియుత్తరభాగమునందు వ్యభిచరించునదియు, సాయం కాలమందు పెక్కండ్రు పెనిమిటులుకలదియు, సాయంప్రాత స్సంధ్యలయందు భోగ పు చానతనముకలదియు, పూర్వరాత్రియందైనయెడల మిక్కిలి ఆయుస్సుకలదియు, అర్ధరాత్రియందైనయెడల వైధవ్యము జెందునదియు, ఉషఃకాలమునందు సౌఖ్యము లేనిదియు, ఈ చెప్పంబడిన సంధి కాలములయందు దౌర్భాగ్యముకలదియు అగును.

దిక్ఫలము—శ్లో. శైలచంద్రాష్టజలధిరసాక్షినవదిక్క్రమాత్ ।
ప్రాగాది స్యాత్ ప్రజాసంఖ్యా బాలికా ప్రథమార్తవే ॥

తా. కన్యకలకు ప్రథమరజోదర్శనమునందు పృచ్ఛకుఁడు తూర్పుదిక్కునుండి పృచ్ఛచేసినయెడల నేడ్వురు పుత్రులనియు, ఆగ్నేయ దిక్కునుండి అడిగిన నొక్క పుత్రుఁడనియు, దక్షిణదిక్కునుండి యడిగిన యెనమండ్రు పుత్రులనియు, నైరృతినుండి యడిగిన నల్వురుపుత్రులనియు, పడమటినుండియడిగిన నార్గురు పుత్రులనియు, వాయ వ్యమునుండి అడిగిన నిద్దఱుపుత్రులనియు,ఉత్తరమునుండి యడిగిన దొమ్మండ్రు పుత్రు లనియు ఈశాన్యదిశయందుండియడిగిన పదుగురుపుత్రులనియు దైవజ్ఞుఁడు చెప్పవలయు.

ఆర్తవవస్త్రనిర్ణయము.

శ్లో. మేషసింహతులాచాపానా ముదయే ధవళాంబరా ।
అలికర్కటనక్రాణా ముదయే మలినాంబరా ।

ఘటయుగ్మాంగనాత్తౌళిలగ్నే రక్తయుతాంబరా,
వృశ్చకాలే భవత్యేవం బాలికా ప్రథమార్తవే ॥

తా. కన్యక తొలిరజస్సువిషయమై పృచ్ఛకుఁడు-మేషము-వృషభము-సింహము ధనుస్సు ఈలగ్నములయందు ప్రశ్న చేసినయెడల తెల్లనివస్త్రము ధరించినది యనియు, వృశ్చికము-కటకము మకరము ఈరాసులయందు ప్రశ్న చేసిన యెడల మాసిన బట్టకట్టుకొనిన దనియు, కుంభము-మిథునము-కన్య - తుల ఈలగ్నములయందు ప్రశ్న చేసినయెడల ఎఱ్ఱనివస్త్రము ధరించినదియనియు చెప్పవలయు;—తూర్పునుండిపృచ్ఛ చేసినయెడల చినిగిపోయిన వస్త్రమనియు, ఆగ్నేయమునుండియైన నల్లని వస్త్రమనియు, దక్షిణమునుండియైన ఎఱ్ఱని వస్త్రమనియు, నైరృతినుండియైన తెల్లనివస్త్రమనియు, పడమటియందుండియైన మాసినవస్త్రమనియు, వాయవ్య దిశయందుండియైన కావియ వస్త్రమనియు, ఉత్తరమునందుండియైన చిత్ర వస్త్రమనియు, ఈశాన్య దిశయందుండి ప్రశ్న చేసినయెడల గైరికాదిధాతుమయ వస్త్రమనియుఁ జెప్పవలయునని గ్రంథాంతరమునందు చెప్పియున్నది.

ఆర్తవకాలధృతవస్త్రఫలము.

శ్లో. సుభగా శ్వేతవస్త్రా స్యా ద్దృఢవస్త్రా పతివ్రతా ।
క్షౌమవస్త్రా క్షితీశా స్యా న్నవవస్త్రా శుభాన్వితా ॥
దుర్భగా జీర్ణవస్త్రా స్యా ద్రోగిణీ రక్తధారిణీ ।
నీలాంబరధరా నారీ విధవా పుష్పిణీ భవేత్ ॥
మలినాంబరసంవీతా దరిద్రా స్యా ద్రజస్వలా ।
ధృతవస్త్రఫలం సమ్య గ్గదితం మునిపుంగవైః ॥

తా. తెల్లనిబట్ట గట్టుకొని రజస్వలయయిన చిన్నది సౌభాగ్యవతియును, గట్టి బట్టగట్టుకొనినది పతివ్రతయు, సన్నవస్త్రము గట్టుకొని పుష్పించిన పడతుక పట్టపు రాణియు, క్రొత్తవస్త్రమును ధరించినది శుభసంపన్నురాలును, శిథిల వస్త్రమును ధరించినది దౌర్భాగ్యవంతురాలును, ఎఱ్ఱనిపుట్టమును గట్టుకొన్నది వ్యాధిగ్రస్తురాలును, నీలవస్త్రధారిణియై పుష్పించిన స్త్రీ విధవరికమును బొందునదియు, మఱికిగల వస్త్రమైనయెడల దరిద్రురాలగునని ఇటులబుషులు వచించిరి.

రజోబిందు నిర్ణయము.

శ్లో. ఇంద్రేగుణోఽగ్నౌయమపవవార్ధిరన్యేవ్యషేవాయుదిశిద్విసంఖ్యాః ।
కుబేర ఈశే శశిబిందురేకో వస్త్రేషుసక్తోనవపుష్పవత్యాః ॥



తా. పృచ్ఛకుఁడు తూర్పుదిక్కునుండిగాని, ఆగ్నేయమూలనుండిగాని యడిగిన మూఁడుబిందువులును, దక్షిణదిక్కునుండిగాని, నైరృతిమూలనుండిగాని యడిగిన నాల్గుబిందువులును, పశ్చిమదిశనుండియైనను, వాయుదిశనుండియైనను అడిగిన రెండు బిందువులును, ఉత్తర-ఈశాన్యదిక్కులనుండియడిగిన నొక్కబిందువును, నూతనముగ రజస్వలయయిన స్త్రీయొక్కవస్త్రమునందు పడినవియని దైవజ్ఞుఁడు చెప్పవలయు.

రజోబిందుఫలము

శ్లో. ప్రాప్నోతి బిందునైకేన సౌభాగ్యం చ ద్విబిందునా ।
రోగ స్త్రిబిందునా భోగో దారిద్ర్యం బహుబిందునా ॥

తా. రజోవతియయినకన్యక - ఒక్క బిందువుచే సౌభాగ్యమును, రెండు బిందువులచే రోగమును, మూఁడుబిందువులచే భోగమును, నాలుగు మొదలగు ననేకబిందువులచే పేదరికమును పొందునని తెలియఁదగును.

రజస్వలాచక్రము. శ్లో. రజస్వలాయాంకన్యాయాందిక్చక్రేభానివిన్యసేత్ ।
ప్రాచ్యాదిదిక్షు చత్వారి త్రీణి త్రీణి విదిక్షు చ ॥

తా. కన్యక రజస్వల అయినప్పుడు దిగాకారంబుగ నొకచక్రము నేర్పరచి, తూర్పు-దక్షిణము-పడమర-ఉత్తరము ఈదిక్కులయందు సూర్యుఁడున్న నక్షత్రము మొదలుకొని నాలుగేసి నక్షత్రంబులును, ఆగ్నేయము-నైరృతి-వాయవ్యము - ఈశాన్యము ఈ విదిక్కులయందు మూఁడేసి నక్షత్రములును లిఖింపవలయు.

శ్లో. భానుభా చ్చంద్రనక్షత్రపర్యంతం గణయే త్క్రమాత్ ।
ఆయు స్సంప ద్వైధవ్య పుత్రా న్ దిక్షు వినిర్దిశేత్ ।
విదిక్షు క్షతరోగార్తి మరణాని వదే త్క్రమాత్ ॥

తా. అట్లు లిఖించి సూర్యుఁడున్ననక్షత్రము మొదలుకొని నిత్యనక్షత్రపర్యంతము వరుసగా లెక్కింపవలయు; ప్రాగాది దిక్కులయందు ఆయుష్యమును; సంపదను, దీర్ఘమంగళీత్వమును; పుత్రసంతానంబును నిర్దేశించవలయు. ఆగ్నేయాదివిదిక్కులయందు క్రమముగ గాయమును, వ్యాధిని, పీడను, మరణమును జెప్పవలయు.

దూరనిర్ణయము. శ్లో. యుగంచద్వియుగంచైవ త్రియుగంచచతుర్యుగం ।
సూతికా పతితో దక్య చండాలేషు యథాక్రమం ॥

తా. ప్రసవించిన స్త్రీకి ౧ కాడిమాకుదూరమునను, జాతిభ్రష్టునకు ౨ కాడిమాకులదూరమునను, రజస్వలకు 3 కాడిమాకుల దూరమునను, చండాలునకు ౪ కాడిమాకుల దూరమునను నిల్వవలయునుకాని అంతకులోపుగునప్పుడు అపరిశుద్ధు లగుదురు.

## రజస్వలాశుద్ధి.

శ్లో. ప్రథమేఽహని చండాలీ ద్వితీయే పతితా స్మృతా,
తృతీయే రజకీ ప్రోక్తా చతుర్థే శూద్రికా భవేత్ ।
పంచమేఽహని శుద్ధా స్యా ద్దైవపైత్రాదికర్మసు,
చతుర్థేఽహని భర్తు స్స్యా చ్ఛుద్ధా సంభోగకర్మణి ॥

తా. రజస్వలాస్త్రీ - మొదటిదినమున-చాండాలి, రెండవదినమున బ్రహ్మఘాతిని; మూడవదినమున రజకి; నాలవదినమున శూద్ర; ఐదవదినమున స్నానాదులచే దేవ పితృకార్యములవిషయమై పరిశుద్ధురాలగును. మఱి నాలుగవదినమున పెనిమిటికి సురతకర్మమునందు స్నానముచే శుచిర్భూతురాలగును.

శ్లో. రోగేణ యద్రజ స్స్త్రీణా మత్యర్థం హి ప్రవర్తతే ।
అశుచ్య స్తాన తేన స్యు స్తాసాం వైకారికం హి తత్ ॥

తా. స్త్రీలకు రోగమువలన రజస్సు మిక్కిలి కనఁబడుచుండిన అది వైకారిక మగుటచే వారలు అపరిశుద్ధలు కారు.

శ్లో. సాధ్వాచారా న తావ త్స్యా ద్రజో యావ త్ప్రవర్తతే ।
వృత్తే రజసి గమ్యా స్త్రీ గృహకర్మణి చేంద్రియే ॥

తా. స్త్రీలు రజస్సు ప్రవర్తించుచుండువఱకు పరిశుద్ధురాండ్రుకారు; రజస్సు నిలిచినపిదప దేవపితృకార్యముల పాకాదులకు,భర్తృసంగమమునకును అర్హులగుదురు.

## ఋతుమతీ వర్జ్యకార్యములు.

సూ. ఋతౌ ప్రథమదివసాత్ప్రభృతి బ్రహ్మచారిణీ దివాస్వప్నాంజనా
శ్రుపాత స్నానానులేపనా భ్యంగ నఖచ్ఛేదన ప్రధావన హాసన
కథనా తిశబ్దశ్రవణా వలేఖనా నిలా యాసా: పరిహరేత్ ॥
కింకారణం ॥ దివాస్వపంత్యా స్స్వాపశీలో ఽంజనాదంధో రోద
నా ద్వికృతదృష్టి స్స్నానానులేపనా ద్దుఃఖశీల స్తైలాభ్యంగా
త్కుష్ఠీ నఖాపకర్తనా త్కునఖీ ప్రధావనా చ్చంచలో హసనా
చ్ఛ్యావదంతోష్ఠ తాలుజిహ్వః ప్రలాపీచాతికథనా దతిశబ్దశ్రవ
ణాద్బధిరోఽవలేఖనాత్ఖలతి ర్మారుతాయాసనేవనాదున్మత్తో గర్భో
భవతీత్యేవ మేతా: పరిహరేత్ ॥



తా. ఋతుమతిఅయినచిన్నది మూఁడుదినములవఱకు బ్రహ్మచారిణియయి పగలు నిద్రించుట, కాటుక పెట్టుకొనుట, కన్నీరు విడుచుట, స్నానము, చందనాద్యనులేపనము, అభ్యంగము, గోళ్ళుతీయుట, పరుగెత్తుట, నవ్వుట, విశేషముగ మాటలాడుట, గొప్పధ్వనిని వినుట, చిత్తరువులువ్రాయుట, పెనుగాలియందుండుట, శ్రమకరకార్యములజేయుట, వీనిని వర్జింపవలయు — పగటినిద్రవలన ఎల్లప్పుడు నిద్రించు స్వభావమును, కాటుక పెట్టుకొనుటవలన గ్రుడ్డితనమును, ఏడ్చుటవలన వికారమైనచూపు, స్నానమువలనను- మైపూఁతలవలనను ఎల్లప్పుడు ఏడ్చుస్వభావము, అభ్యంగమువలన కుష్ఠురోగము, గోళ్ళు తీయుటవలన పుప్పిగోళ్ళు, పరుగెత్తుటవలన చంచలస్వభావము, నవ్వుటవలన నల్లని వర్ణముగల దంతములు-పెదవులు-దౌడలు-నాలుకయు, మిక్కిలిమాటలాడుటవలన ప్రేలెడి స్వభావము, గొప్పధ్వనిని వినుటవలన చెవుడు, చిత్తరువులు వ్రాయుటవలన దుశ్చర్మము, గాలిలో నుండుటవలనను, శ్రమకర కార్యములవలనను ఉన్మాదమును గలశిశువు జనించును.

## ఋతుమతీ నియమము.

సూ. దర్భసంస్తరశాయినీం కరతలశరావపర్ణాన్యతమభోజినీంహవిష్యం
త్ర్యహం చ భర్తు స్సంరక్షేత్; తత శ్శుద్ధస్నాతాం చతుర్థేఽ
హ న్యహతవాసస మలంకృతాం కృతమంగళ స్వస్తివాచనాం
భర్తారందర్శయేత్; తత్కస్యహేతోః?

శ్లో. పూర్వం పశ్యే దృతుస్నాతా యాదృశం నర మంగనా ।
తాదృశం జనయే త్పుత్రం భర్తారం దర్శయే దతః ॥

తా. ఋతువైనస్త్రీ - మూఁడుదినములును దర్భపై శయనించవలయు. దోసిలి మూకుడు-ఆకు వీనిలో దేనిలోనైన శాల్యన్నాదులను ఘృతక్షీరాదులతోఁజేర్చి భుజించవలయు. భర్తను చూడకుండవలయు. పిదప నాలుగవదినమున స్నానముచేసి పరిశుద్ధురాలై క్రొత్తవస్త్రమునుధరించి, ఆభరణముల నలంకరించికొని మంగళ స్వస్తివాచనపూర్వకముగ పతిని దర్శింపవలయు. ఎందుకనఁగా- ఋతుస్నానము చేసిన స్త్రీ-ముందుగ నేపురుషునిఁజూచునో, అట్టిపురుషునివంటిపుత్రుని గనును. గనుక, ముందుగ పతినే చూడవలయు.

## ఋతుమతీధర్మములు.

గ్రంథాంతరే- శ్లో. రజస్వలాయదాయాస్యా త్తాసుర్యాన్నియమానిమాన్ ।
యస్మిన్ వస్త్రే రజో దృష్టం తదేవ వసనం త్ర్యహం ॥

ధారయే న్న చ సంత్యాజ్యం నా న్యద్వాస శ్చ ధారయేత్ ।
శరీరోద్వర్తనం స్నాన మభ్యంగం దంతధావనం ॥
గంధం పుష్పం చ తాంబూలం హాసం రోదన మంజనం ।
రజస్వలా సూతికాంత్యస్పృష్టిం సంభాషణం చ తైః ॥
శూద్రాదిస్పృష్టి మలకా లంకృతిం నఖకృంతనం ।
పలాశపత్రభుక్తిం చ హ్రస్వపాత్రే చ భోజనం ॥
బహిఃపర్యటనం రజ్జుకరణం రాత్రిభోజనం ।
మైథునం చ దివాస్వాపం విశేషేణ వివర్జయేత్ ॥
న నదీతరణం కుర్యా న్న బహిః పర్యటే ద్గృహాత్ ।
యత్ర త్రిరాత్రం శయనం భోజనంచ కృతం భవేత్ ॥
చతుర్థదివసే తత్ర ఖాత్వా చ చతురంగుళం ।
త్యక్త్వా న్యత్ర మృదం తాం తు పూరయే దన్యయా మృదా ॥
గండూషమలమూత్రాది విసృష్టం యత్ర తత్ర తు ।
ప్రాదేశమాత్రఖననం కృత్వా పూర్వాన్యయా మృదా ॥
శయ్యో పధానవస్త్రాది రజకాయ ప్రదాపయేత్ ।
అథవా మలవద్వాసః పక్త్వా క్షారోదకేన చ ॥
వస్త్రశయ్యాసనాదీని స్వయమేవ విశోధయేత్ ।
ద్వాత్రింశద్భి ర్మృత్తికాభి రద్భి ర్గుహ్యం విశోధయేత్ ॥
తావతీభి ర్మృత్తికాభిః పాదా హస్తా విశోధ్య చ ।
నఖాని హస్తపాదానా మశ్మనా ఘర్షయే త్తదా ॥
ద్వాత్రింశద్భి శ్చ గండూషై రాస్యశుద్ధిం విధాయ చ ।
అపామార్గామ్రపత్రాద్యై ర్దంతశుద్ధిం విధాయ చ ॥
ధాత్రీమధూకకల్కాద్యైః కేశా నఙ్గం విశోధ్య చ ।
ఉద్ధృతాద్భి స్తటే దేహం ప్రక్షాళ్య థ విశోధ్య తత్ ॥
తతో ఽవతార్య సలిలే ద్వాత్రింశ న్మజ్జనం తతః ।
ఏకోచ్ఛ్వాసేన కృత్వాథ తామ్రకాంస్యాదిభాజనం ॥
సంవిశోధ్యామ్లభస్మాద్యై ర్ద్వాత్రింశ ద్వారమేవ చ ।
తస్యా వస్త్రాసనాదీనాం తావత్సంఖ్యానిమజ్జనం ॥



కృత్వా స్వయం నిమజ్జే చ్చ తావత్యా సంఖ్యయా పునః ।
అపశ్యం త్యన్యపురుషం ధ్యాయంతీ స్వపతిం ధియా ॥
దృష్ట్వా సూర్యం నమస్కృత్య త ద్గచ్ఛే న్నిజమందిరం ।
స్నాతా నా ర్యన్యపురుషం యది పశ్యే త్ప్రమాదతః ॥
పతిరూపం వివస్వంతం పశ్యే త్తద్దోషశాంతయే ।
శిశుం న పశ్యే త్తదహ స్స్నాతా నారీ రజస్వలా ॥
బ్రహ్మకూర్చం పిబే త్పంచగవ్యం వా గోఃపయోపి వా ।
భక్షయిత్వా న్నకబళం న దోష శ్శిశుదర్శనే ॥
భాండదేవోపకరణహోమద్రవ్యాణి న స్పృశేత్ ।
న కుర్యా త్కర్మపాకాది చతుర్థేఽహ్ని రజస్వలా ॥

తా. రజస్వలాస్త్రీ-ఏవస్త్రమున రజస్సును చూచునో ఆవస్త్రమునే మూడు దినములును ధరించవలయును. ఇతరవస్త్రముకూడదు. నలుఁగుపెట్టుకొనుట, స్నానము, అభ్యంగము, దంతధావనము, గంధపుష్పతాంబూలములు, నవ్వు, ఏడ్పు, కాటుకపెట్టుకొనుట, ఇతరరజస్వలాస్త్రీలను- పురిటిస్త్రీలను- శూద్రస్త్రీలను తాఁకుట, వారితో భాషించుట, ముంగురులనలంకరించుట, గోళ్ళుగిల్లుట వీనిని చేయఁగూడదు. మోదుగ ఆకులలోను- చిన్నపాత్రలలోను భుజింపఁగూడదు; బయటదిరుగుట, త్రాళ్ళు పేనుట, రాత్రి భుజించుట, మైథునము, పగటినిద్ర, నదిని దాటుట మొదలగువానిని వర్జింపవలయును. మూడురాత్రులును ఎచ్చట శయనము- భోజనము జరిగెనో అచ్చట నాలుగవ నాడు నాలుగుఅంగుళముల ప్రమాణము మన్నుత్రవ్వితీసి వేరు మృత్తికచే నాపల్లమును పూడ్చవలయును. ఇటులనే గండూష మలమూత్రాదులు జరిగినచోట ప్రాదేశమాత్రము త్రవ్వి ఇతరమృత్తికచే పూడ్చవలయును. శయ్య-ఉపధాన-వస్త్రాదులను చాకలికి వేయవలయును. లేక తానైనను క్షారోదకముచే వస్త్రశయ్యాసనాదులను శుద్ధిచేయవలయును. ముప్పదిరెండుమారులు మృత్తికోదకముచే గుహ్యమును- కరచరణములనుశుద్ధిచేసికొనవలయును. కరచరణముల గోళ్ళను నేలరాచి కడుగుకొనవలయును. ముప్పదిరెండు మార్లు గండూషముచేత ముఖశుద్ధిచేయవలయును. ఉత్తరేణి, మామిడాకు మొదలగువానిచే దంతశుద్ధి చేయవలయును. ఉసిరికపప్పు - ఇప్పపిండి మొదలగువానిచే వెంట్రుకలను శరీరమును రుద్దుకొని, స్నానముచేసి నీళ్ళలోదిగి ఒక్కయూపిరితో 32మార్లు మునిగి బయటవచ్చి తన రాగి కంచుపాత్రలను చింతపండు బూడిదలతో 32మార్లు తోమి వస్త్రాసనాదులను 32మార్లు శుద్ధిచేసి తాను తిరిగి అన్నిమారులు మునిఁగి పరపురుషుని జూడక తనపతిని ధ్యానించుచు సూర్యునిచూచి నమస్కరించి తనయింటికి-

బోవలయును. ప్రమాదమువలన బరపురుషునిం గాంచినయెడల తద్దోషశాంతికొఱకు పతి రూపి యగుసూర్యునిం జూడవలయును. స్నానముజేసిన దినమున శిశువునుజూడఁదగదు. బ్రహ్మకూర్చమునుగాని, పంచగవ్యమునుగాని, ఆవుపాలనుగాని, అన్నకబళమునుగాని భక్షించి శిశువును జూడవచ్చును. భాండములు-పూజాపాత్రములు-హోమద్రవ్యములు మొదలగువానిని తాఁకగూడదు. నాలుగవదినమున వంటచేయఁగూడదు.

### రజస్వలాన్యోన్యస్పర్శాది ప్రాయశ్చిత్తము.

శ్లో. స్పృష్ట్వా రజస్వలా న్యోన్యం బ్రాహ్మణీ బ్రాహ్మణీం తథా ।
తావ త్తిష్ఠే న్నిరాహారా త్రిరాత్రేణైవ శుధ్యతి ॥

తా. రజస్వల లగుబ్రాహ్మణస్త్రీలు ఒకరినొకరుదాకిన స్నానముచేయువఱకు భోజనములేకుండిన పవిత్రలగుదురు.

శ్లో. స్పృష్ట్వా రజస్వలా న్యోన్యం బ్రాహ్మణీ క్షత్రియాం తథా ।
అర్ధకృచ్ఛ్రం చరే త్పూర్వా పాద మేకం చరే త్పరా ॥

తా. రజస్వల లగుబ్రాహ్మణస్త్రీలు - రాజస్త్రీలు నొకరినొకరు తాఁకిరేని మొదటిది అర్ధకృచ్ఛ్రమును, రెండవది పాదకృచ్ఛ్రమునుం జేయవలయును.

శ్లో. స్పృష్ట్వా [illegible] న్యోన్యం బ్రాహ్మణీ వైశ్యజాం తథా ।
పాదహీనం చరే త్పూర్వా పాద మేక మనంతరా ॥

తా. రజస్వల లగుబ్రాహ్మణస్త్రీయు కోమటిస్త్రీయు - పరస్పరము తాఁకిన మొదటిది ముప్పాతికకృచ్ఛ్రమును, రెండవది పాదకృచ్ఛ్రమునుం జేయవలయును.

శ్లో. స్పృష్ట్వా రజస్వలా న్యోన్యం బ్రాహ్మణీ శూద్రజాం తథా ।
కృచ్ఛ్రేణ శుధ్యతే పూర్వా శూద్రా దానేన శుధ్యతి ॥

తా. బయటనున్న బ్రాహ్మణస్త్రీయు - శూద్రస్త్రీయు నొకరినొకరు తాఁకిన బ్రాహ్మణది కృచ్ఛ్రముచేతను, శూద్రది దానముచేతను పవిత్రలగుదురు.

శ్లో. రజస్వలా యదా స్పృష్టా శునా శూద్రేణ చైవ హి ।
ఉపోష్య రజనీ మేకాం పంచగవ్యేన శుధ్యతి ॥

తా. రజస్వల శూద్రులను, కుక్కను తాఁకినయెడల ఒకరాత్రి ఉపోష్యము చేసి స్నానముచేసి పంచగవ్యమును దీసికొనిన పరిశుద్ధయగును.

శ్లో. స్పృష్ట్వా రజస్వలా న్యోన్యం క్షత్రియా శూద్రజా తథా ।
పాదహీనం చరే త్పూర్వా పాదార్ధం తు తథో త్తరా ॥



తా. రజస్వల లగుక్షత్రియయు - శూద్రస్త్రీయు ఒకరినొకరు తాఁకినయెడల క్షత్రియస్త్రీ - పాదహీన కృచ్ఛ్రమును, శూద్రస్త్రీ - పాదార్ధ హీన కృచ్ఛ్రమును జేయవలయును.

శ్లో. స్పృష్ట్వా రజస్వలా న్యోన్యం వైశ్యజా శూద్రజా తథా ।
కృచ్ఛ్రపాదం చరే త్పూర్వా తదర్ధం తు తథో త్తరా ॥

తా. రజస్వలలగు వైశ్య శూద్రస్త్రీలు పరస్పరముతాఁకిరేని మొదటిది పాద కృచ్ఛ్రంబును, రెండవది వరకకృచ్ఛ్రంబునుం జేయవలయును.

శ్లో. స్పృష్ట్వా రజస్వలా కైశ్చి చ్ఛండాలై రరజస్వలా ।
ప్రాజాపత్యేన కృచ్ఛ్రేణ ప్రాణాయామశతేన చ ॥

తా. రజస్వలఅయినను-అరజస్వల అయినను చండాలురను తాఁకినపుడు ప్రాజాపత్యకృచ్ఛ్రముచేతను, నూరు ప్రాణాయామములచేతను పరిశుద్ధురాలగును.

### అకాలరజోదర్శన శుద్ధిక్రమము.

శ్లో. అష్టాదశదినా దర్వా క్స్నానమేవ రజస్వలా ।
తదూర్ధ్వం చ త్రిరాత్రం స్యా దుశనా ముని రబ్రవీత్ ॥

తా. స్త్రీ - రజస్వలఅయినది మొదలు పదునెనిమిది దినములలోపల తిరిగి రజస్సుకనిపించిన స్నానముమాత్రము చేయవలయును. అటుపిమ్మటఁ గనబడినయెడల మూఁడుదినములు బయటనుండవలయును.

### స్త్రీసాధారణ పారిశుద్ధ్యము.

శ్లో. అదుష్టా స్సంతతాధారా వాతోద్ధూతా శ్చ రేణవః,
స్త్రియో వృద్ధా శ్చ బాలా శ్చ న దుష్యంతి కదాచన ॥
బ్రాహ్మణాః పాదతో మేధ్యా గావో మేధ్యా స్తు పృష్ఠతః,
అజాశ్వా ముఖతో మేధ్యా స్త్రియో మేధ్యా స్తు సర్వతః ॥

తా. ఎడతెగక పడుచున్న యుదకధారలు, గాలికి రేగినదుమ్ము, స్త్రీలు, ముసలివాండ్రు, బాలురు వీరికి స్వభావ పరిశుద్ధతకలదు. బ్రాహ్మణుల పాదములు, గోవుల పృష్ఠములు, గుఱ్ఱములయొక్కయు - మేఁకలయొక్కయుముఖములు, స్త్రీలశరీర మంతయును బవిత్రములు.

శ్లో. వత్సః ప్రస్రవణే మేధ్య శ్శకుంతః ఫలపాతనే ।
స్త్రియ శ్చ రతిసంసర్గే శ్వా మృగగ్రహణే శుచిః ॥

తా. మూత్రము విడుచునపుడు శిశువును, ఫలమును కొట్టివేయునపుడు పక్షియును, కుక్క మృగములను పట్టునపుడును, సంభోగకాలంబున స్త్రీలును పరిశుద్ధులు.

వ్యభిచారిణీదోషవిముక్తి.

శ్లో. భస్మనాశుధ్యతే కాంస్యం తామ్రమమ్లేన శుధ్యతి ।
రజసా శుధ్యతే నారీ వికలం యా న గచ్ఛతి ॥

తా. కంచు బూడిదచేతను, రాగి పులుసుచేతను, వ్యభిచరించిన స్త్రీ గర్భధారణము లేకుండిన రజోదర్శనమువలనను శుద్ధిజెందును.

చండాలసంసర్గప్రాయశ్చిత్తము.

శ్లో. చండాలైస్సహ సంపర్కం యా నారీ కురుతే తతః ।
విప్రాన్ దశవరాన్ కృత్వా స్వకం దోషం ప్రకాశయేత్ ॥

తా. చండాలురతో సంపర్కముచేసిన స్త్రీ శ్రేష్ఠులగు పదిమంది బ్రాహ్మణుల సభచేయించి తనదోషమును వారితోఁ జెప్పవలయును.

శ్లో. ఆకంఠసమ్మితే కూపే గోమయోదకకర్దమే ।
తత్ర స్థిత్వా నిరాహారా త్వహోరాత్రేణ నిష్క్రమేత్ ॥
సశిఖం వపనం కృత్వా భుంజీయా ద్యావకౌదనం ।
త్రిరాత్ర ముపవాసిత్వా త్వేకరాత్రం జలే వసేత్ ॥
శంఖపుష్పలతామూలం పత్రం వా కుసుమం ఫలం ।
సువర్ణపంచగవ్యం చ క్వాథయిత్వా పిబే జ్జలం ।
ఏకభుక్తం చరే త్పశ్చా ద్యావత్పుష్పవతీ భవేత్ ॥
వ్రతం చరతి త ద్యావ త్తావ త్సంవ ర్తతే బహిః ।
ప్రాయశ్చిత్తే తత శ్చీర్ణే కుర్యా ద్బ్రాహ్మణభోజనం ।
గోద్వయం దక్షిణాం దద్యా చ్ఛుద్ధిం పారాశరో౽బ్రవీత్ ॥

తా. ఆబ్రాహ్మణుల సమ్మతినిపొంది కంఠములోఁతుగల బావియందు ఆవుపేడ నీళ్ళు నిండబోసి దానియందు ఉపవాసముతో అహోరాత్రములుండివచ్చి వపనమును చేయించుకొని యవాన్నమునుదిని మరల మూఁడుదినము లుపవాసముచేసి నాలవదినమున కంఠములోఁతునీళ్ళలోనుండి తరువాత శంఖపుష్పియను మూలిక వేరు ఆకు పువ్వు పండు, బంగారు, పంచగవ్యము వీనితో కాఁచిననీళ్ళను త్రాగి, తరువాత తిరిగి పుష్పవతియగువఱకు ఒంటిపూఁటభుజింపవలయును; వ్రతము సమాప్తియగువఱకు నింటికివెలుపలనే యుండవలయును. ప్రాయశ్చిత్తము జరిగినపిమ్మట బ్రాహ్మణులకు భోజనముపెట్టి ఆవును వృషభమును దానముచేసినయెడల శుద్ధియగును.



ప్రాయశ్చిత్తార్హత.

శ్లో. చాతుర్వర్ణ్యస్య నారీణాం కృచ్ఛ్రం చాంద్రాయణం స్మృతం ।
యథాభూమి స్తథా నారీ తస్మా త్తాం న తు దూషయేత్ ॥

తా. నాలుగు వర్ణములస్త్రీలును కృచ్ఛ్రమును, చాంద్రాయణమునుచేసిన పరిశుద్ధలగుదురు; స్త్రీ భూమివలె పరిశుద్ధురాలగును కాన ప్రాయశ్చిత్తము జేయించి చేర్చుకొనవచ్చును విడువరాదు.

వ్యభిచారిణీప్రాయశ్చిత్తము.

శ్లో. బందిగ్రాహేణ యా భుక్తా హత్వా బధ్వా బలా ద్భయాత్ ।
కృత్వా సాంతపనం కృచ్ఛ్రం శుద్ధిం పారాశరో౽బ్రవీత్ ॥

తా. బలాత్కారముగా కట్టి కొట్టి భయపెట్టి చెఱపెట్టి భోగింపఁబడినస్త్రీ సాంతపనకృచ్ఛ్రముచేసిన పవిత్రురాలగును.

శ్లో. సకృద్భుక్తా తు యా నారీ నేచ్ఛంతీ పాపకర్మభిః ।
ప్రాజాపత్యేన శుధ్యేత ఋతుప్రస్రవణేన చ ॥

తా. తాను ఇచ్ఛలేనిదయ్యును దుర్మార్గులచే నొకపర్యాయము భోగింపఁబడిన స్త్రీ ప్రాజాపత్యముచేతను రజోదర్శనముచేతను పరిశుద్ధురాలగును.

వ్యభిచారీత్యాగము.

శ్లో. జారేణ జనయే ద్గర్భం మృతే౽వ్యక్తే గతే పతౌ ।
తాం త్యజేత్ పరే రాష్ట్రే పతితే పాపకారిణీం ॥

తా. పెనిమిటి మృతుఁడైనను, దేశాంతరముపోయిన వార్త దెలియకుండినను, పతితుఁడైనను పరపురుషసంసర్గముచేసి బిడ్డఁగనిన స్త్రీని పరదేశమునకు వెడలఁగొట్టవలెను.

శ్లో. బ్రాహ్మణీ తు యదా గచ్ఛే త్పరపుంసా సమన్వితా ।
సా తు నష్టా వినిర్దిశ్యా న తస్యా గమనం పునః ॥

తా. బ్రాహ్మణస్త్రీ - తండ్రి, భర్త, దేహబంధువులు మొదలగువారుగాక పరపురుషులతోఁగూడి దేశాంతరము పోయినయెడల దానిని నష్ట, అని బంధువులలో ప్రకటించవలయును; అది యింటికివచ్చిన చేర్చుగూడదు.

శ్లో. కామాన్మోహా త్తుయా గచ్ఛే త్త్యక్త్వా బంధూ న్పతిం సుతాన్ ।
సా తు నష్టా పరే లోకే మానుషేషు విశేషతః ॥

తా. బంధువులను పెనిమిటిని కొడుకులనువిడిచి, కామముచేగాని మోహముచే

గాని గ్రామాంతరములందు చిరకాలముండుటకు బయలువెడలిన స్త్రీకి పరలోకము చెడును; ఇహలోకమునందు బంధువులలోను చేర్పఁబడదు.

శ్లో॥ మదమోహగతా నారీ క్రోధా ద్దండాదితాడితా ।
అద్వితీయా గతా చైవ పునరాగమనం భవేత్ ॥

తా. మదమువలనఁగాని అజ్ఞానమువలనఁగాని పెద్దల నవమానపరచినస్త్రీని పెనిమిటి మొదలగువారు కోపముచే కఱ్ఱలు మొదలగువానితోఁ గొట్టినయెడల నొచ్చటికైన నొక్కతె వెడలిన నది మరల నింటికిరావచ్చును.

శ్లో॥ దశమే తు దినే ప్రాప్తే ప్రాయశ్చిత్తం న విద్యతే ।
దశాహం న త్యజే న్నారీం త్యజే న్నష్టశ్రుతాం తథా ॥
భర్తాచైవ చరే త్కృచ్ఛ్రం కృచ్ఛ్రార్ధం చైవబాంధవాః ॥

తా. ఇల్లు విడిచిపోయినస్త్రీ పదిదినములవఱకు వ్యభిచరించినట్టు తెలియకుండినయెడల ప్రాయశ్చిత్తములేకుండ చేర్చుకొనఁదగును; వ్యభిచరించినట్టు తెలిసిన విడువవలయు; విడువనియెడల పెనిమిటి కృచ్ఛ్రమును జేయవలయు.

ఉద్బంధమరణమహాదోషము.

శ్లో॥ అతిమానా దతిక్రోధా త్స్నేహా ద్వా యది వా భయాత్ ।
ఉద్బధ్నీయా త్స్త్రీ పుమాన్ వా గతి రేషా విధీయతే ॥
పూయశోణితసంపూర్ణే త్వంధేతమసి మజ్జతి ।
షష్టిర్వర్షసహస్రాణి నరకం ప్రతిపద్యతే ।
ఆశౌచం నోదకం నాగ్నిం నాశ్రుపాతం చ కారయేత్ ॥

తా. స్త్రీగాని-పురుషుఁడుగాని అవమానమువలనఁగాని క్రోధమువలనఁగాని, అతిస్నేహమువలనఁగాని, భయమువలనఁగాని ఉరిపెట్టుకొనినయెడల దుర్గంధరక్తముతోఁగూడిన అంధతమస్సను నరకమునందు అరువదివేలేండ్లుండుగు. వీరికి అశౌచము పట్టుట, ఉదకమునిచ్చుట, దహనము, దుఃఖించుట మొదలగు పనులు చేయఁగూడదు.

---

గర్భాధానము.

శ్లో॥ స్నాతా చందనలిప్తాంగీ సుగంధా సుమనోఽన్వితా,
తైలమాషోత్తరాహారా సువేషా సమలంకృతా ॥
తాంబూలవదనా పత్యౌ పరమక్తా ధిగస్మరా,
పుత్రార్థినీ నరం నారీ [illegible] ॥



తా. ఋతుస్నానముచేసినస్త్రీ కామవృద్ధికై నూనె మినుములు కలిసిన పదార్థములను ఆహారమునం దుపయోగించుకొని, చందనాది సుగంధిద్రవ్యములఁ బూసికొని, పుష్పమును ధరించి, వస్త్రాభరణాదులచే మనోహరవేషమును ధరించి, తాంబూలమొనర్చి భర్తయందు మిక్కిలి యనురాగముతోఁ బుత్రుని గోరుచున్నదై శుభకరమైన మంచమునందు పురుషునితోఁ గూడవలయు.

శ్లో॥ ఉత్తానా తన్మనా యోషి త్తిష్ఠే దంగైః సుసంస్థితైః ।
తథా హి బీజంగృహ్ణాతి దోషైః స్వస్థాన మాస్థితైః ॥

తా. స్త్రీ - సంభోగసమయమున భర్తయందే మనస్సుగలదై బాగుగ నుంచబడిన యవయవములుగలదై వెల్లకిలఁ బరుండవలయు; అట్లగుటచే స్వస్థానస్థితవాతాది దోషములచే పురుషుని బీజమును గ్రహించును.

ఋతుస్నానముచేసి పురుషుని జేరకుండుటవలనిదోషము.

శ్లో॥ ఋతుస్నాతా తు యా నారీ భర్తారం నోపసర్పతి ।
సా మృతా నరకం యాతి వైధవ్యం చ పునఃపునః ॥

తా. ఋతుస్నానముచేసినస్త్రీ భర్తను పొందకుండెనేని అది మరణించిన పిదప నరకమునుపొంది పలుమారు వైధవ్యమును పొందును.

ఋతుకాలవివరణము.

శ్లో॥ ఋతు స్స్వాభావిక స్త్రీణాం రాత్రయ ష్షోడశ స్మృతాః,
చతుర్భి రితరైః స్సార్థ మహోభి స్సద్విగర్హితైః ।
తాసా మాద్యా శ్చతస్ర స్తు నింది తైకాదశీ చ యా,
త్రయోదశీ చ శేషా స్తు ప్రశస్తా దశరాత్రయః ॥

తా. స్త్రీకి రజస్సు కనఁబడినది మొదలు ౧౬ దినములు ఋతుకాలమనఁబడును; అందు మొదటి నాలుగురాత్రులు పదునొకండవరాత్రి పదుమూడవరాత్రి వీనినివిడిచి తక్కిన ౧౦దినములందు పర్వాదులనువిడిచి పురుషునిఁగూడవలయును.

స్త్రీపుంసాద్యుత్పత్తికారణము.

శ్లో॥ యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు ।
పుమాన్ పుంసోఽధికే శుక్లే స్త్రీ భవ త్యధికే స్త్రియాః ।
సమేఽపుమాన్ పుంస్త్రియౌ వా క్షీణేఽల్పే చవిపర్యయః ।
యది సంయోగకాలే తు [illegible] ।
ద్విధా [illegible] తత్ర జాయతే ॥

తా. సరిదినములయందుఁగూడిన పుత్రులును, బేసిదినములయందు పుత్రికలును గలుగుదురు; పురుషునివీర్యము అధికమైన పుత్రుఁడును, స్త్రీయార్తవ మధికమైన స్త్రీయును, రెండును సమత్వమును జెందిన నపుంసకుఁడుగాని, స్త్రీపురుషులు గాని గలుగుదురు; సంభోగకాలమున పురుషుఁడు రాగమోహితుఁడై శుక్రమును రెండువిధములుగ విడిచిన కవలుబుట్టుదురు.

శ్లో. రాత్రౌ చతుర్థ్యాం పుత్రి స్స్యా దల్పాయు ర్ధనవర్జితః ।
పంచమ్యాం పుత్రిణీ నారీ షష్ఠ్యాం పుత్రి స్తు మధ్యమః ॥
సప్తమ్యా మప్రజా యోషి దష్టమ్యా మీశ్వర స్సుతః ।
నవమ్యాం సుభగా సాధ్వీ దశమ్యాం చ వరః పుమాన్ ॥
ఏకాదశ్యా మధర్మ్యా స్త్రీ ద్వాదశ్యాం పురుషోత్తమః ।
త్రయోదశ్యాం సుతా లోకవర్ణసంకరకారిణీ ॥
ధర్మవి చ్చ కృతజ్ఞ స్స్యా దాత్మవేదీ దృఢవ్రతః ।
ప్రజాయతే చతుర్దశ్యాం గుణౌఘై ర్జగతీపతిః ॥
రాజపత్నీ మహాభోగా రాజవంశగతా ధవా ।
జాయతే పంచదశ్యాం తు బహుపుత్రా పతివ్రతా ॥
విద్యాలక్షణసంపన్న స్సత్యవాదీ జితేంద్రియః ।
ఆశ్రయ స్సర్వభూతానాం జాయతే షోడశే పుమాన్ ॥

తా. నాలవదినమురాత్రి పురుషునిఁ జేరినయెడల అల్పాయువు ధనహీనుఁడునగుపుత్రుఁడును, ఐదవదినమురాత్రి పుత్రవతియగుకూఁతురును, ఆఱవదినము రాత్రియందు మధ్యముఁడగుపుత్రుఁడును, ఏడవదినమురాత్రి సంతానహీనురాలగు పుత్రికయు, ఎనిమిదవ దినమున ప్రభువగు పుత్రుడును, తొమ్మిదవ దినమున పతివ్రతయగుపుత్రికయు, పదియవదినమున శ్రేష్ఠుఁడగుపుత్రుడును, పదునొకొండవదినమున అధర్మురాలగు పుత్రికయు, పండ్రెండవదినమున పురుషోత్తముఁడగు పుత్రుఁడును, పదుమూడవదినమున వర్ణసంకరకరురాలగు పుత్రికయు, పదునాలవదినమున ధర్మవేత్తయు, కృతజ్ఞుఁడును, ఆత్మవేదియు, దృఢవ్రతుఁడును, సుగుణములు గలవాఁడును, భూభర్తయు నగుకొమరుఁడును గలుగుదురు. పదునేనవదినమున రాజపత్నియు, పతివ్రతయు, రాజవంశమును బొందునదియు, శ్రేష్ఠురాలును, పుత్రులుగలదియు నగుపుత్రికగలుగును; పదియాఱవదినంబున విద్యాలక్షణసంపన్నుండును, సత్యవాదియు, జితేంద్రియుఁడును, సర్వభూతాశ్రయుఁడునగు పుత్రుఁడు గలుగును.



## గర్భధారణచిహ్నము.

శ్లో. సద్యోగృహీతగర్భాయా శ్శ్రమ స్స్యా ద్యోన్యభిజాయతే ।
పిపాసా చ తతో గ్లాని ర్యోన్యా స్తు స్ఫురణం భవేత్ ।
శుక్లశోణితసంబంధ స్సక్థిస్పందన మేవ చ ॥

తా. అప్పుడు గర్భమునిలిచిన స్త్రీకి తొలుత శ్రమ, దప్పి, అనంతరము బలహీనత, యోనిస్ఫురించుట (నిండియుండుట) శుక్రశోణితములు కలిసికొనుట, తొడలు బలహీనములగుట ఈలక్షణములు గలుగును.

## గర్భిణీలక్షణము.

శ్లో. స్తనయోః కృష్ణముఖతా రోమరాజ్యుద్గమ స్తథా,
అక్షిపక్ష్మాణి చాప్యస్యా స్సమ్మీల్యంతే విశేషతః ।
అకామత శ్ఛర్దయతి గన్ధా దుద్విజతే శుభాత్,
ప్రసేక స్సదనం చాపి గర్భిణ్యా లింగ ముచ్యతే ॥

తా. కుచాగ్రములు నలుపుగనుండుట, నూగారు పైకి ఉబుకుట, కనులు మూతలుబడుట, నిష్కారణముగ వాంతియగుట, ఉత్తమవాసనను సహించకుండుట, నోట నీళ్లూరుట, ఒడలు చిక్కుట ఈలక్షణములు గలిగిన గర్భిణియని తెలియవలయు.

గర్భిణీధర్మములు.—శ్లో. గర్భధారణమారభ్య వ్యాయామవ్యసనాని చ।
తత్క్షణం చ దివాస్వాపం రాత్రౌ జాగరణం తథా ।
గజాశ్వారోహణంశోక వేగధారణ మేవ చ ।
విరేచనం నైవ కుర్యాత్ క్షారాద్యన్నం చ వర్జయేత్ ॥
నావస్కరేషూ పవిశే న్ముసలోలూఖలాదిషు ।
జలం చ నావగాహేత శూన్యాగారం చ వర్జయేత్ ॥
వల్మీకం నాధితిష్ఠేత న చో ద్విగ్నమనా భవేత్ ।
విలిఖే న్న నఖై ర్భూమిం నాంగారేణ న భస్మనా ॥
న శయాళు స్సదా తిష్ఠే త్కట్వచ్ఛాయాం వివర్జయేత్ ।
న తుషాంగారభస్మాస్థికపాలేషు సమావిశేత్ ॥
వర్జయే త్కలహం లోకే గాత్రభంగం తథైవ చ ।
న ముక్తకేశీ తిష్ఠే త్తు నాశుచి స్స్యా త్కదాచన ॥
నశయీతో త్తరశిరా న చైవాధశ్శిరాః క్వచిత్ ।
నవస్త్రహీనా నోద్విగ్నా న చార్ద్రచరణా సతీ ।

నామంగళ్యం వదే ద్వాక్యం న చ హాస్యాదికం తథా ।
కుర్యా చ్ఛ్వశురయో ర్నిత్యం పూజాం మంగళతత్పరా ।
తిష్ఠే త్ప్రసన్నవదనా భర్తృప్రియహితే రతా ॥

తా. స్త్రీ గర్భము ధరించినది మొదలు ఎల్లప్పుడు సంచరించుట, వ్యసనము, పగటినిద్ర, రాత్రి మేల్కొనుట, గజాశ్వాదుల నెక్కుట, దుఃఖము, మలమూత్రముల విడువకుండుట, విరేచనము, కారపుఅన్నము, అపరిశుద్ధస్థానములందును-తోలు మొదలగు ఉన్నతస్థానములందును కూర్చొనుట, నీటియందు మునుఁగుట, పాడుఇండ్లలోనుండుట, పుట్టనెక్కుట, భయపడుట, గోళ్లతోను బొగ్గుతోను బూడిదతోను నేల గీచుట, ఎల్లప్పుడు పండుకొనుట, మంచపునీడనుండుట, పొట్టు- బొగ్గులు - బూడిద- ఎముకలు-పుర్రెలుగలచోట్లనుండుట, జగడము, ఒడలువిరుచుట, వెండ్రుకలు విరియబోసికొనుట, అపరిశుద్ధి, ఉత్తరశిరముగాఁ బరుండుట, తలక్రిందుగఁబరుండుట, వివస్త్రరాలై యుండుట, తడికాళ్ళతోనుండుట, అమంగళకరములును - హాస్యకరములునగు మాటలుపలుకుట వీనిని వర్జింపవలయు. మంగళములయందాసక్తిగలిగి యత్తమామలఁ బూజించుచు . పెనిమిటిేష్టములను నెరవేర్చుచు ప్రసన్నురాలై యుండవలయు.

గర్భిణీచ్ఛాపూర్తికర్తవ్యము.

శ్లో. దౌహృదస్య ప్రదానేన గర్భో దోష మవాప్నుయాత్ ।
వైరూప్యం మరణం వాపి తస్మా త్కార్యం ప్రియం స్త్రియః॥

తా. గర్భిణీస్త్రీకి వాంఛలు దీర్చనియెడల గర్భము దోషముచెంది- విరూపము, పొట్టితనము, బొక్కిటోమ్ము, ఊఁచచేతులు, గ్రుడ్డితనమును,కుంటితనమును,జడత్వమునుగాని మరణమునుగాని పొందును కావున నవశ్యము కోర్కెల దీర్పవలయును.

స్త్రీపురుషప్రసూతి చిహ్నము.

శ్లో. ప్రాక్పయోదర్శనం యస్యా స్తనే వై దక్షిణే భవేత్,
ఉత్కర్షణం దక్షిణోరో ర్మహత్త్వం దక్షిణాక్షిణః ॥
పుంద్రవ్యేచ్ఛోపలబ్ధి శ్చ స్వప్నే నిర్మలతా ననే,
సూయతే తై స్సుతం నారీ విపరీతై స్తు కన్యకాం ॥

తా. గర్భిణికి దక్షిణకుచమున ముందుగ పాలు గనబడుటయు, నడుము కుడిప్రక్క బరువై యుండుటచే కుడితొడ లావుగఁ గనుపించుటయు, కుడికన్ను పెద్దదిగ గనుపించుటయు, పుంనామద్రవ్యములయందు ఇచ్ఛగలుగుటయు, పుంనామపదార్థములు స్వప్నమునఁ గాంచుటయు, ముఖమునందు స్వచ్ఛతయుఁ గలిగినయెడల పురుషుఁడగును; దీనికి విపరీతలక్షణములు గలిగినయెడల స్త్రీయగును.



నపుంసకప్రసూతిచిహ్నము.

శ్లో. పూర్వోక్తలక్షణై ర్యాచోన్నతపార్శ్వద్వయా భవేత్ ।
పురస్స్రస్తోదరా నారీ సూయతే చ నపుంసకం ॥

తా. పూర్వోక్తలక్షణములు గలిగి కడుపుయొక్క రెండుపార్శ్వములును ఎత్తుగలిగి ముందుకు జారియుండిన నపుంసకుని గనును.

యమళప్రసూతిచిహ్నము.

శ్లో. ద్రోణ్యాకారం మధ్యనిమ్నం యస్యా స్స్యా దుదరం తథా ।
రోమరాజి ర్భవే న్నిమ్నా తస్యా వై యమళౌ శిశూ ॥

తా. గర్భిణియొక్క కడుపు దోప్పవలె నడుమ పల్లము గలిగి నూగారు చాలు పల్లమైయుండిన జంట శిశువులు గలుగుదురు.

శ్లో. దేవతాబ్రాహ్మణపరా శ్శౌచాచారహితే రతాః ।
మహాగుణాన్ ప్రసూయన్తే విపరీతా స్తు నిర్గుణాన్ ॥

తా. దేవతలయందును బ్రాహ్మణులయందును భక్తిగలవారును, దంతధావనాది శౌచకృత్యములందును, సదాచారమునందును, అసక్తిగలవారు నగు గర్భిణీస్త్రీలకు సదాచార సురూప సౌందర్యాదిగుణములుగల సంతానములు గలుగును; దురాచార ప్రవర్తనాదులు గలిగియుండిన దుస్సంతానము గలుగును.

పుంసువనము.—శ్లో. తృతీయేవాచతుర్థేవా మాసిపుంసువనంభవేత్।
గర్భవ్యక్తౌ స్మృతం త చ్చ లోకసిద్ధా స్త్రియా హి సా ॥

తా. పుంసువనమనఁగా పుత్రసంతానమునుగలుగఁజేయు నొక కర్మము; దీనిని మూడవమాసమునందుఁగాని, నాలవమాసమునందుఁగాని చేయవలయు.

సీమంతము.—శ్లో. షష్ఠేవా సప్తమేమాసి సీమంతోన్నయనంభవేత్।
అష్టమే నవమే వా పి యావద్వా ప్రసవో భవేత్ ॥

తా. సీమంతమ అనఁగా గర్భము చక్కనగుటకు స్త్రీకిఁ జేయునట్టి సంస్కారవిశేషము; దీనిని ౬-౭-౮-౯- ఈనెలలలో దేనియందైనను, ప్రసవములోపలనైనను చేయవలయును,

ఇతి శ్రీమద్రాజగోపాల కృపాపరిలబ్ధ పాండిత్యవైభవ శ్రీమద్గాణపు
వంశ సుధాంబుధిపూర్ణసుధానిధి శ్రీమద్వేంకటాచార్యవిరచితే
* శ్రీధర్మరత్నభాండాగారే *
స్త్రీజాతకర్మసంస్కారాది కథనంనామ ప్రథమ ప్రకరణమ్.

ఓమ్ శ్రీయైనమః.

# శ్రీ ధర్మరత్న భాండాగారము

## ద్వితీయ ప్రకరణము.

### స్త్రీనీతి.

శ్లో. సుఖార్థా స్సర్వభూతానాం మతా స్సర్వప్రవృత్తయః ।
సుఖం చ న వినా ధర్మా త్తస్మా ద్ధర్మపరా భవేత్ ॥

తా. సకల ప్రాణులును సుఖమునిమిత్తమై కార్యములయందు ప్రవర్తింతురు; అట్టిసుఖము ధర్మాచరణము లేకగలుగదు; కావునధర్మాచరణమునవశ్యము సేయవలయు.

సూ. తద్యథా—

తా. అది యెట్లనగా;—

సూ. భర్తారం దైవం మన్యమానా తదనుజ్ఞయా దేవ గో బ్రాహ్మణ గురు వృద్ధాచార్యా నర్చయేత్ । దుస్సంగ పరపురుషేక్షణా దీని వర్జయేత్ । నిత్యం స్నాయాత్ । సత్యం బ్రూయాత్ । ఉపహతాంబరధారిణీ। భర్త్రా ధర్మచారిణీ । ధృత వస్త్రాలంకార భూషా। సుగంధమాల్యాలంకృతవేషా। సచ్ఛీలా । సుగుణశాలా। సతీ। నాన్యస్వం గృహ్ణీయాత్ । నాన్యదోషం బ్రూయాత్ । నచాతిబ్రూయాత్ । న గుహ్యం వివృణుయాత్। నాన్యశ్రియం వైరం రోచయేత్ । నాన్యరహస్య మాగమయేత్ । న దన్తాన్ విఘట్టయేత్ । న నఖా నంగాంశ్చ వాదయేత్ । న చంచలం మనో భ్రామయేత్ । నాసంవృతముఖీ జృంభాం క్షువథుం హాస్యం వా ప్రవర్తయేత్। న వరాభి ర్విరుధ్యేత। నావరా ఉపాసీత। నోచ్చై ర్భాషణం కుర్యాత్ । నతృణం ఛింద్యాత్ । న సంధ్యాస్వభ్యవహారస్వాపాదిసేవిని స్యాత్। న శోక మనువిశేత్।



న సిద్ధౌ హాత్సుక్యంగచ్ఛేత్। నాసిద్ధౌ దైన్యం। నాపవాదమను స్మరేత్ ।నాహంకారిణీభవేత్। నవృద్ధాన్గురూనధిక్షిపేత్। బాంధవానురక్తగుహ్యజ్ఞాననుసరేత్ ।న మద్యద్యూతప్రసంగాభవేత్। నవాప్యగ్నిసలిల సోమార్క-ద్విజగురు ప్రతిముఖం నిష్ఠీవేత్ । మలమూత్రాణిచనోత్సృజేత్। నపథి। నజనవతి । నాన్నకాలే ॥

తా. స్త్రీ-భర్తను దైవముగా భావించి అతనియాజ్ఞచొప్పున దేవతలను-గోవులను-బ్రాహ్మణులను-పితృాదులను-పెద్దలను - ఆచార్యులను పూజించవలయు. దుర్జనసహవాసమును, పరపురుషులఁ జూచుటను వర్జింపవలయు. నిత్యము స్నానముసేయుచుండవలయు. యథార్థము చెప్పవలయు. ఉదికిన వస్త్రమును ధరింపవలయు. భర్తతోఁగూడ ధర్మముల నాచరించుచుండవలయు. మంచి వస్త్రములను ఆభరణములను చందనమును పుష్పమాలికలనుధరించి మనోహరయై యుండవలయు. మంచి స్వభావము సద్గుణములు గలిగియుండవలయు. ఇతరుల ధనము నపహరింపఁగూడదు. పరదోషమును జెప్పఁగూడదు. విశేషముగ మాటలాడఁగూడదు. రహస్యమును వెలిపుచ్చగూడదు. ఇతరులసంపదను అన్యులతోడి వైరమును గోరగూడదు. ఇతర రహస్యమును బైటచెప్పగూడదు. పండ్లుకొరుకరాదు. గోళ్ళనుగాని అవయవములఁగాని వాయింపఁగూడదు. మనస్సును చలింపజేయఁగూడదు. ముఖము మూసికొనకయే ఆవులింతను తుమ్మును ఎగతాళిని చేయఁగూడదు. ఉత్తమస్త్రీలతో విరోధమును, అధమస్త్రీలతో సహవాసమును జేయగూడదు. పెద్దగా మాటలాడజనదు. గడ్డిని త్రుంచగూడదు. సంధ్యాకాలములందు భోజనమును నిద్రను మైథునమును వర్జింపవలయు. ఎప్పుడును దుఃఖింపఁగూడదు. కార్యసిద్ధియందు అధిక సంతోషమును, కార్యహానియందు కడు దైన్యమును జెందఁగూడదు. అపవాదమును తలంపఁగూడదు. అహంకారమును విడువవలయు. పెద్దలను గురువులను ఆక్షేపింపగూడదు. బంధువులను, తనయందు ప్రీతిగలవారిని, తనరహస్యమును గుఱుతెఱిగినవారలను అనుసరించియుండవలయు. మద్యమును త్రాగఁగూడదు. జూదమాడఁదగదు. అగ్ని-ఉదకము-చంద్రసూర్యులు-బ్రాహ్మణులు-గురువులు వీరలయెదుట కేకరించి యుమియుటయు, మలమూత్రముల విడుచుటయు గూడదు. మార్గమునడుమను మనుష్యులుగల తావునను, భోజనసమయమున మలమూత్రముల విడువఁగూడదు.

### స్నానాదిక్రమము.

శ్లో. న వివసనా స్నాయాత్ । ప్రమాదతోఽప్యవసనా న కించిత్కుర్యాత్ । నాప్సు మూత్ర ముత్సృజేత్ । ముఖవాయునా నాగ్నిం ప్రజ్వాలయేత్। న నగ్నా ప్రవిశేజ్జలం। నాత్మబింబం

జలే పశ్యేత్ । అపకారపరాయాం చ ఉపకారపరా భవేత్ ।
ఆత్మవ త్సతతం పశ్యే దపి కీటపిపీలికాః ॥

తా. స్త్రీ వస్త్రహీనయై స్నానము చేయఁగూడదు. ప్రమాదమువలనకైనను దిసమొలతో ఇంటిపనులఁ జేయఁదగదు. ఉదకమున మూత్రము విడువఁగూడదు. నోటితో అగ్నిని ఊఁదఁగూడదు. నీటియందు తననీడను జూడఁగూడదు. దిసమొలతో గుంటయందు స్నానము చేయఁగూడదు. తనకపకారమును జేయువారలకైన నుపకారమునే చేయవలయు, పురుగులు చీమలు మొదలగువానినిగూడ తనవలె నెంచవలెను.

శ్లో. ఉత్థాయ పశ్చిమే యామే భర్తుః పూర్వ మతంద్రితా ।
కృత్వా శౌచంవిధానేన దంతధావన మాచరేత్ ॥
కృత్వాథ మంగళస్నానం ధృత్వా శుక్లాంబరం తథా ।
ఆచమ్య ధారయే దూర్ధ్వపుండ్రం శుభ్రం మృదైవ తు॥
చందనేనాపి కస్తూర్యా కుంకుమేనాపి వా సతీ ।
జప్త్వా మంత్రం గురుం పశ్చా దభివంద్య చ వైష్ణవాన్॥
నమస్కృత్వా జగన్నాథం జప్త్వా చ శరణాగతిం ।
ఆత్మానం సమలంకృత్య చింతయే న్మధుసూదనం ॥
గృహభాండాదికం సర్వం వాగ్యతా నియతేంద్రియా ।
సంశోధయే త్ప్రతిదినం యజ్ఞార్థం పరమాత్మనః ॥
మార్జయిత్వా గృహం పశ్చా ద్గోమయే నానులిప్య చ ।
రంగవల్ల్యాదిభిః పశ్చా దలంకృత్య సమంతతః ॥
చతుర్విధానాం భాండానాం క్షాళనం తు సమాచరేత్ ।
పాచకాని బహిస్థాని జలస్యానయనాని చ ॥
స్థాపనాని జలార్థం వా చతుర్విధ ముదాహృతం ।
పృథక్పృథ గుదంచాని తేషుతేష్వపి విన్యసేత్ ॥
నాన్యోన్యం సంకరంకుర్యా ద్భాండానాం సర్వకర్మసు ।
తాని తాని స్పృశే త్పాణిం ప్రక్షాళ్యైవ పునఃపునః ॥
సమ్య క్ప్రక్షాళ్య భాండాని దాహయే ద్యజ్ఞియై స్తృణైః
పునః ప్రక్షాళ్య సంతప్య పశ్చా త్పచన మాచరేత్ ॥
రసభాండాని సర్వాణి క్షాళయే దుష్ణవారిణా ।
చతుర్భిః పంచభి ర్ధ్యాత్వా స్త్రిస్త్రి వా క్షాళయే త్తదా ॥



బహి ర్ని నిష్క్రమయ్యాత పాచకాని గృహాంతికాత్ ।
తాభి రేవ న దద్యా త్తు భుంజతాం హి కథంచన ॥
దత్వా పాత్రాంతరే దద్యా త్కాంస్యే వా మృణ్మ యేపి వా।
పుటే పర్ణమయే వాపి దద్యా దత్ర తు వైణవే ॥
స్రువం దారుమయం కాంస్యం కుర్వీతాయోమయం న తు ।
న పద్యా దారనాళస్య ఘటం త స్మిన్ మహానసే ॥
ఊర్ధ్వంమాసా త్త్యజే త్సర్వం మృద్భాండం వైష్ణవోత్తమా ।
న త్యజే ల్లోహభాండాని తాపయే చ్చ హుతాశనే ॥
సూతకే మృతకే వాపి శునాదిస్పర్శనే తథా ।
స్పర్శనే వా ప్యభక్ష్యాణాం సద్య ఏవ పరిత్యజేత్ ॥
సంప్రోక్ష్యాద్భి శ్శుచౌ దేశే ధాన్యం సంశోధయే ద్భువి ।
అవహన్యా చ్ఛుభతరం గాయంతీ మధుసూదనం ।
సంశోధ్యతండులాన్ పశ్చా దద్భి స్సంక్షాళయే త్త్రిభిః॥
అంభ స్త్రివారం వస్త్రేణ శోధయిత్వా ఘటాంతరే ।
పాచయే త్సా పవిత్రా తు వాగ్యతా నియతేంద్రియా ॥
ఉపవిశ్య శుభే కుండే వహ్నిం ప్రజ్వాలయే త్తతః ।
అవైష్ణవస్య శూద్రస్య పతితస్య తథైవచ ।
పాషండస్యా ప్యశుద్ధస్య గృహే వహ్నిం వివర్జయేత్ ॥
సంప్రోక్ష్య మంత్రరత్నేన వహ్నిం కుశజలై స్త్రిభిః ।
యజ్ఞియై ర్విమలైః కాష్ఠై ర్వ్యజనేన ప్రదీపయేత్॥
ప్రదీప్యాగ్నిం తతో న్నాద్యం పచే న్నియతమానసా ।
చింతయన్ పరమాత్మానం జపన్ మంత్రం ద్వయం తథా॥
పక్త్వాన్నాద్యం యథాపక్వం వాగ్యతా నియతేంద్రియా ।
క్షాలయిత్వాథ దేవస్య భాజనాని శుభై ర్జలైః ॥
అభిపూర్య తతో దద్యా ద్భోజయే చ్చ విశేషతః ।
భోజయే దాగతాన్ కాలే సఖిసంబంధిబాంధవాన్ ॥
బాలాన్ వృద్ధాన్ భోజయిత్వా భర్తారం భోజయే త్తతః।
స్వయంహృష్టా తతో ఽశ్నీయా ద్భర్తు ర్భుక్తావశేషితం ॥

తా. స్త్రీ భర్తకంటె ముందుగా మూడవజామున నిద్రలేచి క్రమప్రకారము శౌచవిధినిజేసి దంతధావనము చేయవలయును; తరువాత మంగళస్నానమాచరించి శుభ్రవస్త్రమును ధరించి యాచమనము చేసి, శుభ్రమృత్తు చందనము కస్తూరి కుంకుమము వీనిలో దేనిచేనైనను ఊర్ధ్వపుండ్రమును ధరించి మంత్రమును శరణాగతిని జపించి గురువులకు విష్ణుభక్తులకు నమస్కరించి భూషణాదుల నలంకరించికొని భగవంతుని ధ్యానించుచు మౌనముతో భగవదారాధన నిమిత్తము గృహభాండాదులను శుద్ధిచేసి పిదప గోమయముతో ఇల్లలికి ముగ్గులుతీర్చి, వండఁదగినవియు బైటనుంచఁదగినవియు నీటితో ఇంటనుంచఁదగినవియు నగు చతుర్విధభాండములను ఒకటికొకటి తగులకుండ ప్రత్యేకముగ శుద్ధిచేసి పాకయజ్ఞసంబంధము లగు తృణములనుకాల్చి భాండములకు దాకించి తిరిగి కడిగి అగ్నియందుకాఁచి పాకము జేయవలయును; భాండమును తాఁకినపుడు చేయి కడుగుకొని మఱియొక భాండమును దాఁకవలయును. రసభాండములను వేడినీళ్ళచేఁగడిగిన శుద్ధియగును. హోమపాత్రములను నీళ్ళతో నాలుగైదుమారులు తోమి కడుగవలయును; కుండలను గృహమునుండి వెలుపలికిఁ దీసికొనిపోఁగూడదు; భుజించువారలకు వండినకుండలతో వడ్డింపఁగూడదు. కంచుది మట్టిది యగు ఇతరపాత్రమునందుఁగాని ఆకుదొన్నెయందుఁగాని వెదురుపాత్రములయందుఁగాని యుంచి వడ్డింపవలయును; గరిటెను కొయ్యతోనైనను కంచుతోనైనను చేయవలయును; ఇనుముతో జేయఁగూడదు; కుడితికుండను వంటయింటిలో నుంచఁగూడదు. భాండములను మాసమునకొకతూరి వర్జించుచుండవలయును; లోహభాండములను విడువనక్కఱలేదు; వీనిని అగ్నియందు తప్తము చేయవలయును. జాతాశౌచ మృతాశౌచములు కలిగినప్పుడును కుక్కలు మొదలగునవి తాఁకినపుడును, అభక్ష్యములను తాఁకినపుడును భాండములను విడువవలయును; పరిశుద్ధస్థలమున ఉదకమును ప్రోక్షించి ధాన్యమునుంచి మట్టిపెళ్లలు లేకుండునటులఁజేసి మధుసూదనునిబాడుచు చక్కఁగా దంచవలయును; పిమ్మట బియ్యమును చెరిగి యుదకముతో మూడుమారులు కడుగవలయును. ఉదకమును వేఱొక కుండయందుఁబోసి బియ్యమునుంచి మౌనముతో ప్రొయ్యిదగ్గఱ గూర్చుని విసనకఱ్ఱతో అగ్నిని ప్రజ్వలింపఁజేయవలయును; విష్ణుభక్తిహీనుఁడు, శూద్రుఁడు, పతితుఁడు, పాషండుఁడు, అపరిశుద్ధుఁడు వీరల గృహమునుండి అగ్నిని తేఁగూడదు. మంత్రరత్నమును ద్వయమును చెప్పుచు దర్భోదకముచే మూడుమారులు అగ్నిని ప్రోక్షించి శాస్త్రమునందుఁ జెప్పఁబడిన పాకయజ్ఞమున కనుకూలములగు కట్టెలను విసనకఱ్ఱతో విసరి మండింపఁజేయవలయును; ఇట్లగ్నిని ప్రజ్వలింపఁజేసి నియమముతో పరమాత్ముని ధ్యానించుచు మంత్రరత్నమును జపించుచు ఇతరసంభాషణలు చేయక బాగుగ పక్వమగునట్లు అన్నాదులను వండవలయును. పిదప భగవంతుని పూజాపాత్రములుకడిగి మంచియుదకముతో నింపించి పూజార్థమై యుంచవలయును. పిదప భగవంతునికి నివేదనముజేసి అట్టి భోజనకాలమునందు మిత్రులను సంబంధులను బాంధవులను బాలురను వృద్ధులనుభుజింపఁజేసి పిదప భర్తను భుజింపఁజేయవలయును. తదనంతరము తాను మిగుల సంతోషముతో భర్త భుజింపఁగా మిగిలినదానిని భుజించవలయును.

---



# పతివ్రతాధర్మము.

శ్లో. సుశీలం తు పరం ధర్మం నారీణాం నృపసత్తమ! ।
శీలభంగేన నారీణాం యమలోక స్సుదారుణః ॥

తా. స్త్రీలకు మంచి నడవడికయే పరమ ధర్మము; అట్టి సౌశీల్యము లేనట్టి స్త్రీలకు మిక్కిలి భయంకరమగు యమలోకము గలుగును.

శ్లో. నారీ ఖ ల్వననుజ్ఞాతా పిత్రా భర్త్రా సుతేన వా।
నిష్ఫలం తు భవే త్తస్యా యత్కరోతి వ్రతాదికం ॥

తా. స్త్రీ తండ్రి, సహోదరుఁడు, పుత్రులు మొదలగువారి యాజ్ఞలేకయే చేసిన వ్రతాదులు నిష్ఫలములగును.

శ్లో. నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషణం ।
పతిం శుశ్రూషతే యత్తు తేన స్వర్గే మహీయతే ॥

తా. స్త్రీలు వేఱుగ యజ్ఞవ్రతోపవాసాదుల సేయ నక్కఱలేదు; పతిశుశ్రూషవలననే స్వర్గమును బొందుదురు.

శ్లో. అశీలః కామవృత్తో వా గుణైర్వా పరివర్జితః ।
న స్త్రీయాః పరివర్జ్య స్స్యా త్సతతం దైవవత్పతిః ॥

తా. భర్త - సుస్వభావహీనుఁడైనను, కామాతురుఁడైనను, గుణహీనుఁడైనను దేవునిగా నెంచి పరిత్యజింపఁగూడదు.

శ్లో. పాణిగ్రాహస్య సాధ్వీ స్త్రీ జీవతో వా మృతస్య వా ।
పతిలోక మభీప్సంతీ నా చరే త్కించి దప్రియం ॥

తా. పతివ్రత యగు స్త్రీ - భర్త బ్రదికియున్నను మృతిఁజెందినను తాను పతిలోకమును గోరుచు నతనికిఁ గొంచెమైన నప్రియము నాచరింపఁగూడదు.

శ్లో. బాలయా వా యువత్యా వా వృద్ధయా వాపి యోషితా ।
న స్వాతంత్ర్యేణ కర్తవ్యం కించిత్కార్యం గృహేష్వపి ॥

తా. స్త్రీ - బాల్యమునందుఁగాని యౌవనమునందుఁగాని వార్ధక్యమునందుఁగాని ఇంటియందలి స్వల్పకార్యములనుగూడ స్వతంత్రించి చేయఁగూడదు.

శ్లో. బాల్యే పితృవశే తిష్ఠే త్పాణిగ్రాహస్య యౌవనే ।
పుత్రాణాం భర్తరి ప్రేతే న భజేత స్వతంత్రతాం ॥

తా. స్త్రీ - బాల్యమునందు పితృవశమునందును, యౌవనమున భర్తృవశము నందును, భర్త మృతిఁజెందినపుడు పుత్రులవశమునందునుండవలయు; స్వతంత్రముగా నెప్పుడు నుండఁగూడదు.

శ్లో. పిత్రా భర్త్రా సుతైర్వాపి నేచ్ఛే ద్విరహ మాత్మనః ।
ఏషాం హి విరహేణ స్త్రీ హీనే కుర్యా దుభే కులే ॥

తా. పితృ భర్తృ పుత్రులతో నెల్లప్పుడును ఎడబాపును కోరకూడదు; ఎడబాసినస్త్రీలు రెండు కులములను చెఱచుదురు.

శ్లో. కురూపో వా కువృత్తో వా దుస్స్వభావోఽథవా పతిః ।
రోగాన్వితః పిశాచో వా మద్యపః క్రోధనోఽపివా ॥
వృద్ధో వా థా విదగ్ధో వా మూకోఽంధో బధిరోఽపి వా ।
రౌద్రో వా థ దరిద్రో వా కదర్యః కుత్సితోఽపివా ॥
కాతరః కితవో వా పి లలనాలంపటోఽపివా ।
సతతం దేవవ త్పూజ్య స్సాధ్వ్యా వాక్కాయకర్మభిః ॥
అహంకారం విహాయా థ కామ క్రోధౌ చ సర్వదా ।
మనసో రంజనం పత్యుః కార్య మన్యస్య వర్జనం ॥

తా. భర్త - కురూపియైనను, దుర్వృత్తి గలవాఁడైనను, దుస్స్వభావుఁడైనను, రోగవంతుఁడైనను, పిశాచగ్రస్తుఁడైనను, మద్యపానియైనను, కోపిష్ఠుఁడయినను, ముసలివాఁడైనను, చతురుఁడు కాకపోయినను, మూగవాఁడైనను, చెవిటివాఁడైనను, భయంకరుఁడైనను, దరిద్రుఁడైనను, అతిలోభియైనను, కుత్సితుఁడయినను, భయపడువాఁడయినను, జూదరియైనను, స్త్రీలోలుఁడయినను, పతివ్రత యగుస్త్రీ మనోవాక్కాయములచేత అట్టి భర్తను దేవునిగా భావింపవలయు. అహంకారమును కామ క్రోధములను వదలి యెల్లప్పుడు భర్తమనస్సును సంతోషపెట్టవలయు; పతికిష్టము కానిదాని వర్జింపవలయు.

శ్లో. న పితా నాత్మజో నాత్మా న మాతా న సుహృజ్జనః ।
గతి ర్భవతి చ స్త్రీణాం పతి స్త్వేకః పరాగతిః ॥

తా. స్త్రీకి - తండ్రి, కొడుకు, తాను, తల్లి, మిత్రజనము వీర లెవ్వరును ముఖ్యులుకారు. పతియే గతి యగును.

శ్లో. ద్వారోపవేశనం నిత్యం గవాక్షావేక్షణం తథా ।
అసత్ప్రలాపో హాస్యం చ దూషణం కులయోషితాం ॥



తా. పతివ్రతాస్త్రీలకు తలవాకిట నుండుట, కిటికీలనుండి చూచుట, చెడ్డ మాటలాడుట, ఎగతాళిచేయుట ఇవి కూడదు.

శ్లో. సకామం వీక్షితా ప్యన్యైః ప్రియై ర్వాక్యైః ప్రబోధితా ।
స్పృష్టా వా జనసమ్మర్దే న వికార ముపైతి యా ॥
పురుషం సేవతే నాన్యం మనోవాక్కాయకర్మభిః ।
లోభితాపి పరేణార్థై స్సా సతీ లోకభూషణా ॥

తా. కామావిష్టులగు పరపురుషులచేఁ జూడఁబడినను, ప్రియవాక్యములచే బోధింపఁబడినను, జనసమ్మర్దమునఁ బరపురుషులచే తాఁకఁబడినను, ద్రవ్యాదులచే ఆశపెట్టఁబడినను, మనోవాక్కాయములచే పరపురుషుని గూడని పతివ్రత లోకమున కలంకార మగును.

శ్లో. దైన్యేన ప్రార్థితా వాపి బలేన విధృతా పివా ।
వస్త్రాద్యై ర్వాసితావాపి నైవా న్యం భజతే సతీ ॥

తా. పతివ్రత-తనను దీనత్వముచేత ప్రార్థించినను, బలాత్కారముగా ధరించినను, వస్త్రాదులిచ్చినను పరపురుషుని బొందదు.

శ్లో. వీక్షితా వీక్షతే నాన్యం హాసితా న హస త్యపి ।
భాషితా భాషతే నైవ సా సాధ్వీ సాధు లక్షణా ॥

తా. మంచి లక్షణములుగల పతివ్రత-పరపురుషుఁడు తనను జూచునపుడు వానిని తాను చూడదు. వాఁడు నవ్వించిన నవ్వదు. మాటలాడించిన మాటలాడదు.

శ్లో. రూపయౌవనయుక్తా పి గీతనృత్తేఽపి కోవిదా ।
స్వానురూపం నరం దృష్ట్వా న యాతి వికృతిం సతీ ॥

తా. పతివ్రత - రూప యౌవనములతోఁ గూడినదైనను, సంగీత నాట్యములఁ దెలిసినదైనను, తనకుఁ దగిన పురుషుని జూచినపుడు కామవికారము నొందకుండును.

శ్లో. సురూపం తరుణం రమ్యం కామినీనాం చ వల్లభం ।
యా నేచ్ఛతి పరం కాంతం విజ్ఞేయా సా మహాసతీ ॥

తా. మంచిరూపము యౌవనము మనోహరత్వము గలవాఁడును, స్త్రీలకు ప్రియుండునగు పరపురుషునిజూచి యేస్త్రీ మగనిగాభావింపదో అట్టిదియే మహాపతివ్రత.

శ్లో. భుంక్తే భుక్తేఽథ యా పత్యౌ దుఃఖితే దుఃఖితా చ యా ।
ముదితే ముదితా త్యర్థం ప్రోషితే మలినాంబరా ॥

సుప్తే పశ్చాచ్చ యా శేతే పూర్వమేవ ప్రబుధ్యతే ।
నాన్యం కామయతే చిత్తే సా విజ్ఞేయా పతివ్రతా ॥

తా. మగడు భుజించిన తాను భుజించుట, అతఁడు దుఃఖించిన తానుదుఃఖించుట, అతఁడు సంతోషించిన తాను సంతోషించుట, అతఁడు పరదేశమందున్నపుడు తాను భూషణాదులనువర్జించి మలినవస్త్రముతో నుండుట, మగఁడు నిద్రించినవెనుక తాను నిద్రించుట, అతఁడు మేలుకొనుటకు మునుపు తాను నిద్రలేచుట- ఈగుణములు గలిగి పరపురుషుని గోరనిస్త్రీ పతివ్రత యనఁబడును.

శ్లో. భక్తిం శ్వశురయోః కుర్యాత్పత్యుశ్చాపి విశేషతః ।
ధర్మకార్యేఽనుకూలత్వ మర్థకార్యేషు సంయుతం ॥
ప్రాగల్భ్యం కామకార్యేషు శుచిత్వం నిజవిగ్రహే ।
మంగళం సమ్మతం పత్యుస్సతతం ప్రియభాషణం ।
భావ్యం మంగళకారిణ్యా గృహమండనశీలయా ॥

తా. పతివ్రత - అత్తమామలయందు భక్తిగలిగి యుండవలయును. భర్తయందంతకంటె విశేషభక్తి గలిగియుండవలయును. అర్థకార్యములయందు నియమమును, కామకార్యములయందు చతురత్వమును, తనశరీరమునందు పారిశుద్ధ్యమును, శుభలక్షణములును, ఎల్లప్పుడు పతితో ప్రియాలాపములును గలిగియుండవలయును; ఇట్టి శుభకరురా లగుపతివ్రత గృహము నలంకరించును.

శ్లో. గృహోపస్కరసంస్కార తద్జ్ఞయా ప్రతివాసరం ।
క్షేత్రాద్వనాద్వా గ్రామాద్వా భర్తారం గృహ మాగతం॥
ప్రత్యుత్థాయా భినందేచ్చ స్వాసనే నోదకేన చ ।
ప్రసన్న భాండమృష్టాన్నం కాలే భోజనదాయినీ ॥
గురూణాం పుత్రమిత్రాణాం బంధూనాం కర్మకారిణాం ।
ఆహూతానాం చ భృత్యానాం దాసీదాసజనస్య చ ॥
అతిథ్యభ్యాగతానాం చ భిక్షుకాణాం తథైవచ ।
ఆసనే భోజనే దానే సమ్మానే ప్రియభాషణే ।
తత్తద్గుణానుసారేణ ప్రాప్తకాలే యథోచితం ॥
దక్షయా సర్వదా భావ్యం భార్యయా గృహముఖ్యయా ।
గృహవ్యయాయ యద్ద్రవ్యం దిశేత్పత్న్యాః కరే పతిః ।
నిర్వర్త్య గృహకార్యాణి సా కించిద్బుద్ధ్యా వశేషయేత్ ।



దానార్థ మర్పితే ద్రవ్యే లోభాత్కించిన్న ధారయేత్ ।
భర్తురాజ్ఞాం వినా నైవ స్వబంధుభ్యో దిశేద్ధనం ॥

తా. ఇంటి యుపకరణములను ప్రతిదినము పరిశుద్ధము చేయవలయును; క్షేత్రమునుండిగాని వనమునుండిగాని గ్రామమునుండిగాని యింటికివచ్చిన భర్తనుచూచి యెదుర్కొని సంతోషముతో మంచిపీఠ మునిచి స్నానాదుల కుదకమునిచ్చి కాలమునందు భోజనము పెట్టవలయును. గురువులు, పుత్రులు, మిత్రులు, పనివాండ్రు, పిలువబడినవాండ్రు, భృత్యులు, దాసీదాసజనులు, అతిథులు, అభ్యాగతులు, భిక్షుకులు వీరలకు మర్యాదతోడ తనకు గలిగినమట్టుకు భోజనాదులనుజరిపించి ప్రియవాక్యములతో తృప్తి పరచవలయును. ఇంటికర్చునిమిత్తము పెనిమిటి యిచ్చినద్రవ్యమును గృహవ్యయమునం దుపయోగించి కొంచెము మిగుల్చుచుండవలయును, దానార్థమై పతియొసంగిన ద్రవ్యమును ఆశచేత మిగుల్చుకొనఁగూడదు; భర్తాజ్ఞలేనిది బంధువులకొఱకు తాను స్వతంత్రించి ఇయ్యఁగూడదు.

శ్లో. తైలాభ్యంగం తథా స్నానం శరీరోద్వర్తనక్రియాః ।
మార్జనంచైవ దంతానా మలకానాం చ కర్తనం ॥
భోజనం వమనం నిద్రాం పరిధానం చ వాససాం ।
ప్రారంభం మండనానాం చ న కుర్యాత్పశ్యతి ప్రియే॥

తా. తైలాభ్యంగము, స్నానము, నలుఁగుపెట్టుకొనుట, పండ్లుతోముకొనుట, ముంగురులను దిద్దుకొనుట, భుజించుట, కక్కుట, నిద్రించుట, వస్త్రము కట్టుకొనుట, శృంగారించుకొనుట ఈపనులను మగఁడు చూచుచుండఁగాఁ జేయఁగూడదు.

శ్లో. ఆహూతా యా తు వై భర్త్రా స్త్రీ న యాతి త్వరాన్వితా ।
సా ధ్వాంక్షీ జాయతే నూనం దశజన్మాని పంచ చ ॥

తా. భర్త పిలిచినప్పుడు శీఘ్రముగా నతనియొద్దకుఁ బోనియెడల పదునేను జన్మములవఱకు కాకియై పుట్టును.

శ్లో. కామా ద్రోషా న్మత్సరా ద్వా భర్తారం యా వమన్యతే ।
సా సప్తజన్మకం యావ న్నారకీ స్యా న్న సంశయః ॥

తా. కామమువలనఁగాని రోషమువలనఁగాని మాత్సర్యమువలనగాని భర్తను అవమానపఱచినయెడల ఏడుజన్మములు నరకమునఁబడును.

శ్లో. జీవితేనా థ విత్తేన భర్తారం వంచయేత యా ।
క్రిమియోనిశతం గత్వా పుల్కసీ జాయతే తతః ॥

తా. ప్రాణముచేతను ద్రవ్యముచేతను పతిని వంచించినయెడల నూరుమార్లు పురుగులజన్మమెత్తి పిదప బోయకులమున జన్మించును.

శ్లో. దరిద్రం వ్యాధితం మూర్ఖం భర్తారం యా వమన్యతే।
సా శునీ జాయతే మృత్వా సూకరీ చ పునః పునః ॥

తా. పతి దరిద్రుఁడైనను, వ్యాధితుఁడైనను, మూర్ఖుఁడైనను స్త్రీ అవమానించినయెడల అది మరణానంతరము కుక్కజన్మమెత్తి పలుమారు సూకరమై పుట్టును.

శ్లో. పత్యౌ జీవతి యా నారీ ఉపోష్య వ్రత మాచరేత్ ।
ఆయుష్యం హరతే భర్తు స్సా నారీ నరకం వ్రజేత్ ॥

తా. పతి జీవించియుండఁగా ఉపవాసవ్రతములను జేసినయెడల ఆస్త్రీ పతియొక్క ఆయుష్యమును హరించి నరకమును జెందును.

శ్లో. అపృష్ట్వా చైవ భర్తారం యా నారీ కురుతే వ్రతం ।
సర్వం త ద్రాక్షసా న్గచ్ఛే దిత్యేవం మను రబ్రవీత్ ॥

తా. స్త్రీ భర్తనడుగకయే వ్రతముజేసినయెడల ఆవ్రతము రాక్షసులజెందును.

శ్లో. స్నానార్చా జపతపో హోమ దాన వ్రతమఖాదయః ।
స్త్రీణాం పతివ్రతానాం తు పత్యౌసతి తు కించ న ।
తదాజ్ఞయా తు కర్తవ్య మకార్య మపిచే త్తయా ॥

తా. పూజ, జపము, తపస్సు, హోమము, దానము, వ్రతము, యజ్ఞము మొదలగునవి పతివ్రతాస్త్రీలకు పతియుండగా నక్కఱలేదు; మగనియాజ్ఞ అయినయెడల అకృత్యమైనను చేయవచ్చును.

శ్లో. పత్యుర ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః ।
పత్యాజ్ఞయా తు కర్తవ్యా పతితస్య తు సర్వదా ॥

తా. పతి గర్వితుఁడయినను, కార్యాకార్యముల నెఱుఁగనివాఁడయినను, పతితుఁడయినను, ఎల్లప్పుడు అతని యాజ్ఞాప్రకారము వర్తించవలయు.

శ్లో. పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనం ।
స్వప్నోఽన్యగేహవాస శ్చ నారీసందూషణాని షట్ ॥

తా. కల్లు త్రాగుట, దుర్జన సహవాసము, పతి నెడబాసియుండుట, వ్యర్థము గఁదిరుగుట, ఎల్లప్పుడు నిద్రించుట, పరగృహమునందుండుట ఈయాఱు గుణంబులును స్త్రీలకు మిక్కిలి చెఱుపును చేయును.



శ్లో. న వ్రతే నోపవాసేన ధర్మేణ విధినా న చ ।
నారీ స్వర్గ మవాప్నోతి ప్రాప్నోతి పతిపూజనాత్ ॥

తా. స్త్రీ - వ్రతములచేతను, ఉపవాసములచేతను, ధర్మములచేతను, విధులచేతను స్వర్గమును పొందనేరదు; ఒక్కటియగు పతిపూజవలననే స్వర్గమును పొందును.

శ్లో. హారిద్రాం కుంకుమం చైవ సిందూరం కజ్జలం తథా ।
కూర్పాసకం చ తాంబూలం మంగళ్యాభరణం తథా ॥
కేశసంస్కార కబరీకరకర్ణాదిభూషణం ।
భర్తు రాయుష్య మిచ్ఛంతీ దూషయే న్న పతివ్రతా ॥

తా. పసుపు-కుంకుమము-సిందూరము-కాటుక-రవిక-తాంబూలము - మాంగల్యము-తలదువ్వుకొనుట-కొప్పు - హస్తాభరణ కర్ణాభరణములు వీనిని పతియొక్క ఆయుష్యమునుగోరిన పతివ్రతాస్త్రీ నిందింపఁగూడదు.

శ్లో. ప్రాతఃకాలే తు యా నారీ దద్యా దర్ఘ్యం వివస్వతే ।
సప్తజన్మాని వైధవ్యం సా నారీ నైవ పశ్యతి ॥
కృత్వా మండలకం బాహ్యే తూష్ణీ మేవా క్షతాదిభిః ।
పూజయే త్సతతం యావ త్తస్యా స్తుష్యంతి దేవతాః ॥

తా. స్త్రీ - నిత్యము ప్రాతఃకాలమున సూర్యునికి అర్ఘ్యమొసఁగిన-ఏడుజన్మములవఱకు వైధవ్యమును పొందదు; సూర్యమండలమును క్రిందవ్రాసి అక్షతలచేఁ బూజించిన దేవతలు సంతోషింతురు.

శ్లో. న దదాతి తు యా నారీ జ్యేష్ఠాయై ప్రత్యహం బలిం ।
భోజ్యా దన్నా ద్యథాశక్తి సా ప్రేత్య నరకం వ్రజేత్ ॥
అవశ్యమేవ నారీభి ర్జ్యేష్ఠాయై బలికర్మణా ।
ప్రీణనం ప్రత్యహం కార్యం పుత్రపౌత్రధనేప్సుభిః ॥

తా. స్త్రీ - నిత్యము జ్యేష్ఠాదేవికి యథాశక్తి బలియొసంగనియెడల నరకమును పొందును; పుత్రపౌత్ర ధనములనుగోరిన స్త్రీలు నిత్యము జ్యేష్ఠాదేవిని తృప్తి పఱచవలయు.

శ్లో. పతివ్రతా తు యా నారీ భర్తృశుశ్రూషణోత్సుకా ।
న తస్యా విద్యతే పాప మిహలోకే పరత్ర చ ॥
పతివ్రతా ధర్మరతా రుద్రాణ్యేవ న సంశయః ।
తస్యాః పరాభవం కర్తుం శక్నోతి న జనః క్వచిత్ ॥

తా. పతిశుశ్రూషయందు ఆసక్తిగల పతివ్రతకు ఇహమునందును పరమునందును పాపమంటదు. ధర్మాసక్తిగల పతివ్రత సాక్షాత్తు పార్వతితో తుల్యురాలు; ఆమెను అవమానించుట కెవ్వండును శక్తుండుగాఁడు.

శ్లో. తావత్కులస్త్రీమర్యాదా యావల్లజ్జావగుంఠనం ।
హృతే తస్మిఁకులస్త్రీభ్యో వరం వేశ్యాంగనాజనః ॥

తా. స్త్రీలు ఎంతవఱకు లజ్జను వదలకయుందురో అంతవఱకే కులస్త్రీమర్యాద; లజ్జనువదలినయెడల వేశ్యలతో సమానలగుదురు.

శ్లో. కార్యే దాసీ రతౌ వేశ్యా భోజనే జననీసమా ।
విపత్తౌ బుద్ధిదాత్రీ చ సా భార్యా సర్వదుర్లభా ॥

తా. భార్య - కార్యమునందు దాసివలెను, రతియందు వేశ్యవలెను, భుజింపచేయుటయందు తల్లివలెను, ఆపద వచ్చినప్పుడు ధైర్యమునిచ్చునదిగ నుండవలయు.

శ్లో. వశ్యభావేన సుమనా స్సువ్రతా సుసమాహితా ।
అనన్యచిత్తా సుముఖీ భర్తు స్సా ధర్మచారిణీ ॥

తా. వశ్యభావముచే మంచిమనస్సు మంచివ్రతములు నెమ్మదియుగలిగి అన్యచిత్తురాలుగాక సుముఖురాలై యుండు స్త్రీ భర్తకు ధర్మచారిణియగును.

శ్లో. యా నారీ ప్రవృతా దక్షా యా నారీ పుత్రిణీ భవేత్ ।
పతివ్రతా పతిప్రాణా సా నారీ ధర్మచారిణీ ॥

తా. ఏస్త్రీ - అనువర్తనము, గృహకృత్యములయందు సామర్థ్యముగలదియు, పుత్రవంతురాలును, పతివ్రతయునై యుండునో ఆ స్త్రీ భర్తకు ధర్మచారిణి యగును.

శ్లో. న కార్యేషు న భోగేషు నైశ్వర్యే న సుఖే తథా ।
స్పృహా స్యాచ్చ యథా భర్తు స్సా నారీ సుఖభాగినీ ॥

తా. ఏస్త్రీకి కార్యములయందును, భోగములయందును, ఐశ్వర్యమునందును, సుఖమునందును, స్పృహ లేకుండునో ఆస్త్రీ భర్తకు సుఖము నిచ్చునదియగును; అనఁగా భర్తయందే విశేషముగ ప్రీతినుంచవలయుననుట.

శ్లో. కల్యోత్థానపరా నిత్యం గురుశుశ్రూషణే రతా ।
సుసంమృష్టగృహా చైవ గోశకృత్కృతలేపనా ॥

తా. స్త్రీ - అరుణోదయమున లేచుటయు, గురుశుశ్రూషణము చేయుటయు గృహమును బాగుగచిమ్మి గోమయాదులచే నలుకుటయు మొదలగు పనులు చేయుచుండవలయు.



శ్లో. శ్వశ్రూశ్వశురయోః పాదౌ తోషయంతీ పతివ్రతా ।
మాతాపితృపరా నిత్యం యా నారీ సా పతివ్రతా ॥

తా. అత్తమామల పాదములకు ప్రణమిల్లి వారిని సంతోషపరచి తల్లిదండ్రులయందు భక్తిగలిగియుండునట్టి స్త్రీ పతివ్రత యనఁబడును.

* శ్లో. పదన్యాసో గేహా ద్బహి రహిఫణారోపణసమో,
నిజావాసా దన్య ద్భవన మపరద్వీపతులితం ।
వచో లోకాలభ్యం కృపణధనతుల్యం మృగదృశః,
పుమా నన్యః కాంతా ద్విధు రివ చతుర్థీసముదితః ॥

తా. స్త్రీ నడుచునపుడు, అడుగులుంచుట సర్పము పడగను వాల్చునట్లుండవలయు. అనఁగా మెల్లగ నుంచవలెననుట. పొరుగిల్లును ద్వీపాంతరముతో సమానముగ నెంచవలెను. అనఁగా పొరుగిండ్లకుఁ బోఁగూడదనుట. కృపణునిధనము బైటరానట్లు తనమాట యితరులకుఁ దెలియఁగూడదు. పరపురుషుని చవితినాటి చంద్రునితో సమానునిగ నెంచవలయు. అనఁగా చూడకూడదనుట.

శ్లో. భక్తిః ప్రేయసి సంశ్రితేషు కరుణా శ్వశ్రూషు నమ్రం శిరః,
ప్రీతి ర్యాతృషు గౌరవం గురుజనే కాంతిః కృతాగస్యపి ।
అమ్లానా కులయోషితాం వ్రతవిధి స్సోయం విధేయం పున
ర్మద్భర్తుర్దయితా ఇతి ప్రియసఖీబుద్ధి స్సపత్నీ ష్వపి ॥

తా. పురుషునియందు భక్తియు, ఆశ్రితులయందు దయయు, అత్తమామలయందు వినయమును, తోడికోడండ్రయందు ప్రీతియు, గురుజనమునందు గౌరవమును, ప్రియుఁడు అపరాధియైనపుడు మోమువాడ్చక కాంతిగలిగియుండుటయు, నా మగనికి ప్రియురాండ్రుగదాయని సవతులయందు ప్రియసఖీభావంబును, గలిగియుండుటయు పతివ్రతాస్త్రీకి ముఖ్యధర్మములు.

శ్లో. యద్గృహే కలహో నాస్తి పూజ్యంతే యద్గృహే స్థితాః ।
తద్గృహే వసతే లక్ష్మీ ర్నిత్యం పూర్ణకలాన్వితా ॥

తా. ఏగృహమునందు జగడములేదో పెద్దలు పూజింపఁబడుదురో ఆయింటియందు లక్ష్మి పరిపూర్ణకళతో వసించును; కావున పతివ్రతలు ఇంటియందు అత్తమామలఁబూజించుచు కలహమాడకుండవలయు.

---

## ప్రోషితభర్తృకాస్త్రీధర్మము.

శ్లో. క్రీడాం శరీరసంస్కారం సమాజోత్సవదర్శనం ।
హాస్యం పరగృహే యానం త్యజేత్ప్రోషితభర్తృకా ॥

తా. పతి దేశాంతరము పోయియుండునపుడు - స్త్రీ - క్రీడలను. దేహము నలంకరించుకొనుటను, సభలకును ఉత్సవాదులకును పోవుటను, హాస్యమును, పొరుగిండ్లు దిరుగుటను విడువవలయు.

శ్లో. నానుక్త్వా గృహా న్నిర్గచ్ఛే న్నానుత్తరీయా న త్వరితా వ్రజే న్న పరపురుషమభిభాషేతా న్యత్ర వణిక్ప్రవ్రజిత వృద్ధ వైద్యేభ్యో, న నాభిందర్శయే దాగుల్ఫా ద్వాసః పరిదధ్యా న్న స్తనౌ వివృతౌ కుర్యా న్నహసేత్, గణికా ధూర్తా భిసారిణీ కలహాకారికా దుశ్శీలాదిభ్య స్సహైకత్ర తిష్ఠే త్సంసర్గేణ హి చారిత్రం దూష్యతి ॥

తా. ఆజ్ఞలేనిది గృహమునుండి వెలుపలికిఁబోవుట, పైఁటలేకయుండుట, శీఘ్రముగఁబోవుట, కోమటి-సన్యాసి-వైద్యుఁడు-వృద్ధుఁడు - వీరలతోఁ దప్ప నితర పురుషులతో సంభాషించుట మొదలగువానిని వర్జింపవలయు. నాభిని కనబరచఁగూడదు; చీలమండలవఱకు వస్త్రమును, స్తనములగుపడకుండునట్లు రవికెను ధరింపవలయు; బోగమువాండ్లు, ధూర్తులు, అభిసారికలు, కలహకారిణులు. దుశ్శీలలు మొదలగువారితో సహవాసము చేయఁగూడదు, అట్లు చేసిన అపకీర్తి కలుగును.

---

## విధవా ధర్మము.

శ్లో. పత్యౌ మృతేఽపి యా యోషి ద్వైధవ్యం పాలయే త్క్వచిత్।
సా పునః ప్రాప్య భర్తారం స్వర్గభోగా న్సమశ్నుతే ॥

తా. పతి మృతిఁజెందినపిదప స్త్రీ విధవాధర్మములను క్రమముదప్పక నడుచుకొనినయెడల జన్మాంతరమునందు తిరిగి పతినిపొంది స్వర్గభోగముల ననుభవించును.

శ్లో. మృతే భర్తరి యా నారీ బ్రహ్మచర్యే వ్యవస్థితా ।
సా మృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః ॥

తా. భర్త మృతిఁజెందినపిదప బ్రహ్మచర్యవ్రతమునుపాలించునట్టిస్త్రీ బ్రహ్మచారులవలెనే స్వర్గమును పొందును.

శ్లో. పర్యంకశాయినీ నారీ విధవా పాతయే త్పతిం ।
తస్మా ద్భూశయనం కార్యం పతిసౌఖ్యసమీహయా ॥

తా. విధవాస్త్రీ మంచమునందు పండుకొనిన పతికి అధోగతిని కలుగజేయును; కావున పతిసౌఖ్యమును గోరినది నేలపై శయనించవలయు.



శ్లో. న చాంగోద్వర్తనం కార్యం స్త్రియా విధవయా క్వచిత్ ।
గంధద్రవ్యస్య సంభోగో నైవ కార్య స్తథా క్వచిత్ ॥
తర్పణం ప్రత్యహం భర్తుః కుర్యా త్కుశతిలోదకైః ।
విష్ణో స్తు పూజనం కార్యం పతిబుద్ధ్యా నచాన్యథా ।
పతి మేవ సదా ధ్యాయే ద్విష్ణురూపధరంపరం ॥

తా. విధవాస్త్రీ నలుఁగుపెట్టుకొనుట, పరిమళ ద్రవ్యాదుల ననుభవించుట వీనిని వర్జింపవలయు. కుశతిలోదకములచే ప్రతిదినము తర్పణముచేయుచుండవలయు శ్రీమన్నారాయణుని భర్తగనెంచి నిత్యము పూజించుచుండవలయు.

శ్లో. మృతే భర్త ర్యపుత్రా చ బాలపుత్రా చ యాంగనా ।
బంధూ నాశ్రిత్య సా తిష్ఠే త్సంయుతా జనకాదికాన్ ॥

తా. భర్త మరణించినపిదప స్త్రీ, పుత్రులు లేనిదైనను, లేక బిడ్డలు చిన్నవాండ్రైనను, పితృాదిబంధువుల నాశ్రయించి యుండవలయు.

శ్లో. తాంబూలోఽభర్తృకస్త్రీణాం యతీనాం బ్రహ్మచారిణాం ।
ఏకైకం మాంసతుల్యం స్యా న్మిళితం తు సురాసమం॥

తా. విధవాస్త్రీలకు-యతులకు-బ్రహ్మచారులకు తాంబూలముకూడదు. చేసిన యెడల మద్యమాంస భక్షణ పాపము జనించును.

సూ. యావజ్జీవం ప్రేతప త్న్యుదకోపస్పర్శన మేకభక్త మధ
శ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణ మధుమాంస వర్జనం చ॥

తా. విధవాస్త్రీ యావజ్జీవము స్నానము, ఒంటిపూఁట భోజనము, నేలపైఁ బరుండుట, బ్రహ్మచర్యము, వీనిని చేయుచుండవలయు; ఉప్పుకారములు మద్యమాంసములు వీనిని వర్జింపవలయు.

---

## అనుగమనవిధి.

శ్లో. తిస్రఃకోట్యర్ధకోటీ చ యాని లోమాని మానుషే ।
తావత్కాలం వసే త్స్వర్గే భర్తారం యానుగచ్ఛతి ॥
వ్యాళగ్రాహీ యథావ్యాళం బలా దుద్ధరతే బిలాత్ ।
ఏవం స్త్రీ పతి ముద్ధృత్య తేనైవసహ మోదతే ॥

తా. మనుష్యునిదేహమున మూఁడుకోట్ల ఏబదిలక్షల రోమములుండును. స్త్రీ భర్త మరణించినపుడు సహగమన మొనర్చినయెడల అన్నివేల సంవత్సరములు స్వర్గ

మున నివసించును; మఱియు నాస్త్రీ, కలుగునందున్న పామును పాములవాఁడు బలాత్కారముగ పైకి లాగునట్లు భర్తను పాపమునుండి తొలఁగించి యతనితోడ నానందము నొందును.

శ్లో. భర్త్రా సహానుగమనే మనసా చ న రోచతీం ।
బాంధవా స్తాం న నిర్బంధ్య బ్రహ్మచర్యే నియోజయేత్ ॥

తా. స్త్రీ, భర్త మరణించినపుడు సహగమనము చేయుట కిష్టపడనియెడల బంధువులు నిర్బంధించి త్రోయక, బ్రహ్మచర్యమునందుండునట్లు చేయవలయు.

స్త్రీ రక్షణ క్రమము.

శ్లో. గృహాశ్రమా త్పరంనా స్తి యదిపత్నీ వశానుగా ।
తదా ధర్మార్థకామాఖ్యం త్రివర్గఫల మశ్నుతే ॥
ఆనుకూల్యం కళత్రస్య స్వర్గో భవతి నిశ్చితం ।
ప్రాతికూల్యం కళత్రస్య నరకో నాస్తి సంశయః ॥

తా. భార్య స్వాధీనురాలైనయెడల గృహాశ్రమమునకంటె నుత్కృష్టమైనది లేదు; అప్పుడు ధర్మార్థకామరూపమయిన త్రివర్గఫలమును పొందుచున్నాఁడు. అనుకూలురాలయిన భార్యగలవానికి నిశ్చయముగ స్వర్గము గలుగును. భార్య ప్రతికూలురాలైనయెడల నిస్సంశయముగ నరకము గలుగును.

శ్లో. పతి ర్భార్యాం సంప్రవిశ్య గర్భో భూత్వేహ జాయతే ।
జాయాయా స్తద్ధి జాయాత్వం య దస్యాం జాయతే పునః ॥
యాదృశం భజతే హి స్త్రీ సుతం సూతే తథావిధం ।
తస్మాత్ప్రజా విశుద్ధ్యర్థం స్త్రియం రక్షే త్ప్రయత్నతః ॥

తా. భర్త భార్యయందు ప్రవేశించి గర్భరూపమై మరల భార్యయందు బుట్టుచుండుటచేత భార్యకు "జాయా" అను పేరుగలిగెను; స్త్రీ ఎటువంటి పురుషుని పొందునో, అటువంటి పుత్రుని గనును; కావున స్త్రీని, సంతానవిశుద్ధ్యర్థము ప్రయత్నపూర్వకముగ రక్షింపవలయు.

శ్లో. అస్వతంత్రాః స్త్రియః కార్యాః పురుషైః స్వై ర్దివానిశం ।
విషయేషు చ సజ్జంత్యః సంస్థాప్యా ఆత్మనో వశే ॥

తా. పురుషులు స్త్రీలను స్వాతంత్ర్యము లేనివారినిగాను విషయములయందు తగులనివారినిగాను చేసి, తమస్వాధీనమందుంచుకొనవలయు.



శ్లో. పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే ।
పుత్ర స్తు స్థవిరే భావే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి ॥

తా. స్త్రీని బాల్యమునందు తండ్రియు, యౌవనమునందు భర్తయు, వార్ధక్యమునందు పుత్రుఁడును సంరక్షింపవలయు; స్త్రీకి స్వాతంత్ర్యము ఎప్పుడును లేదు.

శ్లో. సూక్ష్మేభ్యోపి ప్రసంగేభ్యః స్త్రియో రక్ష్యా విశేషతః ।
ద్వయోర్హి కులయో శ్శోక మావహేయు రరక్షితాః ॥
ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మ ముత్తమం ।
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి ॥
స్వాం ప్రసూతిం చరిత్రం చ కుల మాత్మాన మేవ చ ।
స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి ॥

తా. సూక్ష్మప్రసంగములనుండియు స్త్రీలను కాపాడవలయు; అట్లు రక్షింపనియెడల పితృ భర్తృగృహముల రెండింటికిని దుఃఖము గలుగజేయుదురు; సకలవర్ణములకు నుత్తమమైన యీధర్మమును చూచి భర్తలు దుర్బలులైనను స్త్రీలను రక్షింప యత్నించెదరు. పురుషుఁడు తనజన్మమును, చరిత్రమును, వంశమును, తనను, తనధర్మమును భార్యాసంరక్షణముజేయుటవలన కాపాడుకొనుచున్నాఁడు. లేనియెడల తన జన్మాదులు చెడిపోవును.

వ్యభిచారిణీ లక్షణము.

శ్లో. పర్యంక స్స్వాస్తరణం పతి రనుకూలో మనోహరం సదనం ।
తృణ మివ లఘు మన్యంతే కామిన్య శ్చౌర్యరతిలుబ్ధాః ॥

తా. పరపురుష సంభోగమునందాశగల వ్యభిచారిణులు — మంచిమంచము, మంచిమెత్తలు, రూప యౌవనాదులచే ననుకూలుఁడగుభర్త, రమ్యమైనగృహము వీనిని తృణమునువలె చులుకదనము చేయుచున్నారు.

శ్లో. సుఖశయ్యా తాంబూలం విస్రబ్ధాశ్లేష చుంబనాదీని ।
తులయంతి న లక్షాంశం త్వరిత క్షణ చౌర్యసురతస్య ॥

తా. మఱియు — మంచిపాన్పు-తాంబూలము-భర్తయొక్క విశ్వాసము — ఆలింగనము — చుంబనము మొదలగువానిని క్షణములో ముగియునట్టి చౌర్యసురతముయొక్క లక్షాంశమునకైనను సరిపోల్చరు.

శ్లో. కులపతనం జనగర్హాం బంధన మపి జీవితస్య సందేహం ।
అంగీకరోతి సకలం వనితా పరపురుషసంసక్తా ॥

తా. పరపురుషాసక్తురాలగు స్త్రీ - కులము చెడుట, లోకనింద, చెఱసాల, ప్రాణసందేహము లోనగువాని నన్నిటిని ఒప్పుకొనుచున్నది.

---

## వేశ్యాగర్హణము.

శ్లో. హారహీరకహిరణ్యభూషణై స్తోష మేతి గణికా ధనైషిణీ ।
ప్రేమకోమలకటాక్షవీక్షితై రేవ జీవతి కులాంగనాజనః ॥

తా. వేశ్యాంగన - ధనమును గోరుచున్నదై-హారములు, బంగారు ఆభరణములు వీనిచేత తృప్తిపొందును. కులాంగన - పురుషునియొక్క ప్రేమచేత కోమలములైన కటాక్షవీక్షణములచే తృప్తినొంది భర్తయందు ప్రీతిగలిగియుండును.

శ్లో. జాత్యంధాయ చ దుర్ముఖాయ చ జరాజీర్ణాఖిలాంగాయ చ,
గ్రామీణాయ చ దుష్కులాయ చ గళత్కుష్ఠాభిభూతాయ చ।
యచ్ఛంతీషు మనోహరం నిజవపుర్లక్ష్మీలవశ్రద్ధయా,
పణ్యస్త్రీషు వివేకకల్పలతికాశస్త్రీషు రజ్యేత కః ?॥

తా. పుట్టుగ్రుడ్డివాఁడైనను, వికృతముఖుఁడైనను, ముసలివాఁడైనను, తెలివిలేనివాఁడైనను, కులహీనుఁడైనను, కుష్ఠరోగియైనను, ఎట్టివాఁడైనను పర పురుషునకు ద్రవ్యాశచేత మనోహరం బగుతమశరీరమును ఇచ్చి వివేకమనెడి కల్పలతలను తెంచునట్టి కత్తులవలెనున్న భోగపువాండ్రను బుద్ధిమంతుఁడగువాఁడెవ్వఁడుచేరును? అనఁగా బుద్ధిమంతుఁడగువాఁ డిట్టిభోగపువారిని చేరకూడదనుట.

శ్లో. ఏతా హసంతి చ రుదంతి చ విత్తహేతో,
ర్విశ్వాసయంతి పురుషంఁచ విశ్వసంతి ।
తస్మా న్నరేణ కులశీలసమన్వితేన,
వేశ్యాః శ్మశానఘటికా ఇవ వర్జనీయాః ॥

తా. వేశ్యాంగనలు - ద్రవ్యముకొఱకు పురుషుని జూచినపుడు నవ్వుదురు. ఒకసమయమున రోదనము చేయుదురు. ఒకప్పుడు నమ్మింతురు. ఒకప్పుడు తాము నమ్మరు. కావున సత్కులము సచ్ఛీలమును గల పురుషులు వేశ్యలను శ్మశానమున కుండలను పారవేయునట్లు విడువవలయు.

---



# పాకశాస్త్రము.

శ్లో. అథాతస్సంప్రవక్ష్యామి పాకశాస్త్ర మనుత్తమం ।
యస్యవిజ్ఞానతో నారీ మ్లిష్టపాకా భవే త్సదా॥

తా. అటుపిమ్మట ఉత్తమం బగుపాకశాస్త్రమును జెప్పెదను, ఈ పాకశాస్త్రమును బాగుగ నెఱుంగుటవలన స్త్రీలు మధురపాకమును జేయుటయందు సమర్థురాండ్రయ్యెదరు.

శ్లో. న జ్ఞాత్వా పాకశాస్త్రం చ న జ్ఞాత్వా చ గుణాగుణౌ ।
వస్తుసంస్కరణం చైవ పాకం కుర్యా ద్యదా వధూః ॥
తత్పాకః కురుతే రోగ మగ్నిమాంద్యాదికం తదా ।
తస్మా దవశ్యం జ్ఞాతవ్యం పాకశాస్త్రం సుదుర్లభం ॥

తా. పాకశాస్త్రమును, ద్రవ్యములగుణాగుణములను, పదార్థములనుసంస్కరించు విధంబు నెఱుంగక పాకంబొనర్చినయెడల అగ్నిమాంద్యాది రోగములు జనించుగావున కడుదుర్లభంబైన యీ పాకశాస్త్రమును అవశ్యమెఱింగియే పాకంబొనర్చవలయు.

## ప్రొయ్యి వేయుక్రమము.

శ్లో. ఆగ్నేయ్యాం దిశి కర్తవ్య మావాసస్య మహానసం ।
గవాక్షజాలమార్గాఢ్య మర్ధభిత్త్యుపలేపితం ॥
అగ్నేస్థానం యత స్తత్ర భోక్తు రన్నం తు వర్ధతే ।
చుల్లి స్తత్ర ప్రకర్తవ్యా పూర్వపశ్చిమమాయతా ॥
మృణ్మయాదీని భాండాని క్షాళితాని చ వారిణా ।
తేషు య త్పచ్యతే ద్రవ్యం గుణవ త్సర్వసమ్మతం ॥

తా. ఇంటికి ఆగ్నేయదిక్కున వంటయింటి నేర్పరుపవలయు, ఆవంటయింటికి కిటికీలనుంచి ప్రొయ్యిమీఁద సగముగోడవఱకు అలకవలయును; ఆగ్నేయదిక్కు అగ్నికిస్థానము గనుక భుజించువానికి అన్నము శీఘ్రముగ జీర్ణమగును; ప్రొయ్యిని పశ్చిమదిక్కున ముఖము గలుగునటుల వేయవలయు. కుండ మొదలగు పాత్రములను పరిశుద్ధముగాఁగడిగి అందుపాకముజేసిన అది సర్వసమ్మతమై గుణముగలదిగ నుండును.

శ్లో. వస్తూని భోజనార్హాణి వివిధాని పునఃపునః ।
సర్వాణి గుణయుక్తాని స్థాపితాని మహానసే ॥

తా. భోజనమునకుఁగావలసిన నానావిధ వస్తువులను చక్కఁజేసి వంటయింటి యందు సిద్ధముగా నుంచవలయు.

గృహోపకరణములు.

శ్లో. దాస్య స్సమ్మార్జనీ వాటా పూతహండీ సుకూరికా ।
ఘర్షణీ వైణవం పాత్రం జలపూర్ణ మలింజరః ॥
వహ్నిసంజననగ్రావాః కుద్దాల స్సకుఠారకః ।
దారుఖండాని శుష్కాణి హస్తమాత్రాణిచేంధనం ॥
అజీర్ణా న్యగురూణీహ కీటవర్జ్యాని సంచితః ।
తితఉ శ్చల్లనీ పీఠం ముసలం చాప్యులూఖలం ॥
శిలా శిలాసుత శ్శూర్పం చతురస్రా చ పట్టికా ।
సందంశకే చ దర్వ్యౌ శ్చ వస్త్రఖండచతుష్టయం ॥
నలికా ఛురికా చైవ శూర్ధాలాని కటాహకం ।
వహ్నిసంచాలనార్థాయ దీర్ఘ దీర్ఘా సులోహజా ॥
ఇత్యాదివస్తుజాలై స్స్యాద్గుణాఢ్యం తు మహానసం ॥

తా. దాసీలు, చీఁపురుకట్టలు, పాత్రశుద్ధికిఁదగిన సామానులు, తప్పేలలు, వెదురుబుట్టలు, నీళ్లు నిండించినపాత్రలు, నిప్పు పుట్టించెడిరాళ్లు, గొడ్డండ్లు, ఒక్కొక్క మూరగల యెండినకట్టెలు, ప్రాఁతవి పెద్దవికాని పురుగులులేని పిడకలు, నిప్పు ఎత్తి పెట్టుటకు నీరుకారులు, గరిటెలు, నాలుగుచౌకపుగుడ్డలు, నిప్పు ఊదుగొట్టములు, కత్తి, శలాకలు, నిప్పును కలియఁబెట్టుటకు ఇనుప శలాకలు, పెద్దపాత్రములు మొదలగువస్తువులు గృహమునం దుండవలయు.

పాత్రములగుణము.

శ్లో. మృద్భాణ్డే పచే ల్లోహే చత్తు రర్ఘో వికారనుత్ ।
కాంస్యజే పాచితం యద్ధి తద్ధితం మతిదం శుచి ॥
యత్తు తామ్రమయే సిద్ధ మరుచ్య మమ్లపిత్తకృత్ ।
సౌవర్ణే రాజతే పాచ్య మాఢ్యే భూమిభృతాంగృహే ।
మృత్పాత్రం సర్వదోషఘ్నం ధిషణోత్సవదం సదా ॥

తా. శరీరమునకు ఆరోగ్యకరమగు మంటిపాత్రమునందు వండవలయు; మంటిపాత్రము దొరకనియెడల ఇత్తడి మొదలగు లోహపాత్రములయందు వండవలయు; దీనివలన నేత్రరోగము మూలరోగము మానును. కంచు పాత్రయందు వండఁబడినది బుద్ధిప్రదమును, హితకరమును, పవిత్రమును అగును. రాగి పాత్రమునందు వండఁబడినది అరుచిని, అమ్లపిత్తరోగమును పుట్టించును. (కావున తామ్ర పాత్రములకు కళాయి చేయించవలయు.) రాజులయిండ్లలో బంగారు వెండి పాత్రములతో వండుదురు; అయినను, మట్టిపాత్రము సమస్తదోషములను పోగొట్టును, బుద్ధిని వికసింపఁజేయును.



పాకవిధి.

శ్లో. స్థాపయే ద్గుణవత్స్వాద స్సిద్ధాన్నం పాత్రకాంతరే ।
భక్తం స్వపాత్రకే స్థాప్యం క్వథితా పాత్రకాంతరే ॥
ఘృతం కాష్ఠాయసే స్థాప్యం మాంసమాంసరసా పునః ।
స్థాపయే ద్రాజతే హైమే పాత్రే లోహేఽథ కాష్ఠజే ॥
పత్రాదిషడ్విధం శాకం స్థాప్యం కాష్ఠాశ్మలోహజే ।
పక్వాన్నపిష్టజం భక్ష్యం స్థాప్యం కాంస్యే థ దారుజే ॥
శృతం క్షీరం స్థాపనీయం పాత్రే కాష్ఠస్య వా మృదః ।
పానీయం పాయసం తక్రం మృణ్మయే ష్వేవ ధారయేత్ ।
కాంచనే స్ఫాటికే వాథ వైదూర్యాదివిచిత్రితే ॥
ధారయే త్సర్వదా పాత్రే రాగషాడవసత్తకాః ।
ఏతేషు స్థాపితం ద్రవ్యం పాత్రేషు గుణదం భవేత్ ।
సర్వదా సుఖదం హృద్య మన్యథా దోషకారకం ॥

తా. ఇతరద్రవ్యములు కలిపి సిద్ధముచేయఁబడిన అన్నమును, మఱియొకపాత్రమునందుంచవలయు; వండఁబడిన అన్నమును, వండినపాత్రమునందే యుంచవలయు; పులుసును మఱియొకపాత్రమునందును, నేతిని కొయ్య ఇనుముపాత్రలయందును, మాంసమును మాంసరసమును వెండి బంగారు ఇనుము కొయ్య పాత్రలయందును ఉంచవలయు; ఆకుకూరలు మొదలగు ఆఱువిధములయిన కూరలను కొయ్య రాయి ఇనుముపాత్రలయందుంచవలయు; పక్వాన్నము (లడ్డు మొదలగునవి) పిండితోఁజేయబడినభక్ష్యములు వీనిని కంచు కొయ్యపాత్రములయం దుంచవలయు; కాఁచిన పాలను కొయ్య మట్టి పాత్రములయం దుంచవలయు; త్రాగునపుడు కంచుపాత్రలోపోసి త్రాగవలయు; జలము పాయసము మజ్జిగ వీనిని మట్టిపాత్రములయందుంచవలయు; రాగషాడవసక్తుకములను, (అనఁగా, మామిడి మొదలగు పండ్లరసము, పచ్చళ్లు పెరుగుతో జేయునవి ఇవి మొదలగువానిని) బంగారు స్ఫటికము వైడూర్యాది మణులు చెక్కిన పాత్రములయందుంచవలయు; ఈచెప్పిన ప్రకారము ఆయాపాత్రములయం దాయాపదార్థములనుంచిన మంచిగుణము నిచ్చును; ఎల్లప్పుడు సౌఖ్యమునిచ్చును; మనస్సునకు రమ్యముగనుండును; అటుగాక విపరీతముగ నుంచిన దోషములు కలుగజేయును.

## చక్కెర పాకముచేయువిధము.

"మధురేణ సమారభ్య మధురేణ సమాపయేత్" అను వచనప్రకారము భోజనారంభము మధురపదార్థములతో నారంభించి కడపట మధురపదార్థములతో ముగించవలయునని చెప్పఁబడియుండుటచే మధురపదార్థములఁ జేయుటకు చక్కెరను పాకముచేయువిధము ఆవశ్యకముగనుక ముందుగ చక్కెరను పాకము చేయుక్రమమును, మధుర పదార్థములును చెప్పఁబడును:—

మంచి తెల్లచక్కెరను బాణలిలోవేసి చక్కెరకు మూడవపాలు నీళ్ళుపోసి కలిపి ప్రొయ్యిమీఁదఁబెట్టి పెద్దమంటవేయవలయు; అప్పుడది పొంగును; పొంగినపిమ్మట చిన్నమంటవేయవలయు; పిదప పాలలో నీళ్ళుకలిపి అందు తెల్లనిగుడ్డనుతడిపి యాగుడ్డతో బాణలిలోని పాకమునకు నాలుగుప్రక్కలపిండవలయు, అందువలన పైనను౦డెడి మురికంతయు బైటవచ్చును; ఆమురికిని గరిటెతోతీసి యొకపాత్రమునం దుంచవలయు; తరువాత ఇంకొకపాత్రమునందు తెల్లని గుడ్డకట్టి పాకమును అందుంచవలయు; పిమ్మట బాణలినికడిగి అందు పాకమునుపోసి ప్రొయ్యిమీఁదఁ బెట్టి చిన్నమంటవేయవలయు; అప్పుడు తిరిగిపొంగి గరిటెతో ఎత్తిన ఒకధారగావచ్చి వ్రేళ్ళతో అంటిచూచిన ఒకతీఁగగావచ్చును, దానిని ఒకతీఁగపాకు అనిచెప్పుదురు; మఱికొంచె మధికముగ మంటవేసిన - రెండు తీఁగలుగవచ్చును; దీనిని రెండుతీఁగలపాకము అని చెప్పుదురు; ఇంకను అధికముగా మంటవేసిన పాకము తెల్లఁగాఅయి వ్రేళ్ళతోఁ తాఁకి చూచిన మూడు తీఁగలువచ్చును; దీనిని మూడుతీఁగల పాకము అనిచెప్పుదురు, దాని కంటె నధికముగా మంటవేసిన - మూడునరతీఁగె వచ్చును; దీనిని మూడునరతీఁగె పాకము అని చెప్పుదురు; ఏపాకము కావలసియుండిన ఆపాకమును చేసికొనవచ్చును.

## గోధుమలడ్డు చేయువిధము.

శ్లో. ప్రస్థమానం విశాలాక్షి! గోధూమజం చే,
తుస్స్పష్టం ఘృతం తస్మి మ్ముష్టిద్వయం ।
మిశ్రయిత్వా చ నీరేణ తావత్ప్రియే!
ముష్టిబద్ధం చ లోలాక్షి ! యావద్భవేత్ ।
ముష్టిబద్ధాని పిండాని భిత్వా తతః,
పాచయే త్కుంకుమాభాంశ్చనై స్సఘృతే ।
తాని సంకుట్య కృత్వా తు చూర్ణం పున,
శ్శర్కరాజ్యం పృథక్ప్రస్థమానం నవం ॥
ద్రావిడీ వల్లిజం కోలమానం పృథ



శ్శర్కరబాదామబీజం ఫలం ఖండితం ।
సర్వ మేకత్ర కృత్వా చ సమ్మిశ్రయే,
ద్వర్ధయే న్మోకాం శ్చామ్రమానాం స్తతః॥
తే దహిత్రాభిధా మోదకా శ్శీతలా,
వాతపిత్తాపహా శ్చాగ్నిమాంద్యప్రదాః ।
శ్లేష్మలా శ్శుక్రలా బల్యవృష్యా హితా,
స్సారకాశ్చాపి హృద్యా గరిష్ఠాః ప్రియాః ॥

తా. ౧ సేరు గోధుమపిండిలో ౹ా తులములు నెయ్యిపోసి కలిపి పిడచయగునట్లు నీళ్ళుపోసి పిడచలుచేసి రెండేసిగావితిచి బాణలిలో నేయికాఁగినపిమ్మటవేసి, బాగుగవేగి కుంకుమపువ్వు వర్ణమువచ్చినతరువాత ఎత్తవలయు; పిమ్మట ఆయుంటలను రోటిలోవేసి దంచి పొడిఅయినతరువాత ఆపొడియందు ౧ సేరు తెల్లచక్కెర, ౧ సేరు నెయ్యి. కొంచెము కలకండపొడి, ఏలకులు తు౪, మిరియాలు తు౪, బాదముపప్పుతు ౮, గసగసాలు తు ౮, వీనినన్నిటిని వేసి బాగుగ కలిపి మామిడికాయలంత లడ్డుచేయవలయు. ఇవి దహిత్రామోదకములనియు, పిడచలడ్డుఅనియుఁజెప్పఁబడును; ఇది - చలువజేయును. వాతపిత్తములఁ బోగొట్టును, అగ్నిమాంద్యమును కఫమును చేయును. వీర్యవృద్ధిని బలమును ఇచ్చును. మనోహరముగ నుండును.

## బూందీలడ్డు చేయువిధము.

శ్లో. ప్రస్థైకం వేసనం పిష్టం తండులానాంపలం ప్రియే ! ।
ద్విపలం చ ఘృతం సమ్య గ్ఘస్తాభ్యాం పరిమర్దయేత్ ॥
లోడయిత్వా తత శ్చాద్భి ర్గాఢం మాక్షీకసన్నిభం ।
తత శ్చుల్ల్యాం సముజ్వాల్యం వహ్నిం న్యస్య కటాహకం ॥
తతో దండం కటాహస్య సఘృతస్యోపరి న్యసేత్ ।
సూక్ష్మచ్ఛిద్రాన్వితం తస్యోపరి సన్న్యస్య ఘుర్ఘురం ॥
తత్ఫేనాయాం చ త స్న్యస్య శనై స్సంహత్య పాతయేత్ ।
బిందవః కుంకుమాకారా యదా స్యు శ్చ తదా ద్రుతం ॥
తా నన్యేన చ నిష్కాస్య ఘుర్ఘురేణ విచక్షణే ! ।
వి స్తీర్ణామత్రకే న్యస్య తతః కుర్యా దముం విధిం ॥
త్రిప్రస్థాయా స్సితాయా శ్చ పాకం కృత్వా త్రితారకం

కర్పూరైలాదిసంయుక్తం తస్మిం స్తాన్ బిందుకాన్ క్షిపేత్ ॥
దర్వ్యా సంచాల్య బహుశ స్తత్ర్యుష్ణే చ విబంధయేత్ ।
మోదకాన్ బిల్వతుల్యాం స్తు తే వృష్యా ధాతువర్ధకాః ॥
శీతలా లఘవో రూక్షా మధురా స్తృప్తికారకాః ।
త్రిదోషఘ్నాః స్మృతాః పూర్వై రాచార్యై ర్బిందుమోదకాః ॥

తా. మెత్తని సెనగపిండి ౧ సేరు, బియ్యపుపిండి ౪ తులములు, నేయి రాతు వీనిలో తగుమాత్రము నీళ్ళుపోసి ఒకటిగకలిపి, చేతితో తేనెవలె చిక్కగ నగునట్లు బాగుగ మర్దించి ప్రొయ్యిమీఁద బాణలిలో నేయి నిండుగపోసి కాఁచి బాణలి చెవులనడుమ ఒకకొయ్యనుంచవలయు; దానిపైన సన్నరంధ్రములుగల పెద్దజల్లిగరిటెను కొయ్యమీఁదనుంచి మఱియొక గరిటెతో పిండిని ఆజల్లిగరిటెలోపోసి కొయ్యమీఁద తట్టవలయు. అప్పుడు పిండి పూసలుగ బాణలిలోపడును, ఎఱ్ఱగ వేగినతరువాత వానిని ఇంకొక జల్లిగరిటెతో ఎత్తి తట్టలోవేసి, మూడు తీఁగలుగల మూడుసేరుల చక్కెర పాకములోవేసి, పచ్చకర్పూరము ఏలకులు వీనిపొడికలిపి గరిటెతో బాగుగ గలిపి వేడిగనుండునపుడే మారేడుకాయలంత లడ్డు చేయవలయు. ఇది వీర్యవృద్ధిని, చలువను గలిగించును; చులకనగ రూక్షమ మధురముగ నుండును; తృప్తి నిచ్చును; త్రిదోషములను బోగొట్టును.

ముక్తామోదకములు, పెసరలడ్డు.

శ్లో. ముద్గపిష్టం ససర్పిష్కం మంథయిత్వాంఽబునా తతః ।
కుర్యా దన్యం చ సకలం బిందుమోదకవ ద్విధిం ॥
స్యా న్ముక్తామోదక స్స్వాదు ర్లఘు ర్గ్రాహీ త్రిదోషనుత్
చక్షుష్యో జ్వరహృ ద్బల్య శ్శీత స్తృప్తిరుచిప్రదః ॥

తా. పెసరపిండిలో నేయి నీళ్లుపోసి బాగుగకలిపి బూందీలడ్డుకుఁ జెప్పినయట్లు ప్రకారము చేయవలయు; ఇది-మంచివాసన గలిగియుండును; చులకననిచ్చును; మలబద్ధము చేయును; త్రిదోషములను జ్వరమును పోగొట్టును; నేత్రములకు హితకరముగ-బలముగ నుండును; చలువను గలిగించును; తృప్తిని రుచిని ఇచ్చును.

రత్నమోదకములు, మినపలడ్డు.

శ్లో. ముక్తామోదకవ త్కృత్వా మాషజా నపి మోదకాన్ ।
ఈషత్సమగుణా మాషైః ప్రోక్తా స్తే రత్నమోదకాః ॥

తా. మినపపిండిలడ్డును పెసరలడ్డువలెనే చేయవలయు - ఇది మినుముల గుణములో కొంచెము సమానమైన గుణము గలిగియుండును,



సేవికా మోదకములు.

శ్లో. ఘృతాక్తాం సమితాం మర్ద్య కృత్వా తంతూన్ జలేన చ ।
శనై స్తాన్ భర్జయే దాజ్యే సితాపంకే విమిశ్రయేత్ ।
తత స్తాన్ మోదకాన్ కృత్వా తే గుణై రమృతకాఇవ ।
సేవికా మోదకా నామ్నా కీర్తితా శ్శాస్త్రవేదిభిః ॥

తా. గోధుమపిండిని నేతిలో కలిపి నీళ్ళుపోసి తంతువులుగజేసి నేతిలో వేయించి కలకండపాకములో కలిపి లడ్డు చేయవలయు. ఇవి సేవికామోదకములు.

సమితా మోదకములు.

శ్లో. సమితా ప్రస్థకే కాంక్షే! ఘృతం క్షిప్త్వా శరావకం ।
వర్ణవ్యత్యయతాం యావ త్తావ ద్భర్జ్యా థ శర్కరాం ॥
ప్రస్థికాం చ వినిక్షిప్య తత శ్చోత్తార్య శీతలే ।
ఏలా లవంగ మరిచం పృథక్కోలం వినిక్షిపేత్ ॥
మోదకాన్ రచయే త్తస్యా రుచ్యా మారవివర్ధనాః ।
సమితామోదకానామ పిత్తఘ్నాః ప్రీతికారకాః ॥

తా. ౧ సేరు గోధుమపిండిలో ౪ తులముల నేయిపోసి ప్రొయ్యిమీఁదఁ బెట్టి కొంచెము ఎఱ్ఱగనగునటుల వేయించి దించుకొని, ౧ సేరు తెల్లచక్కెర కలిపి-ఏలకులు లవంగములు మిరియాలు వీనిని ౪ తులముచొప్పున పొడిచేసి అందులోవేసి లడ్డు చేయవలయు; ఇది రుచిగనుండును. కామమును వృద్ధిచేయును. పిత్తమును నశింపఁజేయును ప్రీతిని పుట్టించును.

ద్రావక మోదకములు.

శ్లో. సమితా దుగ్ధకిట్టం చ సర్పిః ప్రస్థమితం పృథక్ ।
హస్తాభ్యాం మర్దయిత్వా త చ్చైకీభూతం విభర్జయేత్ ।
అర్ధపక్వే పున స్సర్పిః ప్రస్థికం క్షిప్య భర్జయేత్ ।
సమ్యక్పక్వే చ ద్విప్రస్థాం సితాం తత్ర విమిశ్రయేత్ ॥
శీతస్థానే తతో ధృత్వా శీతీభూతే చ కల్పయేత్ ।
మోదకా ద్రావకాఖ్యా స్తే లవంగైలాది సంభృతాః ॥
వృష్యా బల్యా శ్చ పిత్తఘ్నా రుచ్యాః కామవివర్ధనాః ।
శ్లేష్మలా స్తర్పణా హృద్యా వాతఘ్నా గురవః స్మృతాః ॥

తా. గోధుమపిండి ౧ సేరు, కాచిన పాలముద్ద ౧ సేరు, నేయి ౧ సేరు, ఈ మూటిని కలిపి చేతితో బాగుగ పిసికి పాత్రములోవేసి పొయ్యిమీఁదఁ బెట్టి సగము పక్వమగువఱకు వేయించి అందులో ౧ సేరు నేయిపోసి తిరిగి వేయించవలయును. బాగుగ పక్వమయినపిమ్మట ౨ సేర్లు తెల్లచక్కెరవేసి కలిపి దించుకొని - లవంగములు ఏలకులు వీనిపొడికలిపి చల్లనిచోటనుంచి చల్లారినతరువాత లడ్డు చేయవలయును. ఇవి శుక్రవృద్ధిని బలమును ఇచ్చును. పిత్తమును వాతమును గొట్టును. రుచిగనుండును. కామమును వృద్ధిచేయును. కఫమును చేయును. తృప్తినిచ్చును. మనోహరముగనుండును. గురుత్వమును జేయును.

## చూరమోదకములు.

శ్లో. ఘృతాక్తం మర్దయే దీషదంబునా తిఘనం ప్రియే! ।
పిష్టం గోధూమజం తస్య కుర్యా దంగారకర్కటీః ॥
చూర్ణయిత్వా తు తా స్తత్ర శర్కరాం చ ఘృతం సమం ।
సంక్షిప్యేలాదికం కుర్యా న్మోదకా న్మతవద్గుణైః ॥

తా. గోధుమపిండిలో పిడచయగునట్లు నేయి నీళ్లుపోసి గట్టిగ ముద్దచేసి రెండంగుళములమందము గలుగునట్లు బిళ్లగాతట్టి పిడకదాలి యుంచినచోట నుంచి పైన పిడకనిప్పునుపెట్టి బిళ్ల గట్టిపడినతరువాత తీసి చూర్ణముచేసి చక్కెర నేయి సమానముగపోసి ఏలకులు మొదలగువాని చూర్ణమునుకలిపి లడ్డు చేయవలయును.

## ముద్గాది మోదకములు.

శ్లో. ముద్గచూర్ణం ప్రియే! ప్రస్థం ప్రస్థే సర్పిషి భర్జయేత్ ।
తత శ్చోత్తారయే త్పాత్రం వహ్నే ర్యావమా నిధాపయేత్ ॥
పాకార్థేఽత్ర సితా గ్రాహ్యా ద్విప్రస్థా మలవర్జితా ।
తతః కృత్వా చ తత్పాకం చతుస్తారం మనోరమం ॥
తస్మిన్ సంమిశ్రయే చ్చేషం వక్ష్యమాణం గణం క్షిపేత్ ।
లవంగ మేలాం మరిచం బాదామం చ నికోటకం ॥
ఇదం కృత్వా పృథక్ శాణం ఖండశోఽతీవ శోభనం ।
మోదకా నస్య లోలాక్షి! కల్పయే ద్రామమానకాన్ ॥
ఇత్యేవం మాషపిష్టస్య కల్పయే ల్లడ్డుకానపి ।
వేసనస్యాప్యతో వక్ష్యే పృథక్కృత్వా గుణానపి ॥
లఘవో వాతపిత్తఘ్నా శ్శీతవీర్యా హి ముద్గజాః ।



సేవితా స్తరుణై రేతే వాతఘ్నా స్తృప్తికారకాః ॥
చాణకా వాతలా రూక్షా శ్శీతా విష్టంభినో మతాః ।
రోచకా లఘవో బాలే! పిత్తరక్తకఫాపహాః ॥

తా. మెత్తని పెసలపిండి ౨౪ తులములు, నేయి ౨౪ తు. వీనినికలిపి ప్రొయిమీఁదఁబెట్టి వేయించిదించి 3 సేర్ల చక్కెరను ౪ తీఁగల పాకముపట్టి అందులో వేసి- లవంగములు ఏలకులు మిరియాలు బాదముపప్పు, సారపప్పు వీనిని దినుసుకుశాణమెత్తుచొప్పున తునకలుచేసి అందులోవేసి లడ్డు చేయవలయును. ఇట్లే మినప సెనగ పిండిని లడ్డును చేయవలయును. పెసరపిండిలడ్డు చులకననిచ్చును. వాతపిత్తములఁ బోగొట్టును. శీతవీర్యము గలిగియుండును. మినుములడ్డు కాఁక చేయును. శుక్రవృద్ధినిజేయును. గురుత్వమును జేయును. బలము నిచ్చును. వాతమును పోగొట్టును. తృప్తినిచ్చును. వీనిని యౌవనపురుషులు సేవింపవచ్చును. సెనగలడ్డు వాతమును చేయును. రూక్షగనుండును. మలబద్ధమును చేయును. రుచిగనుండును. చులకననిచ్చును. పిత్తరక్తకఫరోగములఁ బోగొట్టును.

## హైబాలక మోదకములు.

శ్లో. హైబాలకం చణకాదీనాం శోషయే దాతపే తతః ।
స్థూలం పిష్ట్వా తు ప్రస్థైకే ఘృతం ప్రస్థం వినిక్షిపేత్ ॥
ద్విప్రస్థాం శర్కరా మేవ బాదామాదీ న్యథారుచి ।
బంధయే న్మోదకాం స్తస్య మిశ్రయిత్వా ప్రమానకాన్ ॥
దుర్జరా గురవ శ్శీతా వాతమేదఃకఫప్రదాః ।
శ్రమఘ్నా గ్రాహిణో రూక్షా ఇమే హైబాలకమోదకాః ॥

తా. సెనగలు పెసలు మినుములు మొదలగువానిని ఎండలోనెండించి కొంచెమునూకగా విసరినపిండి ౧ సేరు, నెయ్యి ౧ సేరు వీనినికలిపి వేయించి - చక్కెర ౨ సేర్లు, బాదముపప్పు మొదలగువానినివేసి కలిపి లడ్డుచేయవలయును. ఇవి దుర్జరములుగనుండును. గురుత్వమును జేయును. చల్లగనుండును. వాతమును-కఫమును- మేదస్సును చేయును. శ్రమమును పోగొట్టును. మలమును బంధించును రూక్షగనుండును.

## బీజమోదకములు.

శ్లో. కూశ్మాండకాది బీజాని నిస్తుషీకృత్య భర్జయేత్ ।
ఘృతే చాపి సితాపంకే క్షిప్త్వా కుర్యా చ్చ మోదకాన్ ॥
తే బీజమోదకా వృష్యా శ్శీతలా గురవో మతాః ।

శుక్రలా మధురా బల్యాః స్థౌల్యవర్ణకఫప్రదాః ॥
రక్తదోషం తథా వాతం పిత్తం సంనాశయ త్యయే ! ॥

తా. గుమ్మడికాయ మొదలగువాని విత్తులను పొట్టుతీసి నేతిలో వేయించి చక్కెరపాకములోవేసి లడ్డు చేయవలయు. ఇది శుక్రవృద్ధిని చేలువను బలమును ఇచ్చును. గురుత్వమును చేయును. మధురముగనుండును. శరీరమునకు స్థౌల్యమును కాంతిని ఇచ్చును. కఫమును చేయును. రక్తదోషము-వాతము-పిత్తము వీనినిపోగొట్టును.

### శాలూక మోదకములు.

శ్లో. శాలూకం నిస్త్వచం కృత్వా పాచయే దంబునా శనైః ।
సంపేష్య వటకాన్ కృత్వా పాచయే త్తాన్ ఘృతే ప్రియే ! ॥
తత స్సంచూర్ణయిత్వా తు సితాపాకే విమిశ్ర్య చ ।
బంధయే న్మోదకాం స్తస్య విష్ణవే తాన్ సమర్పయేత్ ॥
కింవా సంపాచ్య సంపేష్య కృత్వా తంతూన్ ఘృతే పచేత్ ।
సంక్షిప్య శర్కరాపాకే మోదకాన్ రచయే త్ప్రియే ! ॥
శాలూకమోదకా రూక్షా దుర్జరాః కఫనాశకాః ।
కించిత్కషాయాః పిత్తఘ్నా శ్శూలాధ్మానకరా మతాః ॥
విష్టంభకరణాః ఖ్యాతా శ్శీతసంనాశనా స్తథా ।
ఏవం శృంగాటకాదీనాం మోదకాన్ రచయే త్ప్రియే ! ॥

తా. తామరగడ్డను చెక్కుదీసి నీళ్ళలో ఉడకపెట్టి తరువాతనూరి వడియములుచేసి నేతిలోవేయించి పొడిచేసి చక్కెరపాకములోకలిపి లడ్డుచేయవలయు. లేక-ఆగడ్డనుఉడకబెట్టినూరి తంతువులుగచేసి నేతిలోవేయించి పాకములోవేసి లడ్డుచేయవలయు. ఇవి రూక్షగ దుర్జరములుగనుండును. కఫమును పిత్తమును పోగొట్టును. కొంచెము వగరుగనుండును. శూల-కడుపుబ్బరము - మలబద్ధము వీనిని చేయును. శీతమును పోగొట్టును. ఇట్లే పరికగడ్డ మొదలగువానినిగూడ లడ్డు చేయనగును.

### క్షీరశాకాకృతిగుణములు.

శ్లో. దుగ్ధం వా దధి వా తక్రే సమభాగేన మేళయేత్ ।
తతో యావ ద్ఘనే త్పిండం తావదేవ విపాచయేత్ ॥
శర్కరాపూరణేనైవ తస్యా కార్యా చ చక్రికా ।
ఘృతే సంపాచితా సా తు క్షీరశాకేతి కథ్యతే ॥



కఫదా పుష్టిదా గుర్వీ వృష్యా హృద్యా ప్రకీర్తితా ।
వాతాగ్నినాశనీ చోక్తా దీప్తాగ్నీనాం హితా మతా ।
వ్యవాయినా మనిద్రాణాం సుహితే పరికీర్తితా ॥

తా. మజ్జిగలో పాలనుగాని పెరుఁగునుగాని సమభాగముగపోసి కలిపి నిప్పుమీఁదఁబెట్టి కాఁచిన ముద్దయగును; దానిని చక్కెరలోకలిపి బిళ్లలుచేసి నేతిలో వేయించవలయు. ఇవి క్షీరశాకములనఁబడును. ఇవి కఫమును జేయును. పుష్టినిచ్చును. గురుత్వమును చేయును. శుక్రవృద్ధినిచ్చును. హృదయమునకు బలకరముగనుండును. వాతమును జఠరాగ్నిని నశింపఁజేయును. మిక్కిలి ఆఁకలిగలవారికి - మైథున మొనర్చినవారికి - నిద్రలేనివారికిని హితకరములు.

### నిష్యందము.

శ్లో. దధిదుగ్ధే సమే కృత్వా పచే దర్ధావశేషకం ।
త స్మిం స్తిలాం స్తండులాం శ్చ చారకం పనసాస్థి చ ॥
మాతులుంగస్య ఖండాని త స్మిన్ దుగ్ధసమం ఘృతం ।
సితాం నిక్షిప్య విపచే త్తస్మిన్ వ్యోషం సచంద్రకం ॥
నిక్షిప్యోత్తార్య నిష్యందో ధాతువృద్ధికరో గురుః ।
హృద్య శ్చ వాతపిత్తఘ్నో మునిభిః పరికీర్తితః ॥

తా. పెరుఁగు పాలు వీనిని సమముగపోసి కలిపి పొయిమీఁదఁబెట్టి సగము అగువఱకుకాఁచి దానిలో నువ్వులు-బియ్యము-సారపప్పు-పనసవిత్తులు-మాదీఫలములు వీనిని, పాలకు సమానముగ-నేయి - చక్కెరవేసి ముద్దయగువఱకువండి - ఏలకులు-ఆకుపత్రి-లవంగాలు-పచ్చకర్పూరము వీనినివేసి దించవలయు. దీనిపేరు నిష్యందము. ఇది ధాతువృద్ధిని గురుత్వమును జేయును. హృదయమునకు బలమునిచ్చును. వాతపిత్తములను పోగొట్టును.

### పలలము - నువ్వులడ్డు.

శ్లో. పలలం తు సమాఖ్యాత మైక్షవం తిలపిష్టకం ।
పలలం మలకృ ద్వృష్యం వాతఘ్నం కఫపిత్తకృత్ ।
బృంహణం పౌష్టికం స్నిగ్ధం గురు మూత్రనివర్తకం ॥

తా. నువ్వులు బెల్లము వీనిని కలిపి రోటిలోవేసి తొక్కి లడ్డుచేయవలయు ఇది వాతమును పోగొట్టును. కఫపిత్తములను చేయును. పుష్టిని- సుఖమును ఇచ్చును గురుత్వమును చేయును. మూత్రమును బంధించును.

## తిలమోదకములు.

శ్లో. వితుషాన్ సుతిలాన్ భర్జ్య గుడపాకేన మోదకాన్ ।
కృత్వా తే చ సమీరఘ్నా వీర్యపుష్టిబలప్రదాః ॥

తా. పొట్టుతీసిన నువ్వులను వేయించి బెల్లపు పాకములోవేసి లడ్డు చేయవలయును; ఇది వాతమును పోగొట్టును. వీర్యపుష్టిని బలమును ఇచ్చును.

## ముద్గదల మోదకములు.

శ్లో. సమాజ్యశర్కరాః కాంతే! ముద్గసక్తువినిర్మితాః।
ఏలాదిచూర్ణసంయుక్తా ఘర్మర్తౌ హితకారకాః।
ప్రియే! ముద్గదలాఖ్యాస్తే మోదకాః పరికీర్తితాః ॥

తా. పెసరపిండి౧సేరు, నేయి ౧ సేరు ఈరెంటినికలిపి పొయ్యిమీఁదఁబెట్టి వేయించి దించుకొని పిండికి సమానముగ చక్కెరవేసి ఏలకులు మొదలగువాని పొడిని కలిపి లడ్డుచేయవలయును వీనికిముద్గదళములని పేరు-ఇవిఎండకాలమునందుహితకరములు

## పాయసము.

శ్లో. దుగ్ధే షోడశప్రస్థే సుతండులానాం ప్రస్థైకం కాంతే! ।
అథవా ప్రస్థద్వితయం మందవహ్నినా విపాచయేచ్ఛనైః ॥
నాతి ద్రవం ఘనకుచే!నాతిఘనం భో యదా మధుసమం స్యాత్
ఉత్తారయేత్కదుష్ణం సితాష్టమాంశా ప్రక్షేప్యా పయసః ॥
ఘృతంసితార్ధం బహులా రజః పలైకం మృద్వీకాష్టపలా ।
బాదామస్య శరావం క్షిపేత్పాయసే హి ఖండశః కృత్వా ॥
తత్పాయసం నితంబిని! ధాతువర్ధకం చ దుర్జరం బల్యం ।
విష్టంభ్యరుచి కఫకరం మేదోవృద్ధిప్రదం చ గురు కాంతే! ॥
కురుతే చ అగ్నిమాంద్యం లోహిత పిత్తప్రణాశనం ఖ్యాతం ।
హరతే పిత్తం వాతం హరయే సతతం నివేదయేచ్చ తతః ॥

తా. పాలు ౧౬ సేర్లు, ౧ సేరుగాని ౨ సేర్లుగాని బియ్యము వీనినికలిపి పొయ్యిమీఁదఁబెట్టి సన్ననిమంటతో వండి తేనెవలె అయినతరువాత దించి-౨సేర్లుచక్కెర, ౧ సేరు నేయి, ఏలకిచూర్ణము ౪ తులములు, ద్రాక్షపండు ౮పలములు, బాదముపప్పు ౮పలములు, వీనిని పాయసమునందువేసి కలుపవలయును; ఇవిధాతువృద్ధినిచేయును. దుర్జరముగను బలకరముగను, మలబద్ధకారిగనుండును. అరుచి-కఫము-మేదస్సు-అగ్నిమాంద్యము వీనినిచేయును. రక్తపిత్తమును, పిత్తమును పోఁగొట్టును.



## నాళికేర పాయసము.

శ్లో. దుగ్ధే చ నాళికేరం సూక్ష్మం కృత్వా విపాచయేచ్ఛనైః ।
నాతిద్రవం ఘనం వా సితాజ్యబహులా గోస్తనికాదయుతం ॥
తత్స్నిగ్ధం చ శీతలంగురు వతిమధురం సుపౌష్టికం వృష్యం ।
వాతంచ రక్తపిత్తం తథామ్లపిత్తం విశేషతో జయతి ॥

తా. కొబ్బెరనుతురిమి - పాయసమునకుఁ జెప్పఁబడిన విధిప్రకారము పాలు మొదలగువానిలో వేసివండవలయును. ఇది స్నిగ్ధముగ శీతలముగనుండును గురుత్వమును కియును. మిక్కిలి మధురముగనుండును. పుష్టినిచ్చును. శుక్రవృద్ధిని చేయును. వాతము రక్తపిత్తము ఆమ్లపిత్తము వీనిని పోగొట్టును.

## లప్సిక, హాల్వా.

శ్లో. ప్రస్థైకా సమితా కాంతే! తత్సమం సర్పి రంగనే ! ।
భర్జయిత్వా యదా పశ్యేత్కణశశ్చ ఘృతం పృథక్ ॥
భర్జితేతి విజానీయాత్తదేయం సమితా ప్రియే ! ।
తతః కృత్యం ప్రవక్ష్యామి త్వం శృణుష్వ సమాహితా ॥
ప్రస్థైకా సార్ధప్రస్థా వా ద్విప్రస్థావా సుశర్కరా ।
త్రిప్రస్థే క్షీరకే నీరే వా విపాచ్య ప్రయత్నతః ॥
మల ముత్తార్య తన్నీరం తత్కటాహే వినిక్షిపేత్ ।
యత్ర సా సమితా పక్వా జ్వలచ్చుల్ల్యుపరి స్థితా ॥
తత స్సంచాలయే ద్దర్వ్యా యావదాజ్యం న దృశ్యతే ।
మరిచ శ్రీసుమైలానాం తత శ్చూర్ణం విమిశ్రయేత్ ॥
తత స్సంచాలయిత్వా తు సముత్తార్య నిధాపయేత్ ।
ప్రోక్తా సా లప్సికా గుర్వీ వృష్యా స్నిగ్ధా బలప్రదా ॥
ధాతుశ్లేష్మకరా చాపి మధురా రసపాకతః ।
వాతపిత్తప్రశమనీ కమనీయగుణాలయే ! ॥

తా. గోధుమనూక ౧ సేరు - నేయి ౧ సేరు - వీనినికలిపి - ఎఱ్ఱగ నగునంతకు వేయించి-నేయి పైకివచ్చినయెడల పక్వమైనదని తెలిసికొని ౧ సేరుగాని ౧½ సేరుగాని ౨సేర్లుగాని చక్కెరయును, ౩ సేర్లు పాలు నీళ్లునుపోసి బాగుగకాఁచి మురికిని పైటతీసి బాగుగ పక్వమైనతరువాత నేయి యుగురునట్లు గరిటెతో కలిపి-మిరియాలు-లవం

గాలు-ఏలకులు వీనిపొడివేసి దించవలయును; దీనిపేరు హల్వా. ఇదిశుక్రవృద్ధిని గురుత్వమును చేయును. స్నిగ్ధముగనుండును. కఫమును ధాతుపుష్టిని చేయును. మధురముగ నుండును. వాత పిత్తములను బోగొట్టును. వర్షాకాలమునందు హితకరముగ నుండును

### ఖైమీలప్సిక.

శ్లో. ప్రియే! ఖైమీలప్సికాయా విధి రన్య స్తు పూర్వవత్ ।
సమానా శర్కరా పిష్టా దంబుజాక్ష్యపరం శృణు ! ॥
నాళికేరస్య మజ్జానం సూక్ష్మం ఖర్జూర మంగనే ! ।
ద్రాక్షా మేలాం త్వచం విశ్వం మరిచం కృత్య ఖండశః ॥
నిక్షిప్య చాలయే ద్దర్వ్యా సముత్తార్య నిధాపయేత్ ।
ఇయం గుణై ర్లప్సికేవ శీతకాలే హితావహా ॥

తా. గోధుమనూకకు సమానముగ చక్కెరనువేసి పైలప్సికవలెనేచేసి, కొబ్బరతురుము-ఖర్జూరపండు-ద్రాక్షపండు-ఏలకులు-లవంగపట్ట-సొంటి- మిరియాలు వీనిని పొడిచేసి అందులోవేసి గరిటెతో కలిపి దించవలయును. ఇది లప్సికగుణములే కలిగియుండును. శీతకాలమునందు హితకరముగ నుండును.

### చంద్రహాసాలప్సిక.

శ్లో. చంద్రహాసాలప్సికాయాః పాకం కుర్యా ద్ధి పూర్వవత్ ।
ఘృతం పిష్టసమం క్షీరం ద్వయో స్తుల్యం సితాపి చ ॥
కర్పూర మేలాం మరిచం క్షిప్త్వా సంచాలయే త్తతః ।
సముత్తార్య భజే దేషా వృష్యా బల్యా కఫప్రదా ।
ధాతుసంవర్ధనీ గుర్వీ వాతపిత్తహరా మతా ॥

తా. చంద్రహాసమును హల్వాను హల్వావలెనే చేయవలయును. అందు నూకకు సమముగ-నేయి, పాలు- చక్కెర రెండింతలు, పచ్చకర్పూరము-ఏలకులు-మిరియాలు వీనినివేసికలిపి దించవలయును. ఇది బలకరముగనుండును. కఫమును గురుత్వమును చేయును. ధాతుపుష్టి నిచ్చును. వాతపిత్తములఁ బోఁగొట్టును.

### ఫేనిక.

శ్లో. సమితా మర విందాక్షి ! కించిదాజ్యవిమిశ్రితాం ।
మర్దయే దంబునా గాఢం కారయే ద్వర్తికా స్తతః ॥
సన్నిధాయ సమా స్సర్వాః కాష్ఠదండే తు వేష్టయేత్ ।
తా శ్ఛురికయా ఖండ్య పున స్థాపయ్య సుపట్టకే ॥



ఘృతనీరయుతేనైవ శాలిచూర్ణేన లేపయేత్ ।
పున స్సంవృత్య చైతాసాం లోమ్నాం సమ్యక్ప్రకల్పయేత్ ॥
వేల్లయే త్తాం తత స్థూలా మంగులోత్సేధకాం పచేత్ ।
ఘృతే పక్వాం సముద్ధృత్య సితాపాకేన వేష్టయేత్ ॥
సా చైషా ఫేనికా గుర్వీ బృంహణీ బలపుష్టిదా ।
మధురా దీపనీ రుచ్యా వాతపిత్తహరా స్మృతా ॥

తా. గోధుమపిండిలో కొంచెము నెయ్యిపోసి నీళ్ళతో బాగుగమర్దించి ఆవు గవత్తులుచేసి కొయ్యకుచుట్టి వానిని కత్తితో తునకలుచేసి పీటమీఁదనునిచి- బియ్యపుపిండి-నీళ్లు-నేయి వీనిని సమానముగకలిపి ఆతునుకలకుపట్టించి ఉంటలు చేసి, ఒక అంగుళము మందము గలుగునటుల అప్పడములవలె ఒత్తి నేతిలోవేయించి పక్వమైన పిదప ఒకతీఁగపాకములో వేయవలయును. దీనిపేరు ఫేనిక-ఇది గురుత్వమును చేయును. పుష్టిని బలమును ఇచ్చును. మధురముగ రుచిగనుండును. అగ్నిదీపనముకలఁగఁజేయును వాతపిత్తములఁ బోఁగొట్టును.

### మఱియొకవిధము.

శ్లో. సమితాం పూర్వవ న్మర్ద్య కారయే ద్వర్తికా శ్చ తాః ।
ఘృతాక్తా స్సంహతా స్సర్వాః పీఠస్యోపరి ధారయేత్ ॥
వేల్లయే ద్వేల్లనే నైతా యథైకా పర్పటీ భవేత్ ।
శకటం లేపయే త్తస్యాం తత శ్శస్త్రేణ ఖండయేత్ ॥
ఏకీకృత్య తతో లోమ్నాం కల్పయే ద్వేల్లయే త్తతః ।
ఏవం వారత్రయం కృత్య వేల్లయే దంగుళోచ్ఛ్రితం ।
తత స్తాం పాచయే దాజ్యే ఫేనికాం పూర్వవద్గుణాం ।
సుగంధయా శర్కరయా తదుద్ధూలన మాచరేత్ ॥

తా. గోధుమపిండిని మునుపటివలెనే మర్దించి వత్తులుగచేసి నేయిపరిమి ఒకటొకటినిచేర్చి పీటమీఁద పిండిపోసి దానిమీఁద ఆవత్తులనునిచి అప్పడములవలె ఒత్తవలయును. అప్పడములమీఁద-నేయి బియ్యపుపిండి నీళ్లుకలిపిపూసి ౩ మడతలుగా మడిచి కత్తితో ౩ తునకలుచేసి వానిని తిరిగిఒత్తి-ఈప్రకారము మూడుమారులు ఒక అంగుళము మందము అగునటుల అప్పడములుగఁజేసి నేతిలో వేయించి చక్కెరను పైన చల్లవలయును.

## పత్రఫేనిక.

శ్లో. ధౌతతండులజం పిష్టం మర్దితం పయసా ద్రవం ।
నిశి పర్యుషితం ప్రాతః పున ర్నీరేణ మర్దయేత్ ॥
పటాదిపత్త్రికే త చ్ఛ పత్త్రవ త్పరిలేపయేత్ ।
కించిత్తోయాన్వితే భాండే తృణగర్భే వివాసయేత్ ।
లఘ్వీ వృష్యా కషాయేయం వాతఘ్నీ పత్త్రిఫేనికా ॥

తా. బియ్యమును కడిగి పిండికొట్టి రాత్రిపూఁట తడిపిపెట్టి ప్రాతఃకాలమున కొంచెము నీళ్లతో మర్దించి మఱ్ఱియాకు మొదలగు వానిలో పల్చనగపూసి వెడల్పు నోరుగల పెద్దగిన్నెలో నీళ్లుపోసి అందు గడ్డివేసి క్రిందమంటవేసి ఆగడ్డిపైన బియ్యపు పిండినిపూసిన ఆకులనుంచవలయు, అవి యుడికినతరువాత నేతిలో వేయించవలయు. దీనిపేరు పత్రఫేనిక; ఇది చులకనగ వగరుగ నుండును; శుక్రవృద్ధిని చేయును; వాతమును హరించును.

## గోధూమపత్రఫేనిక.

శ్లో. గోధూమసంభవా లఘ్వీ ఛర్దిఘ్నీ పత్త్రిఫేనికా ।
రుచ్యా బల్యా మ్లపిత్తఘ్నీ దాహఘ్నీ చ ప్రకీర్తితా ॥
మాషజా బృంహణీ గుర్వీ స్నిగ్ధా బల్యా చ శుక్రలా ।
స్త్రీషు హర్షప్రదా కాంతే ! కీర్తితా పత్త్రిఫేనికా ॥

తా. గోధుమపిండితోఁ జేయఁబడిన పత్రఫేనిక - లఘువుగ రుచిగ నుండును. వాంతిని పోగొట్టును. బలము నిచ్చును. అమ్లపిత్తరోగమును పోగొట్టును. మినప పిండితోఁ జేయఁబడినది పుష్టినిచ్చును. గురుత్వమునుచేయును. మెఱుఁగిచ్చును. బలము నిచ్చును. శుక్రవృద్ధినిచేయును. స్త్రీలయందు సంతోషము నిచ్చును.

## తంతుఫేనిక.

శ్లో. ఈషత్సైంధవసంయుక్తాం సమితా మలికుంతలే ! ।
ఘనం సంమర్ద్య సంకుట్య కృత్వా మృదుతరాం తతః ।
సేవికా రచయే త్తస్యా స్తాభిః కంజవిలోచనే ! ।
విచిత్రం రచయే ద్గుచ్ఛ ముష్ణీషాకారమేవ చ ।
తస్యోపరి ఘృతం లింపే న్మథితం నవనీతవత్ ।
పున స్సంవేష్టయే త్తాభిః కించి దాకర్ష్య వర్ధయేత్ ।



ఘృతే సంపాచయే త్తస్యాం పచంత్యాం సంవిచాలయేత్ ।
సూక్ష్మాభి శ్చ శలాకాభి స్సుపక్వాం తు సముద్ధరేత్ ।
అన్యపాత్రే తు సంస్థాప్య సితా ముపరి నిక్షిపేత్ ।
బృంహణీ గ్రాహిణీ వృష్యా శుక్రలా చ త్రిదోషహా ।
లఘ్వీ చ మధురా పాకే తన్వంగి ! రుచికారికా ।
బాలే ! బలవతి ప్రోక్తా బల్యైషా తంతుఫేనికా ॥

తా. గోధుమపిండిలో కొంచెము సైంధవలవణమును కలిపి నీళ్లుపోసి మెత్తగ మర్దించి సన్నని తంతువులుచేసి వ్రేళ్ళకుచుట్టి ఉంటచేసి నీళ్ళు నెయ్యికలిపి వెన్నవలె చేసి ఆపిండికిపూసి తిరిగి పొడవుగాచేసి చిన్నమడతలుచేసి నేతిలోవేయించి కాఁడతోకలియబెట్టి పక్వమైనతరువాత దించుకొని మఱియొకపాత్రమునం దుంచి దానిపై చక్కెరవేయవలయు; దీనిపేరు తంతుఫేనిక; ఇది ధాతుపుష్టినిచ్చును. మలబద్ధమును శుక్రవృద్ధినిచేయును, త్రిదోషములనుపోగొట్టును, లఘువుగను-పాకమునందు మధురముగనునుండును, రుచిని బలమును ఇచ్చును. దీనిని బలముగలవాఁడు భుజించవలయు.

## గులోరిక - చక్కెరపూరి.

శ్లో. సమితా త్వష్టమం భాగం ఘృతం సమ్య గ్విమిశ్రయేత్ ।
ఘనం నీరేణ సంమర్ద్య కుర్యా చ్చైవాతికోమలాం ॥
తతః పిచుమితాం నీత్వా కృత్వా లోమ్నాం మతాకృతిం ।
శర్కరాం పూరయే త్తస్యాం ముద్రయే త్తన్ముఖం దృఢం ॥
తత స్తాం వేల్లయే ద్బాలే ! వర్తులాం పూలికాకృతిం ।
మందాగ్నౌ పాచయే దాజ్యే సా చ ఖ్యాతా గులోరికా ॥
గుర్వీయం లలనే ! వృష్యా ధాతుసంవర్ధనీ మతా ।
వాతపిత్తప్రశమనీ కారయే చ్ఛ గుడేన వా ॥

తా. గోధుమపిండికి రావపాలు నేయికలిపి నీళ్ళతో మర్దించి మెత్తగాచేసి బిళ్ళలుగచేసి అందు చక్కెరపోసి నోరునుమూసి గుండ్రముగ ఒత్తి నేతిలో వేయించవలయు; దీనిపేరు గులోరిక; ఇది గురుత్వమునుచేయును. శుక్రమును సప్తధాతువులను వృద్ధిచేయును. వాతపిత్తములను పోగొట్టును; దీనిని బెల్లముతోకూడ చేయవచ్చును.

## దుగ్ధకూపిక.

శ్లో. దుగ్ధ మమ్లేన సంభేద్య పాచయే న్మందవహ్నినా ।
గాఢీభూతే ప్రియే ! తస్మిన్ పిష్టం తండులజం సమం ।

మిశ్రయిత్వా చ రచయేత్పూపికాం జంబుసన్నిభాం ।
అతీవ రమణీయాం చ పాచయేద్గోఘృతే తతః ॥
ఘనం సమ్యక్ శృతం దుగ్ధం తస్యామేవ ప్రపూరయేత్ ।
పశ్చాత్తేనైవ పిష్టేన ముఖం తస్యా విముద్రయేత్ ॥
పునస్తస్యా ముఖం యుక్త్యా పాచయేద్వై ఘృతే తతః ।
చతుస్తారే సితాపాకే ప్లావయిత్వా సముద్ధరేత్ ॥
అథవా జంబుసదృశం కృత్వా పిండం విపాచయేత్ ।
తస్య మధ్యం తు శస్త్రేణ యత్నాన్నిష్కాస్య పూర్వవత్ ॥
మర్దేన పూరయేద్వక్త్రం ముద్రయేత్పిష్టకేన చ ।
ప్లావయేద్వేష్టయేత్తద్వత్సితాపాకేన శోభనం ॥
సా దుగ్ధకూపికా ఖ్యాతా గుర్వీ బల్యా చ శీతలా ।
వాతపిత్తహరా ఖ్యాతా శుక్రలా తృప్తిపుష్టిదా ॥

తా. పాలను పులుసుతో విఱిచి పొయ్యిమీదఁ బెట్టి పెల్లనిమంటతో కాఁచిన నిగిరి ముద్దయగును; అప్పుడు బియ్యపుపిండిని సమముగ కలిపి నేరేడుపండంత యుంటలుచేసి, నేతిలో వేయించవలయు; తరువాత వానిని ఇంకొక పాత్రమునందుంచి కాఁచిన పాలనుపోసి వానిముఖములను ఆపిండితో నేమూసి నేతిలో వేయించి నాలుగుతీగల పాకమునందుతడిపి రెత్తవలయు, లేక ముందుచెప్పిన నేరేడుపండంత ఉంటలను నేతిలో వేయించి వానినడుమ కత్తితో కోసి పాలతో నిండించి పిండితో నోరుమూసి నేతిలో వేయించి చక్కెరపాకమునందు వేయవలయు; దీనిపేరు దుగ్ధకూపిక ఇది గురుత్వమును చేయును. బలమునిచ్చును. చల్లగనుండును. వాతపిత్తములను పోగొట్టును. శుక్రవృద్ధిని చేయును, తృప్తిని పుష్టిని ఇచ్చును.

శాలిపూపకృతి.

శ్లో. ధౌతతండులజం పిష్టం ఘృతమిశ్రం గుడాంబునా ।
సంమర్ద్యాపూపకం కృత్వా తస్యైకాంగే చ ఖాఖసం ॥
లగ్నం కృత్వా తతః శ్చాజ్యే పాచయేచ్ఛాలిపూపకం ।
శాలిపూపో రుచికరో వృష్యః స్నిగ్ధశ్చ శీతలః ।
అతీసారప్రశమనో మత శ్శుక్లాభిసారికే! ॥

తా. బియ్యమును చక్కగాకడిగి పిండికొట్టి కొంచెము నేయికలిపి బెల్లపునీళ్లుపోసిమర్దించి కడల్పుగా గుండుగకట్టి ఒకప్రక్కగసగసాలను అంటించి నేతియందు వండవలయు; దీనిపేరు శాలిపూపము, ఇది రుచిగ, శీతలముగ స్నిగ్ధముగ పుష్టికరముగనుండును. అతిసారరోగమును పోగొట్టును.



అపూపము - అప్పము.

శ్లో. సమితా మమితానందే! మర్దయిత్వా గుడాంబునా ।
ఘృతాక్తాం చ తతో నీత్వా బిల్వం బిల్వపయోధరే! ॥
వేల్లనేన తు సంవేల్ల్య చంద్రమండలసన్నిభం ।
వర్తులం పాచయేదాజ్యే సిద్ధం జ్ఞాత్వా సముద్ధరేత్ ॥
అపూపోఽయం విలోలాక్షి! పుష్టిదోఽతిగురుస్తథా ।
వాతపిత్తహరో బల్యో హృద్యో వృష్యో రుచిప్రదః ॥

తా. గోధుమపిండిలో బెల్లపునీళ్లుపోసి కలిపి పిసికి కొంచెము నెయ్యిపోసి నాలుగేసితులముల ముద్దచేసుకొని పూరీలవలె గుండ్రముగ ఒత్తి నేతియందువేయించి పక్వంబైన తరువాత ఎత్తవలయు-దీనిపేరు అప్పము. ఇది పుష్టిని బలమును ఇచ్చును, గురుత్వముచేయును. వాతపిత్తములఁబోగొట్టును. శుక్రపుష్టినిచ్చును రుచిగనుండును.

దధిపూపము. 2224

శ్లో. ఘనదధ్నా ఘనం మర్ద్య శాలిపిష్టం ఘనస్తని! ।
కారయేద్వటకాకారా నాజ్యే సంపాచయేత్తతః ॥
చతుస్తారే సితాపాకే మజ్జయిత్వా సముద్ధరేత్ ।
దధిపూపా ఇమే వృష్యా రుచ్యా ధాతుప్రవర్ధనాః ॥
అగ్నిమాంద్యప్రదా బల్యా శ్లేష్మలా దాహవృద్ధిరాః ।
వాతపిత్తహరా హారలసత్పీనపయోధరే! ॥

తా. బియ్యపుపిండిని పెరుగుతో కలిపి వడియాలుచేసి నేతిలో వేయించి నాలుగుతీఁగల పాకములో ముంచిఎత్తవలయు; ఇది పుష్టినిచ్చును. రుచిగ నుండును. ధాతువృద్ధినిచేయును. అగ్నిని మందగింపఁజేయును. బలమునిచ్చును. కఫమును జేయును. తాపము దప్పి వాతపిత్తములు వీనిని హరించును.

చిరమంతము.

శ్లో. సమితా మమితానందే! సర్పిషాక్తాం విమర్దయేత్ ।
ఘనో మద్భిర్ఘనోరోజే! తతః కుర్యాదముం విధిం ॥
కించిత్కించిజ్జలం దత్వా మర్దయేద్ధి పునఃపునః ।

సుచిరం కోమలాం కృత్వా కోమలాంగి ! మనోహరే ॥
తతః పూగమితం నీత్వా వేల్ల్య కృత్వా చ పర్పటీం ।
సూక్ష్మాం పత్త్రనిభా మేవం బహ్వీః కృత్వా నిధాపయేత్ ॥
ఆజ్యలిప్తా స్తత స్తా స్తు స్థాపయే దుపర్యుపరి ।
యావద్ద్వ్యంగుల ముత్సేధం తతః కించి చ్చ వేల్లయేత్ ॥
తత శ్శస్త్రేణ సంఖండ్య త్ర్యంగులోన్మానకాని చ ।
ఖండాన్యేవ పున ర్వేల్ల్య తనూకృత్య ప్రయత్నతః ॥
చతుఃకోణా పచే దాజ్యే శర్కరాఢ్యాం శ్చ భక్షయేత్ ।
చిరమంతా ఇమే బల్యా వృష్యా ధాతుప్రవర్ధనాః ।
గురవో వాతపిత్తఘ్నాః పుష్టిదాః పరికీర్తితాః ॥

తా, గోధుమపిండిలో కొంచెము నెయ్యికలిపి మర్దించి నీళ్ళతో తడిపి తిరిగి కొంచెము కొంచెముగ నీళ్ళుపోసి మెత్తగపిసికి పెద్దవక్కఅంత పిండినితీసికొని ఉంటలుచేసి ఆకువలెపల్చగనొత్తి వానిపైన నేయిచరిమి ఒకదానిమీఁద నొకటిచొప్పున రెండంగుళములమందము గలుగునట్లుపెట్టి ఒత్తి మూఁడుతునుకలుగకోసి నాలుగుకోణములుగలుగునట్లుఒత్తి ఆతునుకలను నేతియందువండి శర్కరతోడ భక్షింపవలయు; ఇవి బలమును ధాతుపుష్టిని గురుత్వమును చేయును. వాతపిత్తముల హరించును.

ఖాజా.

శ్లో. అంభసి త్రిదినం ప్లావ్య తండులాం శ్రీః ప్రమార్జయేత్ ।
శోషయే దాతపే తేషాం పిష్టం వస్త్రవిగాలితం ॥
తత్సమం చ ఘృతం గాఢం మిశ్రయిత్వా ప్రమంథయేత్ ।
స్థాపయే త్తచ్ఛుభే పాత్రే తతః కుర్యా దముం విధిం ॥
సమితా ముభయో స్తుల్యా మంభసా మర్దయే ద్దృఢం ।
కాంతే ! చాతిఘనాం కించి దాజ్యలిప్తాం వికుట్టయేత్ ॥
భూయోభూయః ప్రయత్నా త్తద్గోలకం దృషతాశ్మని ।
యావన్మృదుతరం పశ్చా చ్ఛిలాయాం సంప్రసార్య చ ॥
తత్ర గర్తా న్యంగుళీభిః కల్పయిత్వా ప్రపూరయేత్ ।
సాజ్యం త త్పిష్టకం యావ ద్గర్తపూరం మనోహరే ! ॥
తత స్తద్ద్విగుణీకృత్య కుట్టయే చ్చాపి పూర్వవత్ ।



ఏవం వారత్రయం కృత్వా తతో నీత్వా తుకం పృథక్ ॥
కించి ద్విస్తార్యాంగుళీభిః కృత్వా గర్తాని పాచయేత్ ।
ఘృతే ఖాజేతి విఖ్యాతా భుక్తా శర్కరయా నరైః ॥
శ్రేష్ఠా హర్షకరీ హ్యేషా గుర్వీ పిత్తానిలాపహా ।
శుక్రలా మధురా కాంతే ! మధురాధరపల్లవే ! ॥

తా. బియ్యమును మూఁడుదినములు తడిపిపెట్టి తరువాత నీళ్ళతో కడిగి ఎండపెట్టి పిండికొట్టి వస్త్రగాలితముచేసి దానికి సమముగ పేరిన నెయ్యి కలిపి మర్దించి ఒకపాత్రమునం దుంచవలయు; పిమ్మట నేతికి పిండికి సమముగ గోధుమపిండిని గ్రహించి మునుపటిపిండియందుకలిపి నీళ్ళతోమర్దించి నేయిచరిమిమెత్తగమర్దించి ఆముద్దను రాతిమీఁదనునిచి రాతితోమర్దించి దానియందు వ్రేళ్ళను గ్రుచ్చి ఆరంధ్రములు నిండువఱకు నేయిపోసి పూర్వమువలె మూఁడుమడతలుగామడిచి మూఁడుగాకొని రాతిమీఁదనుద్దించి కొంచెముతీసికొని బిళ్లగాచేసి ఉంటలుచేసి బిళ్ళగాతట్టి ఐదువ్రేళ్లతో అణిచి గుంటలుచేసి నేతిలోవండి శర్కర పాలు వీనితోడభక్షింపవలయు; ఇది గురుత్వముచేయును. పిత్తవాతములనుహరించును. శుక్రమునుచేయును. మధురముగ నుండును.

మల్లపూపము.

శ్లో. గోధూమపిష్టకం ప్రస్థం గుడం పాదోనప్రస్థకం ।
శర్కరా చే త్సమా నీరే ఘోలయే త్తేన వారిణా ॥
పిష్టం విలోడయే త్తావ జ్జలం దత్వా పునః పునః ।
యావన్మాక్షికతుల్యం స్యా త్తతః కృత్వా త్విమం విధిం ॥
లోహమయ్యాం తప్తికాయాం శరావైకం ఘృతం క్షిపేత్ ।
తస్మిం స్తప్తే తు త ద్ఘోల మాప్రమాణం చ నిక్షిపేత్ ॥
విస్తృతం చంద్రబింబాభం ఘృతోపరి తరే ద్యదా ।
తదా ప్రవర్తయే త్పశ్చా త్సిద్ధం జ్ఞాత్వా సముద్ధరేత్ ॥
మల్లపూప ఇతి ఖ్యాతో వాతపిత్తహరో గురుః ।
బల్యోఽయం మధురో వృష్యో హృద్యో రుచ్యః కఫప్రదః ॥

తా. గోధుమపిండి ౧ సేరు, బెల్లము ముక్కాలుసేరు, శర్కర అయినయెడల ౧ సేరు, వీనిలో నీళ్ళుపోసి తేనెవలె యగునట్లుమర్దించి బాణలిలో నేయిపోసి పొయిమీఁదపెట్టి క్రాఁగినతరువాత పిండిని నాలుగేసి తులములచొప్పునవత్తి నేతిలోవేయవలయు; అది వెడల్పుగనై యుబ్బును; దానిని గరిటెతో తిప్పి పక్వమైన తరువాత

ఎత్తుకొనవలయు; ఇది వాతపిత్తములహరించును. గురుత్వమును చేయును. బలమునిచ్చును మధురముగనుండును. పుష్టినిచ్చును. రుచిగ నుండును. కఫమును చేయును.

### కుండలినీ - జిలేబీ.

శ్లో. లోలాక్షి ! సమితాప్రస్థం ప్రస్థక్షీరేణ మంథయేత్ ।
నవీనే మార్తికే భాండే క్షిపే ద్బధ్వా చ తన్ముఖం ॥
ఆతపే స్థాపయే త్తావ ద్యావ దమ్లత్వ మావ్రజేత్ ।
తతో౽న్యపయసా లోడ్య కుర్యా న్మాక్షీకసన్నిభం ॥
సచ్ఛిద్రే నాలికేరస్య పాత్రే కృత్వాం గులీతలే ।
తప్తికాయాం ఘృతే తప్తే పృథక్కృత్వాంగులీం తతః ॥
ద్విధా వాపి త్రిధా తత్ర భ్రామయిత్వా తిశీఘ్రతః ।
రేఖైకా ముపరి న్యస్య చోత్థితాం వర్తయే త్తతః ॥
సుపక్వాం కుండలాకారాం సితాపాకే వినిక్షిపేత్ ।
మధుతుల్యే తతో నీత్వా స్థాపయే త్పంచ భాజనే ॥
ఏషా కుండలినీ వృష్యా హృద్యా ధాతువివర్ధినీ ।
తర్పణీంద్రియవర్గాణాం పుష్టికాంతి బలప్రదా ॥

తా. ౧సేరు గోధుమనూకను, ౧సేరు పాలలోకలిపి క్రొత్తకుండలోవేసి మూతికట్టి పులియువఱకుఎండలోపెట్టవలయు; పిదప నీళ్ళుపోసి తేనెవలెయగునట్లుమర్దించి రంధ్రముగల టెంకాయచిప్పలోపోసి వేలితోరంధ్రమునుమూసి బాణలియందునేయి పోసి కాచి పిండిని రంధ్రముగుండా రెండుమూడు త్రిప్పులు త్రిప్పవలయు; వేగిన తరువాత ఒకతీఁగ చక్కెరపాకములో ముంచియెత్తి ఇంకొక పాత్రమునందుంచవలయు; దీనిపేరు జిలేబి; ఇది పుష్టిని, హృదయమునకు బలమును, ధాతువృద్ధిని చేయును తృప్తిని బలమును ఇచ్చును.

### మఱియొకవిధము.

శ్లో. సమితాయాం ఘృతం తావ న్మిశ్రయే ద్వనితావరే ! ।
యావ త్సా స్యా న్ముష్టికాబద్ధం తతో నీరేణ లోడయేత్ ॥
స్థాపితం చామ్లతాం ప్రాప్తం పున ర్దుగ్ధేన మంథయేత్ ।
పూర్వవ త్సకలం కృత్వా విధిం చాపి గుణై స్సమా ॥

తా. గోధుమనూకయందు పిడచయగునట్లు నెయ్యిపోసికలిపి తరువాత నీళ్లు పోసి పిసికి పులియువఱకు నానబెట్టి పిమ్మట పాలుపోసి కలిపి ముందు చెప్పిన ప్రకారము చేయవలయు. దీనికిని పైదానిగుణములు కలిగియుండును.



### ఇంకొకవిధము.

శ్లో. నూతనం ఘట మానీయ తస్యాంతః కుశలో జనః ।
ప్రస్థార్ధపరిమాణేన దధ్నా లిప్తేన లేపయేత్ ॥
ద్విప్రస్థాం సమితాం తత్ర దధ్యమ్లాం ప్రస్థసమ్మితం ।
ఘృత మర్ధశరావం చ ఘోలయిత్వా వినిక్షిపేత్ ॥
ఆతపే స్థాపయే త్తావ ద్యావ ద్యాతి త దమ్లతాం ।
పూర్వవ త్త్వఖిలం కృత్యం గుణా జ్ఞేయా శ్చ పూర్వవత్ ॥

తా. క్రొత్తకుండ తెచ్చి దానిలో అరసేరు పెరుగుపూసి, ౨ సేర్లనూక, ౧ సేరు పుల్లనిపెరుగు, ౧ సేరు నెయ్యి వీనినన్నిటిని కలిపి పులియువఱకు ఎండలోపెట్టి పూర్వమువలె చేయవలయు, ముందుజెప్పిన దానిగుణంబులే దీనికిని గలుగును.

### ఘృతపూరము.

శ్లో. పాదాంశసర్పిషా మిశ్రాం సమితా మమితప్రభే ! ।
ఘోలయే త్పయసా కృత్వా ఘోలం మాక్షీకసన్నిభం ॥
తప్తికోపరి సన్న్యస్య తిర్యగ్బద్ధండం సుకాష్ఠజం ।
తస్యోపరి దృఢం న్యస్య ఝర్ఝరం ధాతునిర్మితం ॥
తద్ఘోలం తత్ఘటాయాం చ ధృత్వా హస్తేన ఘర్షయేత్ ।
తచ్ఛిద్రై ర్నిస్సృతం ఘోలం తప్త్యాం తప్తే ఘృతే పతేత్ ॥
ద్వ్యంగులోత్సేధకం యావ ద్భవే త్తావ న్నిపాతయేత్ ।
తతః పక్వం సువిజ్ఞాయ ప్రియే ! శీఘ్రం సముద్ధరేత్ ॥
సంక్షిపే చ్ఛర్కరాపాకే మధుతుల్యే సుశోభనే ! ।
తత ఉద్ధృత్య చాన్యస్మి న్న్యసే త్పాత్రే సువిస్తృతే ॥
ఘృతపూరో గురు ర్వృష్యో హృద్యో బల్యః కఫప్రదః ।
మాంసలోహితశుక్రాణాం వర్ధన శ్చ ప్రియో మతః ॥
సేవితో నాశయ త్యాశు వాతం పిత్తం క్షతం క్షయం ॥

తా. గోధుమనూకలో నూకకు నాలవపాలు నెయ్యికలిపి పాలతో తేనెవలె యగునట్లు మర్దించి ప్రొయిమీఁద బాణలినుంచి దానిమీఁద ఒకకొయ్యనునిచి ఆకొయ్యమీఁదజల్లిగరిటెనునిచి పిండిని ఆగరిటెలోవేసి చేతితో తోమవలయు; అది రంధ్రములగుండా నేతిలోపడును; ఆపిండిని నేతిలో రెండంగుళముల లావగువఱకు పో

యుంచుండవలయు. పక్వమైనపిదప దానిని ఒకతీఁగెపాకములోవేసి యెత్తి మతియొక పాత్రమునం దుంచవలయు; ఇది గురుత్వమునుచేయును, పుష్టిని బలమును ఇచ్చును. కఫమునుచేయును. మాంసమును రక్తమును శుక్రమునువృద్ధిచేయును. వాతము-పిత్తము గాయము-క్షయము వీనిని నశింపజేయును.

నారికేళజ ఘృతపూరము.

శ్లో. నారికేళఫలం స్వార్ద్రిం సూక్ష్మం యత్నేనకర్తయేత్ ।
సూక్ష్మం గోధూమచూర్ణం తు శర్కరా మపి మిశ్రయేత్ ।
దుగ్ధే నాలోడ్య ప్రాగ్వ చ్ఛ కారయే ద్ఘృతపూరకం ॥

తా. తురిమినకొబ్బెర-గోధుమనూక-చక్కెర-పాలు వీని నన్నిటిని బాగుగ కలిపి ఘృతపూరమువలె చేయవలయు

క్షీరఘృతపూరము.

శ్లో. దుగ్ధం సంపాచయే ద్గాఢం పిండంకృత్వా సశర్కరం ।
తత ఆమ్రద్వయం నీత్వా కృత్వేందుమండలాకృతి ॥
ఫలాకారం తు వా కృత్వా పచే దాజ్యే ప్రయత్నతః ।
మజ్జయే చ్ఛర్కరాపంకే ఘృతపూరం మనోరమే ! ॥

తా. పాలనుకాఁచి కోవాచేసి కలకండపొడికలిపి రా తులముల ముద్దయెత్తి కొని చంద్రమండలమువలె (లేక) ఫలములవలెచేసి నేతిలో వేయించి తరువాత చక్కెరపాకములో వేయవలయు.

శాలిపిష్టాదిఘృతపూరములు.

శ్లో. దుగ్ధ మర్ధశృతం కృత్వా శాలిపిష్టం సశర్కరం ।
సంమిశ్ర్య వటకం కృత్వా పాచయే చ్చాపి పూర్వవత్ ॥
శృంగాటక కశేర్వాదిపిష్టజం చ విచక్షణే ! ।
అనేన విధినా కుర్యా ద్ఘృతపూరం సుశోభనం ॥

తా. పాలను అర్ధపక్వముచేసి దానిలో బియ్యపుపిండి చక్కెర వేసి బాగుగ కలిపి వడియములుచేసి నేతిలో వేయించవలయు. ఇట్లే పరికెగడ్డ మొదలగువాని పిండితోఁగూడ ఘృతపూరములు చేయవగును.

ఆమ్రరస ఘృతపూరము.

శ్లో. పక్వామ్రస్య రసం కాంతే! ఘృతయుక్తం విపాచయేత్ ।
ఘనీభూతం సముత్తార్య కారయే ద్వటకాకృతీః ॥



తత స్సంపాచయే దాజ్యే సితాపాకే చ పూర్వవత్ ।
రోచనా దీపనా బల్యా శ్చ్యాతజా ఘృతపూరకాః ॥
హృద్యా వృష్యా శ్చ గురవో వాతపిత్తప్రణాశనాః ॥

తా. మామిడిపండ్లరసములో నెయ్యికలిపి ముద్దయగువఱకు కాఁచి యెత్తి వడియములుచేసి నేతిలోవేయించి చక్కెరపాకములో వేయవలయు; ఇది విరేచనముచేయించును. అగ్నిదీపనమునుచేయును. బలమును పుష్టిని ఇచ్చును. గురుత్వముచేయును. వాతపిత్తముల హరించును.

మఱియొకవిధము.

శ్లో. పక్వామ్రస్య ఘృతే నవే సువిపచే న్మందాగ్నినా యత్నతో,
యావత్సాన్ద్ర ఘన స్తథా పున రయం పాచ్య స్సితాపంకకే।
సంజాతే చ ఘనే తతః పృథుతరే విస్తీర్ణపాత్రే తు తం,
సంలింపే త్తు యథాంగులం ఘనతరం తం ఖండశః కర్తయేత్ ॥
—సోయం చామ్రరసోద్భవో ఘృతపురో హృద్యో గురు ర్దీపనో,
రుచ్యః పిత్తమరుత్ప్రణాశనకరో బల్యోఽతివృష్యో భవేత్ ।
ఏవం చాస్యపదార్థజో ఘృతపుర స్తత్తద్గుణై రన్వితో,
భీమేన ప్రియభోజనేన చ పురా కృష్ణార్థ ముత్పాదితః ॥

తా. మామిడిపండ్లరసములో నెయ్యిపోసి గట్టియగువఱకు మెల్లనిమంటతో కాఁచి చక్కెరపాకములోవేసి గట్టిగా అయినతరువాత, పీఁటమీఁద నెయ్యి చరిమి ఒకఅంగుళము మందముగలుగునట్లుపూసి అది చల్లారినతరువాత తునుకలుగ కోయవలయు; ఇది హృదయమునకు బలము నిచ్చును. గురుత్వమునుచేయును. అగ్నిదీపనమును గలిగించును. రుచినిపుట్టించును. పిత్తమును వాతమును హరించును. బలమును పుష్టిని ఇచ్చును. ఇది పూర్వము శ్రీకృష్ణునికొఱకు భీమసేనునిచే నిర్మింపఁబడినది.

సంయావము.

శ్లో. గోధూమచూర్ణకం కాంతే! భర్జయే త్సర్పిషా తతః ।
శర్కరా మిశ్రితం కృత్వా లవంగైలా మరీచకం ॥
సచంద్రం చూర్ణయే త్తస్మి న్మిశ్రయే చ్చ తతః ప్రియే ! ।
ఘృతాక్తాం సమితా మన్యాం మర్దయే త్పయసా ఘనాం ॥
తతః పూగమితాం నీత్వా వేల్లన్ కృత్వా సుపర్పటీం ।

తస్యాం తత్పూరయే చ్చూర్ణం సంపుటీకృత్య ముద్రయేత్ ॥
ముఖ మస్యాః ప్రగుంధ్యాపి కుర్యా త్కంకణ చిహ్నవత్ ।
పాచయే చ్చ ఘృతే పక్వం సితాపంకేన లేపయేత్ ॥
సంయావోఽయం గురు ర్వృష్యో హృద్యో ధాతుప్రవర్ధనః ।
మధురో వాతపిత్తఘ్నో భగ్నసంధానకృ త్పరః ॥

తా. గోధుమనూకలో కొంచెము నేయివేసి వేయించి కలకండ లవంగములు ఏలకులు మిరియాలు పచ్చకర్పూరము వీనిని పొడిచేసికలిపి, వేరు గోధూమనూకను తెచ్చి అందు కొంచెము నేయిపోసి పాలుకలిపి మర్దించి యుంటలుచేసి అప్పడముల వలెఱొత్తి వానిలోపైఁజెప్పిన పిండిపూర్ణము పెట్టి మడిచి ముఖములుమూసి నేతిలో వేయించవలయు; దీనిపేరు సంయావము; ఇది గురుత్వమును చేయును. పుష్టినిచ్చును. ధాతువృద్ధిచేయును. మధురముగ నుండును. వాతపిత్తములఁ బోఁగొట్టును.

మఱియొకవిధము.

శ్లో. శుద్ధతండులజం పిష్టం సూక్ష్మం వస్త్రవిగాలితం ।
యత్పాత్రప్రమితం పిష్టం తత్పాత్ర ప్రమితంజలం ॥
జల మగ్నౌ ప్రతప్తైవ తతః కుర్యా దముం విధిం ।
కించిత్కించి త్క్షిపే త్పిష్టం దర్వ్యా సంచాలయే న్ముహుః ॥
ఘనీభూతం సముత్తార్య కృత్వా శీతే చ పర్పటీః ।
తాసాం మధ్యే న్యసే త్పూర్ణం శ్రీఫలైలా సితోద్భవం ॥
సితాధాన్యా కజం చూర్ణం కిం వా విశ్వగుణోద్భవం ।
తతో ద్విగుణితాం గుంఫే న్నఖే నార్ధేందుసన్నిభాం ॥
పాచయే చ్చ ఘృతే సమ్య క్సంయావోఽయం చ కీర్తితః ।
తృణగర్భేఽథవా భాండే సనీరే స్వేద్య పాచయేత్ ॥
సంయావోఽయం గురు ర్వృష్యో విష్టంభీ తృప్తికారకః ।
శ్లేష్మలో వాతపిత్తఘ్నో ఘనపీనపయోధరే ! ॥

తా. బియ్యమును బాగుగకడిగి మెత్తగ పిండికొట్టి వస్త్రగాలితముచేసి, ఒక పాత్రమునందు పిండికి సమానముగ నీళ్లుపోసి పొయ్యిమీఁదఁబెట్టి నీళ్లు మసలిన తరువాత పిండిని కొంచెముకొంచెము గావేయుచు గరిటెతో కలియబెట్టవలయు; అదియుడికి ముద్దకాగానే దించి చల్లారినతరువాత ఉంటలుచేసి అప్పడములొత్తి వానియందు ఎండుకొబ్బెర-ఏలకులు-చక్కెర వీనినిగాని, చక్కెర ధనియాలనుగాని, సొంటి బెల్ల



మునుగాని పూర్ణముంచి అర్ధచంద్రాకారముగ మడిచి అంచులుమూసి నేతిలోవేయించవలయు; (లేక) కుండలోనీళ్లుపోసి గడ్డివేసి అందుఁ గొంచెము నీరు ఉడుకనిచ్చి నేతిలో వేయించవలయు; ఇది గురుత్వమును చేయును. పుష్టిని తృప్తిని ఇచ్చును, మలబద్ధమునుచేయును. కఫమును వృద్ధిచేయును. వాతపిత్తములను బోగొట్టును.

కర్పూరనాళిక.

శ్లో. ఘృతాక్తాం సమితాం కాంతే ! మర్దయే దంబునా చిరం ।
తతః పూగమితం నీత్వా రచయే న్నలికాం శుభాం ॥
తత్త్రైలోషణచంద్ర శ్రీయుతాం సంపూరయే త్సితాం ।
ముద్రయే త్తన్ముఖం చాజ్యే పచే త్సంయావవద్గుణా ।
కర్పూరనాళికా తజ్జ్ఞైః కీర్తితా సుభగాలకే ! ॥

తా. గోధుమపిండిలో కొంచెము నేయికలిపి నీళ్ళతోమర్దించి పెద్దవక్కంత తీసికొని పొడవుగ గొట్టములుచేసి వానిలో-కలకండ- ఏలకులు- మిరియాలు- పచ్చకర్పూరము-లవంగాలు వీని పొడినివేసి నోరుమూసి నేతిలో వేయించవలయు; దీనికి సంయావగుణము గలిగియుండును.

ఇందు రసములు.

శ్లో. త్రిప్రస్థం షష్టికాచూర్ణం ప్రస్థైకా శర్కరా ప్రియే ! ।
ఘృతం దధ్నా చ సంమర్ద్య కృత్వా పిండం మనోహరే ! ॥
తత శ్చైకదినం స్థాప్య ద్వితీయేఽహ్ని వినిర్మయేత్ ।
అపూపాం శ్చంద్రబింబాభాం స్తథా కాంగే సితాం స్తిలాః ॥
లగ్నాః కృత్వా పచే దాజ్యే విష్ణవే సన్నివేదయేత్ ।
ఇమా ఇందురసా బల్యా శ్శరదిందునిభాననే ! ॥
కఫవాతహరా హృద్యా అతిశీతా శ్చ పుష్టిదాః ॥

తా. బియ్యపుపిండి 3 సేర్లు, కలకండపొడి ౧ సేరు, వీనిని పెరుగుతోమర్దించి ఒకదినమునిచి మరునాడు పిండిని గుండ్రముగానొత్తి ఒక్కప్రక్క తెల్లనువ్వుల నంటించి నేతిలో వండవలయు, ఇవి బలమును పుష్టిని ఇచ్చును. కఫవాతములఁ బోఁగొట్టును. హృదయమునకు బలమునిచ్చును, చలువ చేయును.

### మఱియొక విధము.

శ్లో. ప్రక్షాళ్య తండులాన్సమ్య క్చూర్ణయే త్తా నులూఖలే ।
సమయా సితయా యోజ్య మర్దయే చ్ఛ విచక్షణః ॥
యదా పిండీభవే త్పిష్టం తదా లోమ్నాం విధాయ చ ।
వేల్లయిత్వా తదేకాంగే లగ్నాన్ కృత్వా ప్రయత్నతః ॥
అహిఫేనస్య బీజాని నిస్తుషాన్ వా తిలాం స్తతః ।
పాచయే ద్ధి ఘృతే సమ్య క్తా స్స్యు రిందురసాః ప్రియే ! ॥
ఇమా ఇందురసా వృష్యా హృద్యా ధాతుప్రవర్ధనాః ।
పిత్తఘ్నా గురవో రుచ్యాః పుష్టికాంతిబలప్రదాః ॥

తా. బియ్యమును చక్కగా కడిగి ఱోటిలోవేసి మెత్తగ పిండికొట్టి పిండికి సమముగ కలకండపొడికలిపి నీళ్లుపోసి మర్దించి ఉంటలుచేసి గుండుగనొత్తి ఒక్కప్రక్క తెల్లనువ్వులనుగాని గసగసాలనుగాని అంటించి నేతిలో వండవలయు; ఇది బలమునిచ్చును. ధాతుపుష్టినిచేయును. పిత్తమును హరించును. గురుత్వమును చేయును. రుచిని పుట్టించును. కాంతిని బలము నిచ్చును.

### శర్కరపాలిక.

శ్లో. సమానం పిష్టత స్సర్పి స్సార్ధభాగా చ శర్కరా ।
భర్జితం శర్కరాపాకే పిష్టకం సఘృతం క్షిపేత్ ॥
లవంగైలాదికం క్షిప్త్వా త చ్ఛ దర్వ్యా విచాలయేత్ ।
యావద్వటకయోగ్యం స్యా త్తత స్థాల్యాం ప్రసారయేత్ ॥
కవోష్ణం ఖండశః కృత్వా శీతే సీతాథవాయ చ ।
అర్పయే చ్ఛర్కరాపాలీ స్స్నిగ్ధాః కించి చ్ఛ పిత్తలాః ॥
శ్లేష్మలా గుర్వ్యరోచఘ్ని ర్వాతవిష్టంభనాశనీః ॥

తా. బియ్యపుపిండి — పిండికి సమముగ నెయ్యి దీనికి అరపాలు చక్కెర వీని నికలిపివేయించి చక్కెరపాకములోవేసి — లవంగాలు — ఏలకులు మొదలగువాని పొడి చేసి గరిటెతో కలియబెట్టి వడియములుచేయుటకు దగినట్లుగా వచ్చినతరువాత పళ్లెములోపోసి — కొంచెము వేడియుండగా తునుకలుగ కోయవలయును, ఇది దేహమునకు మెరుగునిచ్చును. కొంచెము పిత్తమును కఫమును గురుత్వమునుచేయును, అరుచిని వాతమును మలబద్ధమును పోగొట్టును.



### శంఖపాలము.

శ్లో. ఘృతాక్తాం సమితాం మర్ద్య దుగ్ధేన చ జలేన వా ।
సంవేల్ల్య రోటికాం కుర్యా దుత్సేధా మంగుళార్ధికాం ॥
శృంగాటాకృతికా న్యస్యాః కాంతే ! ఖండాని కారయేత్ ।
ఘృతే సంపాచ్య సంలింపే త్సిరాపంకేన యుక్తితః ॥
శంఖపాలా ఇతి ప్రోక్తా బృంహణా బలపుష్టిదాః ।
మధురాః పిత్తవాతఘ్నా గురవో రుచికారకాః ॥

తా. గోధుమపిండిలో నెయ్యిపోసి - పాలతోగాని - నీళ్లతోగానిమర్దించి అరఅంగుళము లావుగలుగునట్లు రొట్టెలుచేసి కత్తితో మూడుమూలలుగకోసి నేతిలో వండి చక్కెరపాకములో వేయించవలయు. ఇదిపుష్టిని బలమును ఇచ్చును. మధురముగనుండును, పిత్తవాతములను పోగొట్టును. గురుత్వమునుచేయును. రుచిని పుట్టించును; దీనిలో ఉప్పుకూడవేసి చేయుదురు.

### మంతము.

శ్లో. ద్విప్రస్థాం సమితాం సర్పి ర్మిశ్రయిత్వా చతుఃఫలం ।
తతో నీరేణ సంమర్ద్య కారయే ద్వటకాన్ దృఢాన్ ॥
పాచయిత్వా ఘృతే కాంతే ! తతః కుర్యా దిమం విధిం ।
ఏలా లవంగ కర్పూర మరీచాద్యై స్సుశోభనం ॥
సితాపంకం విధాయైవ యుక్త్యా మంతేషు లేపయేత్ ।
తే మంతా బృంహణా బల్యాః పౌష్టికా గురవ స్తథా ।
వాతపిత్తహరా రుచ్యా మధురా మధురాధరే ! ॥

తా. ౨ సేర్లు గోధుమనూకలో పావుసేరు నేయిపోసి నీళ్లతోమర్దించి వడియములుచేసి నేతిలోవండి, ఏలకులు లవంగాలు పచ్చకర్పూరము మిరియాలు వీనిపొడిని కలకండపాకములోవేసి ఆపాకమునందు ఆ ఉంటలను వేయవలయు. ఇది సప్తధాతువృద్ధిని చేయును. బలమును పుష్టినిచ్చును. గురుత్వమునుచేయును. వాతపిత్తముల హరించును. రుచినిచ్చును. మధురముగ నుండును.

### సేవికములు.

శ్లో. సమితా మమితాహ్లాదే ! ఘనం క్షీరేణ మర్దయేత్ ।
మృద్వీం కుర్యా త్పున ర్మర్ద్య తస్యా స్తంతూన్ వినిర్మయేత్ ॥
శోషయిత్వా తపే చైతా నీషదాజ్యే విభర్జ్య చ ।

క్షిపే దుత్కలితే నీరే క్షణే నోత్తారయే ద్ధ్రితం ॥
పృథక్ తోయం సునిస్సార్య సితాజ్యాభ్యాం నిషేవయేత్ ।
అథవా శర్కరాముగ్ధ సంయుక్తా స్సృటిమిశ్రితాః ॥
సేవయే త్సేవికా బల్యా భగ్నసంధానకారకాః ।
గుర్వ్య స్తృప్తికరా రుచ్యా గ్రాహిణ్యః పిత్తహా మతాః ॥

తా. గోధుమనూకను పాలతో మెత్తగ మర్దించి తంతువులుగాచేసి యెండించి నేతిలోవేయించి వానిని బాగుగ కాఁగిన నీళ్ళలోవేసి ప్రొయ్యిమీఁదఁబెట్టి శీఘ్రము గాదించి ఆనీళ్ళనువంచివేసి అందులో నేయి-చక్కెర గాని, చక్కెర-పాలుగానిపోసి ఏలకులపొడికలిపి భక్షించవలయు. ఇదిబలమునిచ్చు. విఱిగినదానినిసంధించును గురుత్వము చేయును. తృప్తినిచ్చును. రుచిగనుండును. మలబద్ధము చేయును. పిత్తమునుహరించును.

శష్కులి.

శ్లో. ఘృతాక్తాం సమితా మద్భి ర్మర్దయిత్వా చిరం తతః ।
మృద్వీం కృత్వా తతో నీత్వా నింబుమానం హి గోలకం ॥
వేల్య కృత్వా చ తాం తన్వీం చంద్రమండల సన్నిభాం ।
ఘృతే సంపాచయే దేషా శష్కులీ ఫేనికాగుణా ॥

తా. గోధుమపిండిలో నెయ్యిపోసి నీళ్ళతో మెత్తగ మర్దించి నిమ్మకాయంత యుండలుచేసి పలచగ చంద్రమండలములవలె ఒత్తి నేతిలో వేయించవలయు; దీనికి ఫేనికగుణము గలిగియుండును.

మాష గర్భములు.

శ్లో. నిస్తుషాం మాషజాం దాలీ మార్ద్రా మశ్మని పేషితాం ।
తాం పిష్టిం ప్రవదంతిస్మ పాకశాస్త్రవిచక్షణాః ॥
తత్పిష్ట్యా మార్ద్రకం హింగు లవణం తు విమిశ్రయేత్ ।
అథ వైలాదికం కాంతే! వేసవారం విమిశ్రయేత్ ॥
నిధాయా పుత్రకే కాంతే! తతః కుర్యా దముం విధిం ।
ఘృతాక్తాం సమితా మద్భి ర్మర్దయిత్వా ఘనం తతః ॥
కించిత్కించి జ్జలం దత్వా మర్దయిత్వా పునః పునః ।
కృత్వా మృదుతరా మతుం తతో నీత్వా ప్రకల్పయేత్ ॥
మూషికా మకుకాం తత్ర పిష్టిం పూర్య విముద్రయేత్ ।
సంవేల్య పోలికాం కృత్వా ఘృతే తాం భర్జయే చ్ఛనైః ॥



గుర్వీయం మాషగర్భాఖ్యా స్నిగ్ధా రుచ్యా బలప్రదా ।
స్వాద్వీ నేత్రహితోష్ణా చ పిత్తరక్తవిశోధనీ ॥
తైలే నేత్రాహితా పక్వా రక్తపిత్త విదూషణీ ॥

తా. మినపపప్పులో నీళ్లుపోసితడిపి పొట్టుతీసి మెత్తగరుబ్బి అందు అల్లము ఇంగువ ఉప్పు వీనిపొడినికలిపియుంచి గోధుమపిండిలో నెయ్యిపోసి నీళ్లతో మర్దించి ఉంటలుచేసి బిళ్లలుతట్టి వానిమీఁద ఆ మినపపిండి పూర్ణమునిచి ముఖములను మూసి బిళ్లగతట్టి నేతిలో వేయించవలయు. ఇది గురుత్వమును చేయును. మెఱుఁగు నిచ్చును. రుచినిపుట్టించును. బలమునిచ్చును. మధురముగనుండును. నేత్రములకు మంచిది. పిత్తమును రక్తమును శోధించును. ఉష్ణమును చేయును. దీనిని నూనెలో పక్వము చేసిన నేత్రములకు చెరుపునుచేయును. రక్తపిత్తమును పోగొట్టును.

దుగ్ధామ్రము.

శ్లో. పక్వామ్రస్య రసం ప్రస్థం శృతం దుగ్ధం చ తత్సమం ।
ప్రస్థైకా శర్కరా చాజ్యం ప్రస్థార్ధం సంవిమిశ్రయేత్ ॥
ఏలా జాతీఫలాదీనాం చూర్ణం చే ద్వా విమిశ్రయేత్ ।
త ద్దుగ్ధామ్ర మితి ఖ్యాతం స్వాదు శీతం చ పౌష్టికం ॥
గురు వర్ణకరం రుచ్యం బల్యం ధాతువివర్ధనం ।
వాతపిత్తహరం వృష్యం భుక్తం మేధ్యమదోద్ధతైః ॥

తా. మామిడిపండ్లరసము ౼౮ తులములు, కాగినపాలు ౼౮ తు, శర్కర ౼౮ తు, నేయి ౩౼౨ తు, వీనినన్నిటినికలిపి-ఏలకులు జాజికాయ మొదలగువాని పొడి కలిపి భక్షించవలయు, దీనిపేరు దుగ్ధామ్రము. ఇది మధురముగ శీతలముగ నుండును. పుష్టినిచ్చును. గురుత్వమును చేయును. కాంతిని బలమును ఇచ్చును. రుచిగ నుండును ధాతువృద్ధిచేయును. వాతపిత్తముల హరించును.

శిఖరిణి.

శ్లో. దధి ద్విప్రస్థం భో జలవిరహితం కంజవదనే !,
సితా చ ప్రస్థైకా మధు ఘృతమయే బిల్వ మబలే ! ।
పృథక్కోలం చైలా త్వచ మపి గజం పత్త్రజ ముత,
ద్వికర్షం విశ్వం వై మరిచ మపి లోలాక్షి ! చ పృథక్ ॥
—పటే సూక్ష్మే బాలా కరవిగలితం చేతి సకలం,

తదా విఖ్యాతేయం మతిమతి ! రసాలా శిఖరిణీ।
ఇయం స్నిగ్ధా వృష్యా కఫరుచికరా కాంతిజననీ,
మతా గుర్వీ బల్యా శ్రమపవనపిత్తప్రశమనీ ॥
—విశాలాస్యే ! పుష్టిం వితరతి చ శుక్రం వితనుతే ।
జనానాం శందాత్రీ సుతను!జఘనాంభోజసుభగే !
కురుశ్రీరామాయార్పణ మవనిపుత్ర్యైచ సతతం,
మనోర్థ స్తే సిద్ధో ఝడితి భవితా కుందదశనే ! ॥

తా. వడియకట్టిన తియ్యనిపెరుగు ౨ సేర్లు, చక్కెర ౧ సేరు, కొంచెము తేనె; వెన్న వీనినన్నిటినికలిపి-ఏలకులు-లవంగపట్ట - నాగకేసరాలు-జాపత్రి ఇవి దినుసుకు ౮ తులము, సొంటి ౨ తు, మిరియాలు ౨ తు, వీనిని పొడికొట్టి వస్త్రగలితము చేసి అందులోవేసి కలపవలయు. దీనిపేరు శిఖరిణి. ఇది దేహమునకు మెఱుఁగు నిచ్చును. పుష్టినిచ్చును. కఫమును రుచిని కలిగించును. కాంతిని బలమును ఇచ్చును. గురుత్వమును చేయును. శ్రమము వాతము పిత్తమువీనినిహరించును. శుక్రవృద్ధిచేయును.

మజ్జికా శిఖరిణి.

శ్లో. అయి ! దధి మస్తువిహీనం ద్విప్రస్థం వై ప్రస్థికా చ సితా ।
సర్పిఃపలం మధుపలం పలం చార్ద్రికం మరిచం చార్థపలం ॥
త్వక్పత్రం గజ మేలా పృథగ్ద్విక్షికం కృత్వా చైకధ్యం ।
చంద్రవాసితే భాండే ప్రియే ! మార్తికే తరుణీ నిర్మయేత్ ॥
సా మజ్జికా శిఖరిణీ బాలే ! బల్యా రుచిప్రదా వృష్యా ।
కాంతికారిణీ స్నిగ్ధా శుక్రవృష్టిదా గుర్వీ శ్లేష్మకరీ ॥
ప్రతిశ్యాయవాతాత్రిశ్రమపిత్తఘ్నీ నితంబభారభరే ! ।

తా. నీరువడియగట్టిన పెరుగు ౬౪ తులములు, శర్కర ౬౪ తు, నెయ్యి-తేనె-అల్లపురసము ఇవి దినుసుకు ౪ తు, మిరియాలు ౨ తు, లవంగపట్ట - జాపత్రి-నాగకేసరములు-ఏలకులు ఇవి దినుసుకు ౧ తు వీనినన్నిటిని కర్పూరవాసితమగు భాండమునందువేసి కలపవలయు; దీనిపేరు మంజికాశిఖరిణి. ఇది బలమునురుచినిఇచ్చును. శుక్రవృద్ధిని చేయును. కాంతిని పుష్టిని ఇచ్చును. గురుత్వమును కఫమునుచేయును. పీనస వాతము శ్రమము పిత్తము వీనిని పోఁగొట్టును.

మండక కృతిగుణములు.

శ్లో. సమితా మంబునా మర్ద్య ఘనాం కృత్వా తిలోమలాం ।
తల్లోమ్నాం రచయిత్వా తు హస్తాభ్యాం పరివర్ధయేత్ ॥



సంతప్తే ఖర్పరే చుల్ల్యాం మృణ్మయేఽధోముఖే తతః ।
సంక్షిపే దరవిందాక్షి ! పాచయేచ్ఛ శనైశ్శనైః ॥
మండక స్స హి విజ్ఞేయో దుగ్ధఖండేన భక్షయేత్ ।
దుగ్ధాజ్య శర్కరాభి ర్వా కిం వా మాంసరసేన హి ॥
వా తక్రవటకై స్తైశ్చనం మధురోఽయం త్రిదోషనుత్ ।
రుచ్యో గ్రాహీ లఘుః పాకే బృంహణో బలపుష్టిదః॥

తా. గోధుమపూకను నీళ్ళతో మెత్తగ మర్దించి కొంచెము కొంచెము తీసికొని ఉంటలుచేసి బిళ్ళలుతట్టి చేతులతో పలచగ పెద్దదిగ పెంచవలయు. తరువాత ప్రొయ్యిమీఁద కుండను బోర్లగిలపెట్టి దానిమీఁద పైఁజెప్పిన బిళ్ళలను వేయవలయు; అవికాలినతరువాత పాలు చక్కెర నేతులతోఁగాని, మాంసరసముతోఁగాని, మజ్జిగతోఁగాని భక్షించవలయు. ఇది మధురముగనుండును. త్రిదోషముల హరించు. రుచినిపుట్టించును. మలబద్ధముచేయును. పాకమునందు లఘువుగనుండును. బలమును పుష్టినిచ్చును.

మినపవడలు.

౧ సేరు మినపపప్పును నీళ్ళలో నాననిచ్చి ౨ తులముల ఉప్పువేసి రుబ్బి ౨ తులముల అల్లము, ౬ తులములు పచ్చిమిరపకాయలు, కొత్తిమిరి ౨ తులములు, చరకఎత్తు ఇంగువ వీనిని కలియనూరి ఆ రసమును, ౧౨ తులములు వెన్నను ఆపిండిలో కలిపి ఇష్టము వచ్చినంత పిండినితీసికొని వడలుగాతట్టి మధ్యను రంధ్రము చేసి చమురులోవేసి పక్వము చేయవలయు; ఇది విరేచనమును చేయించును. బలము నిచ్చును.

మఱియొకవిధము.

౮ సేరు మినపపప్పును నానబెట్టి, ౧ తులము ఉప్పువేసి రుబ్బి, ౧౮ తులము మిరియాలు, ౮ తులము జీలకఱ్ఱ, తుఱిమిన అల్లము ౧ తులము, గడ్డపెరుగు ౬ తులములు, వెన్న ౬ తులములు, తరిగిన పచ్చిమిరపకాయలు ౨ తు, వీనిని ఆపిండిలోకలిపి పాతికసేరు బియ్యమును నానబెట్టి మెత్తగా పలచగా రుబ్బి, మినపపిండిని వడలుగ తట్టి, ఆబియ్యపుపిండిలోముంచి చమురులోవేసి పక్వము చేయవలయు; ఇది గురుత్వమును చేయును. రుచిగ నుండును.

బియ్యపుపిండివడలు.

౧ సేరు నీళ్లు కాఁగఁబెట్టి అందు ఉప్పు ౨తులములు, మిరియాలు ౧తు, జీలకఱ్ఱ ౮ తు, తుఱిమినకొబ్బరి ౨౪ తు, వీనినివేసి, ౧ సేరు బియ్యపుపిండి కలిపి దించుకొని ఒకపాత్రమునందుంచి వడలుగతట్టి చమురులో పక్వము చేయవలయు.

## నేతివడలు.

౪సేరు మినపపప్పును నాననిచ్చి పొట్టుతీసి మెత్తగరుబ్బి రాత్రిఅంత ఊరనిచ్చి మరునాడు, ఒకపాత్రములో౨౫తులములు చక్కెరపోసి అందు ౧౨తులములుపాలు కలిపి పాకముపట్టిదించుకొని, పాతికసేరు బియ్యపుపిండి, ౮తులములువెన్న వీనినిమిన పపిండిలోకలిపి పలచగవడలుతట్టి నేతిలో పక్వముచేసి చక్కెరపాకములో వేసి, ౬ తులములు కలకండ, ౨ తులములు ఏలకులు వీనిపొడిని ఆవడలమీద చల్లవలయు.

## గోధుమవడలు.

౪సేరు సెనగపప్పు, ౪సేరు పెసరపప్పు, వీనిని ౧౨తులములు నేతిలోవేయించి తరువాత నీళ్ళలో నాననిచ్చి, ఎడియవేసి-అల్లము ౮ తు, పచ్చిమిరపకాయలు ౬తు, కొత్తిమిరి ౬ తు, ఇంగువ పరక తు, వీనిని ఆపప్పులోవేసిరుబ్బి, ౮ నిమ్మపండ్లరసము నుపిండి, ౨౮ తులముల గోధుమపిండిని నీళ్లలోకలిపి ముద్దచేసి కొంచెము మంచినూనె పోసి చక్కఁగా కలిపి కొంచెమునేపునిచి తరువాత నెల్లికాయంత గోధుమపిండిని అప్పడమువలెతట్టి, అందు సెనగపిండి పూర్ణమును మధ్యనునిచి మూసి వడలుగాతట్టి చమురులో పక్వము చేయవలయు.

## పెరుఁగువడలు.

౧౨ పలములు వడియగట్టిన పెరుగునందు గోధుమరవ ౬ పలములు. ౪ పలము ఉప్పు, కొత్తిమిరి ౨ తు, తుఱిమిన పచ్చిమిరపకాయలు ౮ తు, అల్లము ౪ తు, వీనిని వేసి బాగుగ కలిపి వడలుగాతట్టి నేతిలో పక్వము చేయవలయు.

## ఆంవడలు.

కందిపప్పు అరసేరు, మినపపప్పు అరసేరు, సెనగపప్పు అరసేరు వీనిని నాన పోసి వడియగట్టి అందు ఉప్పు ౨ తు, పచ్చిమిరపకాయలు ౬తులములు వీనినిచేర్చి రుబ్బి, మిరియాలు ౧తు, జీలకఱ్ఱ ౧తు, పసుపుపొడి । తు, వీనినిపిండిలోకలిపి వడలు తట్టి నూనెలో పక్వముచేసి పుల్లనిపెరుఁగుపులుసులో వేయవలయు. ఇది అజీర్ణమును విరేచనమును చేయును.— మఱియొక విధము.— కందిపప్పు । సేరు, మినపపప్పు । సేరు, సెనగపప్పు ౪ సేరు, ఉప్పు ౨ తు, పచ్చిమిరపకాయలు ౨ పలములు, మిరపకాయలు ౧ తు, తురిమినకొబ్బరి ౬తు, ఇంగువ పరక తు, పసుపుపొడి ౪ తు, వీనినిచేర్చి రుబ్బి పైప్రకారము చేయవలయు.

## మొక్కజొన్నఆంవడలు.

మొక్కజొన్నగింజలు ౧ సేరు, సెనగపప్పు ౪ సేరు ఇవినాననిచ్చి, వడియగట్టి ఉప్పు ౫ తు, ముంతమామిడిపప్పు ౮ పలములు, పచ్చిమిరపకాయలు ౬ తు, కొత్తి



మిరి ౮ తు, అల్లము ౧ తు, తుఱిమిన కొబ్బరి ౭ పలములు, ఇంగువ—తు, మూడు నిమ్మపండ్లరసము, వీనిని కలిపి రుబ్బి పైరీతిగా చేయవలయు.

## ముంతమామిడిపప్పు ఆంవడలు.

౧ సేరుపాలలో ఒలిచిన ముంతమామిడిపప్పు ౨ సేర్లు నానవేసి రుబ్బి వడలు తట్టి నేతిలో వేయించి ఏలకులపొడి చక్కెర కలిపి వడలమీద చల్లవలయు; ఇవిబలము నిచ్చును రుచిగనుండును.

## మణుగుఁబువ్వులు

౪ సేరు, పెసరపప్పు నాననిచ్చి వడియగట్టి కొంచెము కొంచెముగా వేయించు కొని, తరువాత ౪ సేరు సెనగపప్పును వేయించి, ౧౪సేరు బియ్యమును నానబెట్టి వడి యగట్టి కొంచెము వెచ్చయగునట్లు వేయించి పైపప్పులతోకలిపి విసిరిన మణుఁగుబూల పిండియగును; ఈపిండి ౧సేరు, ఉప్పు ౨తులములు, పొట్టుతీసిన నువ్వులు ౬పలములు వెన్న ౧ పలము వీనినికలిపి నీళ్ళతో కొంచెము ద్రవముగనుండునటుల ముద్దచేసి యా పిండిని మణుఁగుఁబువ్వులు పిండెడి యినుపగొట్టములోవేసి జల్లిగరిటెమీఁద రెండు మూడుత్రిప్పులుగాపిండి, క్రాఁగుచున్న నేతిలో వేయవలయు.

## మఱియొకవిధము.

౨సేర్లనీళ్లు పాత్రములోపోసి ప్రొయ్యిమీఁద మఱిగించి, ౪ సేరు పెసరప ప్పును, ఆనీళ్ళలోఁబోసి ముద్దగానుడికించి, నానబెట్టి వేయించిన బియ్యపుపిండి అర సేరు ఆపప్పులోవేసి, ఉప్పు ౧౪ తులము, పొట్టుతీసిన నువ్వులు ౮ పలములు వీనిని ఆపిండిలో గలిపి పైప్రకారము చేయవలయు.

## తేంగోళీలు.

౧ సేరు మినపపప్పును. ౧౪ సేరు బియ్యమును ప్రత్యేకముగ నానబోసి సగము నానిన తరువాత ఎండపెట్టి వేయించి రెంటినికలిపి విసరిన తేంగోళీల పిండియగును. ఈపిండి ౧ సేరు, ఉప్పు ౨తు, జీలకఱ్ఱ ౧ తు, వీనినివేసి, తగుపాటి నీళ్లు పోసికలిపి ముద్దచేసి తేంగోళీల పీటలోవేసి నూనెలో పిండవలయు; దీనిలో ౨పలములవెన్నను కూడ చేర్చవచ్చును.

## మఱియొకవిధము.

౪ సేరు మినపప్పప్పును, ఒకరాత్రి నీళ్ళలో నానబెట్టి రుబ్బి అందు ౧౬ తుల ములు బియ్యపుపిండి, ౨ తులములు ఉప్పు వీనినికలిపి యుంచికొని పచ్చిమిరపకా యలు ౨ పలములు, కొతిమిరి ౨ తు, అల్లము ౧ తు నాలుగు మినపగింజలంత యిం గువ వీనిని కలియనూరి వస్త్రమునందుంచి మూటగట్టి రసమును పైపిండియందుపిండి,

౬ తులములవెన్నగలిపి ముద్దచేసి ఆముద్దను ఒంటి రంధ్రముగం తేంగోళీల పీటలో నుంచి కాఁగుచున్న నూనెలో పిండవలయును.

### మఱియొకవిధము.

౪సేరు బియ్యము, ౧ సేరు మినపప్పు వీనిని ప్రత్యేకముగ నొకరాత్రి నీళ్ళలో నానబెట్టి రుబ్బి దానిలో ౨ తులములఉప్పు, వెన్న ౮ పలములువేసి పైప్రకారము చేయవలయు.

### కారాబూంది.

సెనగపప్పు ౬ పలములు, పెసరపప్పు ౮ పలములు, మినపప్పు ౨ పలములు వీనిని నానబోసి వడియగట్టి, ౨ తులములు ఉప్పువేసి మెత్తగ రుబ్బి, మిరపకాయలు ౪ తు, పచ్చిమిరపకాయలు ౮ తు, కొత్తిమెర ౨ తు వీనిని మెత్తగ నూరి పిండిలో కలిపి ఆపిండిని పూసలడ్డుకువలె తగిననీళ్ళుపోసి పలచనచేసి జల్లిగరిటెనుబాణలిమీఁద నునిచి దానియందు పిండిపోసి తట్టిన-నేతిలో పూసలుగా పడును; వానిని జల్లిగరిటెతో తీసికొని మఱియొకపాత్రమునం దుంచుకొనవలయు.

### సుఖియలు.

పెసరపప్పు అరసేరు, గోధుమరవ పాతికసేరు వీనినిప్రత్యేకము వేయించి ఒకటిన్నరసేరు నీళ్లు పొయిమీఁద కాఁగనిచ్చి అందు పప్పును రవను వేసి యుడికించి-తరువాత ముద్దచేసికొని-తుఱిమినకొబ్బరి ౨పలములు, చక్కెర౨౦పలములు, ఏలకపొడి అరతు, వీనిని ఆముద్దలో కలిపి బియ్యపుపూఁతపిండిలో ముంచి నేతినవేయించవలయు.— మఱియొక విధము— ౧ సేరు సెనగపప్పును నీళ్లలోపోసి యుడికించి నీరును వంచివేసి ౧ వీసెగాని ౧౹వీసెగాని బెల్లమును, చక్కెర అయినయెడల ౧౪ వీసెను కలిపి, రుబ్బి ఏలకపొడి ౧ తులము కలిపి గోధుమపూఁతపిండిలో పైపూర్ణమును నిమ్మకాయలంత యెత్తుకొని ముంచి నేతినవండవలయు. — టెంకాయసుఖియలు— ౧౬ పలములు తుఱిమిన కొబ్బరి, బెల్లము ౧౨ పలములు, చక్కెర అయినయెడల ౧౬పలములు వీనినికలిపి ముద్దయగునట్లువేయించి ఏలకపొడి ౧ తులముకలిపి ముద్దలుచేసి బియ్యపుపిండిలో ముంచి నేతిలోవేయించవలయు.

### ధవళ్యాలడ్డు.

అరసేరు గోధుమరవలో-నేయి ౮తు- పాలు ౮తు- కలిపి బాణలిలో ౧తులము నేయిపోసి కాఁచి దానిలో రవనువేయించి యెత్తుకొనవలయు. ఈప్రకారము గోధుమపిండిలో నేయి పాలు పోసికలిపి వేయించి- ౧౩ పలములు నేతిని వెడల్పాటి పళ్లెములో పోసి ౩౨ పలముల చక్కెరను ఆనేతిలో పోసి బాగుగ మర్దించి అది



ఏకీభవించి చిక్కనైన పిదప బాదముపప్పు ౨౦ తు- ఏలకులపొడి ౧ తు - కలకండ ౨౦తు- దానియందు వేసి వేయించియున్న రవను పిండినికలిపి ఉండలుచేయవలయు.

### ఇడ్డెన.

౧ సేరు బియ్యమును నానబెట్టి కొట్టినపిండిలో అరసేరు మినపప్పును నానబోసి రుబ్బి కలిపి ఆముద్దను ౮ సేర్లు నీళ్ళుపట్టఁదగిన పాత్రమునందునిచి మూఁతపెట్టి మూడుదినములు తాళిచూచిన పులిసి పొంగివచ్చును; దానియందు సెనగపప్పు ౮ పలములు ఉప్పు ౧ పలము, తఱిగిన పచ్చిమిరపకాయలు ౨ పలములు, కొత్తిమిరి ౧ ప- వీనిని కలిపి-పరకతులము ఇంగువను కొంచెము నీళ్ళలో నానబెట్టి దానిని ఆపిండిలో గలిపి ఇడ్డెనవండెడిపాత్రములో సగముభాగము నీళ్ళుపోసి మూఁతపెట్టి పొయిమీఁద బెట్టి నీళ్లు మసలిన పిమ్మట అరటాకుకు నూనెరాచి మొదటి అంతస్తునందలి సిబ్బియందునిచి దానికి తగిన యిడ్డెనపిండిని గుండ్రముగాతట్టి ఆకుపైనునిచి యిట్లు రెండవ అంతస్తుయందును పిండినునిచి మూఁతపెట్టవలయు. పిదప కొంతసేపటికి మూఁతసందునుండి ఆవిరిబొట్లుపడిన పక్వమైనదని తెలిసికొని మూఁతతీసి దానిపైన చన్నీళ్లను చిలకరించి దించుకొనవలయు.

### దోసెలు.

౧సేరు బియ్యమును అరసేరు మినపపప్పును వేరుగ నానబోసి కలిపి మెత్తగ రుబ్బి ౩ తు-ఉప్పుకలిపి ౧ దినము ఊరనిచ్చి అరసేరు నీళ్ళుపోసికలిపి పొయ్యిమీఁద ఇనుపపెనముపెట్టి కాలనిచ్చి గుడ్డకు నేయిగాని నూనెగాని రాచి పెనము తుడిచి తగుపాటి పిండినిపోసి నెరపవలయు; కొంచెముకాలినపిదప త్రిప్పివేయవలయు.

### పెసరదోసెలు.

అరసేరు పెసరపప్పును నానబెట్టి ఒకటిన్నరతులంఉప్పు, అరతు-పసుపుపొడి వేసి మెత్తగరుబ్బి-మిరియాలు ౧తు, జీలకఱ్ఱ అరతు, తఱిగిన పచ్చిమిరపకాయలు ౮ తు, కొత్తిమిరి ౨తు, తుఱిమిన అల్లము అరతు, వీనినికలిపి,—తు-ఇంగువను నీళ్లలో నానబెట్టికలిపి, అరసేరునీళ్ళుపోసి కలియబెట్టి మునుపటివలె దోసెలుపోయవలయు.

### రొట్టెలు.

గోధుమరవ ౨౦ తు, వెన్న ౬తు, పాలుమీఁగడ ౬తు, వీనిలో తగినపాలు పోసి కలిపి కొంతసేపు నాననిచ్చి ఱాతిమీఁదఁబెట్టి కొంతపిండి తీసికొని చీఁపురుపుడకమందముగలుగునట్లు రొట్టెలుచేసి, యొత్తిని నిప్పులమీఁదగాని పొయ్యిమీఁదఁగాని పెట్టికాల్చవలెను. మఱియొకవిధము—గోధుమరవ ౧౫పలములు, పాలు ౧౬తు వెన్న ౮ పలములు, పాలుమీఁగడ ౮తు, ఉప్పు అరతులము ఇవి యొకటిగా కలిపి

రెండుగడియలు తాళి మర్దించి రొట్టెలుతట్టి పెనముమీఁద కాల్చి తరువాత ఎఱ్ఱనిప్పుల మీఁద వేయవలయు — మఱియొకవిధము — బియ్యపుపిండి ౧౬ తు, గోధుమపిండి ౪ తు, ఉప్పు అరతు, నీళ్ళు ౨ తు, వీనిని కలిపి ముద్దచేసి పైప్రకారము చేయవలయు — ఇంకొకవిధము — గోధుమపిండి ౨ పలములు, బియ్యపుపిండి ౪ ప, ఉప్పు అరతు, నీళ్ళు ౬ పలములు వీనినికలిపి లావుగ బిళ్ళలుతట్టి పైప్రకారము చేయవలయు.

అన్నముచేయురీతి.

శ్లో. తండులాన్ నిర్మలాం చ్ఛుద్ధాం స్త్రీధా ధౌతాన్ వరాంగనే ! ।
నీరే పంచగుణే క్షిప్త్వా వసునిఘ్నే తు వా ప్రియే ! ॥
ద్విగుణే త్వథవా కాంతే ! చతుర్దశగుణేపి వా ।
పచేదర్ధశృతే మందం స్రావయే దతియుక్తితః ॥
షోడశాంశం ఘృతం తస్మిన్ సంక్షిప్య ఛాదయే త్తతః ।
నిర్ధూమాంగారకే న్యస్య క్షణా దుత్తారయే ద్ద్రుతం ॥
న స్యా ద్యదా షోడశాంశం యథాలాభం ఘృతం క్షిపేత్ ।
నీరసంస్కారభేదేన యథోత్తరగుణాధికః ॥

తా. బియ్యమును మూడుసారులు చక్కగకడిగి వడియవేసి ౧ సేరు బియ్యమునకు, ౩-౫-౭-౧౦-౧౪ బంతులు నీళ్ళుపోసి వెసరుపెట్టి నీళ్ళుతెర్లినపిదప అందుబియ్యమునువేసి ముప్పాతికపాలు ఉడికినతరువాత గంజినివార్చి ౧పలము నేయిపోసి దించి నిప్పుమీఁదపెట్టి యెత్తవలయు. నీళ్ళుఎంతఅధికముగావెసరుపెట్టిన అంతగుణమిచ్చును.

అత్తెసరన్నము.

శ్లో. చే దస్రావితభక్తం కుర్యా ద్బాలే ! విధి స్తదా యం స్యాత్ ।
యది తండులా హి సూక్ష్మాః కేవిపచే ద్ద్వౌ తు సార్ధకే భాగే ॥
స్థూలా శ్చే ద్ద్విగుణే కే స్థూలతరా శ్చే త్సార్ధద్విభాగికే ।
సపాదకే కే సాధ్యా సూక్ష్మతరా వై సుతండులా లలనే ! ॥
అయ మస్రావితభక్తో గురు శ్చ శీతో రుచిప్రదో వృష్యః ।
శుక్రవర్ధనో మధురో వాతకఫఘ్నో గ్రాహీ తృప్తికరః ॥
క్షయరోగఘ్న శ్చాపి ప్రఫుల్లపద్మాననే! వరారోహే ! ॥

తా. బియ్యమును మూడుసార్లుకడిగి సన్నబియ్యమైనయెడల బియ్యమునకు ఒకటిన్నర బంతునీళ్లు, లావుబియ్యమైనయెడల ౨ బంతులు, మిక్కిలిలావైనయెడల రెండున్నర బంతు, మిక్కిలి సన్నమైనయెడల ౧। బంతు నీళ్ళుపోసి ప్రొయ్యిమీఁదఁ



బెట్టి యుడికినతరువాతదించి నిప్పులమీఁద నుంచవలయు. అత్తెసరు అన్నము గురుత్వమును చేయును. శీతలముగనుండును. రుచిని పుట్టించును. పుష్టి నిచ్చును. శుక్రవృద్ధి చేయును. మధురముగనుండును. వాతము- కఫము- క్షయము వీనిని పోఁగొట్టును. మలబద్ధమును చేయును. తృప్తి నిచ్చును.

ఉప్పుడుబియ్యపన్నము.

శ్లో. జీవనే ఽగ్ధశృతాన్ శాలీన్ భర్జయే చ్ఛోషయే త్తతః ।
ఖండయే త్తండులా నేనాం స్త్రీధా ధౌతాన్ విపాచయేత్ ॥
తద్భక్తో దీపనః పథ్య స్తృప్తికృ న్మూత్రల స్స్మృతః ।
లఘు స్స్వచ్ఛ శ్చ రుచ్యోఽయం వాతశ్లేష్మ మయాపహః ॥
ఉష్ణవీర్య శ్చ సంప్రోక్త స్తతః పిత్తామయే ఽహితః ।
దద్యా ద్దోషబలం దృష్ట్వా భోజనాయ విచక్షణః ॥

తా. మొదట వడ్లను నీళ్లలో సగముడకబెట్టి తరువాత ఎండపెట్టి బియ్యముదంచి మూడుమార్లుకడిగి పైఁజెప్పినప్రకారము వండవలయు. ఉప్పుడు బియ్యపు అన్నము. అగ్నిదీపనకారిగను, పథ్యకారిగనునుండును. తృప్తి నిచ్చును, మూత్రవృద్ధిచేయును. చులకననిచ్చును. స్వచ్ఛముగను, రుచిగను నుండును. వాతకఫ రోగములఁబోగొట్టును. ఉష్ణవీర్యముగలిగియుండును. పిత్తరోగమునం దపథ్యకరముగనుండును. దీనిని వాతాదిదోషబలమునుచూచి భుజించుచుండవలయు.

సొజ్జి అన్నము.

శ్లో. భర్జితతండులభక్త స్సుగంధి రుష్ణో లఘు స్తథా రుచ్యః ।
ఆస్థాపనే చ వమనే విరేచనే చ ప్రశస్త ఉక్తోఽయం ॥
గుల్మామయఘ్న శ్చ హితః కఫ మరుచించైవ నాశయే దబలే!॥

తా. ౧సేరు బియ్యమును కొంచెముకొంచెముగా బాణలిలోవేసి వేయించి ౩౪ సేరు నీళ్ళు వెసరుపెట్టి పొంగువచ్చినపిదప, బియ్యమునువేసి ముప్పాతికపాలు ఉడికినతరువాత వార్చి నిప్పుమీఁద నుంచవలయు. ఇది మంచివాసన గలిగియుండును. ఉష్ణముచేయును. లఘువుగ రుచిగనుండును. ఆస్థాపనవస్తికర్మము, వమనము, విరేచనము వీనియందు పథ్యకారిగనుండును. గుల్మము, కఫము, అరుచి వీనిని పోఁగొట్టును.

పొంగలి.

శ్లో. ద్విప్రస్థం తండులం ముద్గం ప్రస్థైకం సంవిపాచయేత్ ।
కర్షైకం మారిచం చూర్ణం తిలచూర్ణం పలం క్షిపేత్ ॥

పుష్ప్యైకం లవణం కాంతే ! పచ త్యస్మిన్ విమిశ్రయేత్ ।
ఇదం వై కృసరాన్నం స్యా ద్బలవీర్యవివర్ధనం ॥
పిత్తశ్లేష్మకరం చైవ గురు విష్టంభి దుర్జరం ।
పుష్టికృ చ్చ వరారోహే ! మలమూత్ర వివర్ధనం ॥

తా. బియ్యము ౨ సేర్లు, పెసలపప్పు ౧ సేరు - వీనినికలిపి వండవలయును; ఉడుకునప్పుడు - మిరియాలపొడి ౧ పలము, నువ్వులపొడి ౧ పలము, ౧ పిడికిలి ఉప్పు వీనిని వేయవలయును; దీనిపేరు పొంగలి. ఇది బలమును ధాతువృద్ధిని పుష్టిని ఇచ్చును. పిత్తకఫములను గురుత్వమును మలబద్ధమునుచేయును. మలమూత్రముల వృద్ధిచేయును.

కృసర.

శ్లో. తిలాః ప్రస్థమితా బాలే ! తత్తుల్యా స్తండులాః ప్రియే! ।
కుడవైకం ఘృతం చామ్రం సైంధవం పాచయే దియం ॥
కృసరేతి సమాఖ్యాతా దీపనీ పాచనీ మతా ।
బలవీర్యప్రదా శ్లేష్మశ్వాసకాసప్రవర్ధినీ ॥
నాతిమూత్రకరా ప్రోక్తా వాతఘ్నీ పిత్తకోపినీ ॥

తా. నువ్వులు ౧ సేరు, బియ్యము ౧ సేరు, నేయి ౪ సేరు, ఉప్పు ౮ తులములు, వీనినికలిపి వండవలయును; దీనిపేరు-కృసరాన్నము; ఇది-అగ్నిదీపనమును పాచనమును చేయును. బలమును వీర్యమును ఇచ్చును. కఫము, శ్వాసము, దగ్గు వీనినివృద్ధిచేయును. మూత్రమును తక్కువ చేయును. వాతమును హరించును. పిత్తమును ప్రకోపింపఁ జేయును.

మఱియొకవిధము.

శ్లో. తండులానాం చ ప్రస్థైకం ముద్గసూపం చ తత్సమం ।
పాచయే ల్లవణస్యా ప్య మార్ద్రికస్య పలం క్షిపేత్ ॥
శరావైకం ఘృతం చైషా కృసరా హరివల్లభా ।
అర్పయే ద్ధరయే తస్మా ద్ధనుర్మాసే విశేషతః ॥
బలవీర్యప్రదా గుర్వీ కఫపిత్తవివర్ధినీ ।
దుర్జరా పుష్టివిష్టంభమలమూత్రకరీ మతా ॥

తా. బియ్యము ౧ సేరు, పెసలపప్పు ౧ సేరు, ఉప్పు ౧ పలము అల్లము ౧ పలము, ౪ సేరునెయ్యి, వీనిని కలిపి వండవలయును. ఇది శ్రీమహావిష్ణువునకు ప్రీతికరము;



ఇది బలమును వీర్యమును ఇచ్చును. గురుత్వమునుచేయును. కఫపిత్తముల వృద్ధినొందించును. పుష్టినిచ్చును. మలబద్ధమును, మలమూత్రవృద్ధిని చేయును.

మఱియొక విధము.

బియ్యము ౧ సేరు, వేయించినపెసరపప్పు ౪ సేరు వీనినికలిపి కడిగి వడియగట్టి పసుపుపొడి ౧ తు, వెన్న ౨౮-ఆబియ్యములోవేసికలిపి, ౨౪సేరు నీళ్లువెసరుపెట్టి తెర్లినతోడనే బియ్యమునువేసి ముప్పాతికపాలు ఉడికినతరువాత మిరియాలు ౧ తు, జీలకఱ్ఱ ౧తు, తుఱిమిన అల్లము ౧౪ తు, ఉప్పు ౨తు, వీనిని వేసి నేయి ౼ పలములు పోసి దించి రొట్టెనిప్పులమీఁదనుంచి, ౧ తులము ఇంగువను ౧ తులము నీళ్ళలో నానవేసి దానిని ఆపులగమునందు పోయవలయును. తుఱిమిన కొబ్బరి ౼ పలములువేసి కలియబెట్టవలయును.

చక్కెర పొంగలి.

సన్నబియ్యము ౧ సేరు, వేయించిన పెసరపప్పు ౹ సేరు, వీనిని కలిపి కడిగి వడియవేసి, పరకతు-కుంకుమపువ్వును ౧ పలము నీళ్ళలో నాననిచ్చి నూరి బియ్యములో కలిపి ౨ సేర్లు మంచినీళ్లవెసరులో ఆ పప్పు బియ్యమునునిచి ముప్పాతికపాలు ఉడకగానే, వెన్న ౼ తు, కలకండపొడి ౬౦ తు, నేయి ౧౬ పలములు, బాదముపప్పు ౬ తు, వీనిని దానియందువేసి, ౫తులములు ద్రాక్షపండును నేతిలోవేయించి దీనిని, ౨ తులములు తుఱిమిన అల్లమును, ఏలకులు ౧ తు - లవంగములు ౧తు-వీనిని ఆపొంగలిలోవేసి కలియబెట్టిదించి నిప్పులమీఁద కొంతసేపునిచి - ౹ తులము పచ్చకర్పూరపొడిని వేయవలయును.

పులియోరెము.

౧సేరు సన్నబియ్యమును చక్కగా అన్నముచేసి - నిర్మలమగు రాతిమీఁద పరచి - నూనె ౮ పలములుకలిపి - ౧సేరు మంచినీళ్లలో ౼ పలములు చింతపండు పిసికి గింజలు ఈనెలుతీసివేసి దానియందు ౨ పలములు ఉప్పువేసి మఱియొక పాత్రమునందు ౼ పలముల నూనెపోసికాఁచి - తొడిమెలు తీసిన మిరపకాయలు ౯ తు-ఆనూనెలో వేసి సగమువేగినతరువాత - ఆవాలు ౧ తులమువేసి అవి సగము వేగినపిదప - మెంతులు ౪ తులమువేసికలిపి ఇంగువ పరక తు, పసుపుపొడి ౪తు, కరివేపాకు ౨తుల- వీనిని ఆనూనెలోవేసి బాగుగ కలియబెట్టి దానియందు పులుసునుపోసి మాడకుండ కలియబెట్టి కాఁగినతరువాత దానిని అన్నములోపోసి కలిపి ఒక పాత్రమునం దుంచవలయును.

## పరమాన్నము.

శ్లో. తండులా త్త్రిగుణం దుగ్ధం తదర్ధం జీవనం ప్రియే! ।
తదర్ధం తు గుడం కాంతే! పాచితం పరమాన్నకం ॥
పరమాన్నం బలం వృష్యం వాతపిత్తప్రణాశనం ।
కఫప్రకోపనం బాలే! తృప్తికృచ్చ ప్రకీర్తితం ॥

తా. బియ్యమునకు మూడుపాళ్ళు పాలు, ౧౪ పాలు నీళ్లు, ౪౪ పాలు బెల్లము ఈ మూటిని కలిపి వండిన పరమాన్న మనఁబడును. ఇది బలమును పుష్టి నిచ్చును. కఫమును ప్రకోపింపఁజేయును. తృప్తినిచ్చును.

## హారిద్రాన్నము.

శ్లో. ఆఢకం మథితం గవ్యం తండులానాం చ ప్రస్థకం ।
కర్షైకం మారిచం చూర్ణం కోలైకం జీరకం ప్రియే ॥
నిశా టంకమితా సర్వం కృత్వైకథ్యం విపాచయేత్ ।
పల మేకం పటు క్షిప్త్వా హారిద్రాన్న మితీరితం ॥
పాచనం హి హారిద్రాన్నం దీపనం రుచికారకం ।
వాతపిత్తకఫాతంకనాశనం పరికీర్తితం ॥

తా. నీళ్లుకలియని ఆవుమజ్జిగ నాలుగుపాళ్లు, బియ్యము ౧ పాలు, మిరియాల పొడి ౧ పలము, జీలకఱ్ఱ వరకపలము, పసుపు ౨ం వెండిమినుములయెత్తు, ఉప్పు ౧ పలము వీనిని ఒకటిగకలిపి వండిన హారిద్రాన్నమనఁబడును. ఇది శీఘ్రముగ జీర్ణమగును. ఆఁకలిని రుచిని పుట్టించును. వాత పిత్తకఫరోగములఁ బోఁగొట్టును.

## నిమ్మపండ్లరసపు చిత్రాన్నము.

౧సేరు-సన్నబియ్యమును-అన్నము చేసికొని ఆరపెట్టి - ఒకపాత్రమునందుఉప్పు ౩ తు-నిమ్మపండ్లరసము ౭ తు-పసుపుపొడి ౪ తు-వీనినిచేర్చి ఆయన్నమునందు కలపవలయు, నేయి ౧సేరు ఒకపాత్రమునందు కాఁగఁబెట్టి - మిరపకాయలు ౨౪ తు- ఆవాలు ౧ తు-వీనిని అందులోవేసి అర్ధభాగము వేగినపిమ్మట - మినపపప్పు ౧ తు- సెనగపప్పు ౨ తు-పచ్చిమిరపకాయతునకలు ౨౪ తు, కరివేపాకు ౧ తు-వీనిని వేసి తిరుగబోతపెట్టి కలియపెట్టి అందులో ఆయన్నము వేసికలిపి రొట్టెనిప్పులమీఁదఁ గొంతసేపునిచి దించుకొనవలయు. దీనియందు నిమ్మపండ్లరసమునకు బదులుగా, ౩తులము లుదబ్బకాయరసమును చేర్చిన దబ్బకాయరసపు చిత్రాన్నమగును. దానిమ్మపండ్లరసము



౧౨ తులములు వేసిచేసిన దానిమ్మపండ్లరసపు చిత్రాన్నమగును. మామిడికాయలరసము ౫తులములు వేసిచేసిన మామిడికాయరసపు చిత్రాన్నమగును.

## దధ్యోదనము.

౧సేరు సన్నబియ్యమును అన్నము చేసికొని-పాలు ౧ సేరు, పుల్ల పెరుగు ౧ సేరు వెన్న ౭తు, ఉప్పు ౨తు-వీనిని అన్నములోకలిపి ౬తులముల నేతిలో మిరపకాయలు ౪ తు, ఆవాలు ౪ తు, మినపపప్పు ౧ తు, సెనగపప్పు ౪ తు, కరివేపాకు ౪ తు- వీనిని క్రమప్రకారము తిరుగబోతవేసి దానిని. కలిపియున్న అన్నమునందు జేర్చి మిరియాలపొడి ౪ తు, కొరినఅల్లము ౧తు, ఇంగువనీళ్లు వరక తు, వీనిని కలపవలయు.

## బకాళాభాత్.

౧ సేరు సన్నబియ్యపు అన్నమును చేతితో మెత్తగపిసికి ఒకపాత్రయందుంచి దానియందు మీఁగడ పెరుగు ౧సేరు, సగముగా దిగఁగాఁచినపాలు ౨సేర్లు, వెన్న ౭ పలములు, ఉప్పు-౨తు, వీనిని ఆయన్నమునందువేసి మెత్తఁగాకలిపియుంచి ౧౨తులములనేతిలో మిరపకాయతునకలు ౧తు, ఆవాలు ౪తు, మినపపప్పు ౪తు, సెనగపప్పు ౧ తు, పచ్చిమిరపకాయలు ౨ తు, కరివేపాకు ౪ తు, వీనినిక్రమప్రకారమువేయించి ఆయన్నమునందుకలిపి, ఏలకపొడి ౧ తు, చేర్చి మూసియుంచవలయు.

## తాపహారి.

శ్లో. ఘృతం భాండే నిశాయుక్తం క్షిప్త్వా చుల్ల్యాం ప్రతాపయేత్ ।
తస్మిన్మాషవటీః క్షిప్త్వా భర్జయే దతియత్నతః ॥
సుధౌతాం స్తండులాం శ్చాపి తత్సమాన్ సువిభర్జయేత్ ।
తాన్ భ్రిష్టా నితి విజ్ఞాయ యథాయోగ్యం జలం క్షిపేత్ ॥
పాచయే దర్ధపక్వేఽస్మిన్ లవణం హింగు చార్ద్రకం ।
సంక్షిపే దనుమానేన సిద్ధా తాపహారీ స్మృతా ॥
బల్యా తాపహారీ రుచ్యా శ్లేష్మఘ్నీ పుష్టిదా మతా ।
ధాతుసంవర్ధనీ బాలే! గుర్వీ సంతర్పణీతి చ ॥

తా. ఒక తప్పెలలో నెయ్యి పసుపువేసి ప్రొయ్యిమీఁదఁబెట్టి కాఁచి అందు మినపపిండి యుండలువేసి వేయించి అందులో మినపవడియములంత బియ్యమును వేసి వేగినతరువాత తగుపాటి నీళ్ళుపోసి సగముడికినతరువాత-ఉప్పు ఇంగువ అల్లము వీనిని వేసి దించవలయు. ఇది బలమునిచ్చును. తాపమునుహరించును. రుచిగనుండును. కఫమును హరించును. పుష్టిని-ధాతుపుష్టిని - గురుత్వమునుచేయును. తృప్తి నిచ్చును.

### కూరపొడి.

మిరపకాయలు ౧౦ పలములు - ధనియాలు ౧౬ - ప - మిరియాలు ౧ప - జీలకఱ్ఱ ౪ ప-పసుపు ౪ప-ఇంగువ ౹ ప-బియ్యము ౧౨ప-మినపప్పు ౧౦ పలములు, సెనగపప్పు ౧౦ ప-ఎండుకరివేపాకు ౨ప-వీనిని ప్రత్యేకముగా వేయించికొని కలిపి విసిరియుంచుకొనవలయును.

### మసాలపదార్థములు.

మిరపకాయలు-ధనియాలు-మిరియాలు-జీలకఱ్ఱ-మెంతులు-ఆవాలు-మినపపప్పు-నువ్వులు-సెనగపప్పు-కొబ్బెర-ఇంగువ-కరివేపాకు-కొత్తిమిరిఆకు-నీరుల్లిగడ్డలు-తెల్లఉల్లిపాయలు-లవంగచెక్క-చింతపండు-ఉప్పు.

### మెంతిపిండి.

మినపపప్పు-కందిపప్పు-పెసరపప్పు-సెనగపప్పు-గోధుమలు-జీలకఱ్ఱ-ఆవాలు-మెంతులు-పసుపు-ధనియాలు-కరివేపాకు-ఇంగువ వీనిని ప్రత్యేకముగావేయించి విసరిపెట్టుకొనవలయు.

### చారుపొడి.

మిరపకాయలు-ధనియాలు-మిరియాలు-జీలకఱ్ఱ-కందిపప్పు-వీనిని చక్కగా వేయించి పొడిచేసి పెట్టుకొనవలయు.

### పప్పు.

శ్లో. రసజ్ఞే! కాంచనం సూపం ప్రస్థైకం సుమనోహరం ।
పచే దబ్ధిగుణే తోయే చార్ధసిద్ధే వినిక్షిపేత్ ॥
హరిద్రాం రామఠం సర్పి ర్లవణం చ యథోచితం ।
నాతిద్రవో ఘనో వా పి ససూపో రుచికారకః ॥
పాచనో దీపన స్స్నిగ్ధః పథ్యో బల్యో వరాంగనే ! ।
కఫవాతహర శ్చాన్నం వినా తేన వృథా భవేత్ ॥

తా. ౧సేరుపప్పును ౮సేర్ల నీళ్ళలోపోసి పొయ్యిమీఁదబెట్టి వండి-నెయ్యి ౮ తు,పసుపుపొడి ౹ తు, వీనిని కాఁగుచుండెడి నీళ్లలోవేసి పప్పు ఉడికినతరువాత మెత్తగకలియఁబెట్టి-ఉప్పు ౨తు,ఇంగువ ౮ గురిగింజలయెత్తు కలిపినతేఁటనీళ్లు వీనినివేసి గరిటతో కలియఁబెట్టి దించుకొనవలయు; ఇది రుచినిగలిగించును. శీఘ్రముగ జీర్ణమగును. ఆఁకలిని పుట్టించును. మెఱుఁగునిచ్చును. పథ్యకరముగనుండును. బలమునిచ్చును. కఫవాతముల హరించును.



### పప్పుపులుసు.

౮సేర్లనీళ్ళను కాఁగఁబెట్టి ౪ సేరు కందిపప్పు, నేయి ౨ తు, పసుపుపొడి ౹ తు, వీనిని నీళ్ళలోవేసి మూఁతపెట్టి, మిరపకాయలు, ౧౪తులం ధనియాలు౧తు, మిరియాలు౹తు, జీలకఱ్ఱ పరకతు, మెంతులు ౹ తు, కొబ్బరితురుము ౫ తు, లవంగపట్ట ౹ తు, వీనిని ప్రత్యేకముగవేయించి నీళ్ళుచల్లి రుబ్బి ముద్దచేసికొని మఱియొక పాత్రములో మంచినీళ్ళు ౹ సేరుపోసి-అందు-చింతపండు ౬ తులములువేసి పిసికి ఆపులుసులో పైముద్దను ఉప్పు నాలుగన్నర తు-వేసి పొయ్యిమీఁదపెట్టి తెర్లినపిదప,పక్వమైయున్నపప్పును దీనిలోఁగలిపి అరపావుసేరు నీళ్ళలో 3 తులముల బియ్యపుపిండిని కలిపి పొయ్యిమీఁద పులుసులోపోసి కలిపి తెర్లినపిదప దించుకొనవలయు. తరువాత ౨తులములనేతిలో మిరపకాయలు - అరతులము, ఆవాలుఅరతు-వేసి క్రమప్రకారము తిరుగబోత వేయవలయు, ౧ గురిగింజయెత్తు ఇంగువనీళ్ళు కలపవలయు.

### చారు.

శ్లో. అమ్లికాయాః ఫలం పక్వం కుడవైకం వినిక్షిపేత్ !
ప్రస్థే నీరే పచే త్సమ్య గ్రసజ్ఞే ! సారకప్రియే ! ॥
అర్ధావశిష్టే పూతే చ మరిచం ద్వ్యక్షకం ప్రియే ! ।
సైంధవం జరణం హింగు యథాయోగ్యం విపేషితం॥
శ్లక్ష్ణం పిండీకృతం సర్వం చార్ద్రికు స్తుంబురీయుతం ।
తస్మిన్ క్వాథే వినిక్షిప్య పాచయే చ్ఛనకైః పునః ॥
అమ్లికాసార మబ్జాక్షి ! వాతాతంకప్రణాశనం ।
పిత్తశ్లేష్మకరం కించి త్సురుచ్యం వహ్నిబోధకం ॥

తా. ౮ పలములు చింతపండును ౧ సేరు నీళ్ళలో వేసి పొయ్యిమీఁదఁ బెట్టి కాఁచి సగముగ కాగినతరువాత వడియగట్టి మిరియాలు ౨ తులములు- ఉప్పు-జీలకఱ్ఱ ఇంగువ వీనిని చక్కగానూరి పొడిచేసి వీనిని, తుఱిమిన అల్లమును,కొత్తిమిరిని ఆపులుసునందువేసి క్షణకాలము ప్రొయ్యిమీఁదఁబెట్టికాఁచిదించుకొనవలయు. ఇదివాతరోగమునుపోగొట్టును.పిత్తకఫములనుచేరుయును. రుచినిపుట్టించును. అగ్నిదీపనమునుజేయును.

### మఱియొకవిధము.

౮ సేర్లు మంచినీళ్ళను బాగుగకాచి అందు కందిపప్పుఅరసేరు- ౧తులము నెయ్యి లేక-నూనె, పసుపుపొడి ౧ తు-వీనినివేసి పొంగినపిదప దించుకొని మఱియొక పాత్రమునందు అరసేరు నీళ్ళుపోసి-౬తులములుచింతపండువేసి - బాగుగకాఁచి అందు - ఉప్పు

చాలుగున్నరతు, మిరపకాయలు ౧।తు-ధనియాలుము క్కాలుతు-జీలకఱ్ఱ ।తు-మెంతులు పరకతు-ఆవాలు పరకతు-వీనిపొడిని, ౮ తులములువాడ్చిన కరివేపాకు, కొత్తిమిరి ఒకటిన్నరతు-వీనినివేసి- ఆచింతపండుపులుసును అట్టకట్టునట్లు కాచి - పప్పుకట్టును పులుసులోపోసి కాఁచి-౧ తులము నేతిలో ఆవాలు । తు-వేసివేయించి-క్రమప్రకారముతిరుగబోతపెట్టి తోడనేమూసి వీసమెత్తు ఇంగువ తేఁటను కలపవలయును. ఇట్లే సెనగపప్పుచారును చేయవచ్చును.

శ్లో. దీపనార్థం హి పత్త్రేషు జీరకం లశునం మతం ।
రక్తా మరీచికా చాపి రామఠం వా విచక్షణే ! ॥
పుష్పేషు రాజికా హింగు జీరకం చ రసోనకం ।
మరీచికా తథా రక్తా దీపనే మదిరేక్షణే ! ॥
చతుర్ష్వపి ఫలాద్యేషు పృథ్వీకా బాజిమేధికాః ।
రసోనం రాజికా హింగు వా తు రక్తా మరీచికా ॥

తా. ఆకుకూరల పోరిని-జీలకఱ్ఱ తెల్లయుల్లిపాయలు, మిరపకాయలు, ఇంగువ వీనిని తిరుగబోఁతపెట్టి చేయవలయును. పువ్వులను-ఆవాలు, ఇంగువ, జీలకఱ్ఱ, తెల్లయుల్లిపాయలు, మిరపకాయలు వీనిని తిరుగబోఁతపెట్టి చేయవలయును. పండ్లు-కాడలు-గడ్డలు మొదలగువానిని-పెద్దయేలకులు, జీలకఱ్ఱ, మెంతులు, తెల్లయుల్లిపాయలు, ఆవాలు, ఇంగువ, మిరపకాయలు తిరుగఁబోఁతపెట్టి చేయవలయును.

## పులుసుకూర.

శ్లో. పర్ణశాకే విశేషం చ కంబుాస్యే! శృణు సాంప్రతం ।
యేన స్యాద్రుచిరం స్వాదు భోజనే ప్రీతివర్ధనం ॥
రామఠం దీపనే దద్యాత్తథా రక్తాం మరీచికాం ।
రసోనం చ పలాండుం వా నిక్షిప్య ఛాదయేత్తతః ॥
ధూమ్రం దృష్ట్వా సముద్ఘాట్య శాకం నిక్షిప్య ఛాదయేత్ ।
క్షణా దుద్ఘాట్య ప్రస్థంచే చ్ఛాకం పటు పలార్ధకం ॥
యథారుచి తు వా కాంతే! ధాన్యకాదిరజః క్షిపేత్ ।
తథా! కుస్తుంబురుం చార్ద్రాః క్షిపే జ్జ్వాలామరీచికాః ॥
హరితా అరుణా వాపి/ఘృతా శ్శస్త్రేణ ఖండశః ।
అమ్లవర్గం చ నిక్షిప్య పక్త్వా ముత్తారయే చ్చ హి ॥



తా. ఆకుకూరలను- ఇంగువ, మిరపకాయలు, తెల్లయుల్లిపాయలు (లేక) ఎఱ్ఱయుల్లిపాయలు వీనిని తిరుగఁబోఁతపెట్టి అందు కూరనువేసి - ౧సేరు కూరకు అరపలము ఉప్పు-ధనియాలు-ఆవాలు-మిరపకాయలు-పసుపు-లవంగములు- లవంగపట్ట- కొబ్బరితురుము - ఇంగువ-నూనెతో వేయించి విసరినపిండి, తఱిగినకొత్తిమిరి, పచ్చిమిరపకాయలు చింతపండు వీనినివేసి కూరయుడికినతరువాత దించుకొనవలయును.

౧౬ పలముల తోఁటకూరను చక్కగా తఱిగి కడిగి వడియవేసి, ౮ తులముల నెయ్యి, మిరపకాయలు ౧ తు-ఆవాలు అరతు-సెనగలు ౮ తు-మినపపప్పు ౧ తు- చేర్చి క్రమప్రకారము తిరుగఁగోఁతచేసి - సగము ఉడికిన పిదప, ఉడికిన పెసలపప్పు ౨ గరిటెలువేసి, అరపావుసేరునీళ్లలో ౧ తులము చింతపండుపులుసుకలిపి ఆకూరయందు పోసి - ౧తులముఉప్పు ౧ తులము కూరపిండికలిపి దించుకొని-౨ పలములు తురిమిన కొబ్బరి కలపవలయును; తక్కిన ఆకుకూరలను అయాక్రమము నెఱింగి చేయవలయును.

## కూరలు - వంకాయపొరి - బెండకాయపొరి.

౨౮ తులములు వంకాయబద్దలు నీళ్ళలోవేసి- 3తులముల నేయి ఒకపాత్రలో పోసి కాఁగనిచ్చి - అరతులము మిరపకాయలు- । తులముఆవాలు- అరతులము మినపపప్పు వీనినివేసి క్రమముగతిరుగఁబోఁతవేయించి పైవంకాయబద్దలను తిరుగఁబోఁతలో వేసి కొంచెముగ నీళ్ళుచిలకరించి-మఱియొకపాత్రమునందు అరసేరు నీళ్లుపోసి అరతులముచింతపండుకలిపి - వంకాయబద్దలమీఁదపోసి - కూరపిండి ౧ తు-ఉప్పు౧తు-ఉడికినపప్పు ౨ గరిటెలు-తురిమినకొబ్బరి 3 తు-వీనిని కలపవలయును. ఇట్లేబెండకాయ కూరను చేయవచ్చును. దీనికి బెండకాయలు ౮౦ తు-చింతపండు-౨తు-కూరపిండి-౨ తు-ఈప్రకారము వేయవలయును.

## బీరకాయపొరి - దోసకాయపొరి.

తురిమినబీరకాయలు 3౦ పలములు-పెసరపప్పు । సేరు-వీనిని కలిపి యుంచికొని నేయి ౨ప-మిరపకాయతునుకలు ౧।తు-ఆవాలు అరతు-మినపపప్పు-౨తు వీనిని క్రమప్రకారము తిరుగఁబోఁతచేసికొని దానియందు బీరకాయపప్పును వేసి యుడికినతరువాత ఉప్పు ఒకటిన్నరతు-కూరపొడి ౧తు-అందు కలపవలయును. తురిమిన రెండుకొబ్బరికూడ చేర్చుకొనవచ్చును. ఇట్లే దోసకాయపొరిని చేయవచ్చును.

## అరఁటికాయ పొరి.

తఱిగిన అరటికాయ 3౦ పలములు-పెసరపప్పు ౪ సేరు వీనినికలిపి-నెయ్యి ౧౦ తు- మిరపకాయలు ౧తు, ఆవాలు౧-తు, మినపపప్పు ౨-తు, సెనగపప్పు-౨తు-వీనిని క్రమముగా తిరుగఁబోఁతవేయించి దానియందు అబద్దలనువేసి ౪ సేరు నీళ్ళుపోసి ప్రొయ్యి

మీఁదపెట్టియుడికించి - మఱియొకపాత్రమునందు ౨తులముల చింతపండువేసి ఉప్పు ౪తు-కూరపిండి అరతు-తురిమినకొబ్బరి అరతు-వీనినివేసి కలపవలయును.

### పులుసు కలిపిన వంకాయపప్పు.

రెండున్నరసేరు మంచినీళ్ళను మసలనిచ్చి-కందిపప్పు అరసేరు, నెయ్యి ౨తు, పసుపుపొడి పరకతు- వీనినివేసి ముప్పాతికపాలు ఉడికినపిదప ౭౨ తులములుతఱిగిన వంకాయబద్దలువేసి, మూఁతపెట్టి-మిరపకాయలు రెండున్నరతు, మిరియాలు అర తు, ధనియాలు ౨తు, జీలకఱ్ఱ ౹ తు, మెంతులు ౹ తు, లవంగపట్ట ౹ తు, తురిమిన కొబ్బెర ౨తు, వీనిని ప్రత్యేకముగ ౧౨తులముల నేతిలోవేయించి అన్నిటిని రోటిలోవేసితగు పాటినీళ్ళుపోసి కొట్టిముద్దచేసి దానిని ఉడికిన వంగబద్దలయందు వేసి, ఒకపాత్రములో అరపావుసేరు నీళ్ళుపోసి ౬ తులములు చింతపండువేసి గొజ్జుచేసి ఆ గొజ్జును మూడున్నరతులము ఉప్పును - ఆపప్పులోవేసి నెయ్యి ౬తు, మిరపకాయలు ౨తు,ఆవాలు అరతు,కరివేపాకురతు, వీనినిచేర్చి క్రమప్రకారముతిరుగఁబోఁతపెట్టి ౧తులముఇంగువ నీళ్ళనుకలపవలయును,అన్నికాయగూరలనుఆయాప్రమాణముచొప్పున చేర్చుకొనవలయును.

### నూనెకాయలు.

శ్లో. విశేషం చ ప్రవక్ష్యామి శృణు పద్మవిలోచనే ! ।
వృంతాక కారవేల్లాదిఫల మర్ధం విదీర్య చ ॥
తత్రేదం పూరయే త్సర్వం వక్ష్యమాణం నిబోధ మే ।
రసోనస్య పలం హింగు భర్జితం కోలసమ్మితం ॥
ధాన్యాకం ద్విపలం భర్జితం జీరకస్య చ తిందుకం ।
అమ్లవర్గం పలైకం చ పలార్ధం రక్తాం మరీచికాం ॥
నాతిసూక్ష్మీకృతం సర్వం కర్షాష్టలవణాన్వితం ।
వృంతాక కారవేల్లాది ద్విప్రస్థే పూరయే దిదం ॥
తత స్సూత్రేణ సంబధ్య ఘృతే తైలే ఽ థవా ప్రియే ! ।
యుక్త్యా సంపాచయే చ్ఛుష్కం రసార్థం వా జలాన్వితం ॥

తా. ౨సేర్లు వంకాయలు, కాఁకరకాయలు వీనినితొడిమెలుతీయకుండా సగముగ చీల్చి వానిలో తెల్లవుల్లిపాయలు ౧ పలము, కాల్చిన యింగువ ౬ మాషముల యెత్తు, ధనియాలు ౨ పలములు, జీలకఱ్ఱ ౧తు, చింతపండుపులును ౧పలము, మిరపకాయలు ౧ పలము వీనిపొడిని ౨ పలములు ఉప్పునునిండించి దారముతోకట్టి, నేతగాని నూనెగాని పక్వము చేయవలయును; ద్రవముగకావలసినయెడల కొంచెము నీళ్లుపోసి కలపవలయును.



### నూనెవంకాయ.

వంకాయలు ౩౦ పలములు-తొడిమెలు తీయకుండా నాలుగుగాకోసి - లవంగము అరతు-జాపత్రి అరతు-జాజికాయ అరతు-మినపపప్పు ౬ తు, వీనిని వేయించి అందుతురిమినకొబ్బెర ౧౽తు-ఉప్పు ౮తు-ధనియాలు ౨తు-మిరపపొడి ఒకటిన్నరతు వీనినికలిపి, ౹ సేరు నీళ్ళలో ౮ తులముల చింతపండుపులును కలిపియుంచి దానియందు ఆపొడినికలిపి ముద్దచేసి వంకాయలోపెట్టి దారముతోకట్టి ౧౦ పలములనూనెలో-మిరపకాయలు ౧తు, ఆవాలు ౧తు, మినపపప్పు ౧తు, సెనగపప్పు ౨ తు, వీనినిక్రమముగ తిరుగఁబోఁతచేసి అందు ఆవంకాయలనువేసి కొంచెము నీళ్లు చిలకరించి మూఁతపెట్టి యుడుకునంతలో రెండుమూడుమారులు కుదిలించవలయును.

ఆయా ప్రమాణముల నెటింగి కాఁకరకాయ పొట్లకాయ మొదలగు కూరలను చేసికొనవలయును.

### పచ్చళ్లు.

౧ పలము నేతిలో ౪ పలము మిరపకాయలువేయించి పొట్టుతీసిన మినపపప్పు ౮ పలములువేసి వేయించి - తురిమినకొబ్బరి ౩ ప, ఉప్పు౧ప, చింతపండు౧ప, ఇంగువ నాల్గు గురిగింజలంతవేసి వీనిని పప్పులోవేసి కలియనూరవలయును.

ఇట్లే తిక్కిన పప్పుదినుసులను పచ్చళ్లు చేయవచ్చును.

### పచ్చి పెసలపప్పు పచ్చడి.

౮ పలములు పెసరపప్పును నానవేసి ౪ పలం మిరపకాయలు, ఇంగువ ౮ గురిగింజలయెత్తు, ఉప్పు ౧ పలము చేర్చి రుబ్బి ౧ నిమ్మకాయరసమును పిండవలయును, ఇష్టముండిన తిరుగఁబోఁతకూడా వేయవచ్చును.

ఇట్లే-తక్కినపచ్చళ్ళను ఆయాక్రమప్రకారము దినుసులను చేర్చి చేయవలయును.

### మజ్జిగపులుసు.

శ్లో. నాత్యమ్లమధురే తక్రే చతుఃప్రస్థే విమిశ్రయేత్ ।
వేసనం కుడవం సూక్ష్మం మరీచలవణాన్వితం ॥
తత స్తామ్రాదిజం భాండం వంగలిప్తం బృహన్ముఖం ।
చుల్ల్యాం నిధాయ వహ్నిం తు కృత్వా తప్తే చ భాండకే ॥
క్షిపే దాజ్యం తు తత్తప్తే మేధికాం రామఠం తు వా ।
జీరకం రాజికాం వాపి క్షిపే ద్రక్తాం మరీచికాం ॥
యథారుచి రుచిప్రేప్సే । సర్వం వా తు రసోనకం ।

తుణం చైవాన్యపాత్రేణ ఛాదయే త్సుప్రయత్నతః ॥
దృష్ట్వా తు నిస్సృతం ధూమం శనై రుద్ఘాట్య సంక్షిపేత్ ।
అర్ధం సవేసనం తక్రం ద్రుతి మాచ్ఛాదయే త్తతః ॥
పలాదుద్ఘాట్య శేషం తు క్షిపే ద్దర్వ్యా ప్రచాలయేత్ ।
తతో మందానలేనైవ పాచయే దతియుక్తితః ॥
అర్ధశేషే త్రిపాదే వా సముత్తార్య నిధాపయేత్ ।
క్వథితా మితి తాం ప్రాహు స్సూపశాస్త్రవిశారదాః ॥

తా. మిక్కిలి పులుసు-మిక్కిలితీపులేని ౮ సేర్లు పెరుగు, సెనగపిండి ౮ పలములు, వీనికి సమము ఉప్పు, మిరపకాయలు వీనినివేసి కలిపి కళాయిపూసిన తామ్రాదిపాత్రలయందుపోసి ప్రొయ్యిమీఁదఁబెట్టికాఁచి కొంచెము నేయివేయవలయు,పిదప మెంతులు ఇంగువ జీలకఱ్ఱ,ఆవాలు మిరపకాయలు వీనినివేసి తిరుగఁబోఁతపెట్టి మూసి (కావలసియున్నయెడల తెల్ల ఉల్లిపాయలు వేసికొనవచ్చును.) పొగవచ్చినతరువాత మూఁతతీసి,తిరిగి మునుపటిపెరుగులో సగము పెరుగునుసగముపిండినివేసి మూఁతపెట్టి కొంచెముసేపుతాళి మూఁతతీసి గరిటెతోఁ గలియఁబెట్టి-మెల్లనిమంటతో కాఁచవలయు అది ముప్పాతికపాలుగగాని అరపాలుగగాని అయినతరువాత దించుకొనవలయు.

౨సేర్లు పెరుగును బాగుగ చిలికి 3 తులములు ఉప్పు, మిరపపొడి ౧తు, మెంతులపొడి ౪ తు, కొతిమిరాకు ౧ తు, పచ్చిమిరపకాయతునుకలు ౨తు, వీనిని మజ్జిగలోకలిపి ౪ సేరు నీళ్ళలో చింతపండు ౨తు-కలిపి అందులో పచ్చిసెనగపిండి ౨తు, పసుపుపొడి ౪ తు, కలిసి పక్వముగకాఁచి అందుపై మజ్జిగనుపోసి బాగుగ మఱగించవలయు. ౨ తులములు నేతిలో మిరపకాయలు ౪ తు, ఆవాలు ౪ తు, వీనినిక్రమముగవేసి తిరుగఁబోఁతపెట్టి- పరకతులము ఇంగువ తేఁటను కలపవలయు.

౧సేరు చిలికినపెరుగులో- ఉప్పు ఒకటిన్నరతు, మిరపపొడి అర తు. పసుపుపొడి పరకతు, మెంతులపొడి అరతు, పచ్చిమిరపతునుకలు ౨తు, కొతిమిరి-అర తు, పచ్చిసెనగపిండి ౨ తు, వీనిని ఆమజ్జిగలోపోసి అరతులము నేతిలో-ఆవాలుఅరతు, మిరపకాయలు అరతు, వీనిని క్రమముగవేసి తిరుగఁబోఁతపెట్టవలయు.

౨ సేర్లు వంకాయలను బద్దలుగా తఱిగియుంచి అరసేరు నీళ్లలో వేసి పొయిమీఁదనుంచి మఱియొకపాత్రములో ౹ సేరు నీళ్లుపోసి అందు-౨తులములు చింతపండు కలిపి, అందు-ఉప్పు 3తు, మిరపపొడి అరతు, మెంతులపొడి ౹ తు, పసుపు ౹ తు, పచ్చిమిరపకాయలు ఒకటిన్నర తు, కొత్తిమిరాకు ౧ తు, తుఱిమిన అల్లము అరతు, పెరుగు ౧సేరు వీనినివేసి ఉడుకుచున్నవంకాయలలోపోసి ౮ తులములు సెనగపిండి



వేసి క్రమప్రకారము తిరుగఁబోఁతపెట్టి దించుకొనవలయు. ఇట్లే యితరములైన కాయగూరలనుచేర్చి మజ్జిగపులును చేయవచ్చును.

అలీకమత్స్యములు.

శ్లో. చామసీం వేసనం వాపి మంథయే దంబునా సమం ।
తత్రైవ తైలాదికం కాంతే! వేసవారం విమిశ్రయేత్ ॥
నాగవల్లీదళా నీషత్పక్వాన్యేవ తతః ప్రియే !।
లేపయే త్తేన పిష్టేన సూపశాస్త్రవిశారదః ॥
వేష్టయే చ్చ ప్రయత్నేన తతః కుర్యా దిమం విధిం ।
కించిన్నీరయుతం భాండం తృణై రర్ధం విపూరయేత్ ॥
తస్యోపరి న్యసే త్తాని పాచయే న్మందవహ్నినా ।
యది తాని ఘనాని స్యు ర్భాండా న్నిష్కాసయే త్పృథక్ ॥
తేషాం శస్త్రేణ ఖండాని మత్స్యానామివ కల్పయేత్ ।
ఘృతే తైలేఽథవా తాని పాచయే న్నవయావనే ! ॥

తా. మినపపిండినిగాని, సెనగపిండినిగాని నీళ్లతోమర్దించి దానిలో - ఏలకులు, లవంగపట్ట, మిరియాలు, లవంగాలు, నల్లజీలకఱ్ఱ, ధనియాలు వీనిపొడిని వేసికలిపి కొంచెము పండిన తమలపాకులపైన ఆపిండిపూసి, ఒకకుండలో కొంచెము నీళ్ళుపోసి సగము కుండకు గడ్డివేసి దానిపైన ఆకులనునిచి మెల్లని మంటతో వండవలయు, అవియుడికి గట్టిపడినతరువాత వెలుపలికితీసి వానిని కత్తితో మత్స్యాకారములుగనుండునట్లు ముక్కలుకోసి నేతగాని నూనెగాని వండవలయు.

రసాజ్యములు.

శ్లో. ప్రస్థైకం చాణకం పిష్టం ప్రస్థైకం ఘృతం తథా ।
ఏకీకృత్య తు సంమర్ద్య పచే న్నీరే చతుర్గుణే ॥
యావద్గాఢం భవే త్పశ్చాత్ స్థాల్యాం కృత్వా ప్రసారయేత్ ।
కనిష్ఠికామితోత్సేధం శీతే ఖండాని కల్పయేత్ ॥
దీర్ఘాణి శింబికాతుల్యా న్యాజ్యే తాని విపాచయేత్ ।
ఫుల్లాని కుంకుమాభాని దృష్ట్వా నిష్కాసయే ద్ధృతం॥
రసాజ్యా ఇతి సంప్రోక్తా స్సూపశాస్త్రవిశారదైః ॥

తా. సెనగపిండి ౨౮ తు, నేయి ౨౮ తు, వీనిని కలిపి మర్దించి నాలుగింతల నీళ్ళలోకలిపి వండవలయు, అదియుడికి గట్టిపడిన తరువాత ఒక పళ్లెములో చిటికెన

బిళ్ళలుగా పుగలుగునట్లు వెడల్పుగ పరచి చల్లారిన తరువాత పొడవుగ తంతువులవలె ముక్కలు కోసి నేతవండవలయు, అవి యెఱ్ఱగ వేగిన తరువాత శీఘ్రముగ ఎత్తుకొనవలయు; వీనిపేరు రసాజ్యములు.

మాషరంగి.

శ్లో. మాషకాః దళితా న్నీరే క్షిప్త్వా రాత్రౌ చతుర్గుణే।
ప్రాత స్తాః నిస్తుషాః కృత్వా ప్రక్షాళ్యాద్భిః ప్రయత్నతః॥
తత స్తాః పేషయే త్సమ్య క్పిష్టం కృత్వా శ్మనా శ్మని।
తస్యాం పిష్ట్యాం హి లవణం జీరకం మరిచం నిశాం॥
రామఠం చానుమానేన వేసవారం తు వా ప్రియే!।
క్షిపే దేలాదికం పశ్చా న్మంథయే ద్భృశ మేవ చ॥
కోలంకోలం క్షిపే త్తప్తే ఘృతే సంపాచ్య తూద్ధరేత్।
తచ్ఛేషాం పిష్టికా మద్భి ర్ఘోలయిత్వా ష్టభాగకే॥
క్వాథలీ మివ సంపాచ్య క్షిపే దేలాదికం తతః।
వేసవారం చ లవణం తత్రేమా వటికాః క్షిపేత్॥
తతో దద్యా త్క్షణం వహ్నిం సిద్ధా మేవ సముద్ధరేత్।
ఏషా ప్రోక్తా ప్రియే! తద్జ్ఞై ర్మాషరంగీతి నామతః॥

తా. మినుములను నాలుగింతలనీళ్ళలోపోసి యొకరాత్రియంత నాననిచ్చి పొట్టుతీసి కడిగి పిండిరుబ్బి, ఆపిండిలో-ఉప్పు-జీలకఱ్ఱ-మిరియాలు-పసుపు-ఇంగువ వీనినిగాని,ఏలకులు-లవంగపట్ట- మిరియాలు- లవంగాలు-నల్లజీలకఱ్ఱ వీనినిగాని పొడిచేసి తగునట్లువేసి గట్టిగామర్దించి రేగుపండంత పిండిని తీసికొని క్రాగుచున్న నేతిలోవేసి పక్వమయినతరువాత ఎత్తుకొనవలయు; తరువాతపిండినితీసికొని ఆపిండికి రాపాళ్ళునీళ్ళుపోసి బాగుగకలిపి మజ్జిగపులుసువలెకాచి- ఏలకులు-మొదలగువానిపొడి- ఉప్పువేసి అపులుసులో ఆవడియములనువేసి క్షణకాలము ప్రొయ్యిమీదనునిచిమంటవేసి సిద్ధముకాగానే దించుకొనవలయు; దీనిపేరు మాషరంగి,ఇది మినపప్పుగుణముకలిగియుండును.

మినుపవడియములు - పెసలవడియములు.

శ్లో. మాషా న్విదళితా న్నీరే ప్లావయే త్ప్రహరద్వయం।
తత స్తోయేన సంక్షాళ్య క్షాళయే దపి నిస్తుషాః॥
శిలాయాం పేషయే త్పశ్చా దశ్మనా సూక్ష్మకం తతః।



తత్పిష్ట్యా మనుమానేన లవణార్ద్రికరామఠం॥
సంమిశ్ర్య మంథయే త్తావ ద్యావన్నీరతరం భవేత్।
తతో వస్త్రే ప్రకల్పేత చణకప్రమితా వటీః॥
శోషయే దాతపే సమ్య గిమా మాషవటీః ప్రియే!।
కించిదాజ్యేన సంభర్జ్య పాచయిత్వా ంబునా భజేత్॥
రుచ్యా మాషవటీ హన్యా త్కంపవాతం తథార్దితం।
వాతరుక్సర్పిణీ చేయం కఫపిత్తవివర్ధినీ॥
ముద్గసూపగుణా మాద్గీ చాస్యా స్సావన్నగుణా స్మృతాః॥

తా. మినుములను నీళ్ళలో రెండుజాములు నానపోసి కడిగి పొట్టు తీసి తోటిలోవేసి మెత్తగరుబ్బి, వుప్పు, అల్లము, ఇంగువ వీనిని తగునట్లువేసి కలిపి మెత్తనగునట్లు మర్దించి వస్త్రమునందు సెనగలంత వడియములుపెట్టి ఎండనెండించి నేతిలోవేయించవలయు; ఇవి రుచిగనుండును, కంపవాతము, అర్దితవాతము, వాతరోగములు, వీనిని పోగొట్టును. పెసలపప్పు వడియములు పెసలపప్పు గుణముగలిగియుండును.

మఱియొక విధము.

శ్లో. సుపిష్టం చాణకం నీరే సమానే సంవిపాచయేత్।
మరిచం లవణం హింగు ధాన్యాకం శర్వరీం క్షిపేత్॥
సుసూక్ష్మం నారికేళస్య మజ్జానం చాపి సంక్షిపేత్।
ఘనీభూతం సముత్తార్య ఘృతాక్తే కాష్ఠపట్టకే॥
సంక్షిప్య ఘృతలిప్తేన హ స్తేనైవ శనై శ్శనైః।
వర్ధయే త్తారపాకారం శీతే ఖండాని కల్పయేత్॥
చతుష్కోణాని శస్త్రేణ శృంగాటకనిభాని వా।
తత స్సంపాచయే దాజ్యే ఖండాఖ్యా వటికా స్మృతాః॥
ఇమా బల్యా శ్శుక్రలా శ్చ కాంతిపుష్టికఫప్రదాః।
విష్టంభికారికా రుచ్యా గుర్వ్యో వాతహరా స్స్మృతాః॥
రక్తదోషం తథా పిత్తం నాశయం త్యపి భక్షితాః॥

తా. సెనగపిండిలో పిండికి సమముగ నీళ్ళుపోసి ప్రొయ్యిమీదబెట్టి వండి అందులో మిరియాలు-ఉప్పు, ఇంగువ, ధనియాలు, పసుపు, తురిమినకొబ్బరి వీనిపొడినివేసి కలిపి గట్టిపడినతరువాత దించికొని, పీటమీద నేయిపూసి యందుంచి అంచేతులకు నేయిరాచికొని పిండితీసికొని మెల్లమెల్లగ బిళ్ళలుగ పెంచిచల్లారిన తరువాత

కత్తితో నాలుగుకోణములుగలుగునట్లుకోసి నేతిలో వేయించవలయును, ఇది- బలమును శుక్రమును, కాంతిని,పుష్టిని, కఫమును, మలబద్ధమును చేయును. రుచిగనుండును. గురుత్వమునుచేయును. వాయువును హరించును. రక్తదోషము పిత్తము వీనిని పోగొట్టును.

వడలు.

శ్లో. మాషకాన్ విదలీకృత్య క్షిపే న్నీరే ద్వియామకం ।
సంక్షాళ్య నిస్తుషాన్ కృత్వా పేషయే దశ్మనా శ్మని ॥
పలైకం చ పటు ప్రస్థే శృంగబేరం పలం తథా।
టంకైకం రామఠం భృష్టం జీరకం చ ద్విశాణకం ॥
కోలైకం మరిచం కృత్వా చైకథ్యం మంథయే త్తతః ।
భవే న్నీరతరం యావ త్తతో నీత్వా పలం పృథక్ ॥
కృత్వా చంద్రసమాకారం శరచ్చంద్రప్రభాననే ! ।
మధ్యచ్ఛిద్రం తత శ్చాజ్యే తైలేవా పాచయే చ్ఛనైః ॥
కుంకుమాభా న్నిరీక్ష్యైవ పృథక్కృత్వా నిధాపయేత్ ।
మాషాణాం వటకా రుచ్యాః కఫవాతవివర్ధనాః ।
కంపవాత మరుత్పక్షాఘాతకార్శ్యహరా స్స్మృతాః ॥

తా. మినుములను నీళ్ళలోఁబోసి రెండుజాములునిచి కడిగిపొట్టుతీసి ఱోటిలో బోసి రుబ్బి-౧సేరు పప్పులో ౧పలము ఉప్పు, ౧పలము అల్లము,౧ర మినపగింజలయెత్తు కాల్చిన ఇంగువ, జీలకఱ్ఱ మిరియాలు ప్రత్యేకముగ ౨మినపగింజలయెత్తు వీనిని ఒకటిగాకలిపి పొడిచేసి పిండిలోవేసి. మర్దించి ఒక్కొకపలముపిండితీసికొని గుండ్రముగతట్టి నడుమ రంధ్రముచేసి నేతిలోగాని నూనెలోగాని వండవలయును ఎఱ్ఱగవేగిన తరువాత ఎత్తుకొనవలయును - ఇవి రుచిగనుండును. కఫమును వాతమును వృద్ధిచేయును. కంపవాతము పార్శ్వవాతము కృశత్వము వీనిని పోఁగొట్టును.

మఱియొక విధము.

శ్లో. త్వగ్ఘీనాం మాషజాం డాలీం యాత్రాసూక్ష్మాం విపేషయేత్ ।
దధ్నా లిప్తష్టకం మథ్య కృత్వా తద్వటకాన్ ప్రియే! ॥
గోఘృతే పాచితా బల్యా స్తే హితాః స్త్రీప్రసంగినాం ।
వాతఘ్నా శ్శుక్రలా శ్శ్లేష్మ రక్తపిత్తప్రకోపనాః ॥

తా. పొట్టుతీసిన మినపపప్పును ఱోటిలోవేసి రుబ్బి ఆపిండిలో పెరుగుపోసి కలిపి వడలుచేసి ఆవునేతిలో వండవలయును-ఇవి బలమునిచ్చును. స్త్రీసేవ చేయువారికి



హితమునిచ్చును-వాతమునుపోగొట్టును. శుక్రమునుచేయును. కఫము-రక్తపిత్తము వీనిని ప్రకోపింపఁజేయును.

మజ్జిగ వడలు.

శ్లో. మృద్భాండం కటుతైలాక్తం ధూపయే ద్రామఠాజ్యతః ।
తత్ర తక్రం సలవణం సాజాజీ శుంఠి రాజికం ॥
సంక్షిప్య వటకా స్తత్ర ధౌతా నుష్ణోదకేన చ ।
ముద్రయిత్వా ప్తయామాంతం స్థాపయే చ్చ తతో భజేత్ ॥
తే హృద్యా శ్శుక్రలా బల్యాః పౌష్టికా లఘవః స్మృతాః ।
వాతాతంకప్రశమనా రక్తపిత్తకఫప్రదాః ॥

తా. మట్టికుండకు ఆవనూనెరాచి నేయి ఇంగువ వీనినికాఁచి పొగ పట్టించి ఆకుండలో - మజ్జిగ-ఉప్పు- జీలకఱ్ఱ-సొంటి-ఆవాలు వీనినివేసి వడలను వేడినీళ్ళతో కడిగి కుండలోని మజ్జిగలోవేసి మూతినిమూసి ౭ జాములు ఊరపెట్టవలయును, ఇవి హృదయమునకు బలమునిచ్చును. శుక్రమును పుట్టించును. పుష్టిని బలమును ఇచ్చును. లఘువుగనుండును. వాతరోగమును హరించును. రక్తపిత్తము కఫము వీనినిచేయును.

కందవడలు.

శ్లో. సూరణం ఖండశః కృత్వా పాచయే త్పేషయే త్తతః ।
లవణం మరిచం తత్ర రామఠం జీరకం తు వా ॥
సంక్షిప్య మంథయే త్పశ్చా త్పాచయే ద్వటకాన్ ఘృతే ।
తే చాగ్నిదీపనా రుచ్యా అర్శోవాతవిభంజనాః ॥

తా. కందను ముక్కలుగ తఱిగి వండి తరువాత రుబ్బి, ఆపిండియందు ఉప్పు మిరియాలు, ఇంగువ, (లేక) జీలకఱ్ఱ, వీనిపొడివేసి కలిపి వడలుగతట్టి నేతిలో వండవలయును. ఇవి జాఠరాగ్నిదీపనము చేయును. రుచిగనుండును, మూలరోగము వాతము వీనిని పోగొట్టును.

గుమ్మడికాయవడియములు.

శ్లో. కూశ్మాండం ఖండశః కృత్వా సూక్ష్మం త చ్చాపి వాససా ।
నిష్పీడ్య నిర్జలం కృత్వా తత స్తస్మి న్విమిశ్రయేత్
పేషనం మాషపిష్టం వా నిశా ధాన్యాకరామఠం ।
లవణం మరిచం సర్వం మంథయే ద్ఘటికాద్వయం ॥
తత స్సంపాదయే త్తస్య వటకా నతిశోభనాన్ ।

శోషయిత్వా తపే చైతాన్ పాచయే ద్ఘృతభర్జితాన్ ॥
లవణం త్వనుమానేన క్షిపే దంబుప్రమాణతః ।
కూశ్మాండవటకా రుచ్యా వాతాతంకవినాశనాః ॥

తా. బూడిదగుమ్మడుకాయను సన్నముక్కలుగతరిగి గుడ్డలో వేసి చక్కగా పిడిచి నీరును తీసివేసి అందు సెనగపిండిని (లేక) మినపపిండిని, పసుపు-దనియాలు-ఇంగువ-ఉప్పు-మిరియాలు వీనిపొడిని వేసి రెండు గడియలసేపు మర్దించి కొంచెము కొంచెము పిండితీసికొని వడియములుపెట్టి ఎండనెండించి నేతినవేయించవలయు. ఇది రుచిగనుండును, వాతమును హరించును.

## అప్పడములు.

శ్లో. నిస్తుషాణాం చ మాషాణాం పిష్టం వస్త్రవిగాలితం ।
లవణం మరిచం జీరం కిం వా రామఠకం క్షిపేత్ ।
క్షీరాంబు మర్దితం గాఢం నిశాయా ముషితం తతః ।
కుట్టయే దశ్మనా సమ్య క్పాషాణే కోమలం యథా ॥
తత స్తద్వర్తికాం కృత్వా మృణాలసదృశీం శుభాం ।
శు క్తిమానాని ఖండాని తస్యాః కుర్యా చ్చ తంతునా ॥
వేల్లయే త్పర్పటాం స్తేషాం చంద్రమండలసన్నిభాన్ ।
సూక్ష్మాన్ స్నేహేఽథ వాంగారే భర్జయే త్తాంశ్చశోషితాన్ ॥
పర్పటా మాషజా బల్యా దీపనా రుచికారకాః ।
కఫకాంతిప్రదాః కాంతే! పాచనా వాతనాశనాః ॥
సారకా గురవః పుష్టిర క్తపి త్తప్రవర్ధనాః ।
చే దాజ్యే పాచితా స్తే చ న్యూనా స్స్యు ర్గుణత స్తతః ॥

తా. పొట్టుతీసిన మినుములను విసిరి వస్త్రగలితముచేసి, ఉప్పు- మిరియాలు, జీలకఱ్ఱ,ఇంగువ వీనినివేసి-చాటినీళ్లతో బాగుగమర్దించిరాత్రియూరపెట్టి ఱోటియందు రోకటితో మెత్తగతొక్కవలయు, తరువాత పొడవుగ వత్తులుచేసికొని ఆ తులముల ముద్దతీసికొని, చంద్రమండలమువలె గుండ్రముగను సన్నముగను అప్పడములు ఒత్తవలయు; పిదప ఎండించి చమురులోఁగాని నిప్పులమీఁదఁగాని వేయించవలయు; ఇవిబలము నిచ్చును. అగ్నిదీపనమునుచేయును. రుచినిచ్చును. కఫమునుకాంతినిచేయును. వాతమును పోగొట్టును. జీర్ణమును చేయును. గురుత్వము చేయును, పుష్టినిచ్చును, రక్తపిత్తరోగమును వృద్ధిచేయును. నేతిలో వేయించిన పైగుణములకంటె తక్కువగుణమునిచ్చును.



## పెసలఅప్పడములు.

శ్లో. నిస్తుషాణాం చ ముద్గానాం పిష్టం వస్త్రవిగాలితం ।
మరిచం లవణం హింగు జీరకం వా త్ర మిశ్రయేత్ ॥
మర్దయే త్క్షారనీరేణ పూర్వవ త్కుట్టనం వినా ।
వర్తికాదీని కృత్యాని కుర్యా త్సంవేల్లయే త్తతః ॥
ఘృతాక్తే పట్టకే కాంతే! వేల్లనే నేందుబింబవత్ ।
శోషయే దాతపే సమ్యజ్ మృద్భాండే సన్నిధాపయేత్ ॥
తేఽంగారభర్జితా శ్శ్రేష్ఠా మధ్యమా ఘృతభర్జితాః ।
ముద్గానాం పర్పటా స్స్నిగ్ధా గురవ శ్చ జ్వరే హితాః ।
త్రిదోషశమనాః ప్రోక్తా హితాః కర్ణాక్షిరోగిణామ్ ॥

తా. పొట్టుతీసి విసిరిన పెసలపిండిని వస్త్రగలితముచేసి ఆపిండిలో మిరియాలు ఉప్పు, ఇంగువ, జీలకఱ్ఱ వీనినికలిపి చాటినీళ్ళతో మర్దించి పొడవుగ తంతువులుచేసి కొంచెముకొంచెము త్రుంచుకొని నేయిచరిమిన పీఁటమీఁద నునిచి చంద్రబింబమువలె అప్పడములొత్తి ఎండలో పెట్టి కుండలో నుంచవలయు. వానిని నిప్పులమీఁదకాల్చిన శ్రేష్ఠము, నేతవేయించిన మధ్యమము. పెసలఅప్పడములు మెఱుఁగు నిచ్చును. గురుత్వమును చేయును. జ్వరమునందు హితకరములు. త్రిదోషముల హరించును. కర్ణరోగము నేత్రరోగము గలవారికి హితకరములు.

## బియ్యపు అప్పడములు.

శ్లో. ధౌతానాం తండులానాం చ పిష్టం నీరే విపాచయేత్ ।
మరీచ పటు బాహ్లీకం మిశ్రయే దనుమానతః ॥
పర్పటా స్తద్భవా మిష్టా బల్యా వృష్యా రుచిప్రదాః ।
ధాతుసంవర్ధనా హృద్యా గురవః పాచనా స్సరాః ॥
త్రిదోషశమనాః ఖ్యాతా మంజుకోకిలభాషిణి ! ।
అంగారభర్జితా శ్శ్రేష్ఠా మధ్యమా ఘృతభర్జితాః ॥
అస్యైవ వటకాకారాః కృతా శ్చాజ్యే విభర్జితాః ।
గుణై ర్గుణవతి! జ్ఞేయా హృద్యా వాతకఫాపహాః ॥

తా. బియ్యమునుకడిగి మెత్తగపిండికొట్టి తగినసీళ్లుపోసి వండవలయు. తరువాత-మిరియాలు, ఉప్పు తగినట్లువేసికలిపి అప్పడములు చేయవలయు, ఇవి తియ్యగ

నుండును. బలమును రుచిని పుష్టినిఇచ్చును. ధాతుపుష్టిని చేయును. హృదయమునకు బలమునిచ్చును, గురుత్వమును చేయును. త్రిదోషములను హరించును. వీనిని నిప్పుల మీఁదకాల్చిన శ్రేష్ఠము. నేతవేయించిన మధ్యమము, ఈపిండిని వడలంతట్టి నేతిలో వేయించిన - వాత కఫముల హరించును. జఠరమ్మునకు బలము నిచ్చును.

## బజ్జులు.

శ్లో. వృంతాకాదిఫలం వాపి కందం చాంగారభర్జితం ।
యత్నా త్తన్నిస్త్వచం కృత్వా హస్తే నైవ విమర్దయేత్ ॥
ఆర్ద్రికుస్తుంబురుం తత్ర పటు రక్తాం మరీచికాం ।
హరితా మపి వా కాంతే! భర్జితం హింగు మిశ్రయేత్ ।
తద్భరిత్రస్య లోలాక్షి! గుణా స్తత్తత్ఫలై స్సమాః ॥

తా. వంకాయ మొదలగువానిని నిప్పులమీఁదకాల్చి చెక్కుతీసి చేతితోపిసికి అల్లము, కొత్తిమిరి, ఉప్పు, మిరపకాయలు (లేక) పచ్చి మిరపకాయలు, కాల్చిన యింగువ వీనిని కలపవలయు. ఇది ఆయాకాయలగుణము గలిగియుండు .

## గోధుమరొట్టెలు.

శ్లో. అయి! గోధూమపిష్టకం జలేన గాఢం విమర్దయే త్కాంతే! ।
కించిత్కించి న్నీరం తత శ్చ దత్వా విమర్దయే ద్భూయః ॥
యావన్మంజులతరం స్యా న్మదనసమానం మదనకలాకుశలే! ।
తస్యపోలికాంకృత్వా చంద్రబింబవ చ్చ పత్రమివ సూక్ష్మాం ॥
ఆజ్యవిలిప్తాం బాలే! లోహత ప్తకే విపాచయే చ్ఛనకైః ।
పునః పున ర్లోలాక్షి! ప్రవ ర్తయిత్వోత్తారయే చ్చ పక్వాం ॥
అర్పయే చ్చ హరయే తాం మదనవర్ధనీం బల్యాం పిత్తఘ్నీం ।
కోష్ఠ శుద్ధికర్త్రీ మపి వాతనిహంత్రీం భజే త్తత స్సతతం ॥

తా. గోధుమపిండిలో నీళ్ళుపోసి గట్టిగాకలిపి కొంచెము నీళ్ళు చిలకరించి బాగుగమర్దించి మెత్తగనైన తరువాత - ఉండలుచేసి చంద్రమండలమువలె గుండ్రముగ పన్నగఒత్తి నేయిచరిమి పెనముమీఁదవేసి ఒకప్రక్క కాలినతరువాత త్రిప్పివేసి నేయిచరిమి, పక్వముకాఁగానె యెత్తుకొని శ్రీమన్నారాయణునికి అర్పించవలయు; ఇది కామమును బలమును ఇచ్చును. పిత్తమును గొట్టును. కోష్ఠమును శుద్ధిచేయును. వాతమును హరించును.



శ్లో. గోధూమపిష్టకం పూర్వ మష్టమాంశాజ్యమిశ్రితం ।
మర్దయే త్పూర్వవచ్చైనం కృత్వైతస్యైవ పోలికాం ॥
తత శ్చాజ్యేన సంలిప్య కృత్వా తాం చ చతుర్గుణాం ॥
పునశ్చంద్రసమాకారాం వేల్ల్య కృత్వా ప్రపాచయేత్ ॥
పునఃపునః ప్రవర్త్యైవ లఘుహస్తా విచక్షణా ।
పక్వా ముత్తారయే దేనాం పోలికేవ గుణై రియం ॥

తా. గోధుమపిండిలో ౧వ పాలు నేయికలిపి పూర్వమువలెమర్దించి గుండ్రముగ ఒత్తి నేయిచరిమి, ఆరొట్టెను మూడుకోణములువచ్చునట్లు నాలుగుమడతలు మడిచి తిరిగి గుండ్రముగవత్తి పెనముమీఁదవేసి కాల్చిపక్వమైనతరువాత యెత్తుకొనవలయు.

## పూరీలు.

శ్లో. సమితా చ షోడశాంశం ఘృతం విధిజ్ఞో విమర్దయే త్సమ్యక్ ।
గాఢం తత శ్చాంబునా విమర్దయే త్తాంరచయే త్తల్లోమిన్నాం ॥
శుక్తిమితాం వా స్వేష్టాం తత శ్చక్రికాం కృత్వా తల్లోమ్నాఖ్యః ॥
సంవేల్ల్య తాంచ సూక్ష్మాం విపాచయే ద్వైకటాహకే సఘృతే ॥
సా పూరికేతి కథితా స్నిగ్ధా గుర్వీ మరుత్పిత్తహర్త్రీ ।
శుక్రవర్ధినీ కాంతే! తథా దుర్జరా జరాపహా చాపి ॥
సైషైవా ఘృతమిశ్రేణ గోధూమ పిష్టకేన చ ।
కృతా లఘ్వీ గుణైః ఖ్యాతా పూర్వవత్పూరికా ప్రియే! ॥

తా. గోధుమపిండిలో ౧౬వ పాలు నేయికలిపి పిదపనీళ్లుపోసి మెత్తగపిసికి ఆపిండిని రెండేసితులములు ఎత్తుకొని పల్చగ గుండ్రముగ నొత్తి, నేతిబాణలిలోవేసి వేయించవలయు అది వేగి ఉబ్బును. దానిని ఎత్తిపెట్టుకొనవలయు. ఇది మెఱుఁగు నిచ్చును గురుత్వమును చేయును. వాత పిత్తములహరించును. శుక్రమునువృద్ధిచేయును. వృద్ధునికి తారుణ్యమును గలుగజేయును ఇవి నేయికలపకుండా వట్టినీళ్ళతోమర్దించి చేయఁబడినయెడల గురుత్వము లేకుండును.

## రొట్టెలు.

శ్లో. గోధూమచూర్ణకం కాంతే! మర్దయే దంబునా ఘనం ।
కించిత్కించిజ్జలం దత్వా మర్దయే చ్చ పునఃపునః ॥
యావన్మృదుతరం కుర్యా త్తతో లోమిన్నాం పలోన్మితాం ।
పశ్చా త్త చ్చక్రికాం కృత్వా హస్తాభ్యాం తాం విమర్ధయేత్

సంవేల్ల్య పర్ధయే ద్వాపి చంద్రమండల సన్నిభాం ।
తాం క్షిపే ల్లోహజే తప్తే క్షణైకేన ప్రవర్తయేత్ ॥
పున రంగారచక్రే చ క్షిపే న్నిర్ధూమకే హి తాం ।
ప్రఫుల్లాం వై యదా దృష్ట్వా తదా శీఘ్రం సముద్ధరేత్ ॥
సర్పిషా లిప్య తాం సమ్యక్ స్థాపయే ద్భాజనే శుభే ।
అర్పయే ద్ధరయే బల్యాం రుచ్యాం పుష్టిప్రదాం ప్రియే ! ॥
ధాతుసంవర్ధినీం గుర్వీం శ్లేష్మలాం వాతనాశినీం ।
భక్షయే త్స నర శ్చైనాం యస్యాగ్నిః ప్రబలో భవేత్ ॥

తా. గోధుమచూర్ణమును నీళ్లతో గట్టిగమర్దించి కొంచెము కొంచెము నీళ్లు చిలకరించుచు మెత్తగచేసి, నాలుగు తులములు చొప్పున పిండినితీసికొని ఉండలుచేసి గుండ్రముగఒత్తి పెనముమీఁదవేసి ముప్పాతికపాలువేగినతరువాత యెత్తి నిప్పుమీఁద వేసిన నది యుబ్బును. వెంటనే తీసికొని నేయిచరిమి పాత్రమునం దుంచుకొనవలయును ఇది రుచిగనుండును, పుష్టినిచ్చును. ధాతుపుష్టినిచేయును. గురుత్వమును కఫమును చేయును. వాతమునుహరించును. మిక్కిలి యాఁకలిగలవారు దీనినిభక్షింపవచ్చును.

శ్లో. గోధూమచూర్ణకే పూర్వం కించిదాజ్యం విమిశ్రయేత్ ।
మర్దయే దంబునా సమ్యక్ పూర్వవ చ్చాతియత్నతః ॥
తతో నింబుమితాం లోష్మ్నాం కృత్వాంగుష్ఠేన పీడయేత్ ।
నిర్ధూమే గోమయాంగారచక్రే సంపాచయే చ్చ తాం ॥
ప్రవర్త్య బహుధా పశ్చా దంగారై శ్ఛాదయే ద్దృఢం ।
క్షణా దుద్ధృత్య త ద్వహ్నౌ పూర్వవ త్పరివర్తయేత్ ॥
నీత్వా వికసితాం పక్వాం స్ఫోటయిత్వా ఘృతే క్షిపేత్ ।
సాంగారకర్కటీ బల్యా పౌష్టికీ శుక్రవర్ధినీ ॥
అగ్నిసందీపనీ లఘ్వీ కఫాతంకప్రణాశినీ ।
కాసశ్వాస ప్రహారణీ పీనసాతం కనాశినీ ॥

తా. గోధుమ పిండిలో కొంచెము నేయిపోసి కలిపి కొంచెము నీళ్లు చిలకరించి మర్దించి పెద్దనిమ్మకాయంత పిండి తీసికొని వెడల్పుగతట్టి పొగలేని పిడకలదాలి వేసిన చోట నునిచి పిడకనిప్పునుమూసి పగుల్లువిచ్చి కాలిన తరువాత యెత్తుకొని నేతిలో వేసియుంచవలయును. దీనిపేరు అంగార కర్కటి. ఇది బలమును పుష్టిని శుక్రమును



ఇచ్చును. జఠరాగ్నిని హెచ్చించును. చలువనిచ్చును. కఫరోగము, దగ్గు, శ్వాసము, పీనసరోగము వీనిని పోఁగొట్టును.

వేఢమిక.

శ్లో. మాషకాన్ విదలీకృత్య ప్లావయే దంబుని ప్రియే ! ।
సంక్షాళ్య నిస్తుషీకృత్య పేషయే దశ్మనా శ్మని ॥
పిష్ట్వా మేలాదికం కాంతే ! వేసవారం విమిశ్రయేత్ ।
శృంగిబేరం చ లవణం రామఠం జీరకం తథా ।
తతో గోధూమజం పిష్ట మంబునా మర్దితం భృశం ॥
తన్మధ్యే పిష్టికాం న్యస్య తన్ముఖం చ విముద్రయేత్ ।
తత శ్చంద్రసమాకారాం కృత్వా సంవేల్ల్య యత్నతః ॥
పాచయే ల్లోహజే తప్తే త్వంగారే హి విధూమకే ।
ప్రఫుల్లా ముద్ధరే దాశు మతా వేఢమికా హి సా ॥
బల్యా వేఢమికా వృష్యా రుచ్యో ష్ణా తృప్తికారిణీ ।
గుర్వీ పుష్టిప్రదా ధాతుమేద స్తన్య వివర్ధినీ ॥
పరిణామభవం శూలం గుదకీలం మరుద్వ్యథాం ।
అర్దితం శ్వసనం హంతి భేదినీ కఫపిత్తకృత్ ॥

తా. మినుములను నీళ్లలో నానవేసి పొట్టుతీసి రుబ్బి ఏలకులు మొదలగువాని అల్లము, ఉప్పు, ఇంగువ, జీలకఱ్ఱ వీనినివేసి కలిపిపెట్టుకొని గోధుమపిండిలో నీళ్ళు పోసి కలిపిముద్దచేసి యీపిండిలో మినప్పిండిని పెట్టి నోరుమూసి చంద్రబింబమువలె ఒత్తి పెనముమీఁదవేసి రెండుప్రక్కల త్రిప్పివేసి కాలినతరువాత తిరిగి పొగలేని నిప్పుమీఁదబెట్టిన నది యుబ్బును; తరువాత నేయిచరిమియెత్తిపెట్టుకొనవలయును. ఇది పుష్టిని బలమును ఇచ్చును. రుచిగనుండును. ఉష్ణముచేయును. తృప్తినిచ్చును. గురుత్వమునుజేయును. ధాతువును మేదస్సును వృద్ధిపరచును. స్త్రీలకు పాలనువృద్ధిచేయును, పరిణామశూల, గుదకీలము, వాతరోగము, అర్దితవాతము, శ్వాసము వీనిని పోగొట్టును. మలమును వెడలించును. కఫపిత్తములఁజేయును.

భాష్ట్రిజ.

శ్లో. ధాన్యానాం తండులానాం హి పిష్టం వస్త్రవిగాలితం ।
తతో ఒష్టమాంశకం సర్పి ర్మిశ్రయే దంబునా తతః ॥
మంథయిత్వా చ త ద్గోలం మృణ్మయే ఖర్పరే శుభే ।

శుద్ధభస్మప్రలిప్తే చ మందవహ్నిప్రతాపితే ॥
క్షిప్త్వా ప్రసారయే చ్ఛీఘ్ర ముత్సేధ మంగుళోన్మితం ।
పూర్ణచంద్రసమాకారాం పాచయే న్మందవహ్నినా ॥
ఛాదితా మన్యపాత్రేణ సుపక్వాం తు సముద్ధరేత్ ।
సచ్ఛిద్రాం తాం క్షిపే దుష్ణాం తప్తే క్షీరే సశర్కరే ॥
భ్రాష్ట్రిజైషా స్మృతా కాంతే! సూపశాస్త్రవిచక్షణైః ।
ప్రోక్తైషా దుర్జరా గుర్వీ వృష్యోష్ణా ధాతువర్ధినీ ॥

తా. బియ్యమును బాగుగకడిగి విసిరి వస్త్రగలితము చేసి ౧ా వ పాలునేయి పోసి నీళ్లుపోసి పిసికి, ఒక మంగలమును తెచ్చి, దానికిబూడిదపూసి పొయ్యిమీఁదఁ బెట్టి కాఁచి ఆమంగలములో, ఒకయంగుళముమందమున ఆపిండిని పోసి మూఁతపెట్టి మెల్లనిమంటతో వండవలయును; అది రంధ్రములుపడి పక్వమైనతరువాత తీసి చక్కెర వేసినపాలలో వేయవలయును. ఇది పుష్టినిచ్చును. ఉష్ణమును గురుత్వమును ధాతువృద్ధిని చేయును. ఆలస్యముగ జీర్ణమగును.

## పోళి.

శ్లో. ప్రస్థైకం చాణకం సూప మాఢకీసంభవం తు వా ।
పాచయే త్కే ప్రియే! తావ ద్యావదంగులిమర్దితం ॥
జ్ఞాత్వా నీరం పృథక్కృత్య సంక్షిప్య పాకకోవిదః ।
గుడం ప్రస్థం సపాదం వా శర్కరాం సార్ధప్రస్థికాం ॥
తులా దుత్తార్య వామోరు! పేషయే దశ్మనా శ్మని ।
యత్నతో లలనే! రమ్యే శుభే ఽమత్రే నిధాపయేత్ ॥
తతో గోధూమజంచూర్ణం మర్దయే దంబునా భృశం ।
తస్మా న్నింబుమితం పిష్టం పృథక్కృత్వా విచక్షణే! ॥
కృత్వా చ మూషికాకారం తన్మధ్యే తు ప్రపూరయేత్ ।
తత్పూర్ణం ముద్రయే త్తస్య ముఖం కృత్వా సుగోలకం ॥
చంద్రవత్పూలికాం తస్య కృత్వా తప్తే విపాచయేత్ ।
కించిదాజ్యసమాలిప్తే భూయో భూయః ప్రవర్తయేత్ ॥
పక్వాం జ్ఞాత్వా సముత్తార్య భూమిజాపతయే ఽర్పయేత్ ।
పూర్ణగర్భా పూలికేయం లఘ్వీ హృద్యా చ శీతలా ॥



దీపనీ రాజయక్ష్మఘ్నీ ప్రమేహఘ్నీ చ కీర్తితా ।
సైషైవ సర్పిషా పక్వా విశేషేణ గుణోత్తమా ॥

తా. ౧ సేరు సెనగపప్పునుగాని కందిపప్పునుగాని నీళ్లలోపోసివండి వ్రేలితో నద్దిన పొడియగుచుండిన పక్వమైనదని తెలిసికొని నీరును వంచివేసి, ౧ సేరుగాని ౧। సేరుగాని బెల్లము, చక్కెర అయినయెడల ౧౹సేరువేసి కలిపి రుబ్బి ఒకపాత్రము నందుంచవలయును. పిదప గోధుమపిండిలో నీళ్ళుపోసిపిసికి నిమ్మకాయంత పిండి తీసికొని వెడల్పుగతట్టి అందు పైఁజెప్పిన సెనగపిండి పూర్ణమునిచి ముఖమువూసి చంద్రమండలమువలె గుండ్రముగా ఒత్తి పెనమునకు నేయిరాచి దానిమీఁద పోళినివేసి రెండు ప్రక్కల త్రిప్పి వేయవలయును; పక్వముకాఁగానే తీసియుంచుకొనవలయును. ఇది లఘువుగ మధురముగ శీతలముగనుండును. అగ్నిదీపనమును జేయును. రాజయక్ష్మరోగమును ప్రమేహమును పోఁగొట్టును. దీనిని నేతిలో పక్వముచేసినయెడల విశేషగుణమునిచ్చును. సెనగపప్పు పూర్ణముగల పోళి రూక్షగనుండును. కఫము రక్తపిత్తము వీనిని హరించును. మలబద్ధమును గురుత్వమునుచేయును. నేత్రరోగము గలవారికి హితముగనుండును.

## రాగము.

శ్లో. అమ్లికాం తుల్యనీరేణ మర్దయే ద్గ్రాహయే ద్రసం ।
తత్సమం మాతులుంగస్య క్షోదం సింధూద్భవం సితాం ॥
క్షోదం పరూషకస్యాపి జృంభనీరం చ రాజికాం ।
అనుమానేన చైకథ్యం కృత్వా రాగోఽయ మీరితః ॥
కాంతే! రుచిప్రదో హృద్య శ్శుక్రల శ్చ ముఖప్రియః ।
పౌష్టిక స్తిక్తక స్స్వాదుః క్షార శ్చామ్లః ప్రకీర్తితః ॥
ముఖజిహ్వావిశుద్ధికరో రక్తపిత్తప్రకోపనః ।
నేత్రయో రహితో వృష్యః కఫకుష్ఠప్రకోపనః ॥
జడోఽతఊర్ధ్వగః కుర్యా త్కఫ మాధ్మానకారకః ।
తృషాం మూర్ఛాం భ్రమంఛర్దిం మేదోదోషం చ నాశయేత్ ॥

తా. చింతపండు-దీనికి సమానమునీళ్ళు వీనినికలిపి గొజ్జుచేసి, దీనికిసమానము మాదీఫలరసము, ఉప్పు, చక్కెర, ఖర్జూరపండ్లరసము, నిమ్మపండ్లరసము, ఆవాలు వీనిని కలిపిన రాగమనఁబడును. ఇది రుచిని పుట్టించును. మనోహరముగ నుండును. శుక్రమును చేయును. నోటికి రుచిగనుండును. పుష్టినిచ్చును. కొంచెము ఛేదుగ,మధు

రముగ కొంచెము ఉప్పుగ పుల్లగనుండును. నోటిని నాలుకను శుద్ధిచేయును. రక్త పిత్తరోగమును కఫమును కుష్టువును ప్రకోపింపఁజేయును. నేత్రములకు చెరుపునుచేయును. బలమునిచ్చును. గురుత్వమును చేయును. కఫమును పైకి వెడలించును. కడుపుబ్బరముచేయును. దప్పి మూర్ఛ భ్రమము వాంతి మేదోరోగము వీనినిపోగొట్టును.

ఖాండవము.

శ్లో. బీజపూరామ్రదాడింబచించాదధిఫలాదికాః ।
ఏషా మన్యతరస్యాపి చికిత్సా ఖాండవం ప్రతి ॥
తద్గృహీత్వా వినిక్షిప్య తత్ర సైంధవశర్కరే ।
గుడం వా హింగుసహితం దృషదా చ విపేషయేత్ ॥
కథితో మునిభి ర్వైద్యైః ఖాండవో రాగవద్గుణైః ॥

తా. మాదీఫలము, మామిడిపండు, దానిమ్మగింజలు, చింతపండు, వెలగపండు వీనిలో దేనినైనను తీసికొని - ఉప్పు, చక్కెర (లేక) బెల్లము, ఇంగువ వీనినివేసి రాతిమీఁద నూరవలయు. ఇది రాగగుణము గలిగియుండును.

రాగఖాండవము.

శ్లో. ఆమ్ర మామం సమీచీనం త్వగ్యష్టిరహితం ప్రియే ! ।
ద్విధా త్రిధా చతుర్ధా వా ఫలమానేన ఖండయేత్ ॥
ఏవం ప్రస్థం రసాలానాం ఖండానాం మధురప్రియే ! ।
సర్పిషా భర్జ్య తా నీష న్మృత్పాత్రే చ నిధాపయేత్ ॥
ప్రస్థత్రయసితాపాకే త్రితారే తాని సంక్షిపేత్ ।
అంగులీద్వితయే పశ్చా త్పాకం నీత్వా నిరీక్షయేత్ ॥
భూయోభూయః ప్రయత్నేన చైకతంతు ర్యదా ద్వయోః ।
అంగుల్యోరంతరే పశ్యే జ్జానీయా దేకతారకం ॥
యది తంతు ర్నదృశ్యేత కించిదస్యాం సితాం క్షిపేత్ ।
దృష్ట్వా తు తం సముత్తార్య మరీచైలాదిభావితం ॥
కృత్వా సుశీతలం పశ్చాత్ కాచపాత్రే నిధాపయేత్ ।
అథవా మార్తికే పాత్రే లాక్షాలిప్తాంతరే ప్రియే ! ॥
అయం హి పౌష్టిక స్స్నిగ్ధో గురు స్స్వాదు ర్బలప్రదః ।
తృప్తిద శ్చ వరారోహే ! వాతపిత్తారుచిప్రణుత్ ॥
కాంతిర క్తవికారంచా నురక్తే ! రాగఖాండవః ॥



తా. మామిడికాయలను చెక్కుతీసి విత్తులనుతీసివేసి - మూడు,(లేక)నాలుగు ముక్కలుఁగకోసి ౭ర తులములు ముక్కలను నేతితోవేయించి ఒక కుండయందుంచవలయు. తరువాత ౧౫ తులముల చక్కెరను 3 తీఁగలపాకముపట్టి అందులోముక్కలనువేసి కొంతదడవు ప్రొయ్యిమీఁదనునిచి మంటవేసి ౧ తీఁగపాకమగునట్లు కాఁచి, ఒకతీఁగఁగారానియెడల కొంచెము చక్కెరవేసి ౧ తీఁగవచ్చువఱకుకాఁచిదించి- మిరియాలు, పిన్నయేలకులు, వీనిని పొడిచేసి - అదిచల్లారినతరువాత అందులోవేసి కలిపి గాజుపాత్రమునందుఁగాని కుండయందుఁగాని యుంచవలయు. ఇది పుష్టిని మెఱుఁగును ఇచ్చును, గురుత్వమునుచేయును. రుచిగనుండును. బలమును తృప్తిని ఇచ్చును. వాతము-పిత్తము-అరుచి-రక్తరోగము వీనిని పోఁగొట్టును.

ఆమ్రలేహము.

శ్లో. భర్జయే త్తరుణం స్వామ్రం తద్రసే చ విమిశ్రయేత్ ।
శర్కరాం సుగుడం వాపి తత్సమం మధురాధరే ! ॥
తతో వింశాంశకం చూర్ణం పటు వల్లిజహింగుజం ।
ఆమ్రలేహాహ్వయ మబ్జాక్షి! హృద్య స్తృప్తిప్రదో గురుః॥
స్నిగ్ధో రుచిప్రదః కాంతే ! మధురో మధురస్వరే ! ॥

తా. దోరమామిడికాయలను తఱిగి రసముతీసి దానిలో-చక్కెరనుగాని బెల్లమునుగాని సమానముగకలిపి, ౨౦-వపాలు - ఉప్పు, మిరియాలు, కాల్చిన యింగువ వీనినిపొడిచేసి వేయవలయు; ఇది మనోహరముగనుండును. తృప్తినిచ్చును గురుత్వమునుచేయును. మెఱుఁగునిచ్చును. రుచినిపుట్టించును. మధురముగనుండును.

పానకములు.

శ్లో. ద్రాక్షామ్లికా పరూషాదిఫలా నంబురుహేక్షణే ! ।
నీరే సప్తగుణే క్లిన్నా న్యబ్జహస్తే ! విమర్దయేత్ ॥
వస్త్రపూతే క్షిపే త్తస్మిన్ శర్కరాం ద్రవ్యత స్సమాం ।
వింశాంశం పత్రిమరిచం త్వగార్ద్రైలా గజోద్భవం ॥
సకర్పూరం క్షిపే చ్చూర్ణం పానకం తత్ప్రకీర్తితం ।
పానకం మూత్రలం హృద్యం తృప్తికృ త్తృణ్మదాపహం ॥
వాతవాంతిశ్రమగ్లానిఘ్నం మూర్ఛాపిత్తదాహనుత్ ।
తద్ద్విధామ్లం చ మధురం గుణై స్తుల్యౌ ప్రకీర్తితౌ ॥
ద్రాక్షాయాః పానకం దాహశ్రమగ్లానితృషాపహం ।

రక్తపిత్తం చ మూర్ఛాం చ నిహన్యా దబ్ధిజాసనే ! ॥
విష్టంభకారకం హృద్యం బాదరం చ పరూషజం ।
అమ్లికాఫలసంభూతం పానకం చ శ్రమాపహం ॥
దాహచ్ఛర్ది తృషావాత కృమిభ్రాంతినివారణం ।
కంఠతాలూద్భవం శోషం నాశయే దితి కీర్తితం ॥

తా. ద్రాక్ష-చింతపండు-ఖర్జూరము ఈపండ్లను ఏడింతల నీళ్లలో వేసి పిసికి వడియకట్టి, పండ్లరసమునకుసమానము కలకండపొడినికలిపి, వీనికి ౨ంవపాలు- జాపత్రి, మిరియాలు, లవంగపట్ట, అల్లము, ఏలకులు, నాగకేసరాలు, పచ్చకర్పూరము వీనినిపొడిచేసి దానిలో వేయవలయు. దీనిపేరు పానకము ఇది మూత్రమును వృద్ధిపరచును. మనోహరముగనుండును. తృప్తినిచ్చును. దప్పి, మదము, వాతము, వాంతి, శ్రమము, గ్లాని, మూర్ఛ, పిత్తము తాపము వీనిని పోగొట్టును. ఇది పులుపు, తీపు అని రెండువిధములు; రెంటికిని గుణము సమానముగనుండును. ద్రాక్షాపానకము, తాపము, శ్రమము, గ్లాని, దప్పి, రక్తపిత్తరోగము, మూర్ఛ వీనిని పోగొట్టును. రేగుపండ్లపానకము-ఖర్జూరపానకము ఇవి-మలబద్ధమును చేయును. హృదయమునకు హితముగనుండును. చింతపానకము - శ్రమము, తాపము,వాంతి, దప్పి, వాతము,క్రిములు, భ్రాంతి, కంఠశోషము, తాలుశోషము (దౌడలెండుట) వీనిని పోగొట్టును.

పంచసారమనుపానకము.

శ్లో. ద్రాక్షామధూష ఖర్జూర దాడింబబదరోద్భవం ।
గుడేక్షురస కర్పూర చాతుర్జాతోషణై ర్యుతం ॥
పంచసారాభిధం పానం తృప్తికృ ద్గురు మూత్రలం ।
విష్టంభకారకం హృద్యం శ్రమగ్లానితృషాపహం ॥

తా. ద్రాక్ష, ఈత, ఖర్జూరము, దానిమ్మ, రేగు,ఈపండ్లరసములో-బెల్లము పచ్చకర్పూరము-లవంగపట్ట-తమాలపత్రము-ఏలకులు-నాగకేసరాలు-పిప్పళ్ళు వీనిపొడిని కలపవలయు. ఈపానకము మలబద్ధమును చేయును. తృప్తినిచ్చును. గురుత్వమును చేయును. మూత్రమును వృద్ధిచేయును. మనోహరముగనుండును. శ్రమము గ్లాని దప్పి వీనిని పోగొట్టును.

వర్ధమానసట్టకము.

శ్లో. ఘనం దధి ప్రియే ! ప్రస్థం ప్రస్థార్ధా శుభ్రశర్కరా ।
వ్యోషా జాజీభవం చూర్ణం కర్షైకం మదిరేక్షణే ! ॥
పక్వదాడింబబీజాని చతురామ్రాణి మిశ్రయేత్ ।
హస్తే నాలోడయే త్సిద్ధ స్సట్టకోఽయ ముదాహృతః ॥
వర్ధమానాభిధో బల్యో దీపనో రుచికారకః ।
గురు స్తృప్తికర స్స్వర్య శ్శ్రమగ్లానితృషాపహః ॥
వాతపిత్తహరః పీనో రోజకే! మధురాధరే ! ॥

తా. గట్టిపెరుగు ౧ సేరు, తెల్లచక్కెర ౪ సేరు, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, జీలకఱ్ఱ వీనిపొడి ౧ తులము, దానిమ్మపండువిత్తులు ౹ సేరు, వీనినిఅన్నిటినికలిపి పిసికి యుంచుకొనవలయు; ఇది బలమునిచ్చును. అగ్నిదీపనమును చేయును. రుచినిచ్చును. గురుత్వమును చేయును. తృప్తినిచ్చును. కంఠస్వరమునకు హితకరముగ నుండును. శ్రమము-గ్లాని-దప్పి-వాతము-పిత్తము వీనిని బోగొట్టును.

సోమసట్టకము.

శ్లో. ఘనం దధ్యాఢకం కాంతే ! సితా ర్ధాఢకసమ్మితా ।
త్రికట్వగ్నిభవం చూర్ణం పలైకం చ విమిశ్రయేత్ ॥
గాలయే త్సూక్ష్మవస్త్రేణ తతో భాండే నిధాపయేత్ ।
పక్వదాడింబబీజాని ప్రస్థికాని ఘనస్తని ! ॥
మిశ్రయిత్వా జనైః ఖ్యాత స్సోమాస్యే ! సోమసట్టకః ।
వర్ధమానకవచ్చాయం గుణై ర్గుణవతి ! ప్రియే ! ॥

తా. గట్టిపెరుగు ౨౧౬ తులములు, చక్కెర ౧౨౯ తులములు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, చిత్రమూలము వీనిపొడి ౮ తు, వీనిని కలిపి వడియగట్టి,భాండమునందునిచి, ౬౮ తులములు దానిమ్మపండువిత్తులువేసికలపవలయు. దీనిపేరు సోమసట్టకము. ఇది వర్ధమాన సట్టకగుణము గలిగియుండును.

ప్రమోదసట్టకము.

శ్లో. సుఘనం హి దధి ప్రస్థం ప్రస్థార్ధా శర్కరా ప్రియే ! ।
చంద్రవ్యోషలవంగానాం చూర్ణం కర్షప్రమాణకం ॥
మిశ్రయే ద్గాలయే చ్చాపి సూక్ష్మవస్త్రేణ యత్నతః ।
పక్వదాడింబబీజాని చతుర్బిల్వాని మిశ్రయేత్ ॥
స్థాపయే న్మృణ్మయే భాండే ప్రమోదాయ నృణా మయం ।
ప్రమోదసట్టకః ఖ్యాతో వర్ధమానసమో గుణైః ॥

తా. గట్టిపెరుగు ౭౨ తు, చక్కెర ౩౨ తు, పచ్చకర్పూరము-సొంటి-పిప్పళ్ళు-మిరియాలు-లవంగాలు వీనిపొడి ౧ తులము, వీనినికలిపి వడియకట్టి-౧౬ తులములుదానిమ్మపండ్ల విత్తులువేసి కుండయందుంచవలయు. దీనిపేరు ప్రమోద సట్టకము. ఇదియు వర్ధమానసట్టకగుణమే గలిగియుండును.

### మంథకృతి గుణములు.

శ్లో. సక్తూన్ ఘృతే మిశ్రయిత్వా జలేనసహ ఘోలయేత్ ।
నాతిద్రవం నాతిఘనం సమంథో బలద స్మృతః ॥
పరిణామే బలహరో మధుర శ్శీతల స్తథా ।
వర్ణపుష్టిస్థైర్యకారీ దాహతృట్ శ్రమఛర్దిహా ॥
ప్రమేహక్షయకుష్ఠానాం నాశనః పరికీర్తితః ॥

తా. పేలపిండిలో నెయ్యికలిపి నీళ్ళుపోసి మిక్కిలి ద్రవముగను మిక్కిలిగట్టిగను కాకుండకలిపి భక్షించిన - బలమునిచ్చును. పాకమునందు బలమును హరించును. మధురముగ శీతలముగనుండును. కాంతిని పుష్టిని స్థైర్యమును చేయును. తాపము,దప్పి, శ్రమము, వాంతి, ప్రమేహము, క్షయము, కుష్టువు వీనిని పోగొట్టును.

శ్లో. సగుడామ్లఘృతై స్సార్థం భక్షితో మూత్రకృచ్ఛ్రహా ।
ఉడావర్తహర శ్చైవ సమితేక్షురసై ర్యుతః ॥
ద్రాక్షాభి ర్భక్షితో నిత్యం వాతరక్తవినాశనః ।
పిత్తస్య నాశన శ్చోక్త స్సద్రాక్షామధునాసహ ॥
జలేన ఘోలిత శ్చోక్తః కఫనాశకరో మతః ।
అమ్లేక్షుఘృతశీతాభి ర్మధుద్రాక్షాగుడై స్సహ ॥
భక్షిత శ్చ మలాన్ దోషాన్ యథామార్గేణ వాహకః ।
సక్తు శ్చ శర్కరాసర్పి ర్యుక్తో గ్రీష్మేఽతిపూజితః॥
శుక్రల శ్చ లఘు ర్బల్య శ్శీత స్తృప్తి రుచిప్రదః ॥

తా. పేలపిండిని-బెల్లము, చింతపండు నేయి వీనితోడ భక్షించిన మూత్రకృచ్ఛ్రరోగము హరించును. చెఱకు రసముతోడను చక్కెరతోడను భక్షించిన ఉదావర్తరోగము హరించును. ద్రాక్షపండ్లతో భక్షించిన వాతము రక్తము నశించును. ద్రాక్షపండు, తేనె వీనితోడ భక్షించిన పిత్తముహరించును. పట్టినీళ్లలోకలిపి భక్షించిన కఫముహరించును. పులుసు, చెఱకుపాలు, నేయి, చక్కెర, తేనె,ద్రాక్షబెల్లము



వీనితోడ భక్షించిన మలమును వెడలించును. వాతాదిదోషములను స్వస్థపరచును. ఈచెప్పినవానిలో నీళ్ళుకలిపి తినుట ఉత్తమము, చక్కెర, నెయ్యి వీనితోడ ఎండకాలమునందు భక్షించిన శ్రేష్ఠము. శుక్రము నిచ్చును. లఘువుగనుండును. బలమునుచేయును. శీతలముగనుండును. తృప్తిని రుచిని ఇచ్చును.

### ధానాకృతి గుణములు.

శ్లో. ధానా భ్రిష్టయవా గుర్వ్యో మేదశ్ఛర్దికఫాపహాః ।
లేఖనా దుర్జరా రూక్షా వాతలా స్తృట్ప్రదాః ॥
మలబంధకరాః ఖ్యాతా రూపశీలధనాగ్రగే! ॥

తా. జొన్నపేలపిండి గురుత్వమును చేయును. మేదోరోగము,వాంతి,కఫము వీనిని పోగొట్టును. ధాతువును మలమును శుష్కింపఁజేయును. శీఘ్రముగ జీర్ణము కాదు. రూక్షగ నుండును. వాతమునుచేయును. తృప్తిని దప్పిని చేయును. మలమును బంధించును.

### పేలాలగుణము.

శ్లో. శాలయ స్సతుషా భ్రిష్టాః ప్రఫుల్లా నిస్తుషీకృతాః ।
లాజాఖ్యా మధురా లఘ్వ్యో రూక్షా స్సందీపనా హిమాః ॥
స్వల్పమూత్రమలా బల్యా దాహపిత్తకఫాపహాః ।
ఛర్ద్యతీసారతృణ్మేదోరక్తమేహాపహా శ్చ తాః ॥

తా. వరిపేలాలను పొట్టునుతీసి భక్షించిన మధురముగ లఘువుగ రూక్షగనుండును. అగ్నిదీపనమును చేయును. శీతలముగనుండును. కొంచెము మలమూత్రములఁజేయును. బలమునిచ్చును. తాపము, పిత్తము, కఫము, వాంతి, అతిసారము, దప్పి, మేదోరోగము, రక్తప్రమేహము వీనినిపోఁగొట్టును.

### అటుకుల గుణము.

శ్లో. వాలుకాయాం సుతప్తాయా మార్ద్రాం శ్శాలీన్ విభర్జయేత్ ।
శీఘ్ర ముష్ణాం స్తతః కుట్టే దులూఖలగతాన్ భృశం॥
చర్పటా స్తు యదా తే స్యు స్తదా శూర్పేణ శోధయేత్ ।
అభావే చార్ద్రశాలీనా మత్యుష్ణేఽంబుని సంక్షిపేత్ ॥
శాలీన్ పర్యుషితాన్ నీత్వా జలా ద్వస్త్రే నిపీడ్య చ ।
నిర్జలాన్ భర్జ్య సంకుట్య శూర్పేణైవ చ శోధయేత్ ॥

తే స్మృతాః పృథుకాః కాంతే ! గురవః కఫకారకాః ।
వాతాతంకహరా శ్చాపి విశేష మపరం శృణు ! ॥
సితా దుగ్ధాన్వితా బల్యా స్సారా వృష్యా శ్చ శుక్రలాః ।
వాతఘ్నాః కఫలాః ప్రోక్తాః పృథుకాః పృథుకాన్వితే ! ॥
వాలుకాయాం పునర్భ్రష్టా శ్చిపిటా స్తే ప్రఫుల్లితాః ।
స్వాదుపాకా స్త్రిదోషఘ్నా విశేషా ద్రుచికారకాః ॥

తా. ౘ పాలు పండిన ఎఱ్ఱని తెల్లని పచ్చివడ్లను చట్టిలోపోసి వేయించి ఱో టిలోవేసి దంచి పలుచగ అటుకులు కాఁగానే చేటలోపోసి చెరిగి యెత్తిపెట్టుకో నవలయు. పచ్చివడ్లు దొరకనియెడల - నీళ్లు ఎసరుపెట్టి అందులో వడ్లనుపోసి- ఒక దిన మూరనిచ్చి నీరునువడిచి వేఁయించిదంచి చేఁటలోచెరిగి యెత్తిపెట్టుకొనవలయు. ఇవి గురుత్వమును కఫముసు చేయును. వాతరోగమును పోఁగొట్టును. వీనిని చక్కెర తోను పాలుతోను భక్షించిన బలమునిచ్చును. విరేచనము చేయించును. పుష్టిని,ధాతు పుష్టినిచేయును. వాతమును హరించును. కఫమునుచేయును. వీనిని ఇసుకలోవేయిం చిన నుబ్బును; దీనిపేరు చిపిటములనఁబడును. ఇవి రుచిగనుండును. త్రిదోషముల హరించును.

## ఓలంబీకృతిగుణములు.

శ్లో. గోధూమా న్వా యవా నార్ద్రా నర్ధపక్వా న్సమాహరేత్ ।
సనాలా న్మంజరికాం బధ్వా నాళే గ్రాహ్యా విభర్జయేత్ ॥
తృణప్రజ్వాలితాయాం చ జ్వాలాయా మతియత్నతః ।
తన్మంజరీ శ్చ్యుతా న్నాలా త్తస్మి న్నగ్నౌ చ పూరయేత్ ॥
క్షణా దుద్ధృత్య సంమర్ద్య శూర్పేణ చ విశోధయేత్।
సోలంబీ వాతపిత్తఘ్నీ గుర్వీ శ్లేష్మబలప్రదా ॥

తా. గోధుమలు, యవలు, (జొన్నలు) ఇవి సగముపండియుండగా చెట్టువేరు తోఁగూడ తెచ్చి కట్టలుగకట్టి, కాఁడలు చేతపట్టుకొని గడ్డిమంటలో కాల్చి చేతితో మర్దించి గడ్డినితీసివేసి చేఁటతో చెరిగి భక్షించవలయు; దీనికి ఓలంబి అనిపేరు. ఇది వాతపిత్తములఁ బోఁగొట్టును. గురుత్వమునుచేయును. కఫమును బలము నిచ్చును.

## సెనగలగుణము.

శ్లో. వాజిమంథో హిమో ऽ పక్వో రోచన స్తర్పణ స్తథా ।
తృషాదాహాశ్మరీమేదో దోషఘ్న శ్చ కషాయకః ॥



ఈషత్క ఫకరో బాలే ! శుక్రలః పరికీర్తితః ।
సచాంగారై శ్చ సంభ్రష్ట స్తైలభ్రష్ట శ్చ తద్గుణః ॥
ఆర్ద్రభ్రష్టో బలకరో రోచన శ్చ ప్రకీర్తితః ।
శుష్కభ్రష్టో ऽ తిరూక్ష స్స్యా ద్వాతకుష్ఠ ప్రకోపనః ॥
స్విన్నః పిత్తకఫౌ హన్యా ద్గురూ రూక్ష శ్చ వాతలః ।
ఆర్ద్రోऽతికోమలో రుచ్యో రక్తపిత్త హరో హిమః ॥

తా. పచ్చిసెనగలు శీతలముగ నుండును. విరేచనమును చేయించును. తృప్తి నిచ్చును. దప్పి-తాపము-మూత్రకృచ్ఛ్రరోగము-మేదోరోగము వీనిని పోఁగొట్టును. వగరుగ నుండును. కొంచెము కఫమును శుక్రమునుచేయును. నిప్పులమీఁద కాల్చినవి యును-నూనెలో పక్వము చేయఁబడినవియు పైగుణమే గలిగియుండును. తడిపివేయిం చిన సెనగలు-బలమును రుచినిచ్చును. ఇసుకలోవేయించిన సెనగలు అతిరూక్షముగ నుండును. వాత పిత్తములు బ్రకోపింపజేయును. ఉడకపెట్టిన సెనగలు- పిత్తకఫముల హరించును. గురుత్వమును చేయును. రూక్షగనుండును. వాతమునుచేయును. నానబో సినసెనగలు-మెత్తనైరుచిగనుండును. రక్తపిత్తమును పోఁగొట్టును.శీతలముగనుండును.

## కుంకుమోదనకృతిగుణములు (కేసరిభాత్.)

శ్లో. ప్రస్థైకం తండులానాం భో ! జీర్ణానా మలికుంతలే ! ।
సూక్ష్మాణా మాఢకే నీరే పాచయస్వ శనై శ్శనైః ॥
అర్ధపక్వే చ విస్రావ్యా తత శ్చేమం విధిం కురు ।
తండులాంస్తాన్ బృహత్పాత్రే కృత్వా దర్వ్యాం ప్రసార్య చ॥
బాదామంకుడవం ద్రాక్షాం కుడవైకాం సుశోధితాం ।
సార్ధప్రస్థాం సితాం శుద్ధాం కుడవైకం నికోచకం ॥
కుంకుమం నీరసం పిష్టం సర్వం యత్నా ద్విమిశ్రయ ।
భాండ మన్య త్తత శ్చుల్ల్యాం తప్తం కృత్వా ఘృతం క్షిప ॥
సార్ధప్రస్థం ఘృతే తప్తే కోలం దేవసుమం క్షిప ।
క్షణ మాచ్ఛాద్య చోద్ఘాట్య యద్ద్రవ్యం తండులాదికం ॥
తత్సర్వం చ ఘృతే తస్మిన్ క్షిప్త్వా సంచాల్య ఝుంపయ ।
తత శ్శీఘ్రం సముత్తార్య నిర్ధూమాంగారకే న్యస ॥
యావన్మృదు తత శ్చాన్యే విస్తీర్ణే భాజనే కురు ।

తత్ర పుష్పసితాం కాంతే! కుడవై కాంకణాకృతిం ॥
కర్ష మేలారజః కోలం లవంగం చ విమిశ్రయ ।
ఇదం బల్యం స్వాదు వృష్యం పుష్టిదం కుంకుమోదనం ॥

తా. ౬౮ తులములు సన్నని మంచి ప్రాంత బియ్యమును ౮ పాళ్ళ నీళ్ళలో వండి సగముడికినతరువాత వార్చి ఆయన్నము నొకపాత్రమునందువేసి అర్చి-బాదముపప్పు (దీనిని వేడినీళ్ళలో నానబెట్టి పొట్టును తీయవలయు) ౧౬ తులములు, ద్రాక్షపండు ౧౬ తులములు, పిస్తా (ఊడుగ) విత్తులు ౧౬ తు, తెల్లచక్కెర ౩౨ తులములు, ౮ తులముల నీళ్ళలో ౧ తులం కుంకుమపువ్వునువేసి పిసికి ఆనీళ్లు, వీనినన్నిటిని బాగుగకలిపి పెద్దపాత్రను పొయ్యిమీఁదనునిచి ౯౬ తు, నేయిపోసి కాఁచి లవంగాలపొడి । పలంవేసి కొంచెముసేపుమూసియునిచి దానిలో పైయన్నమునువేసి బాగుగ కలపవలయు. పిదప దించి మెత్తగనగువఱకు నిప్పులమీఁద నుంచి ఒక వెడల్పాటిపాత్రమునందు ఆరపోయవలయు; దానిలో కలకండపొడి ౧౬ తు, ఏలకులపొడి ౧ తు, లవంగాలు ౪ తు, వీనిని కలపవలయు. దీనిపేరు కేసరిభాత్. ఇది బలము నిచ్చును. రుచిగనుండును. శుక్రమును వృద్ధిచేయును. పుష్టినిచ్చును.

ఇక్షురసోదనము.

శ్లో. తండులానాం సుధౌతానాం ప్రస్థైక మైక్షవే రసే ।
పాచయ త్వం వరారోహే! పక్వే తూత్తారయ ద్రుతం ॥
కుడవైకం ఘృతం తత్ర కర్ష మేలాభవం రజః ।
మిశ్రయిత్వా తతః కోష్ణం భూమిజాపతయే ఽర్పయ! ॥
ఇదం బల్యం చ వృష్యం చ రుచ్య మిక్షురసోదనం ।
విశ్వచూర్ణయుతంచే త్సా ద్దామదోషహరం భవేత్ ॥

తా. బాగుగ కడిగిన మంచిబియ్యము ౬౮ తులములుతీసికొని చెఱకుపాలలో నుడకబెట్టి అందు ౧౬ తులములు నెయ్యి, ౧ తు-ఏలకులపొడి వీనిని కలపవలయు. ఇది బలమునిచ్చును పుష్టినిచేయును. రుచిగనుండును. సొంటిపొడి కూడవేసిన, ఆమ (అపక్వ) దోషమును పోగొట్టును.

హలువా.

శ్లో. గోధూమాన్ ప్లావయే న్నీరే త్రిదినం వా చతుర్దినం ।
తతః కరాభ్యాం సమ్మర్ద్య పృథక్కృత్వా జలా చ్చ తాన్ ॥



తన్నీరం వాససా గాల్య నిశ్శేషం స్థాపయే త్తతః ।
స్థిరీభూతే జలం యత్నా త్పాత్రా న్నిష్కాసయే చ్ఛనైః ॥
అన్య మంబు వినిక్షిప్య స్థిరీభూతే తు పూర్వవత్ ।
జలం నిష్కాసయే ద్దేవం యావద్యాతి విగంధతా ॥
తావ త్పునఃపున ర్నీరం దత్వా నిష్కాస్య శోధయేత్ ।
పిష్టవ ద్యద్ధి త త్పాత్రం భవే త్తత్సత్వ మీరితం ॥
సార్ధభాగాం హి సత్వస్య సితాం నీరే సమే పచేత్ ।
ద్వితారే చ సితాపాకే తత్సత్త్వం చ శనైశ్శనైః ॥
క్షిపన్ సంచాలయే ద్దర్వ్యా యావద్గాఢం భవే త్ప్రియే! ।
తత స్త్వాజ్యం క్షిపన్ యుక్త్యా చాలయిత్వా తివేగతః ॥
సిద్ధం జ్ఞాత్వా సముత్తార్య ఘట్టయే చ్చ భృశం దృఢం ।
తత్ర బాదామఖండాని చైలా చూర్ణాదికం క్షిపేత్ ॥
హలువేతి జనైః ఖ్యాతః పౌష్టికో ఽయం బలప్రదః ।
గురు శ్శ్లేష్మకరో హంతి వాతపిత్తే రుచిప్రదః॥

తా. గోధుమలను-మూడు, (లేక) నాలుగు దినములు నీళ్లలో నానబెట్టి, తరువాత చేతులతో పిసికి నీరునువంచి పొట్టుతీసివేసి తిరిగి నీళ్లుపోసిపిసికి వడియకట్టి, ఈప్రకారము వాసనపోవువఱకు పైనీళ్లు పారపోయుచు క్రిందికిదిగిన సత్వమును, ఒక పాత్రమునం దుంచుకొనవలయు. దానిని ఎండలోపెట్టిన పిండియగును. ఆపిండికి ౧౪ పాలు చక్కెరను- సమానజలమునందువేసి ౨ తీఁగలపాకముపట్టి అందు. ఆసత్వమును మెల్లమెల్లగవేసి గరిటెతోగట్టియగువఱకు కలియబెట్టి కొంచెము కొంచెము నేయిపోయుచు వేగముగ కలియబెట్టవలయు పిదప దించి బాగుగ కలపవలయు. అప్పుడు గట్టిపడును. అందులో బాదముపప్పుతునుకలను ఏలకులపొడినివేయవలయు. దీనిపేరు హల్వా. ఇది పుష్టిని బలమును ఇచ్చును. గురుత్వమును కఫమును చేయును. రుచినిచ్చును. వాతపిత్తములఁ బోగొట్టును.

ఫేడాకృతిగుణములు.

శ్లో. దుగ్ధకిట్టే సితాం క్షిప్య షోడశాంశం చ భర్జయేత్ ।
యావచ్ఛుష్కం భవే త్తావ ద్ఘృత మీష దపి క్షిపేత్ ॥
తతః కిట్టసమాం కిట్టే శుభాం పుష్పసితాం ప్రియే! ।
మిశ్రయిత్వా చ తస్యాశు రచయిత్వా హి పిండకాన్ ॥

లోకే ఫేడా ఇతి ఖ్యాతా వాతపిత్తహరా మతాః ।
ధాతుసంవర్ధనాః కాంతే! వృష్యా బల్యాః కఫప్రదాః ॥

తా. పాలను కోవాచేసికొని (ముద్దయగువఱకు కాఁచి) ఒక పాలు చక్కెర కలిపి వేయించవలయు. వేగినతరువాత కొంచెము నేయిపోయవలయు. తరువాత పాల ముద్దకు సమముగ తెల్లచక్కెరకలిపి ముద్దలు చేయవలయు. దీనికి "ఫేడా"అనిపేరు ఇది వాతపిత్తములఁబోఁగొట్టును. ధాతువృద్ధిని పుష్టిని బలమును కఫమును ఇచ్చును.

మఱియొకవిధము

౮ సేర్లపాలు, ౪ సేరు చక్కెర, ౧ సేరునేయి వీనిని ఇత్తడిపాత్రములో వేసి ప్రొయ్యిమీఁదఁబెట్టి కలియబెట్టుచుండవలయు. అదిముద్దయగును. దానినిదించి యొక పళ్ళెములోవేసితట్టి నాలుగు కోణముల బిళ్లలుగకోసి, బాణలిలో నేయిపోసి కాఁచి అందులో ఆబిళ్లను నేతిలోవేసి వేయించవలయు. పక్వమైనతరువాత దించి ఒకతీఁగ పాకములోవేసి వేరుపాత్రమునందుంచి ఏలకులపొడి చల్లవలయు.

బరఫీకృతిగుణములు.

శ్లో: దుగ్ధకిట్టే సితాం క్షిప్య షోడశాంశం ఘృతాన్వితం ।
భర్జయే ల్లలనే! తావ ద్యావ చ్ఛుష్కతరం భవేత్ ॥
కిట్టతుల్యాం సితాం శుద్ధాం పాచయిత్వా విధానతః ।
త్రితారే చాపి తత్పాకే తత్కిట్టం మిశ్రయే త్తతః ॥
సముత్తార్య ద్రుతం దర్వ్యా ఘట్టయే చ్చాతివేగతః ।
యదా పాకే కణా దృష్ట్వా స్తదా శీఘ్రం వినిక్షిపేత్ ॥
ఘృతాక్తే విస్తృతే పాత్రే యుక్త్యా తం చ ప్రసారయేత్ ।
ద్వ్యంగులోత్సేధకం శీతే కృత్వా ఖండా న్యయే ప్రియే! ॥
చతుఃకోణాని ఖండాని బరఫీతి జనై రియం ।
విఖ్యాతా పౌష్టికీ వృష్యా బల్యా దోషత్రయాపహా ॥

తా. పాలను కోవాచేసి దానికి ౧౬-వభాగము తెల్లచక్కెర,కొంచెము నేయి పోసి పొయిమీఁదఁబెట్టివేయించి తరువాత పాలకుసమభాగము తెల్లచక్కెరనుమూడు తీఁగలపాకముపట్టి అందులో పాలకోవానువేసి గరిటెతో కలియబెట్టుచుండిన నూకలవలె నగును; దానిని నేయిచరిమిన పళ్లెములో వేసి పరిచి సమముగ తట్టవలయు; చల్లారినవెనుక-నాలుగుమూలలుగల బిళ్ళలుగ కోయవలయు. దీనిపేరు "బరఫీ"ఇది పుష్టిని బలమునుఇచ్చును. శుక్రవృద్ధినిచేయును. త్రిదోషముల హరించును.



చక్కెరపార.

గోధుమపిండిలో నేయికొంచెమువేసి బాగుగపిసికి కొంచెము ఓమము,ఇంగువ, జీలకఱ్ఱ-ఉప్పు-వీనినివేసి కొంచెము నీళ్లుపోసి గట్టిగపిసికి నాలుగుకోణములుగల బిళ్ళలుగఒత్తి-నేతిలోవేసి యెఱ్ఱగ నగునట్లు వేయించవలయు.

తియ్యనిపూరి.

గోధుమపిండి ౧ సేరు, పాతికవరకసేరునేయి, ౧ సేరుకలకండ వీనిలోకొంచెము వేడినీళ్ళుపోసికలిపి, పిస్తావిత్తులు పరకసేరు, పరకసేరుబాదముపప్పు,పరకసేరు అల్లపురసము,లవంగపట్ట ౨ తులములు,లవంగాలు ౨ మాడలయెత్తు వీనిని పొడిచేసి యొక చోటనుంచి-పొయిమీఁద బాణలిలో నేయిపోసి-పిండితీసికొని బిళ్లలుతట్టి అందులో పైపొడిని కొంచెము కొంచెముపెట్టి నోరుమూసి గుండ్రముగ ఒత్తి నేతిలో వేయించవలయు. అది యుబ్బును.

ఊరుగాయలు, మామిడి ఆవకాయ.

ముదిరిన మంచి పుల్లని ౧౦౦ మామిడికాయలను నీళ్ళలో బాగుగఁ గడిగి, బద్దలు అంటియుండునట్లు ౮ భాగములుగాతఱిగి, అందలి జీడిని తీసివేసి, సన్నఆవాలు ౧ వీసె, పసుపు ౫ పల, మిరపకాయలు ౧ వీసె, మిరియాలు ౮ పల, మెంతులు ౮ పల, ఉప్పు ౧ పడి-వీనిని వేర్వేఱుగ మెత్తగ పొడిచేసి ౫ తులముల మంచి నూనెలో 3 తులముల ఇంగువనువేసికాచి పొడిచేసి అన్నిటినికలిపి, ఆమామిడికాయలలో బాగుగ కూరి క్రొత్తకుండలోఁగాని, జాడీలోఁగాని వాని నునిచి తగుపాటిగ మంచినూనెపోసి మంచిసెనగలు ౧ పడిపోసి మూకుడుమూతపెట్టి, అప్పుడప్పుడు కొయ్యగరిటెతో కలియదీయుచుండవలయు. ఇది రుచిగనుండును. జీర్ణముచేయును.

మెంతికాయ.

౧౦౦ మంచి పుల్లమామిడికాయలను బద్దలు వీడిపోకుండునటుల రెండుగా తఱిగి, ౧ పడి ఉప్పు పొడిలోవేసి ఊరినతరువాత యెండబెట్టి మిరపపొడి ౧౪ సేరు, పసుపుపొడి ౪ సేరు, మెంతులపొడి ౪ సేరు వీనిని ఒకటిగకలిపి, దీనిలో ౧ సేరు నూనెలో 3 తులముల ఇంగువనువేయించి పొడిచేసికలిపి ఒకకుండలోపెట్టి మూకుడు మూసి, అప్పుడప్పుడు కుదిలించుచుండవలెను

నిమ్మకాయ ఊరుగాయ.

౧౦౦ మంచి నిమ్మపండ్లను నాలుగు భాగములుగా తఱిగి, ౪ పడి ఉప్పుపొడిలోవేసి, మెంతులు ౫ పల, మిరపకాయలు ౭ పల, పసుపు 3 పల, ఇంగువ ౧ తు,

వీనిని వెవ్వేఱుగ నూనెలో వేయించి పొడిచేసి, ఆనిమ్మపండ్లలో కలిపి క్రొత్తబానలో నునిచి మూతమూసి అప్పుడప్పుడు కొయ్యగరిటెతో కలియదీయుచు ఎండలో నునిచి యూర్తియుంచుకొనవలెను.

ఇట్లే దబ్బకాయ, కిత్తిలి ( నారింజ ) కాయలను ఊరుగాయ చేయవలెను.

---

మాంసభక్ష్యాదులు— మాంసపూర్ణపోళిక.

శ్లో. పలం నిరస్థి ప్రస్థైకం కృతం సూక్ష్మతరం నవం ।
పలైక మార్ద్రికక్షోద మామ్ర మామ్రస్యచూర్ణకం ॥
భ్రష్టధాన్యరజ శ్చామ్ర మర్ధామ్రం చ రసోనకం ।
సార్ధామ్రం లవణం ప్రస్థం ఘృతం టంకం మరీచకం ॥
సమితాం ప్రస్థైకమితాం చతురామ్రం పలాండుతః ।
కర్షమేలాదికం సర్వం వేసవారం సమాహరేత్ ॥
చుల్ల్యాం తప్తే క్షిపే ద్భాండే ఘృతస్య కుడపత్రయం ।
ఘృతే తప్తే క్షిపే త్తత్ర సూక్ష్మం ఖండ్య పలాండుకం ॥
తామ్రీభూతే పలాండౌ చ పలం క్షిప్య విచాలయేత్ ।
శృంగబేరం చ లవణ మామ్రచూర్ణం రసోనకం ॥
మరిచం వేసవారం చ ధాన్యకం పాచయే చ్ఛనైః ।
శుష్కే మాంసరసే నీరం క్షిపే త్తత్రానుమానతః ॥
కేశుష్కే చ పలే పక్వే కుర్యా చ్ఛీతం మనోహరే ! ।
తతో ఘృతాక్తాం సమితాం మర్దయే దంబునా భృశం ॥
తస్యా అర్ధపలం నీత్వా కూపికాం రచయే త్ప్రియే ! ।
తన్మధ్యే పూర్య తన్మాంసం ముద్రయిత్వా చ వేల్లయేత్ ॥
తాం పూలికాం పచే దాజ్యే పలగర్భా హి సా స్మృతా ।
బల్యా పుష్టిప్రదా వృష్యా రుచ్యా వాతహరా మతా ॥

తా. మాంసాహారుల యుపయోగమునకై తత్పాకశాస్త్రోక్తములగు మాంసభక్ష్యాదుల గొన్నిటిని చేయుక్రమము చెప్పబడును:—ఎముకలు తీసివేసి, సన్నగా కొట్టిన మాంసము ౬౪ తు, తుఱిమిన అల్లము ౪ తు, మామిడికాయతునుకలు ౪తు, వేయించిన ధనియాలపొడి ౪ తు, తెల్లగడ్డలు ౨తు, ఉప్పు ౬తు, నేయి ౬౪తు, ఏలకులు



మొదలగువాని పొడి ౧ పలము-ఒకపాత్రమున ౪౮ తులములు నేయిపోసి కాచి, అందు ఉల్లిగడ్డలు తునుకలుచేసి యెఱ్ఱగనగునట్లు వేయించి, పైనచెప్పిన పొడులను మాంసములో కలిపి యామాంసమును నేతిలో వేసి వేయించి గరిటెతో కలియబెట్టిన, మాంసగసము ఇగురును; అప్పుడు తగుపాటినీళ్లు పోసి యుడకబెట్టి నీరిగిరి మాంసము పక్వముకాగానే పొయిమీఁదనుండి దించుకొని, గోధుమపిండిలో కొంచెము నేయికలిపి నీళ్లతో బాగుగమర్దించి ముద్దచేసికొని బిళ్ళలుతట్టి అందులో మాంసమును పెట్టిమూసి గుండముగ ఒత్తి నేతిలో వేయించవలయును. ఇదిబలమును పుష్టిని రుచిని ఇచ్చును. శుక్రవృద్ధి నిచ్చును. వాతమును పోగొట్టును.

మాంసకృతిగుణములు—ప్రస్థైకమామిషంసర్పిస్సద్యస్కంచశరావకం।
కుడవైకం పలాండు స్స్యా ద్ద్విపలే చ రసోనతః ॥
పల మేకం చ లవణం శృంగబేరం పలం మతం ।
దధి ప్రస్థార్ధకం కాంతే ! సంతానీ తు చతుః పలా ॥
ద్రావిడీ శ్రీప్రసూనం చ కాశ్మీరం ధర్మపత్తనం ।
పృథక్ టంకమితం చైవ బాదామం కుడవోన్మితం ॥
మాంసఖండాని సంక్షాల్య త్రిధా నీరేణ యత్నతః ।
లవణం శృంగబేరాంబు దధి తత్ర వినిక్షిపేత్ ॥
ఘృతం భాండే సుసంతాప్య తత్ర క్షిప్త్వా పలాండుకం ।
తామ్రవర్ణం చ తం దృష్ట్వా తదా మాంసాదికం క్షిపేత్ ॥
భర్జయే ద్భర్జనే కాలే క్షిపే న్నీరం రసోనజం ।
కించిత్కించి న్ముహు స్తావ ద్యావ త్స్యా ద్ఘృతశేషకం ॥
లవంగైలామరీచానాం కించిన్నీరం తతః క్షిపేత్ ।
ఆమిషం చ మృదుం దృష్ట్వా బాదామపిష్టకం క్షిపేత్॥
సంతానికాం చ తత్సార్ధం క్షిపే దంబురుహేక్షణే ! ।
పంచనింబుకనీరేణ సంపిష్టం కుంకుమం క్షిపేత్ ॥
అంగారేషు క్షణం న్యస్య సముత్తార్య నిషేవయేత్ ।
ఇదం బల్యం చ వృష్యం చ గురు కాంతికఫప్రదం ॥
వాతఘ్నం రుచికృ త్కాంతే ! కించిత్పిత్తకరం మతం ।
సూపశాస్త్రవిధానజ్ఞైః కీర్తితం లలనోత్తమే ! ॥

తా. మాంసము ౨౮ తులములు, నేయి ౩౹ తు, ఉల్లిగడ్డలు ౧౬ తు, తెల్లగడ్డలు ౭ తు, ఉప్పు ౮ తు, అల్లము ౮ తు, పెరుగు ౩౹ తు, పాలకోవా ౧౬ తు, ఏలకులు-లవంగాలు-కుంకుమపువ్వు-మిరియాలు ఇవి దినునుకు ౩ మాషములయెత్తు, బాదముపప్పు ౧౬ తు-వీనిని సిద్ధముచేసి, తరువాత మాంసఖండములను నీళ్ళతో మూడు సారులుకడిగి, అందులో ఉప్పును అల్లపురసమును పెరుగునుకలిపి. పొయిమీఁదపాత్ర మునుంచి, అందులో నేయిపోసి పొగవచ్చునట్లుకాఁచి, అందులో తెల్ల ఉల్లిపాయలను ఎఱ్ఱగడ్డలనువేసి యెఱ్ఱగనగునట్లువేయించి - అందులో మాంసమునువేసి, తెల్లపాయలరసమును కొంచెముకొంచెమువేయుచు- నేయి ఇగురువరకు వేయించవలయును. లవంగాలు-ఏలకులు-మిరియాలు-బాదముపప్పు వీని నీళ్ళతోనూరి పాలకోవాలోకలిపిమాంసములో వేయవలయును. పిదప ౫ నిమ్మకాయలరసమునుతీసి అందు కుంకుమపువ్వును నూరి కలిపి మాంసములో కలపవలయును. తరువాతదించి నిప్పులమీఁద అరగడియసేపు ఉంచి యెత్తవలయును. ఇదిబలమును పుష్టినిచేయును. గురుత్వమునుచేయును. కాంతిని కఫమునుచేయును. వాతమునపోగొట్టును. రుచినిచ్చును. కొంచెము పిత్తముచేయును.

శాకామిషకృతిగుణములు.

శ్లో. ఆమిషం ప్రస్థకం సర్పిస్సద్యస్కం చ శరావకం ।
పలాండోః కుడవైకం స్యాత్ రసోనస్య పలద్వయే ॥
లవణం చ పలం కాంతే! శృంగబేరం పలం ప్రియే! ।
నింబుకాః పంచ లోలా! దధి ప్రస్థార్ధమేవ చ ॥
మరిచం కుంకుమంచైవ పృథక్టంకం మనోహరే! ।
ధాన్యకం పలమేకం చ హారిద్రా కోలసమ్మితా ॥
యచ్ఛేష్టపత్రపుష్పాదిశాకం కందాదికం తు వా ।
ప్రస్థం శస్త్రేణ సంశోధ్య పృథక్పాత్రే నిధాపయేత్ ॥
త్రిధా నీరేణ సంక్షాల్య చామిషం సుప్రయత్నతః ।
శృంగబేరాంబు లవణం దధి ధాన్యాక మేవ చ ॥
ఆమిషే సకలం కాంతే! మిశ్రయిత్వా నిధాపయేత్।
తత స్స్థాప్య ఘృతం భాండే క్షిపే త్తప్తే పలాండుకం ॥
తామ్రీభూతే పలాండౌ చ క్షిపే త్తత్ర విభావరీం ।
తతః క్షిప్రం క్షిపే త్తత్ర యత్సర్వం చామిషాదికం ॥
భర్జయే న్సంక్షిపే త్తత్ర రసోనాంబు పునఃపునః ।



కే శుష్కే చ క్షిపే చ్ఛాకం భర్జయే చ్చ తతః పునః ॥
కించిన్నీరం వినిక్షిప్య పాచయే చ్చ శనైశ్శనైః ।
పక్వం జ్ఞాత్వా క్షిపే త్తత్ర నింబునీరం సకుంకుమం ॥
సముత్తార్య నిషేవేత వీర్యవృద్ధికరం పరం ।
శాకామిష మిదం కాంతే! కాంతిదం రుచికారకం॥

తా. మాంసము ౨౮ తు, నేయి ౩౹ తు, ఉల్లిగడ్డలు ౧౬ తు, తెల్లగడ్డలు ౭ తు, ఉప్పు ౮ తు, అల్లము ౮ తు, నిమ్మకాయలు ౬ తు, పెరుగు ౩౹ తు-మిరియాలు-కుంకుమపువ్వు ఇవి దినునుకు ౧ తు, వేయించిన ధనియాలు ౮ తు, పసుపు 4 తు, ఇష్టమైనకూర ౨౮ తు, ఈపదార్థములను వేర్వేరుగ సిద్ధముచేసి యుంచుకొవలెను. మాంసమును మూడుసారులు చక్కఁగా కడిగి - అందు-అల్లపురసము,ఉప్పు-పెరుగు, ధనియాలు వీనిని కలిపి ప్రొయిమీఁద పాత్రమునునిచి నేయిపోసి కాఁచి, ఉల్లిగడ్డలను తఱిగివేసి వేయించి యెఱ్ఱగవేగినతరువాత పసుపువేసి తరువాత మాంసాదివస్తువులనువేసి గరిటెతో బాగుగకలియబెట్టి తెల్లపాయలరసమును చిలకరించుచుండిన నీరింగిరిపోవును. తరువాత కూరనువేసి మెల్లనిమంటతో నుడకబెట్టి యుడికినతరువాత - నిమ్మకాయ రసములో కుంకుమపువ్వునూరి మాంసమువందువేసి దించుకొనవలయును. ఇది-ధాతువృద్ధిని కాంతిని రుచిని ఇచ్చును.

శూలపక్వమాంసకృతిగుణములు.

శ్లో. ఆమిషం శస్త్రసంక్షుణ్ణం ప్రస్థైకం లవణం పలం ।
శృంగబేరం శరావార్ధం వల్లిజం శుక్తిసమ్మితం ॥
ధాన్యకం చ పలం బాలే! పలాండు ర్ద్విపలోన్మితః ।
దధి ప్రస్థార్ధకం టంకం కుంకుమం చ లవంగకం ॥
సంతానికా చ సర్పి శ్చ బాదామం కుడవం పృథక్ ।
టంక మేలారజో బాలే! రసం నింబుచతుష్కజం ॥
ధాన్యాకం భర్జితం పిష్ట్వా చాన్య త్సర్వ మభర్జితం ।
వస్త్రబద్ధవినిర్మస్తు దధ్ని సర్వం విమిశ్రయేత్ ॥
లేపయిత్వా త్విదం శూలే తత స్సూత్రేణ వేష్టయేత్ ।
నిర్ధూమాంగారకే శూలం సన్నిధాయ విపాచయేత్ ॥
శూలపక్వ మిమం మాంసం ధాతుపుష్టికరం మతం ।
బల్యం వృష్యం తథా రుచ్యం కఫకాంతివివర్ధనం ॥

తా. కత్తితో నఱికిన మాంసము ౮౧ తు, ఉప్పు ౧ తు, అల్లము ౧౬ తు మిరియాలు ౨ తు, ధనియాలు ౧ తు, ఉల్లిగడ్డలు ౪ తు, పెరుగు ౩౨ తు, కుంకుమపువ్వు-లవంగములు దినుసుకు ౩ మాషములయొత్తు, పాలమీఁగడ ౧౬ తు, నేయి ౧౬ తు బాదముపప్పు ౧౬ తు, ఏలకులు ౩ మాషములు, ౧ నిమ్మపండ్లరసము వీనిని సిద్ధము చేసికొని - ధనియాలు వేయించి పొడిచేసి - తక్కినవానిని వేయించకుండనూరి అన్నివస్తువులను కలిపి-మీఁగడ నీళ్లులేని పెరుగులోవేసికలిపి, ఇనుపశలాకమీఁద పెరుగును ఒకఆంగుళము మందమునపూసి దారముచుట్టి పొగలేని నిప్పులమీఁద శూలమునునిచి కాల్చినయెడల మాంసము పక్వమగును; ఇది ధాతుపుష్టిని, పుష్టిని, బలమును, రుచిని ఇచ్చును. కఫమును కాంతిని వృద్ధిచేయును.

## మత్స్యపాక కృతిగుణములు.

మత్స్యమాంసము ౩౨ తులములు, నేయి ౪ తు, అల్లము ౨ తు, ఉల్లిగడ్డలు ౨ తు, పాలు ౧౬ తు, నీరులేని పెరుగు ౧౬ తు, వేయించిన ధనియాలు ౨ తు, సెనగపిండి ౧ తు, మిరియాలు ౩ మాషములు-ఏలకులు ౧ మాషము, ఉప్పు ౨ తు, చింతపండు ౧ తు, ఇట్లు వీనిని సిద్ధముచేసికొని, మత్స్యఖండములను శలాకతో గ్రుచ్చి, సెనగపిండిని నీళ్లలోకలిపి దానితో మత్స్యములను మూడుమారులుకడిగి, తరువాత-అల్లము, మిరియాలు, ధనియాలపొడి, పెరుగు, పాలమీఁగడ వీనినికలిపి మత్స్యఖండములమీఁదపూసి, ప్రొయ్యిమీఁద నొకపాత్రమునునిచి అందు నెయ్యిపోసికాఁచి ఉల్లిగడ్డల తునుకలువేసి యెఱ్ఱగవేగినతరువాత మత్స్యములనువేసి వేయించుకొనవలయు. ఇవి బలమును పుష్టిని ఇచ్చును. రుచిగనుండును.

శ్లో. కథితం తే వరారోహే ! సంగ్రహేణ మయాధునా ।
పాకశాస్త్ర మిదం జ్ఞాత్వా మిష్టపాకా భవ ప్రియే ! ॥

* ఇతి శ్రీమద్రాజగోపాల కృపాపరిలబ్ధపాండిత్యవైభవ శ్రీమద్దాలమ
వంశ సుధాంబుధి పూర్ణసుధానిధి శ్రీమద్వేంకటాచార్య
విరచితే - స్త్రీధర్మరత్నభాండాగారే స్త్రీధర్మాదినిర్ణయ
పాకవిధానకథనంనామ ద్వితీయప్రకరణమ్. *

శ్రీ ర్విజయతే.

# స్త్రీధర్మరత్నభాండాగారము.

## తృతీయ ప్రకరణము.

అథ స్త్రీభేదా నిరూప్యన్తే—

శ్లో. దైవీ మప్సరసో యక్షకాన్తాం రాక్షసకామినీం ।
కృత్వా మితి జగు ర్నారీం యుక్తాం తై రేవ లక్షణైః ॥

తా. స్త్రీలు- దైవి, అప్సరస, యక్షిణి, రాక్షసి అను భేదములుగలిగి ఆయా లక్షణములతోఁ గూడియుందురు.

### దైవీస్త్రీలక్షణము.

శ్లో. చంద్రముఖీ మృగనయనా మదనధనుర్భ్రూ శ్శశాంకశిశిరాంగీ ।
సమశిఖర సదృశదశనా ముఖపరిలీనమధుపాలిః ॥
పుంస్కోకిలమధురోక్తి ర్బింబోష్ఠీ కంబుకంఠకృతశోభా ।
కోమలమృణాలబాహూ రక్తోత్పలసదృశకరచరణా ॥
శ్రీఫలసమవక్షోజా మధ్యే క్షీణా గభీరనాభి శ్చ ।
త్రిభువనజయరేఖా యస్యా స్త్రివళీలతాభాతి ॥
పృథుతరనితంబబింబా హారిణీ స్మరమందిరోద్దేశా ।
కామతరో రంకురఇవ యస్యా రోమావళీ విభా త్యుదరే ॥
రంభోరు ర్హంసగతిః కనకరుచి ర్నీలనీరజాభా చ ।
సురభక్తా పతియుక్తా లజ్జాళు స్సురభిరతనీరా ॥
సితవసనకుసుమనిరతా లఘ్వాహారా తికృష్ణఘనకబరీ ।
సుచిరకలితపతిరమణా దైవీ సా పద్మినీ శ్యామా ॥

తా. చంద్రునివంటి ముఖమూ, లేడి కన్నులవంటికన్నులు, మన్మథునివిల్లువంటి కనుబొమలు, చంద్రునివలె చల్లనైనదేహము, సమానశిఖరములవంటి పండ్లు, ముఖమున

వ్యాపించిన ముంగురులు, పురుషకోకిల కంఠధ్వనివలె మధురమైనమాటలు, దొండపండువంటి పెదవియు, శంఖమువంటి కంఠమును, లేఁత తామరతూండ్లవంటి బాహువులు, ఎఱ్ఱ తామరలవంటి కర చరణములు, సన్ననినడుము, లోఁతైన బొడ్డు, ఉదరమునందు ముల్లోకముల జయించునట్టి మూఁడు మడతలరేఖలు, విశాలమయిన కటిప్రదేశము, కామవృక్షముయొక్క మొలకలవంటినూగారు, అరఁటికంబములవంటి తొడలును, హంసగమనమువంటి నడక, బంగారునంటి మేనికాంతియు, చామనిచాయ, గురుదేవతాభక్తి, భర్తయం దనురాగము, సిగ్గు, తెల్లనివస్త్రములు పుష్పము వీనియందాసక్తి, స్వల్పాహారము, మిక్కిలి నల్లనై విశేషమైన తలవెండ్రుకలు, తనయందు భర్తృప్రేమయు – ఈలక్షణములుగలది దైవిస్త్రీ యనఁబడును. ఇది పద్మినీజాతి స్త్రీలక్షణములు గలిగియుండును.

## అప్సరా స్త్రీలక్షణము.

శ్లో. గీతనృత్యప్రియా కేకావాణీ చిత్రామ్బరైషిణీ ।
సుగన్ధవక్త్రేభగతి స్సున్దరీ మధురప్రియా ॥
మధుగంధరతద్రావా కోష్ణాంగీ కఠినస్తనీ ।
గౌరా శ్యామశరీరా వా సువిశాలకటీతటా ॥
అజా లఘుస్మరావాసా బాహ్యసంభోగరాగిణీ ।
నారీ యా చిత్రిణీచిహ్నా సా ప్సరాజాతి రుచ్యతే ॥

తా. సంగీతనృత్యములయందుఁ బ్రీతి, కోకిలస్వరము, చిత్ర వస్త్రములయందు ఇష్టము, ముఖమునందు పరిమళము, ఏనుఁగునడక, సౌందర్యము, మధురపదార్థములయందు ఇష్టము, శరీరమున కొంచెమువేడి, శరీరమున తెలుపు, (లేక) నలుపు కటిప్రదేశమున వైశాల్యము, బాహ్యసంభోగప్రీతి ఈలక్షణములుగలది అప్సరయని తెలియవలయు. దీనికి చిత్రిణీలక్షణములు గలిగియుండును.

## యక్షిణీ స్త్రీలక్షణము.

శ్లో. స్థూలాంగీ చాతితన్వీ గౌరీ శ్యామాపి దీర్ఘకరచరణా ।
బడబా పృథుమదనగృహా రక్తాంబరరాగిణీ కుటిలా ॥
విపులకుచా పృథుజఘనా సోష్ణాంగీ క్షారగంధరతసలిలా ।
యా శంఖినీసమానా హంసరవా యక్షిణీ సా స్యాత్ ॥

తా. స్థూలశరీరము, సూక్ష్మశరీరము, తెలుపు (లేక) నలుపుగల శరీరము. దీర్ఘములైన కరచరణములు, ఎఱ్ఱనివస్త్రములయందుప్రీతి, కాపట్యము, విశాలమైన



కటిప్రదేశము, హంసపలుకులవంటిమాటలు ఈలక్షణములు గలిగి శంఖినితో సమానముగనుండునది యక్షిణి యనఁబడును.

## రాక్షసీలక్షణము.

శ్లో. దీర్ఘాస్యదంతనాసా స్థూలోష్ఠీ స్థూలహస్తచరణా చ ।
కపిలకచా గతలజ్జా వారణకుంభాభవక్షోజా ॥
కరిమదగంధరతజలా రోమశజంఘా కషాయకటురసనా ।
స్థూలపృథుస్మరగేహా శీతోష్ణాంగీ చ ఖరవచనా ॥
అరుణాంగీ శ్యామా వా పతివర్గద్వేషిణీ కుటిలచిత్తా ।
యా హస్తినీసమానా సా జ్ఞేయా రాక్షసీ నారీ ॥

తా. పొడవులైన ముఖ దంత నాసికములు, లావైనపెదవి, స్థూలములైనహస్తపాదములు, ఇంచుకపసిమిగల వెండ్రుకలు, లజ్జాహీనత, వెండ్రుకలుగల పిక్కలు, ఒగరు కారములయందిష్టము, శీతోష్ణమైనయొడలు, కఠినమైనమాటలు, ఎఱుపు (లేక) నలుపుగల శరీరము, మగనివంకవారలయందు ద్వేషము, కపటస్వభావము – ఈలక్షణములుగలిగి హస్తినితో సమానమైనది రాక్షసియని తెలియవలయు.

## కృత్యాలక్షణము.

శ్లో. కలహప్రియా తిదీర్ఘా ఖర్వా వా శ్యామపీతహరితా వా ।
లంబోష్ఠీ లఘునాసా లంబస్తనశిథిలవిభాగా చ ॥
శుష్కకటిః పృథుజఠరా విగన్ధకాయా చ కరభికాయోనిః ।
యద్యస్మరాశివోక్తిః సా జ్ఞేయా కర్మఠా కృత్యా॥
హరిణీ ఛాగీ బడబా కరిణీ కరభీతి పంచధా నార్యః ॥

తా. కలహమునందుఁబ్రీతి, మిక్కిలి పొడువు (లేక) పొట్టితనము, నలుపు-పసుపు-ఆకుపసుపు వీనిలో నేదియైన మైచాయ, వ్రేలాడుపెదవి, చిన్నముక్కు, సళ్ళువదలినప్రక్కలు, ఎండినతొంట్లు, పెద్దకడుపు, గంధవిహీనశరీరము, కామోద్రేకము లేకుండుట, అమంగళకరసంభాషణము, అసత్కర్మములయందాసక్తి – ఈలక్షణములుగలది 'కృత్య' యని తెలియవలయు. ఈచెప్పిన అయిదుజాతులును-హరిణి-ఛాగి-బడబ-కరిణి-కరభి-అను పర్యాయనామధేయములఁ గ్రమముగఁ జెందును.

శ్లో. అన్యోన్యలక్షణై ర్యుక్తాం నారీం సంకీర్ణకాం విదుః ।
యా నిజై రేవ సంయుక్తా చిహ్నై స్తాం కేవలాం విదుః ॥

తా. ఈచెప్పిన జాతులలో పరస్పర లక్షణములుగలది - సంకీర్ణక, యనియు ఆయా నిజ లక్షణములుమాత్రముండిన కేవలయనియు తెలియవలయు.

## స్త్రీ అవస్థాభేదము.

శ్లో. బాలేతి గీయతే నారీ యావద్వర్షాణి షోడశ ।
తత స్తు తరుణీ జ్ఞేయా ద్వాత్రింశద్వత్సరావధి॥
తదూర్ధ్వ మధిరూఢా స్యా త్పంచాశద్వత్సరావధి ।
వృద్ధా తత్పరతో జ్ఞేయా సురతోత్సవ వర్జితా ॥

తా. స్త్రీ-పదియాఱు వత్సరములపర్యంతము బాల, అదిమొదలు ముప్పది యాఱువత్సరములపర్యంతము తరుణి, అది మొదలుకొని యేబదివత్సరముల వఱకు ప్రౌఢ, పిమ్మట వృద్ధయనఁబడును. ఇది సురతమునందు వర్జింపఁదగినది.

## అథ భరతశాస్త్రానుసారత స్థాయిరసాలంబనభూత నాయికాభేదా నిరూప్యంతే—

### రతిస్థాయి.

శ్లో. యూనో రన్యోన్య విషయా స్థాయినీ చ్ఛా రతి ర్భవేత్ ।
నిసర్గేణాభియోగేన సంసర్గేణాభిమానతః ॥
ఆత్మోపమాదివిషయై రేతా స్స్యు స్తత్ర విక్రియాః ।
కటాక్షపాతభ్రూక్షేపప్రియవాగాదయోఽపిచ ॥

తా. నాయికానాయకులకు-సహవాసము, స్వభావము, సంబంధము, అభిమానము, ఆత్మోపమ మొదలగు విషయములచే నొకరిమీఁద నొకరికిగలుగు ఇచ్ఛయే రతిస్థాయి యనఁబడును.—ఇందు కడగంటిచూపు, కనుబొమ లెగరవేయుట, ప్రియవాక్యము మొదలగునవి గలుగును; అట్టిస్థాయి-విభావ-అనుభావ-సాత్విక-వ్యభిచారిభావములతో చేరుటవలన రస మగుచున్నది; అట్టిరసము ఆలంబనము నాశ్రయించి రసికుల కానందము గలిగించును.

### స్థాయిరసాలంబనభూత నాయికలు.

శ్లో. రసాలంబనభూతా యా నాయికా త్ర నిరూప్యతే ।
సా స్వీయా పరకీయేతి సామాన్యేతి త్రిధా మతా ॥



తా. రసమునకాధారముగ ఏనాయిక చెప్పఁబడుచున్నదో ఆనాయిక-స్వీయ పరకీయ-సామాన్య అని మూడువిధంబులుగ నుండును.

### స్వీయ.

శ్లో. సంపత్కాలే విపత్కాలే యా న ముంచతి వల్లభం ।
శీలార్జవగుణోపేతా సా స్వీయా పరికీర్తితా ॥

తా. సంపద గలిగినప్పుడును ఆపద గలిగినప్పుడును భర్తను విడువక నుస్వభావము మంచినడతయుగల స్త్రీ స్వీయ అనఁబడును.

శ్లో. ముగ్ధా మధ్యా ప్రగల్భేతి త్రేధా సా తు నిగద్యతే ॥

తా. ఆ స్వీయ-ముగ్ధ, మధ్య, ప్రగల్భ అని మూడు విధములు.

(ముగ్ధ)—శ్లో. ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిదితమన్మథా ॥

తా. ఉదయించిన యౌవనము గలదియు, లజ్జచేఁ దెలియని కామముగలదియు ముగ్ధ యనఁబడును; దీనికి రతియందు క్రొత్త, పురుషునకు అస్వాధీనత, కోపమువచ్చినపు డూరకయుండుట, రతివ్యాపారమునందు కడుసిగ్గుతో నుండుట, చూచుటకు ఇంపైయుండుట, నాయకుఁడు కోపగించినపుడు ఏడ్చుచు నాయకుని చూచుట, రతికాలమున నాయకునితో తనయిష్టమునుగాని ఇష్టములేమినిగాని చెప్పకుండుట ఈ లక్షణములుండును.

(మధ్య)—శ్లో. లజ్జామన్మథమధ్యస్థా మధ్య మోదితయౌవనా ॥

తా. తుల్యములగు లజ్జాకామములు గలదియు, బాగుగ నుదయించిన యౌవనముగలదియు - మధ్య యనఁబడును; దీనికి, నాయకుని గోరుట, మోహము, తుదిని రతికి ఆగ్లానతయు గలిగియుండును.

శ్లో. మధ్యా త్రిధా మానవృత్త్యా ధీరా ధీరో భయాత్మికా ॥

తా. మధ్యానాయిక - మానమనియెడు ప్రియాపరాధమువలన జనించినకోపవ్యాపారముచే - ధీర, అధీర, ధీరాధీర అని మూడువిధములు.

(ధీర)—శ్లో. ధీరా తు వక్తి వక్రోక్త్యా సోత్ప్రాసం సాగసం ప్రియం ॥

తా. అపరాధియగు నాయకునిచూచి హేతుగర్భితము లగు ఎత్తిపొడుపుమాటలాడునది ధీరయనఁబడును.

(అధీర)—శ్లో. అధీరా పరుషై ర్వాక్యైః ఖేదయే ద్వల్లభం రుషా ॥

తా. అపరాధియగు నాయకుని కోపముతో కఠినవాక్యములచే ఖేదపరచునది అధీర యనఁబడును.

(ధీరాధీర)—శ్లో. ధీరాధీరా తు వక్రోక్త్యా సబాష్పం వదతి ప్రియం ॥

తా. అపరాధియగు నాయకునిజూచి కన్నీరుగార వక్రవాక్యముల బలుకునది ధీరాధీర యనఁబడును.

(ప్రగల్భ)—శ్లో. స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా ॥

తా. కామముచే మందగించిన లజ్జగలదియు, సంపూర్ణ యౌవనము గలదియు ప్రగల్భ యనఁబడును. దీనికి సంపూర్ణ యౌవనముచేఁ గలిగిన మదము, కామోద్రేకము, సురతమునందు నాయకుననుసరించి ప్రయత్నించుట, సురతారంభమునందే ఆనందమూర్ఛనమును బొందుట ఈలక్షణములుండును.

శ్లో. మానవృత్త్యా ప్రగల్భాపి త్రేధా ధీరాదిభేదతః ॥

తా. ఈప్రగల్భ - కోపవ్యాపారముచే మూడువిధములు.

(ప్రగల్భాధీర)—శ్లో. ఉదాస్తే సురతే ధీరా సావహిత్థా చ సాదరం ॥

తా. అపరాధియగు నాయకునిజూచి అవయవములు దాచుకొని సురతక్రీడయందు ఉదాసీనముగనుండునది ప్రగల్భాధీర.

(ప్రగల్భాఅధీర)—శ్లో. సంతర్జ్యయత్యైరంరోషా దధీరా తాడయేత్ప్రియం ॥

తా. రోషముతో నాయకుని మిక్కిలి బెదరించుచు కొట్టునది ప్రగల్భాఅధీర.

(ప్రగల్భాధీరాధీర)—శ్లో. ధీరాధీరగుణోపేతా ధీరాధీరేతి కథ్యతే ॥

తా. అపరాధియగు నాయకుని సురతమునందుపేక్షించుట బెదరించుట తిట్టుట గలిగియుండునది ప్రగల్భాధీరాధీర.

శ్లో. ఏతే జ్యేష్ఠా కనిష్ఠేతి భేదతో ద్వివిధే మతే ॥

తా. ముందుజెప్పిన నాయికలు-జ్యేష్ఠ కనిష్ఠ అని రెండు తెఱఁగులు.

(జ్యేష్ఠ)—శ్లో. ప్రియాధిక ప్రేమ పాత్రం జ్యేష్ఠా సా తు నిగద్యతే ।
(కనిష్ఠ)—న్యూన విస్రంభ పాత్రం చేత్కనిష్ఠా సా ప్రకీర్తితా ॥

తా. భర్తయొక్క ప్రేమకు పాత్రురాలుగ నుండునదిజ్యేష్ఠ; తక్కువ విశ్వాసమునకు పాత్రురాలగునది కనిష్ఠ.

పరకీయ.

శ్లో. పరానురాగవ్యాపారగోపనే దత్తమానసా ।
పరకీయేతి సా ప్రోక్తా భరతాగమవేదిభిః ॥

తా. పరపురుషునియందలి ప్రేమవ్యాపారమును దాచుటయందు మనసుంచునది పరకీయ యనఁబడును.



శ్లో. సా చ కన్యా పరోఢేతి ద్వివిధా పరికీర్తితా ॥

తా. ఆ పరకీయ - కన్య, పరోఢ అని రెండువిధములు.

(కన్య)—శ్లో. కన్యా త్వనూఢా యువతి స్సలజ్జా పితృపాలితా ।
సఖీకేళిషు విస్రబ్ధా ప్రియే ముగ్ధగుణాన్వితా ॥

తా. పెండ్లికానిదియు, యౌవనము కలదియు, తండ్రిచే పోషింపఁబడినదియు, చెలికత్తెలతో విహరించుటయందు ప్రీతికలదియు, ప్రియుని జూచినపుడు ముగ్ధలక్షణములుగలదియు పరకీయాకన్య యనఁబడును.

(పరోఢ)—శ్లో. పరోఢా తు ప్రియేణోఢా హ్యన్యసంగమలాలసా ।
నిపుణా గృహకృత్యేషు భర్తృచిత్తానువర్తినీ ॥

తా. నాయకునిచేఁ బెండ్లియాడఁబడినను - పరపురుషసురతమునందిచ్ఛగలదియు, ఇంటిపనులయందు నేర్పరియు, మగనిమనస్సు కనిపెట్టి నడుచుకొనునదియు పరకీయాపరోఢ యనఁబడును.

సామాన్య.

శ్లో. సామాన్యా సైవ గణికా కలాప్రాగల్భ్యధౌర్త్యయుక్ ।
విత్తమాత్రాశయా లోకే పురుషే ష్వనురాగిణీ ॥
ఏతస్యా నానురాగ స్స్యాద్గుణవత్యపి నాయకే ।
భగ్నకామా న్కృతార్థజ్ఞా న్బాలపాషండషండకాన్ ॥
రక్తేన రంజయే న్నిత్యం నిస్స్వా న్మాతు ర్వివాసయేత్ ।

తా. సంగీతాదులయందు నేర్పు, ద్రవ్యాశచేఁ బురుషులయందు ప్రేమగలదియు, గుణవంతుఁడైనను ద్రవ్యహీనుఁడగు నాయకునియందు అనురాగము లేనిదియు, ద్రవ్యముగలవారు నపుంసకులైనను - పాషండులైనను - బాలులైనను - భగ్నకాములైనను - అసత్యవాదులైనను వారలయందు ప్రేమకలదానివలె వర్తించి రంజింపఁజేయునదియు, ద్రవ్యహీనులను తరుమగొట్టునదియు సామాన్యయనఁబడును. ఇదియే వేశ్య.

శ్లో. ఏతా షోడశనాయక్యో హ్యవస్థాభేదతః క్రమాత్ ।
ప్రత్యేక మష్టధా ప్రోక్తా భావశాస్త్రవిచక్షణైః ॥

తా. స్వీయాది షోడశనాయికలు శృంగారావస్థాభేదములచే నొక్కొక్కతె ఎనిమిది విధములు.

అష్టవిధ శృంగారనాయికలు.

శ్లో. స్వాధీనపతికా చైవ తథా వాసకసజ్జికా ।
విరహోత్కంఠితా చైవ విప్రలబ్ధా చ ఖండితా ॥

కలహాంతరితా చైవ తథా ప్రోషితభర్తృకా ।
తథాభిసారికా చేతి క్రమా ల్లక్షణ ముచ్యతే ॥

తా. పూర్వోక్తనాయికలలో నొక్కొకతె దశాభేదములచే- స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషిత భర్తృక, అభిసారిక అని యెనిమిది భేదముల నొందుచున్నారు.

(స్వాధీనపతిక)—శ్లో. ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా ।

తా. ప్రియునిచే నెల్లపుడు లాలింపఁబడునది స్వాధీనపతిక; దీనికి మన్మథపూజోత్సవాదులు, ఉద్యానవనవిహారము జలక్రీడ, పుష్పములుగోయుట ఇవిచేష్టలు.

(వాసకసజ్జిక)—శ్లో. ప్రియాగమనవేళాయాం మండయంతీముహుర్ముహుః।
కేళీగృహం తథాత్మానం సా స్యా ద్వాసకసజ్జికా ॥

తా. మగఁడువచ్చు సమయంబున- తనను పడకటింటిని అలంకరించుకొని సిద్ధముగనుండునది వాసకసజ్జిక; దీనికి సంభోగచింత, చెలికత్తెలతోవిలాసము, పలుమారు దూతినిచూచుట, మగఁడు వచ్చుదారినిజూచుట ఇవి చేష్టలు.

(విరహోత్కంఠిత)—శ్లో. చిరయత్యధికంకాంతేవిరహోత్కంఠితోన్మనాః॥

తా. అపరాధరహితుఁడగు నాయకుఁడు శీఘ్రముగ రాకుండిన విళంబమునకు సహించలేక యెదురు చూచునది విరహోత్కంఠిత యనఁబడును; దీనికి - పరితాపము, వణఁకు, కృశింపు, పనులయందు ప్రీతిలేకుండుట, కన్నీరు విడుచుట, తనయవస్థను చెప్పుకొనుట ఇవి చేష్టలు.

(విప్రలబ్ధ)—శ్లో. క్వచి త్సంకేత మావేద్య దయితేనాథ వంచితా ।
స్మరార్తా విప్రలబ్ధేతి కళావిద్భిః ప్రకీర్త్యతే ॥

తా. సంకేతస్థలమునందు ప్రియుఁడు రానందున వంచితురాలై మన్మథపీడితురాలైనది విప్రలబ్ధ యనఁబడును; దీనికి మనోవైఫల్యము, చింత, ఖేదము, దైన్యము, కన్నీరు, నిట్టూర్పువిడుచుట, మూర్ఛ మొదలగునవి చేష్టలు.

(ఖండిత)—శ్లో. నీత్వా న్యత్ర నిశాం ప్రాతరాగతే ప్రాణవల్లభే ।
అన్యాసంభోగచిహ్నై స్తు కుపితా ఖండితా మతా ॥

తా. రాత్రి తనయింటికిరాక యితరస్త్రీనిపొందిన గురుతులతో ఉదయమున ఇంటికివచ్చెడి నాయకునిఁజూచి కోపించునది ఖండిత యనఁబడు; దీనికి నిట్టూర్పులు విడుచుట మాటలాడకుండుట, కన్నీరువిడుచుట, ఖేదించుట, భ్రమించుట ఇవిచేష్టలు



(కలహాంతరిత)—శ్లో. యా సఖీనాం పురః పాదపతితం వల్లభం రుషా ।
నిరస్య పశ్చా త్తపతి కలహాంతరితా తు సా ॥

తా. సఖులు చూచుచుండ పాదములమీఁదఁబడిన వల్లభుని ముందు నిరాకరించి తరువాత పరితాప పడునది కలహాంతరిత యనఁబడును; దీనికి నిట్టూర్పులు శ్రమము, మనస్తాపము, భయము, పలుమారు ప్రలాపించుట మొదలగునవి చేష్టలు.

(ప్రోషితభర్తృక)—శ్లో. దేశాన్తరగతే పత్యౌ ఖిన్నా ప్రోషితభర్తృకా ॥

తా. మగఁడు దేశాంతరమునకుఁబోయియుండ ఖేదపడునది ప్రోషితభర్తృక యనఁబడును. దీనికి నిదురలేమి కృశత్వము, ప్రియాగమనమునుగురించి శకునములు చూచుట, మాలిన్యము, నిలిచినచోట నిలువకుండుట, ఎప్పుడు పడకను విడువకుండుట, జాడ్యము, మనశ్చింత ఇవిచేష్టలు.

(అభిసారిక)—శ్లో. కాంతాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా ॥

తా. కామోద్రేకముచేత ప్రియుఁడు తనతావునకు వచ్చునట్లుగాని, తాను ప్రియునియొద్దకుఁ బోవునట్లుగాని యత్నించునది అభిసారిక యనఁబడును. దీనికి సంతాపచింతలు చేష్టలు.

---

శ్లో. ఏతాసాం నాయికానాం తు త్రైవిధ్యం పరికీర్తితం ।
ఉత్తమా మధ్యమా చారా దధమేతి ప్రకీర్తితా ॥

తా. ఈనాయికలు నడవడికవలన, ఉత్తమ-మధ్యమ-అధమ యని మూడు విధములుగ నుండుదురు.

(ఉత్తమనాయిక)—శ్లో. విదధత్యప్రియం పత్యౌ ప్రియమాచరతి స్వయం।
వల్లభే సాపరాధేపి తూష్ణీం తిష్ఠతి సోత్తమా ॥

తా. పెనిమిటి తన కప్రియమును చేసినను, తాను ప్రియమునుజేయునదియు, ప్రియుఁ డపరాధమొనర్చినను తా నూరకుండునదియు ఉత్తమ నాయిక.

(మధ్యమ)—శ్లో. పుంసి స్వయం కామయతి కామయేద్యాచ తం వధూః।
సక్రోధే కృధ్యతి ముహు స్సూనృతే సత్యవాదినీ ॥
సాపరాధే ఉపకర్త్రీ స్యాత్ స్నిగ్ధే స్నిహ్యాతి వల్లభే ।
ఏవమాదిగుణోపేతా మధ్యమా సా ప్రకీర్తితా ॥

తా. పురుషుఁడు కోరినపుడు తాను కోరుట, కోపించినపుడు కోపించుట, నిజము పలికినపుడు తాను నిజముపలుకుట, తప్పుచేసినపుడు తాను తప్పుచేయుట, స్నేహించినపుడు తాను స్నేహముచేయుట ఇట్టిగుణములుగలది మధ్యమ అనఁబడును.

(అధమనాయిక)—శ్లో. అకస్మాత్కుప్యతి రుషం ప్రార్థితాపి న ముంచతి।
సురూపం వా విరూపం వా గుణవంత మథాగుణం ॥
స్థవిరం తరుణం వాపి యా వా కామయతే ద్రుతం ।
ఈర్ష్యాకోపవిషాదేషు నియతా సాఽధమా మతా ॥

తా. నిష్కారణముగా గోపించుట, బ్రతిమాలినను కోపము విడువకుండుట, మగఁడు సౌందర్యవంతుఁడైనను సౌందర్యహీనుఁడైనను - గుణవంతుఁడైనను, గుణహీనుఁడైనను, వయోవంతుఁడైనను, ముసలివాఁడైనను ఇచ్ఛయించుట, ఈర్ష్యాకోపవిషాదములు గలిగియుండుట ఈగుణములు గలది అధమనాయిక.

### యౌవనభేదములు.

శ్లో. సర్వాసామపి నారీణాం యౌవనం త్రివిధం మతం ।
ప్రతియౌవన మేతాసాం చేష్టితాని పృథక్పృథక్ ॥

తా. స్త్రీలకందఱకును యౌవనము - ప్రథమ ద్వితీయ తృతీయ భేదముచే మూఁడు విధములు; ఇందు వాని వానిచేష్టలు వేఱువేఱుగనుండును.

(ప్రథమయౌవనము)—శ్లో. ఈషచ్చపలనేత్రాంతం స్మరస్మేరముఖాంబుజం।
సగర్వజ రజోగంధ మసమగ్రారుణాధరం ॥
లావణ్యోద్భేదరమ్యాంగం విలసద్భావసౌరభం ।
ఉన్మీలితాంకురకుచ మస్ఫుటాంగికసంధికం ॥
ప్రథమం యౌవనం తత్ర వర్తమానా మృగేక్షణా ।
అపేక్షతే మృదుస్పర్శం సహతే నోచ్చతాం రతేః ॥
సఖీకేళిరతా స్వాంగసంసంస్కారకలితాదరా ।
న కోపమార్గా భజతే సపత్నీదర్శనాదిషు ॥
నాతిలజ్జావతీ కాంతసంభోగే కిం తు శంకితే ॥

తా. కొంచెము చలించుచున్న కడకన్నులును, కామసంబంధమైన చిఱునగవు గల ముఖపద్మంబును, క్రింది పెదవియందు కొంచెము ఎఱుపును, లావణ్యమతిశయించిన మనోహర శరీరంబును, ప్రకాశించుచున్న భావాతిశయంబును, ఉబుకుచున్న మొలకలవంటి కుచంబులును, స్పష్టముగాని శరీరసంధులును గలది ప్రథమ యౌవనము. ఈయౌవనముగలస్త్రీకి - మృదుస్పర్శమును గోరుట, ఉచ్చరతిని సహింపకుండుట, చెలికత్తెలతో నాడుట, అలంకరించుకొనుటయం దిష్టము, సవతులఁజూచునపుడుకోప సంతోషములు లేకుండుట, మగనియొద్ద కొంచెము సిగ్గతోనుండుట, సంభోగమున భయపడుట మొదలగు చిహ్నములు గలిగియుండును.



(ద్వితీయయౌవనము)—శ్లో. స్తనౌపీనౌ తనుర్మధ్యః పాదేపాణౌచ రక్తిమా।
ఊరూ కరికరాకారా వంగం వ్యక్తాంగసంధికం ॥
నితంబో విపులో నాభి ర్గంభీరా జఘనం ఘనం ।
వ్యక్తరోమావళి స్నైగ్ధ్య మంగప్రత్యంగసౌష్ఠవం ॥
ద్వితీయం యౌవనం తత్ర వర్తమానా సులోచనా ।
సఖీషు స్వాశయజ్ఞాసు స్నిగ్ధా ప్రాయేణ భామినీ ॥
న ప్రసీద త్యనునయై స్సపత్నీ ష్వభ్యసూయినీ ।
నాపరాధా న్విషహతే ప్రణయేర్ష్యాకషాయితా ॥
రతికేళి ష్వనిభృతా చేష్టతే గర్వితా రహః ॥

తా. ఘనములగుకుచములు, సన్ననినడుము, కరచరణములయందెఱుపు, ఏనుఁగు తొండమును బోలినతొడలు, స్ఫుటమైన అంగసంధులుగలదేహము, విశాలమైనకటిప్రదేశము, లోఁతుగలబొడ్డు, ఘనమైన కటిపురోభాగము (మడికట్టు), నిగనిగలస్పష్టమగు నూగారు, అంగప్రత్యంగములయందు చక్కదనము, ఇవి స్త్రీకి ద్వితీయయౌవనమున గలుగును. ఈ స్త్రీకి స్వాభిప్రాయము నెఱింగిన చెలికత్తెలయందు ప్రీతి, ప్రీతివాక్యములచే సమాధానపడకుండుట, సవతులయందు కోపము, నాయకుని అపరాధమును సహింపకుండుట, ప్రణయకలహమునందు కోపించుట, ఏకాంతమున రతికేళియందు గర్వించుట ఇవి కలిగియుండును.

(తృతీయయౌవనము)—అస్నిగ్ధతానయనయోర్గండయోర్మ్లానకాంతితా।
విచ్ఛాయతా ఖరస్పర్శోఽప్యంగానాం శ్లథతా మనాక్ ॥
అధరే మసృణో రాగ స్తృతీయే యౌవనే భవేత్ ।
తత్ర స్త్రీణా మియం చేష్టా రతితంత్రవిదగ్ధతా ॥
వల్లభస్యాపరిత్యాగ స్తదాకర్షణకౌశలం ।
అనారోపోఽపరాధేషు సపత్నీష్వప్యమత్సరః ॥

తా. కన్నులయందు కాంతితగ్గుట, చెక్కిళ్లువాడియుండుట, శరీరమునకాంతి చెడుట, మృదుస్పర్శము లేకుండుట, దేహపటుత్వము కొంచెము తప్పియుండుట, పెదవియందు మిక్కిలి యెఱుపు, ఇవి తృతీయయౌవనమున నుండును. ఈ స్త్రీకి-సురతక్రీడయందు మిక్కిలిచాతుర్యము, పురుషుని విడువకుండుట, పురుషుని వశపరచుకొనుటయందు నేర్పు, అపరాధియగునాయకునియందును - సవతులయందును మాత్సర్యము లేకుండుట ఇవి కలిగియుండును.

---

## భావప్రకరణము.

శ్లో. విభావ శ్చానుభావ శ్చ సాత్త్వికో వ్యభిచారికః।
ఏతే చతుర్విధా భావాః కథ్యంతే పూర్వసూరిభిః ॥

తా. విభావము-అనుభావము-సాత్త్వికభావము-వ్యభిచారిభావము అని భావంబులు నాలుగువిధములు.

## విభావము.

శ్లో. రత్యాదిస్థాయినో యేన భావ్యంతే నితరా మితి ।
అతోఽసౌ భావపారజ్ఞై ర్విభావ ఇతి కథ్యతే ॥

తా. రతి మొదలగు స్థాయిభావములను తేటపఱచునది విభావము.

(అనుభావము)—శ్లో. రత్యాదిస్థాయిన స్సమ్య క్చింతాదీం శ్చ తతఃపరం ।
అనుభావయతీ త్యేవ త్వనుభావ ఇతీర్యతే ॥

తా. రతి మొదలగు స్థాయిభావములను, చింత మొదలగు వ్యభిచారీభావములను, జ్ఞప్తికిఁ దెచ్చునది అనుభావము.

(వ్యభిచారీభావము)—శ్లో. విశేషేణాభిముఖ్యేనసంయాతి స్థాయినం ప్రతి।
వ్యభిచారీతి విజ్ఞేయో భావో భావార్థకోవిదైః ॥

తా. రతి మొదలగు స్థాయిభావములను గూర్చి విశేషముగా ఎదుట సంచరించునది వ్యభిచారీభావము.

శ్లో. విభావః కథ్యతే యత్ర రసోత్పాదనకారణం ।
ఆలంబనోద్దీపనాత్మా స ద్విధా పరికీర్త్యతే ॥

తా. విభావము - శృంగారాది నవరసములకును కారణము; ఆ విభావము-ఆలంబన ఉద్దీపన భేదముచే రెండువిధములు.

(ఆలంబనము)—శ్లో. యానాలంబ్య ప్రజాయంతే రత్యాదిస్థాయినోఽపిచ।
ఆలంబనాఖ్యా స్తే ప్రోక్తా నాయికాద్యా విచక్షణైః ॥

తా. రత్యాదిస్థాయిభావములను కలుగఁజేయు నాయిక మొదలగు వస్తువులు ఆలంబనము లనఁబడును.

(ఉద్దీపనము)—శ్లో. ఉద్దీపన శ్చతుర్ధా స్యా దాలంబనసమాశ్రితః ।
గుణా శ్చేష్టాలంకృతయ స్తటస్థా శ్చేతి భేదతః ॥

తా. ఆలంబనము నాశ్రయించియుండు గుణములు, చేష్టలు, అలంకృతులు, తటస్థములు అని నాలుగువిధములు గలది ఉద్దీపనము.



(ఆలంబనగుణములు)—శ్లో. ఆలంబనగుణోరూప యౌవనాదిరుదాహృతః॥

తా. యౌవనము-రూపము-లావణ్యము-సౌందర్యము-అభిరూప్యము - మార్దవము-సౌకుమార్యము అనునివి ఆలంబనగుణములు.

(చేష్టలు)—శ్లో. తచ్చేష్టా యౌవనోద్భూతహావభావాదికా మతాః ॥

తా. యౌవనమువలనఁబుట్టిన హావభావాదులు (కడగంటిచూపులు) మొదలగునవి చేష్టలు.

(అలంకృతులు)—శ్లో. నూపురాంగదహారాది తదలంకరణంమతం ॥

తా. అందెలు భుజకీర్తులు హారములు మొదలగు భూషణములు, వస్త్రములు పుష్పములు మైపూఁతలు మొదలగునవి అలంకృతులు.

(తటస్థములు)—శ్లో. తటస్థా శ్చంద్రికాధారాగృహచంద్రోదయాదయః ।
కోకిలాకుల మాకంద మందమారుత షట్పదాః ॥
లతామంటప భూగేహ దీర్ఘికా జలదారవాః ।
ప్రాసాదగర్భ సంగీత క్రీడాది సరిదాదయః ॥

తా. వెన్నెలప్రసరించెడి గృహములు, చంద్రోదయము, కోయిలలుగల తియ్యమామిడిచెట్లు, మలయమారుతము, తుమ్మెదలు, పొదరిండ్లు, భూగృహములు, నడబావులు, మేఘధ్వని, మేడలు, సంగీతము, క్రీడాదులు, సెలయేళ్లు మొదలగు ఉపభోగోపయోగవస్తువులు తటస్థములు.

---

## అనుభావము.

శ్లో. కార్యభూతోఽనుభావ స్స్యా త్కటాక్షాదిశరీరజః॥

తా. కడగంటితోఁ జూచుట, కనుబొమలు త్రిప్పుట మొదలగువానివికారములచే మనోభిప్రాయమును బయలుపఱచుట అనుభావము.

## వ్యభిచారీభావములు.

శ్లో. నిర్వేదగ్లానిశంకాఖ్యా స్తథా సూయామదశ్రమాః ।
ఆలస్యం చైవ దైన్యం చ చింతా మోహః స్మృతి ర్ధృతిః ॥
వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా ।
గర్వో విషాద ఔత్సుక్యం నిద్రా పస్మార ఏవ చ ॥
సుప్తి ర్విబోధోఽమర్ష శ్చ అవహిత్థా వ్యథోగ్రతా ।
మతి ర్వ్యాధి స్తథోన్మాద స్తథా మరణ మేవ చ ।
త్రాస శ్చైవ వితర్క శ్చ విజ్ఞేయా వ్యభిచారిణః ॥

తా. నిర్వేదము-గ్లాని-శంక-అసూయ-మదము-శ్రమము-ఆలస్యము-దైన్యము-చింత-మోహము-స్మృతి-ధృతి-వ్రీడ-చపలత-హర్షము-ఆవేగము-జడత-గర్వము-విషాదము-ఔత్సుక్యము-నిద్ర-అపస్మారము-సుప్తి-విబోధము-అమర్షము-అవహిత్థ-ఉగ్రత-మతి-వ్యాధి-ఉన్మాదము-మరణము-త్రాసము-వితర్కము అనునవి వ్యభిచారీభావములు.

(నిర్వేదము)—శ్లో. దుఃఖేర్ష్యాతత్వబోధాదే ర్నిర్వేదో నిష్ఫలత్వధీః ।
తత్ర చింతాశ్రునిశ్శ్వాసదీనతా స్సంభవంతి చ ॥

తా. దుఃఖము-ఈర్ష్య-తత్వజ్ఞానము-వియోగము వీనివలనఁ బుట్టినవైఫల్యము గల బుద్ధి నిర్వేదమనఁబడును; దీనియందు చింత నిశ్శ్వాసము దైన్యము మొదలగునవి గలుగును.

(గ్లాని)—శ్లో. గ్లాని ర్బలస్యాపచయో వైవర్ణ్యారతికారణం ॥

తా. మనోవ్యాధి-రోగము-వ్యాయామము-సురతము వీనివలన గలుగు బలనాశము గ్లాని యనఁబడును; ఇందు వైవర్ణ్యము-కార్యములయందు అప్రీతి - మెల్లగ మాటలాడుట మొదలగునవి గలుగును.

(శంక)—శ్లో. శంకా చౌర్యాపరాధాద్యై స్స్వానిష్టోత్ప్రేక్షణం మతం ।
తత్ర చేష్టా ముహుః పార్శ్వ వీక్షణం ముఖశోషణం ॥
అవకుంఠనవైవర్ణ్యకంఠసాదాదయోఽపిచ ॥

తా. తానుచేసిన దొంగతనము మొదలగు నపరాధములవలన గలుగు భయము నూహించుట శంక; ఇందు పలుమారు పార్శ్వములచూచుట- ముఖము వాడుట- ముసుకిడుట-వైవర్ణ్యము-గద్గదస్వరము మొదలగునవి గలుగును.

(అసూయ)—శ్లో. పరసౌభాగ్య సంపత్తి విద్యా శౌర్యాది హేతుభిః ।
గుణేఽపి దోషారోప స్స్యా దసూయా తత్ర విక్రియాః ॥
ముఖాపవర్తనం గర్హా భ్రూభేదానాదరాదయః ॥

తా. పరులయొక్క సంపద్విద్యా శౌర్యములఁజూచి సహింపక గుణమందుఁగూడ దోషమెంచుట అసూయ. ఇందు ముఖముత్రిప్పుట- నిందించుట- అలక్ష్యము మొదలగునవి గలుగును.

(మదము)—శ్లో. మద స్త్వానందసమ్మోహసంభ్రమో మదిరాదిజః ।
గతిభంగ స్స్మితం వాచి స్ఖలనం ఘూర్ణనం దృశోః ॥
గమనే వక్రతా బాహ్వోర్విక్షేప స్స్విన్నతాదయః।
నిష్ఠీవనం ముహు శ్శ్వాసో హిక్కా చరాదయో మతాః ॥



తా. మద్యాదులచేఁ గలిగిన మోహము - ఆనందము - వీనియొక్క వికారము మదము; ఇందు-గతిభంగము- చిఱునగవు-నోరు తడబడుట-కండ్లుదిరుగుట-వంకరగ నడచుట-చేతులనాడించుట-వ్రేలవేయుట- ఉమియుట-నిట్టూర్పు-వెక్కిళ్లు-వాంతి మొదలగునవి గలుగును.

(శ్రమము)—శ్లో. శ్రమో మానసఖేద స్స్యా దధ్వనృత్తరతాదిభిః ।
అంగమర్దననిశ్శ్వాస పాదసంవాహనాని చ ॥
జృంభణం మందయానత్వం ముఖనేత్రవికూణనం॥

తా. మార్గమునడుచుట- నృత్యము చేయుట-రతిచేయుట వీనివలనఁగలుగు ఖేదము శ్రమమనఁబడును. ఇందు-అంగమర్దనము,నిట్టూర్పు, ఆవులింత, కాళ్లుపిసికించుట, మెల్లగనడుచుట, ముఖమును కన్నులును వంకర చేయుట మొదలగునవి గలుగును.

(ఆలస్యము)—శ్లో. స్వభావభయసౌహిత్యగర్వనిర్భయతాదిభిః ।
కృచ్ఛ్రాత్క్రియోన్ముఖత్వం య త్తదాలస్య మిహ క్రియాః॥
అంగభంగక్రియాద్వేషజృంభణాక్షివిమర్దనాః ।
శయ్యాసనైకప్రియతా తంద్రీ నిద్రాదయోఽపిచ ॥

తా. స్వభావము-భయము-భయములేమి- తృప్తి-గర్వము మొదలగు వానివలన సావకాశముగ కార్యములఁ బ్రయత్నించుట ఆలస్యమనబడును; ఇందు-అంగభంగము కార్యద్వేషము, ఆవులింతలు, కన్నులను నలుపుట, నిద్ర, పరుండుటయందును కూర్చుండుట యందును అభిలాష మొదలగునవి గలుగును.

(దైన్యము)—శ్లో. హృత్తాపదుర్గతత్వాద్యై రనౌద్ధత్యం హి దీనతా ।
అత్రానుభావా మాలిన్యగాత్రస్తంభాదయో మతాః ॥

తా. మనస్తాపము- పేదరికము, కృపణత వీనివలనగలిగిన అణఁకువ- దైన్యమనఁబడును; ఇందు-మాలిన్యము-శరీరస్తంభము మొదలగునవి గలుగును.

(చింత)—శ్లో. ఇష్టవస్త్వపరిప్రాప్తై రైశ్వర్యభ్రంశనాదిభిః ।
చింతా ధ్యానాత్మికా తస్యా మనుభావా భవం త్యమీ ॥
కార్శ్యాధోముఖ్యసంతాపనిశ్శ్వాసోచ్ఛ్వాసనాదయః ॥

తా. ఇష్టము నెరవేరక పోవుట-ఐశ్వర్యముతొలఁగుట-అపమానము మొదలగు వానిచేఁగలుగు ధ్యానము చింతయనఁబడును; ఇందు సంతాపము, నిట్టూర్పు, దేహకార్శ్యము, తలవంపు మొదలగునవి గలుగును.

(మోహము)—శ్లో. ఆపద్భీతి వియోగాద్యైర్మోహశ్చిత్తస్యమూఢతా।
విక్రియా స్తత్ర విజ్ఞేయా ఇంద్రియాణాం చ శూన్యతా ॥
నిశ్చేష్టితాంగభ్రమణపతనాఘూర్ణనాదయః ॥

తా. ఆపత్తు- భీతి- దుఃఖము వియోగము మొదలగువానిచేఁగలిగిన షడింద్రియ పారవశ్యము మోహమనఁబడును; ఇందు-నిశ్చేష్టత, ఒడలుతిరుగుట, పడుట, కండ్లుతిరుగుట మొదలగునవి గలుగును.

(స్మృతి)—శ్లో. స్మృతిః పూర్వానుభూతార్థప్రతీతి స్తత్ర విక్రియాః।
కంపనోద్వేపనే మూర్ధ్నో భ్రూవిక్షేపాదయోఽపిచ ॥

తా. పూర్వమనుభూతములైనవి జ్ఞప్తికి వచ్చుట స్మృతియనఁబడును; ఇందు-తలయూఁచుట-కనుబొమలుముడిపెట్టుట మొదలగునవి గలుగును.

(ధృతి)—శ్లో. ధృతి శ్చిత్తస్య నైస్పృహ్యం జ్ఞానాభీష్టాగమాదిభిః।
అత్రానుభావా విజ్ఞేయాః ప్రాప్తార్థానుభవ స్తథా ॥
అప్రాప్తాతీతనష్టార్థానభిసంశోభణాదయః ॥

తా. మోక్షజ్ఞానము శాస్త్రజ్ఞానము మొదలగువానిచేఁగలుగు నిస్పృహత ధృతియనఁబడును; ఇందు-దొరకిన వాని ననుభవించుట, దొరకనివానియందు చింతలేకుండుట మొదలైనవి గలుగును.

(వ్రీడ)—శ్లో. చేతస్సంకోచనం వ్రీడానంగరాగ స్తవాదిభిః।
తత్ర చేష్టా నిగూఢోక్తి రాధోముఖ్యవిచింతనే ॥
అనిర్గమో బహిర్వాపి దూరాదేవావకుంఠనం।
నఖానాం కృంతనం భూమిలేఖనం చైవమాదయః ॥

తా. నూతన సంభోగము-స్తుతి-అకృత్యము చేయుట- అవమానము మొదలగువానివలనఁగలుగు మనస్సంకోచము వ్రీడ; ఇందు-తలవంపు, యోచించుట, వెలుపలికి రాకుండుట, దూరముగా మునుగిడుట, గోప్యముగ సంభాషించుట, అవమానము, గోళ్లు త్రుంచుట, నేలపై వ్రాయుట లోనగునవి గలుగును.

(చపలత)—శ్లో. రాగద్వేషాదిభి శ్చిత్తే లాఘవం చాపలం భవేత్।
చేష్టా స్తత్రా విచారేణ పరిరంభావలోకనే ॥
నిష్ఠ్యూసనోక్తిపారుష్యే తాడనాజ్ఞాపనాదయః ॥

తా. రాగద్వేషాదులవలనఁబుట్టిన మనస్సుయొక్క లఘుత్వము - చపలతయనఁబడును. ఇందు-కౌఁగలించుట, చూచుట, ఉమ్మునుట, కఠినముగఁబలుకుట, కొట్టుట, ఆజ్ఞాపించుట లోనగునవి కలుగును.



(హర్షము)—శ్లో. మనోరథస్యలాభేన సిద్ధియోగ్యస్య వస్తునః।
మిత్రసంగాచ్చ దేవాద్ప్రసాదేన చ కల్పితః ॥
మనఃప్రసాదో హర్ష స్తస్య దత్ర నేత్రాస్యపుల్లతా।
ప్రియభాషణ మాశ్లేషః పులకానాం ప్రరోహణం ॥
స్వేదోద్గమ శ్చ హ స్తేన హ స్తసంతాడనాదయః ॥

తా. ఇష్టప్రాప్తి-ఘనవస్తులాభము - దేవతానుగ్రహము-మిత్రులఁగూడుట లోనగు వానిచేఁగలిగిన మనోవికాసము హర్షమనఁబడును. ఇందు- ముఖనేత్రవికాసము, ప్రియసంభాషణము, ఆలింగనము, గగుర్పాటు, చెమట, చేతులు తట్టుట లోనగునవి గలుగును.

(ఆవేగము)—శ్లో. ఇష్టానిష్టాగమా జ్జాత ఆవేగ శ్చిత్తవిభ్రమః ॥

తా. ఇష్టానిష్టములయొక్క ఆగమనమువలనఁబుట్టిన చిత్తసంభ్రమము ఆవేగమనఁబడును.

(జడత)—శ్లో. జాడ్య మప్రతిపత్తి స్స్యా దిష్టానిష్టార్థయో శ్శ్రుతేః।
దృష్టే ర్వా విరహాదభ్యైః క్రియా స్తత్రానిమేషతా ॥
అశ్రుతిః పారవశ్యం చ తూష్ణీంభావాదయోఽపిచ ॥

ఇష్టానిష్టప్రయోజనముల వినుట - చూచుట - విరహము లోనగువాని వలనఁగలుగు అజ్ఞానము జడత అనఁబడును; ఇందు-రెప్పవాల్చక చూచుట, చెవుడు, పరవశత, ఊరకయుండుట లోనగునవి గలుగును.

(గర్వము)—శ్లో. అన్యధిక్కరణా దాత్మోత్కర్షో గర్వో బలాదిజః।
అనుభావా భవం త్యత్ర గుర్వాద్యాజ్ఞావ్యతిక్రమః ॥
అనుగ్రహప్రదానం చ వైముఖ్యాభాషణాదయః।
విభ్రమావహ్నుతీ వాక్యపారుష్య మనవేక్షణం।
అవేక్షణం నిజాంగానా మంగభేదాదయోఽపిచ ॥

తా. రూప యౌవన ఐశ్వర్య బలాదులవలనను - ఇతరులను తిరస్కరించుట వలనను గలుగు ఆత్మోత్కర్షము గర్వమనఁబడును; ఇందు - గురువులోనగువారిఆజ్ఞను అతిక్రమించుట, అనుగ్రహప్రదానము, విముఖత, మౌనము, కఠినవాక్యములు, ఇతరులను చూడకుండుట, భ్రమము, ములుగుమాటలు, తన అవయవములను చూచుకొనుట, ఒడలు విరుపు లోనగునవి గలుగును.

(విషాదము)—శ్లో. ప్రారబ్ధకార్యానిర్వాహా దిష్టాప్రాప్తే ర్విపత్తితః ।
అపరాధపరిజ్ఞానా దనుతాప స్తు యోభవేత్ ॥
విషాద ఇతి విఖ్యాతో భరతార్ణవపారగైః ॥

తా. ఆరంభించినకార్యములు-ఇష్టములును నెరవేరకపోవుట - ఆపద- అపరాధము నెఱుఁగుట, వీనివలనఁగలుగు ఖేదము విషాదమనఁబడును; ఇందు యోచించుట ఉత్సాహము లేకుండుట, నిట్టూర్పు లోనగునవి గలుగును.

(ఔత్సుక్యము)—శ్లో. కాలాక్షమత్వ మౌత్సుక్య మభిలాషాది హేతుజం ।
త్వరయా గమనం శయ్యా స్థితే రుత్థానచింతనే ॥
శరీరగౌరవాద్యా శ్చ అనుభావా ఇహ స్మృతాః ॥

తా. అభిలాషాదులవలన జనించిన కాలవిళంబము నోర్వకుండుట ఔత్సుక్యమనఁబడును; ఇందు-వేగముగపోవుట, పడకనుండిలేచుట, చింత, దేహము బరువగుట లోనగునవి గలుగును.

(నిద్ర)—శ్లో. మందస్వభావవ్యాయామనిశ్చింతత్వసమాధిభిః ।
మనోనిమీలనం నిద్రా చేష్టా స్తత్రా స్యగౌరవం ॥
ఆఘూర్ణమాననేత్రత్వ మంగానాం పరివర్తనం ।
నిశ్శ్వాసోచ్ఛ్వసితే గాత్రస్వేదో నేత్రనిమీలనం ॥
శరీరస్య తు సంకోచో జాడ్యం చే త్యేవమాదయః ॥

తా. జడస్వభావము-తిరుగుట - నిశ్చింతత-సమాధి లోనగువానిచేఁ గలుగు మనస్సుయొక్క నిమీలనము నిద్రయనఁబడును; ఇందు-ముఖము బరువగుట, కన్నులు తిరుగుట, ఒడలుతిరుగుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, చెమట, కన్నులుమూఁతపడుట, దేహము ముడుచుకొనుట లోనగునవి గలుగును.

(అపస్మారము)—శ్లో. ధాతువైషమ్యదోషేణ భూతావేశాదినా కృతః ।
చిత్తక్షోభ స్త్వపస్మార స్తత్ర చేష్టాః ప్రకంపనం ॥
ధావనం పతనం స్తంభో భ్రమణం నేత్రవిక్రియా ।
స్ఫోటదంశభుజాక్షేపలాలాఫేనాదయోఽపిచ ॥

తా. వాతాదిధాతువైషమ్యము - భూతావేశము-మోహము- దుఃఖము లోనగువానివలనఁ గలిగెడి చిత్తక్షోభము అపస్మారమనఁబడును; ఇందు-వణఁకుట, పరుగెత్తుట, పడుట, స్తంభించుట, తిరుగుట, నేత్రములు వికారమగుట, పండ్లు కొఱుకుట, చేతులువిసరుట, చొల్లు నురుగుకారుట లోనగునవి గలుగును.



(సుప్తి)—శ్లో. ఉద్రేక ఏవ నిద్రాయా స్సుప్తి స్స్యా త్తత్ర విక్రియాః ।
ఇంద్రియోపరతి ర్నేత్రమీలనం స్రస్తగాత్రతా ॥
ఉత్స్వప్నాయితనైశ్చల్య శ్వాసోచ్ఛ్వాసాదయోఽపిచ ॥

తా. నిద్రాతిశయమే సుప్తియనఁబడును; ఇందు - కండ్లు మూఁతలు పడుట, ఇంద్రియోపరతి, స్వప్నము, చాలసేపుకదలకయుండుట, ఉచ్ఛ్వాస నిశ్వాసములు లోనగునవి గలుగును.

(విబోధము)—శ్లో. విబోధ శ్చేతనావాప్తి శ్చేష్టా స్తత్రాక్షిమర్దనం ।
శయ్యాయా మోక్షణం బాహువిక్షేపోఽంగుళిమోటనం ॥
శిరఃకండూయనం చాంగవలనం చైవమాదయః ॥

తా. మేల్కాంచుట విబోధమనఁబడును; ఇందు కన్నులు నలుపుట, పడకను విడుచుట, చేతులు విదలించుట, వ్రేళ్ళను నెటికలు విఱుచుట, తలగోకుట, ఒడలును త్రిప్పుట లోనగునవి గలుగును.

(అమర్షము)—శ్లో. అమర్ష స్స్వాపరాధేషు చేతః ప్రజ్వలనం మతం ।
తత్ర స్వేద శ్శిరఃకంప ఆధోముఖ్యవిచింతనే ॥
ఉపాయాన్వేషణోత్సాహవ్యవసాయాదయః క్రియాః ॥

తా. ఇతరాపరాధములవలనఁ గలుగు మనోవికారము అమర్షమనఁబడును; ఇందు-చెమట,శిరఃకంపము, తలవంచుకొనుట చింత, సాధకమును వెదకుట,ఉత్సాహము ప్రయత్నము లోనగునవి గలుగును.

(అవహిత్థ) శ్లో. అవహిత్థాకారగుప్తి ర్గౌరవప్రాభవనీతిభిః ।
లజ్జాసాధ్వసదాక్షిణ్యప్రాగల్భ్యభయాదిభిః ॥
అన్యథాపాదనం మిథ్యాధైర్య మన్యత్ర వీక్షణం ।
కథాభంగాదయోఽప్యస్యా అనుభావా భవం త్యమీ ॥

తా. నీతి-ధైర్యము-లజ్జ-భయము-దాక్షిణ్యము మొదలగువానివలనఁగలుగు ఆకారగుప్తి అవహిత్థయనఁబడును; ఇందు-మరుగుపరచిచెప్పుట, అబద్ధపు ధైర్యము,ఇతరస్థలమునందుఁజూచుట, కథాభంగము మొదలగునవి గలుగును.

(ఉగ్రత)—శ్లో. అపరాధావమానాభ్యాం చౌర్యనిగ్రహణాదిభిః ।
అసత్ప్రలాపనాద్యై శ్చ కృతం తూర్ణత్వ ముగ్రతా ॥
క్రియా స్తత్రా స్యనయనరాగో బంధనతాడనే ।
శిరసః కంపనం స్వేదవర్ధనం భర్త్సనాదయః ॥

తా. తప్పిదము-తలవంపు-దొంగతనము-నిగ్రహము-చెడ్డమాటలు మొదలగువాని వలనఁగలుగు త్వర-ఉగ్రత యనఁబడును; ఇందు-ముఖము కన్నులు వీనియం దెఱుపు, బంధించుట, కొట్టుట, శిరఃకంపము, చెమట, బెదరించుట మొదలగునవి గలుగును.

(మతి)—శ్లో. తత్వమార్గానుసంధానా దర్థనిర్ధారణం మతిః ।
అత్ర చేష్టాస్తు కర్తవ్యకరణం సంశయచ్ఛిదా ॥
శిష్యోపదేశో భ్రూక్షేప ఊహాపోహాదయోఽపిచ ॥

తా. తత్వమార్గానుసంధానమువలన అర్థమును నిశ్చయించుట-మతిఅనఁబడును, ఇందు-యుక్తాయుక్తవిచారము, సంశయరాహిత్యము, శిష్యోపదేశము కనుబొమలాడించుట, ఊహాపోహములు మొదలగునవి గలుగును

(వ్యాధి)—శ్లో. దోషోద్రేకవియోగాద్యై ర్జ్వరాత్మా వ్యాధి రుచ్యతే ।

తా. మనస్తాపాదులచేతను-వాతపిత్తాది ప్రకోపముచేతను - వియోగాదులచేతనుగలిగిన జ్వరాదులు వ్యాధియనఁబడును.

(ఉన్మాదము)—శ్లో. ఉన్మాద స్తుల్యవృత్తిత్వం చేతనాచేతనేష్వపి ॥

తా. చేతనాచేతనవస్తువులయందు సమానముగాఁ బ్రవర్తించుట ఉన్మాదమనఁబడును.

(మరణము)—శ్లో. వాయో ర్ధనంజయస్యాపి విప్రయోగో మహాత్మనః ।
శరీరావచ్ఛేదవతో మరణన్నామ తద్భవేత్ ॥

తా. సకలశరీరమున వ్యాపించియుండు ధనంజయవాయువు తగ్గిపోవుట మరణమనఁబడును.

(త్రాసము)—శ్లో. ఆకస్మికభయా చ్చిత్తక్షోభ స్త్రాసః ప్రకీర్తితః ।
ఉత్కంపగాత్రసంకోచ రోమాంచ స్తంభగద్గదాః ॥

తా. అకస్మికముగ-పిశాచ సర్పాదులవలనఁగలిగిన చిత్తక్షోభము త్రాసమనఁబడును; ఇందు వణఁకు, శరీరము ముడుచుకొనుట, గగుర్పాటు, డగ్గుత్తిక గలుగును.

(వితర్కము)—శ్లో. సందేహా త్కల్పనానంత్యం వితర్కః పరికీర్తితః ।
అత్రానుభావా స్స్యు రమీ భ్రూశిరఃకంపనాదయః ॥

తా. సందేహమువలన సత్యాసత్యవిషయమై అనేక వికల్పముల నూహించుట వితర్కమనఁబడును; ఇందు-తలయూఁచుట, కనుబొమ లెగురవేయుట మొదలగునవి గలుగును.



సాత్వికభావములు.

శ్లో. స్తంభః ప్రళయరోమాంచా స్స్వేదో వైవర్ణ్యవేపథూ ।
అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్వికాః పరికీర్తితాః ॥

తా. స్తంభము-ప్రళయము-రోమాంచము-స్వేదము - వైవర్ణ్యము - వేపథు-అశ్రు-వైస్వర్యము అనునవి సాత్వికభావములు.

(స్తంభము)—శ్లో. స్తంభో హర్షభయామర్షవిషాదాద్భుతసంభవః ।
అనుభావో భవే దత్ర నిష్క్రియాంగత్వ మేవ హి ॥

తా. సంతోష-భయ-క్రోధ-విషాద-అద్భుతములవలన గాత్రము చలింపకుండుట స్తంభమనఁబడును.

(ప్రళయము)—శ్లో. ప్రళయస్సుఖదుఃఖాద్యై ర్గాఢమింద్రియమూర్ఛనం

తా. సుఖదుఃఖాదులచేఁ గలిగెడి తెలివిదప్పుట ప్రళయమనఁబడును.

రోమాంచము—రోమాంచో విస్మయోత్సాహహర్షాద్యై స్తత్రవిక్రియాః ।
రోమోద్గమాద్యాః కథితా విక్రియా స్తత్రకోవిదైః ॥

తా. ఆశ్చర్య-ఉత్సాహ-సంతోషాదులచేఁగలుగు గగుర్పాటు రోమాంచమనఁబడును; ఇందు-రోమములు గగుర్పొడుచుట లోనగునవి గలుగును

(స్వేదము)—శ్లో. వపుర్జలోద్గమః స్వేదో రతి ఘర్మ శ్రమాదిభిః ॥

తా. సురతము-ఎండ-ఆయాసము లోనగువానిచే శరీరమునందు తడిగలుగుట స్వేదమనఁబడును.

(వైవర్ణ్యము)—శ్లో. విషాదమదరోషాదే ర్వర్ణాన్యత్వం వివర్ణతా ।
ముఖవర్ణపరావృత్తిః కార్శ్యాద్యా స్తత్ర విక్రియాః ॥

తా. విషాద-మద-రోషాదులవలన దేహమున వన్నెమాఱుట వైవర్ణ్యమనఁబడును; ఇందు-కాంతిచెడుట, కృశించుట లోనగునవి గలుగును.

(వేపథు)—శ్లో. వేపథు ర్హర్షసంత్రాసజ్వరక్రోధాదిభి ర్భవేత్ ॥

తా. సంతోష-భయ-జ్వర-క్రోధాదులవలన శరీరమునందుఁ గలిగిన కంపము వేపథు అనఁబడును.

(అశ్రు)—శ్లో. అశ్రు నేత్రోద్భవం వారి దుఃఖరోషప్రహర్షజం ॥

తా. దుఃఖ - రోష - సంతోషాతిశయములవలన కన్నులఁగారెడి నీరు అశ్రు అనఁబడును.

(వైస్వర్యము)—శ్లో. స్వరభేద స్సుఖాద్యైస్తు తత్ర స్యు ర్గద్గదాదయః॥

తా. సుఖాదులచేఁగలిగిన స్వరభేదము వైస్వర్యమనఁబడును; ఇందు-డగ్గుత్తిక లోనగునవి గలుగును.

---

## శృంగారరసము.

శ్లో. విభావై రనుభావై శ్చ సాత్వికై ర్వ్యభిచారిభిః ।
నీతా సదస్యాస్వాద్యత్వం రతి శ్శృంగార ఉచ్యతే ॥

తా. విభావ-అనుభావ-వ్యభిచారిభావ-సాత్వికభావములచేత సభికులకు సార స్యమును పుట్టించునట్టి రతిస్థాయిభావము శృంగారరస మనఁబడును.

శ్లో. నాయికా నాయకో వాపి తత్ర చాలంబనం మిథః ।
విప్రలంభ శ్చ సంభోగ ఇతి స ద్వివిధా భవేత్ ॥

తా. ఆ శృంగారరసమునకు ఆలంబనము నాయికానాయకులు. ఇది-విప్రలంభ శృంగారమనియు, సంభోగ శృంగారమనియు రెండువిధములు.

## విప్రలంభము.

శ్లో. అప్రాప్తి ర్విప్రలంభ స్స్యా ద్యూనో ర్జాతాభిలాషయోః ॥
అయోగో విరహో మానః ప్రవాస శ్శాప ఇత్యపి ।
విప్రలంభస్య పంచైతే హేతవః పరికీర్తితాః ॥

తా. పరస్పరము మిక్కిలి ప్రేమాసక్తులుగల నాయికానాయకులకు చేరికలేక యుండుట విప్రలంభమనఁబడును; దీనికి-అయోగము, విరహము, మానము, ప్రవాసము, శాపము(తిట్టు)ఈయైదును హేతువులు.

(అయోగవిప్రలంభము)—ప్రాగసంగతయోర్యూనో రనురాగేఽపిజాగ్రతి
అయోగః పారతంత్ర్యాద్యై ర్విప్రలంభోఽభిలాషజః ॥
ప్రవేశనిర్గమా తూష్ణీం తద్దృష్టిపథగామితా ।
రాగప్రకాశనపరా చేష్టా స్స్వాత్మప్రకాశనం ॥
వ్యాజోక్తయ శ్చ విజనే స్థితి రిత్యాదయోఽపిచ ॥

తా. పరస్పరము అధికప్రేమగల నాయికానాయకులకు ప్రథమసంగమమునకు పూర్వము పరాధీనతచేఁగలిగిన విప్రలంభము అయోగవిప్రలంభమనఁబడును; ఇందు-నాయిక ప్రియుని నిజాంచి గృహములోనికిఁబోవుట, వెలుపలికివచ్చుట, పలుమారునాయకునికిఁ గనబడుట, తన మనోభిప్రాయమును ప్రకటీకరించుకార్యములఁ జేయుట, తనదేహమును చూపుట, మనుష్యులు లేనిచోట నుండుట లోనగునవి గలుగును.



(విరహవిప్రలంభము)—కాలక్షేపస్తుసంప్రాప్తేః కార్యాద్వాపారతంత్ర్యతః
ఏకత్రా గస్థయో ర్యూనో ర్విరహ స్సోఽభిధీయతే ॥
ఔత్సుక్యచింతా నిశ్శ్వాసవితర్కాద్యనుభావభాక్॥

తా. పరస్పర మత్యంతప్రేమగల ఏకగ్రామనివాసు లగుస్త్రీపురుషులకు కార్యమువలననైనను పరాధీనతవలననైనను చేరుటకు కాలవిళంబమయినయెడల పుట్టిది విరహవిప్రలంభమనఁబడును; దీనికి-ఉత్సాహము, చింత, నిశ్వాసము, వితర్కము మొదలగునవి గలుగును.

(మానవిప్రలంభము)—ఈక్షణా లింగనాదీనాం నిరోధో మాన ఉచ్యతే ॥

తా. చూచుట-ఆలింగనము మొదలగువానిని అడ్డగించుట మాన విప్రలంభ మనఁబడును.

(ప్రవాసవిప్రలంభము)—దేశాంతర స్థితి ర్యాతు ప్రవాసస్సోఽభిధీయతే।
కార్శ్యపాండిమనిశ్శ్వాసచింతాదైన్యాశ్రుగద్గదాః ॥

తా. పరస్పర ప్రేమాతిశయముగల స్త్రీ పురుషులు ఒకరినివిడిచి యొకరు దేశాంతర మందుండుట ప్రవాస విప్రలంభ మనఁబడును. దీనికి కృశత్వము, పాలిపోవుట, నిశ్వాసము, చింత, దైన్యము, కన్నీరు, డగ్గుత్తిక మొదలగునవిగలుగును.

(సంభోగశృంగారము)—అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ।
దర్శనస్పర్శనాదీని స సంభోగ ఉదాహృతః ॥

తా. విలాసవంతులగు స్త్రీపురుషులు పరస్పరము అనుకూలముతో దర్శనస్పర్శనాదులను పొందుట-సంభోగశృంగార మనఁబడును.

---

## శృంగారచేష్టలు.

శ్లో. భావో హావ శ్చ హేలా చ మాధుర్యం ధైర్య మిత్యపి ।
లీలా విలాసో విచ్ఛిత్తి ర్విభ్రమః కిలికించితం ॥
మోట్టాయితం కుట్టమితం బిబ్బోకం లలితం తథా ।
కుతూహలం చ చకితం విహృతం హాసిత ఇత్యపి ।
ఏవంశృంగారచేష్టా స్స్యు రష్టాదశవిధా మతాః॥

తా. భావము-హావము-హేల-మాధుర్యము-ధైర్యము-లీల-విలాసము-విచ్ఛిత్తి-విభ్రమము-కిలికించితము-మోట్టాయితము-కుట్టమితము-బిబ్బోకము-లలితము-కుతూహలము-చకితము-విహృతము-హాసము అని శృంగారచేష్టలు పదునెనిమిది విధములు.

(భావము)—శ్లో. రసాభిజ్ఞానయోగ్యత్వం భావ ఇత్యభిధీయతే ॥

తా. శృంగారాది నవరసములను గుర్తెఱుగుట భావమనఁబడును.

(హావము)—శ్లో. ఈషద్దృష్టివికార స్స్యా ద్భావో హావః ప్రకీర్త్యతే ।

తా. భావము కన్నులు మొదలగువానివలనఁ దెలియఁబడుట హావమనఁబడును.

(హేల)—శ్లో. సువ్యక్తవిక్రియో భావో హేలేతి ప్రతిపాద్యతే ॥

తా. సుందరమయిన యభినయాదులతో బాగుగఁ దెలుపఁబడిన భావము హేలయనఁబడును.

(మాధుర్యము)—శ్లో. మాధుర్యం నామచేష్టానాం సర్వావస్థా సుమార్దవం॥

తా. సకల సమయములయందును - పనులయొక్క మృదుత్వము మాధుర్యమనఁబడును.

(ధైర్యము)—శ్లో. శీలాద్యలంఘనంనామ ధైర్య మి త్యభిధీయతే॥

తా. శీలాదులను దాఁటకయుండుట ధైర్యమనఁబడును.

(లీల)—శ్లో. ప్రియానుకరణం లీలా వాగ్భ గ్గత్యా థ చేష్టితైః ॥

తా. మంచిమాటలు - గమనము - చేష్టలు వీనిచే ప్రియుని అనుసరించుట లీలయనఁబడును.

(విలాసము)—శ్లో. తాత్కాలికో వికార స్స్యా ద్విలాసో దయితేక్షణే॥

తా. ప్రియునిజూచుటయందు కనుబొమలు కన్నులు మొదలగువానియందుఁ గలుగువిశేషము విలాసమనఁబడును.

(విచ్ఛిత్తి)—శ్లో. విచ్ఛిత్తి రతిరమ్యత్వం స్వల్పై రపి విభూషణైః ॥

తా. భూషణములు కొంచెముగానున్నను అతిరమ్యముగా నుండుట విచ్ఛిత్తియనఁబడును.

(విభ్రమము)—శ్లో. విభ్రమ స్త్వరయా కాలే భూషాస్థాన విపర్యయః।

తా. నాయకుఁడు వచ్చువేళ త్వరచేత ఆభరణములయొక్క స్థానవైపరీత్యము విభ్రమ మనఁబడును.

(కిలికించితము)—శ్లో. రోషాశ్రుహర్ష భీత్యాదే స్సంకరః కిలికించితం ॥

తా. రోషము-కన్నీరు-హర్షము-భీతి మొదలగువానియొక్క సంకరము కిలికించిత మనఁబడును.

(మోట్టాయితము)—మోట్టాయితం స్యా దిష్టస్య కథాదౌ హావసూచనం।

తా. ప్రియునితో సంభాషించునపుడు స్వాభిప్రాయమును సూచించుట మోట్టాయిత మనఁబడును.



(కుట్టమితము)—శ్లో. కేశాధరాద్యగ్రహణే మోదమానాపి మానసే ।
దుఃఖితేన బహిః కుప్యే ద్యది కుట్టమితం భవేత్ ॥

తా. సురతక్రీడయందు నాయకుఁడు కొప్పును - అధరమును అంటినపుడు మనమున సంతోషము గలిగియు, పైకి ఇష్టము కానట్లు కోపగించుట కుట్టమితమనఁబడును.

(బిబ్బోకము)—శ్లో. మనాక్ప్రియకథాలాపే బిబ్బోకోఽనాదరక్రియా ॥

తా. ప్రియుని కథాలాపములయందు స్వల్పముగా అనాదరము చేయుట బిబ్బోక మనఁబడును.

(లలితము)—శ్లో. సుకుమారాంగవిన్యాసో లలితం పరికీర్త్యతే ॥

తా. సుకుమారంబైన అవయవ విన్యాసము లలిత మనఁబడును.

(కుతూహలము)—శ్లో. కుతూహలం రమ్యదృష్టౌ చాపలం పరికీర్త్యతే ॥

తా. రమ్యమయిన వస్తువులను చూచుటకు విషయమయిన చపలత కుతూహలమనఁబడును.

(చకితము)—శ్లో. చకితం భయసంభ్రమః ।

తా. భయముచేఁ గలిగిన సంభ్రాంతి చకితమనఁబడును.

(విహృతము)—ఈర్ష్యయా మానలజ్జాభ్యా మదత్తం యోగ్య ముత్తరం ।
క్రియయా వ్యజ్యతే యత్ర విహృతం త దుదీరితం ॥

తా. ఈర్ష్య-కోప-లజ్జలలో దేనిచేనైనను ఉత్తరమీయక వ్యాపారములచేఁ దెలుపుట విహృతమనఁబడును.

(హసితము)—శ్లో. ఆకస్మికం తు హసితం యౌవనాది వికారజం ।

తా. యౌవనాదులచేఁ బుట్టిన ఆకస్మికమగు నగవు హసిత మనఁబడును.

---

## దశావస్థలు.

శ్లో. చక్షుఃప్రీతి శ్చింతా సంకల్పో గుణనుతిః క్రియాద్వేషః ।
తాపో లజ్జాత్యాగో న్మాదో మూర్ఛా మృతి ర్దశావస్థాః ॥

తా. చక్షుఃప్రీతి, చింత, సంకల్పము, గుణనుతి, క్రియాద్వేషము, తాపము, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మృతి, ఈపది దశావస్థలనఁబడును.

(చక్షుఃప్రీతి)—శ్లో. చక్షుఃప్రీతిస్స్పృహా రమ్యే దృష్టేవాలంబనే శ్రుతే।
కౌతుకస్వేదరోమాంచహర్ష విస్మయసాధ్వసైః ॥
చాపలస్తంభలజ్జాద్యై రనుభావ్యో భవే దియం ॥

తా. రమ్యమగు ఆలంబనమువినఁబడినను - చూడఁబడినను - దానియందుఁగలిగిన యిచ్ఛ చక్షుఃప్రీతి యనఁబడును; దీనివలన కౌతుకము, చెమటనీరు, గగుర్పాటు, హర్షము, ఆశ్చర్యము, భయము, చపలత, స్తంభము, సిగ్గు ఇవిమొదలగునవిగలుగును.

(చింత)—శ్లో. కేనోపాయేన సంసిద్ధ్యే త్కదా తేన సమాగమః ।
దూతీముఖేన కిం వాచ్య మిత్యాద్యూహావిచింతనం ॥
అత్రానుభావా నిశ్వాస ధ్యానస్రస్తాంగతాదయః ।
వలయాదిపరామర్శ స్వేదాంగపులకాదయః ॥
శయ్యాసనాదవిద్వేష ఇత్యాద్యాః స్మరకల్పితాః ।
నిర్లక్ష్యవీక్షణం చైవమాద్యా స్స్య ర్వక్రియా మతాః ॥

తా. వానితోఁగూడి సమాగమము ఏయుపాయముచే నెప్పుడు సిద్ధించును? దూతికలగుండా యేమి చెప్పిపంపుదును? అనునివి మొదలగువాని నూహించుట చింత యనఁబడును; దీనివలన-నిశ్వాసము,ధ్యానము,దేహముసోలుట, కటకములు మొదలగునాభరణములను తాఁకుట, చెమటపట్టుట, గగుర్పాటు, శయ్యాసనాదులయందు ద్వేషము లోనగునవి గలుగును.

(సంకల్పము)—శ్లో. మనోరథ స్స్యా త్సంకల్ప స్తత్సమాగమగోచరః ।
ఔత్సుక్యస్వేదరోమాంచ స్మృతిశ్వాసాక్షిమీలనైః ॥
బాహ్యార్థస్యాపరిజ్ఞానే నానుభావ్యో భవే దసౌ ॥

తా. నాయకుని సమాగమమునకు గోచరంబైన మనోరథము సంకల్ప మనఁబడును. దీనివలన-ఆసక్తి,చెమట,గగుర్పాటు,స్మరణము, నిట్టూర్పు, కన్నులు తెఱచుట- బాహ్యవ్యాపారపరిజ్ఞానము లేకుండుట మొదలగునవి గలుగును.

(గుణనుతి)—శ్లో. భవే ద్గుణనుతి స్తస్య రూపాదిపరికీర్తనం ।
రోమాంచో గద్గదా వాణీ భావావరణవీక్షణం ॥
తత్సంగచింతనం సఖ్యా గండస్వేదాదయోఽపిచ ।
ఔత్సుక్యహర్షస్మృత్యాద్యా అనుభావా ఇహ స్మృతాః ॥

తా. ప్రియుని రూపాదిగుణముల స్తుతించుట గుణనుతి యనఁబడును; దీనివలన పులకరింత-డగ్గుత్తికతోఁబలుకుట, సాభిప్రాయముగఁ జూచుట, చెలికత్తెలతో నతని సంగమమునుగుఱించి చింతించుట, చెక్కిళ్లయందు చెమటగలుగుట, ఔత్సుక్యము, హర్షము, స్మరణము మొదలగునవిగలుగును.



(క్రియాద్వేషము)—క్రియాద్వేషస్తతోఽన్యత్ర విద్వేషోభోజ్యవస్తుని ।
చింతానిశ్వాసదైన్యాశ్రుకళాజాగరసాంద్రతాః ॥
విషాదో గ్లాని రిత్యాద్యా అనుభావా స్తదుద్భవాః ॥

తా. ప్రియునికంటె నితరములగు భోజ్య వస్తువులయందు ద్వేషముగలుగుట క్రియాద్వేష మనఁబడును; దీనివలన- చింత,నిశ్వాసము, దీనత్వము, కన్నీరు గార్చుట నిద్రలేకుండుట, పాలిపోవుట, విషాదము, గ్లాని మొదలగునవి గలుగును.

(తాపము)—శ్లో. తత్ప్రాప్తే ర్విప్రకర్షేణ తాపస్స్యా త్కామజో జ్వరః ।
వైవర్ణ్య మశ్రు వైస్వర్యం శయనే పరివర్తనం ॥
నిశ్వాసముఖరోషాద్యా అనుభావా స్తదుద్భవాః ॥

తా. ప్రియునిపొందుటకు విలంబ మగుటవలనఁ గలిగెడి కామజ్వరము తాప మనఁబడును; దీనివలన- వైవర్ణ్యము- కన్నీరు, డగ్గుత్తిక, పాన్పునందుఁ బొర్లాడుట, నిట్టూర్పు, ముఖమువాడుట. లోనగునవి గలుగును.

(లజ్జాత్యాగము)—శ్లో. లజ్జాత్యాగ స్త్రపాహాని రౌత్సుక్యాదిసముద్భవా ।
ఉల్లంఘనం భవేద్వాచాం గౌరవాగణనంతథా ॥
విషాదో వ్యగ్రతా దైన్య మిత్యాద్యై రనుభావ్యతే ॥

తా. ఔత్సుక్యాదులవలన సిగ్గును విడుచుట లజ్జాత్యాగమనఁబడును; దీనివలన- ఉల్లంఘనముజేయుట, గౌరవము నెంచకుండుట, విషాదము, వ్యగ్రత, దైన్యము లోనగునవి గలుగును.

(ఉన్మాదము)—శ్లో. సర్వావస్థాసు సర్వత్ర తన్మనస్కతయా సదా ।
అతస్మిం స్తదితి భ్రాంతి రున్మాదో విరహోద్భవా ॥
తత్ర చేష్టా స్తు విజ్ఞేయా ద్వేష స్స్వేష్టేఽపి వస్తుని ॥
దీర్ఘో ముహు శ్చ నిశ్వాసో నిర్నిమేషతయా స్థితిః ।
అనిమిత్తస్మితధ్యానగానమోహాదయోఽపిచ ॥
అకాండగమనోత్థానశంకాద్యా అపి విక్రియాః ।
విషాదమదరోషాద్యా అనుభావా ఇహ స్మృతాః ॥

తా. ఎల్లప్పుడును సర్వావస్థలయందును ప్రియునియందే మనస్సుగలదగుటచే నొకవస్తువు వేఱొకటిగాఁదోచుట విరహమువలనఁగలిగిన ఉన్మాదమనఁబడును; దీనివలన ఇష్టవస్తువునందు ద్వేషము, ఊరక నిట్టూర్పులు విడుచుట, ఱెప్పపాటు లేకుండుట,

నిర్నిమిత్తముగానడుచుట, లేచుట, శంక, విషాదము, మదము, రోషము లోనగునవి గలుగును.

(మూర్ఛ)—తాపోత్కర్షా త్తదప్రాప్త్యా మూర్ఛా జ్ఞానక్షయోమువహః ।
ఇద మిష్ట మనిష్టం త దితి వేత్తి న కించన ॥
నోత్తరం భాషతే ప్రశ్నే నేక్షతే న శృణోతి చ ।
క్రమేణ మందా వుచ్ఛ్వాస నిశ్శ్వాసా నష్టచేష్టతా ॥
స్పర్శానభిజ్ఞతే త్యాద్యా భవం త్యత్రా నుభావకాః ॥

తా. ప్రియుఁడు రాకపోవుటచేనైన తాపోత్కర్షమువలన తెలివినశించుట మూర్ఛయనఁబడును; దీనివలన ఇది యిష్టము ఇది అనిష్టము అని తెలియకుండుట, పిలిచినఁ బలుకకుండుట, చూడకుండుట, వినకుండుట, ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు క్రమముగమందములగుట, నిశ్చేష్టత, తాఁకినను తెలియకుండుట మొదలగునవిగలుగును.

(మృతి)—శ్లో. స్మరోత్థా మరణేచ్ఛా చ మృతి రిత్యభిధీయతే ।
లీలాశుకవినోదాదిన్యాస స్స్నిగ్ధసఖీకరే ॥
కలకంఠకలాలాపశ్రుతి ర్మందానిలాశ్రయః ।
జ్యోత్స్నాప్రవేశమాకందమంజరీ ప్రేక్షణాదయః ॥
ఉద్బంధనాదిసన్నాహా స్సాస్రదృష్ట్యాదయ స్త్విహ ॥

తా. మన్మథునిచేఁ గలిగిన మరణేచ్ఛ మృతియనఁబడును; దీనివలన-విలాసపుచిలుకలనాడించుట లోనగువానిని సమానవయస్కురాలగుసఖికొప్పగించుట, కోయిలల కలకల ధ్వనుల వినుట, మందమారుత సేవనము, వెన్నెలలోనికిఁబోవుట, మామిడిపూగుత్తులనుజూచుట, ఉరిలోనగు వానికి యత్నించుట, కన్నీరుతోఁజూచుట లోనగునవి గలుగును.

* ఇతి శ్రీమద్రాజగోపాల కృపాపరిలబ్ధ పాండిత్య వైభవ
శ్రీమద్గౌతమవంశ సుధాంబుధి పూర్ణసుధానిధి
శ్రీమద్వేంకటాచార్య విరచితే
స్త్రీధర్మరత్నభాండాగారే
భరతశాస్త్రకథనం నామ
తృతీయప్రకరణమ్. *

---

శ్రీర్విజయతే.

# స్త్రీధర్మరత్నభాండాగారము

## చతుర్థప్రకరణము

అథ స్త్రీధనస్వరూపాదినిరూప్యతే.—

యాజ్ఞవల్క్యః—శ్లో॥ పితృమాతృపతిభ్రాతృదత్తమధ్యగ్న్యుపాగతం ।
ఆధివేదనికాద్యం చ స్త్రీధనం పరికీర్తితం ॥

**స్త్రీధన స్వరూపము.** తా. తండ్రి-తల్లి- భర్త- సహోదరులువీరిచే నియ్యఁబడినదియు, మేనమామ మొదలగు వారిచే వివాహ కాలమునందియ్యఁబడినదియు, భర్త మఱియొకవివాహముచేసికొనునపుడు మొదటిభార్యకిచ్చిన ఆధివేదనికద్రవ్యంబును, అప్రతిబంధదాయము, సప్రతిబంధదాయమును, ఒకనిధికానిదానిని గ్రహించుటయు, నిక్షేపాదులవలన వచ్చినదియు స్త్రీధనమనఁబడును.

మనుః—శ్లో. అధ్యగ్న్యధ్యావహానికం దత్తం చ ప్రీతికర్మణి ।
భ్రాతృమాతృపితృప్రాప్తం షడ్విధం స్త్రీధనం మతం ॥

తా. వివాహకాలమున-అగ్నిసన్నిధియందు- స్త్రీలకుఁజదివింపఁబడునదియు, పితృగృహమునుండి పిలుచుకొనిపోవునపుడు స్త్రీలకు అరణముగా నిచ్చునట్టిదియు, అత్తమామలచే ప్రేమపూర్వకముగ నియ్యఁబడినదియు, అన్నదమ్ములు-తల్లితండ్రివీరలచేనియ్యఁబడినదియు స్త్రీధనమనఁబడును కాత్యాయనులమతప్రకారము, పాదవందనమువలన బంధువులచేనియ్యఁబడినదియు, కన్యకకుగాని పెండ్లి అయినదానికిఁగాని భర్తృపితృగృహములయందు - అన్నదమ్ములచేతను - తలిదండ్రులచేతను ఇయ్యఁబడినదియు స్త్రీధనమని చెప్పఁబడును.

శ్లో. బంధుదత్తం తథా శుల్క మన్వాధేయక మేవ చ ।

తా. స్త్రీకి తనబాంధవులచేతగాని, మాతృ పితృబాంధవులచేతగాని ఇయ్యఁబడినదియు, భర్తచే-శుల్కము (ఓలి)గా నియ్యఁబడినదియు,

వివాహానంతరము తండ్రివంకవారుగాని భర్తవంకవారుగాని ఇచ్చినదియు స్త్రీధన మనఁబడును.

శ్లో. అతీతాయా మప్రజసి బాంధవా స్తదవాప్నుయుః ॥

స్త్రీ, సంతానములేక మరణించినపుడు స్త్రీధనాధికారులు.

తా. ఈ స్త్రీధనమునకు ధనాధికారిణి మరణించినపుడు ఆ స్త్రీయొక్క కూఁతులును, కొమార్తెకూఁతులును, కూఁతురికొడుకులును, కొడుకులును, కొడుకుల కొడుకులును క్రమముగ నధికారులు. వీరలెవ్వరు లేనియెడల- భర్త్రాదిబంధువులకుఁ జేరఁదగినది.

శ్లో. అప్రజ స్త్రీధనం భర్తు ర్బ్రాహ్మాదిషు చతుర్ష్వపి।
దుహితౄణాం ప్రసూతా చే చ్ఛేషేషు పితృగామి తత్॥

బ్రాహ్మాదివివాహభేదములలో నొక దానియందు వివాహితయై సంతానహీనయై మరణించినప్పుడు స్త్రీధనాధికారులు.

తా. బ్రాహ్మ- దైవ- ఆర్ష- ప్రాజాపత్యములను చతుర్విధవివాహములలో నేవివాహముచేనైన వివాహితయై బిడ్డలులేక మరణించిన దానియొక్క స్త్రీధనము భర్తకుఁ జెందును. భర్తలేనప్పుడు సమీపజ్ఞాతులకుఁ జేరును. ఆసుర-గాంధర్వ-రాక్షస-పైశాచ వివాహములలో దేనిచేనైన వివాహితయై సంతానములేక మరణించినదాని స్త్రీధనము ఆమెతల్లికిని, తల్లి లేనపుడు తండ్రికిని, అతఁడులేనపుడు అతనిసమీపజ్ఞాతులకును చేరును. బ్రాహ్మాద్యష్టవివాహములలో దేనిచేనైనఁ బెండ్లియాడఁబడి మరణించిన స్త్రీకి బిడ్డలుండినయెడల స్త్రీధనము కూఁతులకు చేరును.

గౌతమవచనప్రకారము-తల్లితరువాత స్త్రీధనము కూఁతులకు చేరును. కూఁతులు కొందఱు వివాహితలుగను కొందఱు అవివాహితలుగను ఉన్నయెడల వివాహముకాని కూఁతులకు చేరును అందఱును వివాహితలు గానున్నయెడల బిడ్డలుగలదానికంటెను ముందు బిడ్డలులేనిదానికిని, ధనముగలదానికంటెను ముందు ధనములేనిదానికిని చేరును. శుల్కరూపస్త్రీధనమైనయెడల సోదరులకుమాత్రము చేరును. సోదరులులేనియెడల తల్లికి చేరును. మఱియు స్త్రీధనము కొమార్తెలులేనపుడు కూఁతురి కూఁతులకు చేరును. వారు తమ తల్లులపాళ్ల ప్రకారము పొందవలయును.



కొమార్తెలు కొమార్తెకూఁతులును ఉన్నపుడు - కొమార్తెకూఁతులకు ప్రీతిపూర్వకముగ తగునట్లుగా కొంచె మియ్యవలయునని మనువు.

కొమార్తెలకూఁతులులేనియెడల కొమార్తెల కొడుకులకుఁ జేరును. దౌహిత్రులు లేనియెడల ధనాధికారిణి కొడుకులకు చేరును. కొడుకులు లేనియెడల కొడుకుల కొడుకులకు చేరును; పౌత్రులు లేనపుడు భర్త మొదలగువారికి చేరును.

శ్లో. దత్వా కన్యాం హరన్ దండ్యో వ్యయం దద్యాచ్చ సోదయం॥

తా. కన్యనిచ్చెద నని వాగ్దానముచేసి మరలనియ్యనని తిరుగుబాటు చేసినయెడల, కన్యను వాగ్దానము చేయుకాలమున వరునికి అయిన వ్యయద్రవ్యమును వడ్డితోఁగూడ దండనపూర్వకముగనిప్పించవలయు, ఇయ్యకుండుటకు సరియైన కారణముండినయెడల (అనఁగా వరుఁడు కులశీలములచే తక్కువవాఁడైయుండి శ్రేష్ఠుఁడగు వరుఁడు దొరికినప్పుడు-వాగ్దత్తయగుకన్యనైనను మరలింపవచ్చునని చెప్పియుండుటంబట్టి) కన్యాదాత దండింపఁబడఁగూడదు.

శ్లో. మృతాయాం దత్త మాదద్యా త్పరిశోధ్యో భయవ్యయా ॥

వాగ్దత్తకన్య మరణించినపుడు.

తా. వాగ్దత్తయగు కన్యక, మృతిఁజెందినయెడల వాగ్దానకాలమునందు ఉభయులకైనకర్చులను వరుఁడే పొందవలయును. శుల్కముగా (ఓలి) ఇయ్యఁబడిన ద్రవ్యమును, కన్యాదాత వరునకిప్పించవలయు కన్యకు మాతామహాదులిచ్చిన శిరోభూషణాదికమును సహోదరులును, వారులేనియెడల తల్లియు, ఆమె లేనియెడల తండ్రియు తీసికొనవచ్చునని బోధాయనులనిరి.

శ్లో. దుర్భిక్షే ధర్మకార్యే చ వ్యాధౌ సంప్రతిరోధకే।
గృహీతం స్త్రీధనం భర్తా న స్త్రియై దాతు మర్హతి॥

స్త్రీధనమును భర్తసెలవుచేయఁదగినసమయములు.

తా॥ క్షామకాలంబున కుటుంబమును పోషించుటయందును, అవశ్యముచేయఁదగిన ధర్మకార్యములయందును తీఱని వ్యాధిసంభవించినపుడును, కారాగృహాదులను తప్పించుకొనుటయందును, పురుషునకితరద్రవ్యమేమియులేనియెడల స్త్రీధనమును ఉపయోగించుకొనవచ్చును

వానిని మరల స్త్రీకి ఇయ్యవలయుననునియమములేదు. పూర్వోక్తకారణములు లేనప్పుడు తీసికొనినయెడల మరల నియ్యవలయు. భర్తగాకతక్కిన వారియాములెవ్వరును స్త్రీబ్రదికియుండఁగా నాపెధనమునుతీసికొనఁగూడదు ఒకవేళ గ్రహించినయెడల దొంగనువలె దండింపవలయు; గ్రహించిన వారును పతితు లగుదురు.

శ్లో. అధివిన్నస్త్రియై దద్యా దాధివేదనికం సమం।
న దత్తం స్త్రీధనం యస్యై దత్తే త్వర్ధం ప్రకల్పయేత్ ॥

తా. భార్యయుండఁగా మఱియొకపెండ్లిని చేసికొనఁబోవువాఁడు, తానుగాని తనతండ్రిగాని భార్యకు స్త్రీధనమియ్యని పక్షమున తానుచేసికొను రెండవ వివాహమున కెంతకర్చుఅగునో అంతద్రవ్యమును మొదటి భార్యకు స్త్రీధనముగానియ్యవలయు; ఒకవేళ స్త్రీధనమిచ్చియున్నయెడల నూతన వివాహమునకయ్యెడి ధనమునకంటె నెంతతక్కువైయున్నదో ఆతక్కువద్రవ్యమును ఇప్పించవలయు.

భార్యయుండగా మరియొక పెండ్లిచేసికొనునపుడు.

శ్లో. న స్త్రీపుత్రిందద్యాత్ప్రతిగృహ్ణీయాద్వాఽన్యత్రానుజ్ఞానాద్భర్తుః

తా. భర్తయుండునపుడు స్త్రీ స్వతంత్రముగా పుత్రిదానమునుగాని, పుత్రస్వీకారమునుగానిచేయఁగూడదు; భర్త్రాజ్ఞచేఁ జేయవచ్చును.

భర్తృపుత్రాధికారము.

శ్లో. అప్రజావిధవా నారీ పితృభ్రాత్రాద్యనుజ్ఞయా।
దానం ప్రతిగ్రహం కుర్యా దన్యథా నరకం వ్రజేత్ ॥

తా. విధవా స్త్రీకి భర్త్రాజ్ఞ సంభవింపదు గనుక-తండ్రి-సోదరులు-మామలు-భావలు-మఱదులుమొదలగువారి యనుజ్ఞచొప్పున దానప్రతిగ్రహములఁ జేయవలయు. లేనియెడల నరకముంజెందును.

స్త్రీశ్రాద్ధాధికారము.

శ్లో. పుత్రః పౌత్రః ప్రపౌత్ర శ్చ పుత్రికాపుత్ర ఏవచ।
పత్నీ భ్రాతా చ తజ్జ శ్చ పితా మాతా స్నుషా తథా ॥
భగినీ భాగినేయ శ్చ సపిండో ధనహార్యపి।
పూర్వపూర్వవినాశే స్యు రుత్తరోత్తరపిండదాః ॥



తా. మరణించినవానికి-పుత్రుఁడు, పౌత్రుఁడు, ప్రపౌత్రుఁడు, దౌహిత్రుఁడు, భర్త, సహోదరుఁడు, అన్నదమ్ములు, వారికొడుకులు, తండ్రి, తల్లి, కోడలు, భగిని, భాగినేయుఁడు, సపిండుఁడు, ధనహారి వీరలు క్రమముగ నొకరివెనుక నొకరు పిండదానాధికారు లగుదురు.

వృద్ధమనుః—శ్లో. అపుత్రా శయనం భర్తుః పాలయంతీ వ్రతే స్థితా।
పత్న్యేవ దద్యా త్తత్పిండం కృత్స్న మంశం లభేత చ ॥

తా. పుత్రులు లేని విధవ బ్రహ్మచర్యవ్రతమందుండి భర్తకు పిండోదకక్రియలను తానే చేయుచు భర్తయొక్క యావత్తుసొత్తులను పొందవలయు.

శ్లో. భార్యాపిండం పతి ర్దద్యా ద్భర్త్రే భార్యా తథైవ చ।
శ్వశ్రాదే శ్చ స్నుషా చైవ తదభావే సపిండకాః ॥

తా. భార్యకు భర్తయు, భర్తకుభార్యయు, అత్తమొదలగువారలకు కోడలును పిండదానాధికారులు; వీరు లేనియెడల సపిండులు అగుదురు.

శ్లో. సర్వాభావే స్త్రియః కుర్యు స్స్వభర్తౄణా మమంత్రకం।
(తదాసురాదివివాహోఢావిషయం)
ధర్మై ర్వివాహై రూఢా యా సా పత్నీ పరికీర్తితా।
క్రయక్రీతా తు యా నారీ న సా పత్న్యభిధీయతే ॥
న సా దైవేన వా పిత్ర్యే దాసీం తాం మునయో విదుః ॥

తా. ధర్మవివాహము లగు బ్రాహ్మ-దైవ-ఆర్ష-ప్రాజాపత్య ములలో దేనిచేతనైన వివాహితయగుస్త్రీయే పత్ని యనఁబడును. ఆపె భర్తకు సమంత్రకముగ క్రియలుజేయవలయు. అసురాది వివాహములలో దేనిచేనైనఁ బెండ్లియాడఁబడిన స్త్రీయు, క్రయమునకు కొనబడినదియు, పత్నిగా నేరదు; దాసీ సమానురాలు గనుక అస్త్రీ భర్తకార్యముల నమంత్రకముగఁజేయవలయు,

శ్లో. యజ్ఞేషు మంత్రవత్కర్మ పత్నీ కుర్యా ద్యథావిధి।
తథోర్ధ్వదైహికం కర్మ కుర్యా త్సా ధర్మసంస్కృతా ॥

తా. ధర్మములచేసంస్కరింపఁబడిన స్త్రీ యథాశాస్త్రముగయజ్ఞకర్మలను సమంత్రకముగఁ జేయవలయు. అటులే భర్తయొక్క పరలోకక్రియలను సమంత్రకముగఁ జేయవలయు,

# స్త్రీరోగ చికిత్సా ప్రకరణము.

## వంధ్యా (గొడ్రాలు) భేదములు.

కలిగిన సంతానము మృతిఁజెందుచుండిన నది మృతవంధ్య, సంతానమే కలుగనిది జన్మవంధ్య, రెండు సంతానములు గలిగి పిదపలేనిది కాకవంధ్య, ఒక సంతానము గలిగి పిదపలేనిది కదళీవంధ్యయని తెలియవలయు. ఈదోషము వాతాదిదోషములచే స్త్రీకి రజస్సు చెడుటవలన సంభవించును గనుక చికిత్సఁ జేయవలయు.

## దుష్టార్తవమునకుచికిత్స.

స్త్రీకి-వాతప్రకోపమువలన ఋతుకాలమున ఆర్తవము మాలిన్యము లేక- ఇంచుక యెఱ్ఱనైయుండును; రొండి, గుహ్యము వీనియందు నొప్పి జ్వరము గలిగియుండును—దీనికి శుద్ధిజేసిన తెగడ, ఆముదపువేరు,మామిడివేరు-వీనిని సమముగ చూర్ణము చేసి నాల్గుమాడలయెత్తును ఆవుపాలలోఁగలిపి కారుచుండెడిరక్తము నిలుచువఱకుత్రాగుచుండిన గుహ్యము పరిశుద్ధమగును. తరువాత, లక్ష్మణపంజియను మూలికను సమూలముగ పొడిచేసి నాలుగుమాడలయెత్తును ఆవుపాలలోఁ గలిపి పానమును, కుడిముక్కున నస్యమును జేసిన పుత్రోత్పత్తిగలుఁగును; ఎడమ ముక్కునందు నస్యముజేసిన వందగత్తెయగు కూఁతురు గలుగును; మఱియు వాతమువలన ప్రప్పము బొత్తిగాఁజెడిన యెడల సంతానహీనురాలగును—పూర్వోక్తలక్షణంబులె శ్లేష్మప్రకోపమునందును గలిగి ఆర్తవము జిగటగను, మిక్కుటముగను వెడలుచు నాభియందు నొప్పినిగలిగించును-దీనికి జిల్లేడువేరు ఒలుపు, ప్రేంకణపుప్పము, కుంకుమపువ్వు, నాగకేసరములు చిన్నపెద్ద ముత్తవపులగములు వీనిని సమముగా మెత్తగనూరి మేకపాలతో మూడుదినములు త్రాగిన గుహ్యము శుద్ధంబగును,-తరువాత సొంటిని నూరి గోమూత్రమునందు గలిపి పుచ్చుకొనవలెను—పిత్తప్రకోపమువలన మిక్కిలి నల్లగ ఆర్తవము వెడలును- నడుమున నొప్పి శరీరముసమంటలు గలిగియుండును - దీనికి-నల్లకలువగడ్డ, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, యష్టిమధుకము, శ్రీగంధము వీనిని సమముగా చూర్ణముజేసి మేఁకపాలలోఁగలిపి శుద్ధంబగువఱకుత్రాగి నస్యమును జేసిన పిత్తదోషము హరించును.

## కాకవంధ్యాత్వ చికిత్స.

నీడనెండిన విష్ణుక్రాంతమును సమూలముపొడిచేసి బఱ్ఱెపాలలో నానబెట్టిబఱ్ఱె వెన్నతో నేడుదినములు పుచ్చుకొనిన మంచిసంతానము గలుగుచుండును.

## సర్వవంధ్యాత్వనివృత్తికి చికిత్స.

ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు, ఖర్జూరపండ్లు, ఏలకులు, లవంగపు చెక్క, నాగకేసరములు, ఆకుపత్రి, సొంటి, పిప్పళ్ళు, మిరియాలు, తవాక్షీరి(వెదురునపుట్టునది)



కొబ్బెర, చందనము, యష్టిమధుకము, ఉసిరికపప్పు, చారపప్పు, కురువేరు, వట్టివేళ్లు, జాపత్రి, నేలగుమ్మడుగడ్డ, వల్లేరు, అరఁటిగడ్డ, దూలగొండివిత్తులు, జాజికాయ, తక్కోలపుట్లు, చెంగల్వకోష్టు, మినుములు, వెదురుబియ్యము, నువ్వులు, యవలు, లొద్దుగపువ్వు,తుంగముస్తెలు, జిబిలికవేళ్ళు, జనపవిత్తులు, నల్లజీలకఱ్ఱ, జీలకఱ్ఱ, ఓమము మెంతులు, తాళిసపత్రి, సైంధవలవణము, కొతిమెర్లు, గంటుభారంగి, కర్కాటకశృంగి, గుంటగలగర, గలిజేరువేళ్లు, జీడిపలుకులు, మామిడిపలుకులు, అభ్రక సిందూరము వీనిని సమముగ చూర్ణముచేసి, మొత్తమునకు రెండింతలు తెల్లచక్కెరచేర్చి కర్షప్రమాణమును ఆవునేతితోనైనను, ఆవుపాలతోనైనను మూడు మండలములు (౧౨౦ దినములు) ఉదయ సాయంకాలములయందు పుచ్చుకొనవలెను, ఋతుకాలములయందు మూడువేళలయందుఁ బుచ్చుకొనిన స్త్రీలకు వంధ్యాత్వము,గర్భస్రావము మొదలగునవి నివర్తించి దీర్ఘాయుష్మంతులగు పుత్రులు గలుగుదురు; పురుషులును దీనిని పుచ్చుకొనినయెడల అమితమయిన వీర్యవృద్ధిగలిగి యౌవనము గలవారై గజతుల్యపరాక్రమముగల పుత్రులఁ బడయుదురు.

## ఋతు శూలలకుచికిత్స.

చల్లగుమ్మడివేరుచెక్కను తెచ్చి నాలుగుపుంజీలు (౧౬)వల్ల మిరియాలువేసి మెత్తగా నిమ్మకాయంతనూరి కుంకుడుగింజలంతమాత్రలు చేసి ౩ దినములు, దూరమయిన స్త్రీలకు ఇచ్చిన నొప్పిమానును.

తిప్పతీఁగవేరుచెక్క, దానికి నాలుగవపాలు మిరియములుకలిపి మెత్తగనూరి గచ్చకాయలంతమాత్రలుచేసి నొప్పి కనిపించినవెంటనే ఇయ్యవలెను, అట్లు మూడుమార్లు ఇయ్యవలెను. చప్పిడిపథ్యము; బెల్లము నంజుకొనవచ్చును.

ఎఱ్ఱప్రత్తివేరు, తమలపాకువేళ్ళు, చంద్రవేళ్ళు, నేల యుసిరికవేళ్ళు, మిరియాలు వీనిని కషాయముపెట్టి అంటుఅయిన మూడుదినములును ఉదయమున నియ్యవలయు; ఇచ్ఛాపథ్యము. నాలుగవదినమున మెంతులుఆవునెయ్యికలిపి మెత్తగానూరి ఆవుపాలను మిశ్రముచేసి ఇయ్యవలెను. తరువాత మూడురోజులపర్యంతము. మఱ్ఱి ఊడలు ఇగుళ్లు ఆవుపాలతోనూరి త్రాగించవలయును. పాలుఅన్నము పథ్యము. తామ్రపాత్రములో సువర్ణమునుంచి నీలి వస్త్రమునుకట్టి ధ్యానము చేయించవలయును. మూడురోజులపర్యంతము వేఁప ఈనెలనుగాని ఆకునుగాని ఎండించి అపాగను గుహ్యమునకు పొగవేయవలయు. ఈ చికిత్సచేసిన ఇట్టి ప్రతిబంధకములుమాని సంతానము గలుగును.

## రక్తకుసుమలకు (ఎఱుపు) చికిత్స.

జీలకఱ్ఱను కొంచెము వెచ్చచేసి నూరి-లవంగాలు, ఏలకులు, ధనియాలు ఇవి సమముగ పొడిచేసి కలిపి అధికముతో మాత్రలుకట్టి ఆవునేతితో ఇచ్చినమానును.

## శ్వేతకుసుమలకు (తెలుపు) చికిత్స.

అచ్చుబెల్లము మిరియములునూరి అత్తిపాలుకలిపియిచ్చిన తెల్లకుసుమమానును.

మెఱుగు బియ్యపు తవుడు- పంచదార- లవంగాలు- కలిపి- ఉంటలుచేసి యిచ్చిన తెల్లకుసుమమానును.

మామిడివేరు ఒలుపును ఆవుపాలతోనూరి త్రాగిన ఆర్తవముపైలువెడలును-గర్భము నిలువకుండెడి స్త్రీకి-దూసరితీగె యాకులను ఏడురాత్రులు కడుపునం దునిచి కట్టిన గర్భనాశ హేతువులగు క్రిములు నశించును; మఱియు-పల్లేరువేరు, మఱ్ఱిచెక్క, రావిచెక్క- అత్తిచెక్క, యష్టిమధుకము, వీనిని సమముగ చూర్ణముచేసి అందులో శర్కరపాలు గలిపిత్రాగిన ఋతుశూల, రక్తశూల హరించి గర్భమునిలుచును.

## యోనిశూలకుచికిత్స.

యోనియందు సన్నని పురుగులు పుట్టుటచే నొకవిధమైన శూలగలుగును- దీనికి వేఁపవిత్తులు - ఆముదపు పప్పు వీనిని వేఁపాకు రసముతో నూరి యోనియందునిచినను (లేక) భావంచి విత్తులు-దేవదారు-మంచి పసుపు-వేఁపాకు వీనినిసమభాగములుగనూరి యోనియందునిచినను శూలహరించును - మఱియు - వెల్లుల్లిపాయలు, కరుదూపము, పావర, వాయువిడంగములు వీనిని సమముగజేర్చి నేలములకవుండ్ల రసముతో నూరి యోనియం దేడుదినములు బూసిన క్రిములవలనఁగలిగిన శూలహరించును, ఋతుకాలమునందు శంఖద్రావకమును పుచ్చుకొనిన యోనిశూలలు సర్వశూలలు పోవును.

జాపత్రి- వేఁపకొనలు- చేదుపొట్లాకు- చేఁదుబీరవలుకులు-మ్రానిపసుపు-గూడపాల- మంజిష్టి-కరక్కాయలు- మైలుతుత్తము- మైనము - యష్టిమధుకము- క్రానుగువిత్తులు వీనిని సమముగ చూర్ణముజేసి నేతిలోఁగలిపి సెగచేసి యోనియందుబూసిన-సంకుచిత యోనిదోషము- ఎల్లపుడు యోనియందు స్రవించుట- దుర్గంధము- వ్రణము- శూల ఇవి యన్నియు హరించును- నిత్యము గుహ్యమును గడుగుచు నౌషధమును బూయవలయు.

## యోనిదోషములు.

స్త్రీలకు ఆహార విహారములు క్రమముతప్పి జరుగుటచేతను - రక్తముచెడుటచేతను- బీజ దోషముచేతను - దైవవశము వలన యోనిదోషములు ఇరువది విధములుగ జనించును- అవియేవియనిన:-ఉదావృత్తము- వంధ్య-విప్లుతము- పరిప్లుతము- వాతలము



లోహితక్షయము-వామిని-ప్రస్రంసిని-పుత్రఘ్ని-పిత్తళము - అత్యానందము - కర్ణిని-చరణము-అతిచరణము - శ్లేష్మలము-షండిని - అండిని-మహాయోని- సూచీవక్త్రము-సాన్నిపాతికము - అని తెలియవలయు.

స్త్రీలకు ఉదావృత్తదోషమునందు ఆర్తవము నురుగుతోఁగూడి ప్రయాసముగాస్రవించును.—వంధ్యాదోషమునందు ఆర్తవము చెడియుండును. విప్లుతదోషమునందు ఎల్లపుడునొప్పిగలిగియుండును-పరిప్లుతదోషమునందు మైథునముచేయుటచేబాధగలిగియుండు-వాతలదోషమునందు యోనియందు కాఠిన్యము నొప్పి గలిగియుండును—లోహితక్షయ దోషమునందు రక్తముక్షీణించి యుష్ణముగ యోనినుండి వెడలును—వామినిదోషంబున రజస్సుతోఁగూడిన శుక్రము వాతముతోఁగూడి స్రవించును—ప్రస్రంసినియను దోషంబున ఆర్తవము యోనిస్థానమునుండి భ్రష్టంబగును—మర్దించినను చక్కగస్రవించదు; కావుననే ఇది కడుకష్టముగ ప్రసవమునుగలుగజేయును—పుత్రఘ్నియను దోషమునందు ఆర్తవము నశించుటవలన గర్భము నిలువకుండును. పిత్తళయనుదోషంబున యోనియందు తాపము-పండుట-జ్వరము గలిగియుండును.

అత్యానందదోషంబున-యోని-గాఢమైథునముచేతగూడ సుఖమును జెందదు-కర్ణినిదోషంబున యోనియందు కఫరక్తములచేత పుట్టిన కర్ణికము (మిద్ద) గలిగియుండును-చరణదోషంబున మైథునముచేయుటకుముందే పురుషునికంటె నతిక్రమించును; అనఁగా బురుషుఁడు సురతసుఖముజెందకముందే ద్రవించి సురతక్రీడకు ఓర్వదనుట-అతిచరణదోషంబున పురుషుఁడు మైథున మొనర్చినపిదప మిక్కిలి యాలస్యముగ ద్రవించును. ఈచరణాతిచరణ దోషగ్రస్తములగు యోనులు గర్భమును ధరింపఁజాలవు-శ్లేష్మలద్దోషంబున యోనియందు జిగట-దురద-శైత్యము గలిగియుండును.

షండినియను యోనిదోషంబున ఆర్తవము, స్తనములును లేకుండును - సురతంబున యోని అతికఠినమై గరగరతోఁగూడియుండును—అండినియనుదోషంబున-యౌవనంబుగల స్త్రీ అతిస్థూలలింగ సంభోగమువలన యోనినుండి యండమువలెఁ బైకివెడలును. మహాయోనిదోషంబున-యోనిముఖము మిక్కిలి సంకోచముజెంది సూక్ష్మద్వారము గలిగియుండును. సాన్నిపాతిక దోషంబున సర్వదోష లక్షణములుగూడియుండును - ఇట్టి యోనిద్దోషంబులచేతనే స్త్రీలకు గర్భము గలుగకుండుట - ఒకవేళ ధరించినను నిలువకుండుట-ఒకవేళ నిలిచి సంతానము గలిగినను రమ్యముగ నుండకుండుట సంభవించునుగావున తద్దోషము నివర్తించుటకై చికిత్స జేయింపవలయు.

## ఫల ఘృతము.

మంజిష్టి-అతిమధురము-చెంగల్వకోష్టు-కరక తాడి యుసిరికపప్పులు-పంచదార-ముత్తవపులగము-మేద-పిన్నపాల- తెలమణివేరు- పెన్నేరుగడ్డ-ఓమము- పసుపు

త్రానివనుపు-కటురోహిణి-నల్లకలువగడ్డలు-తెల్లకలువగడ్డలు-ద్రాక్షపండ్లు-కాకోళి-క్షీరకాకోళి-చందనము-రక్తచందనము - వీనిని ఒక్కొక్క కర్షమెత్తు గ్రహించి కల్కము జేసి ఒక ప్రస్థము నేతిలో కలిపి నాలుగు ప్రస్థములు పిల్లిపీచర వేళ్ళరసము- ఆవుపాలు గలిపి నేయి మిగులువఱకు కాంచి ప్రతిదినము రెండుమండలములు పుచ్చుకొనిన-సర్వయోనిదోషములు- గర్భస్రావముమానును; మఱియు దీర్ఘాయుష్యముగల సంతానము గలుగును - స్త్రీలనుమాత్రముగనునట్టి స్త్రీ- సౌందర్యవంతులగుపుత్రులఁ గనును- దీనినే పురుషుఁడును సేవించిన దృఢవీర్యముగలిగి స్త్రీలను తృప్తిపరచును.

## మఱియొక చికిత్స.

తెల్లఆవాలు- వస- మండూకబ్రహ్మి- శంఖపుష్పి- గలిజేరు- పిన్నపాల-కరకతాడి యునిరికలు-చెంగల్వకోష్టు-కటుకరోహిణి-సుగంధిపాల-నల్లసుగంధిపాల, అతిమధురము- చోరకము- జాజితీఁగె- అడ్డసరపువ్వులు- మంజిష్టి- దేవదారు- సొంటి- పిప్పలి- గజపిప్పలి- గుంటగలగర- పసుపు- నల్లతెగడ- సౌవర్చలవణము- మారేడు- తక్కిలి- దుందిలము- గుమ్ముడు- కలిగొట్టు- కోలపొన్న- నేలపొన్న - చిన్నములక- పెద్దములక - పల్లేరు ఈదశమూలములును- ఉత్తరేణు- పెన్నేరుగడ్డ-పిల్లిపీచర వీనిని ప్రత్యేకము రెండుపలములచొప్పునదంచి ద్రోణప్రమాణము (నాల్గుతూములు-3 అపస్లు) నీళ్లుబోసి కాఁచి వడియకట్టి అందు ఆఢకప్రమాణము (3 పలములు) నెయ్యిగలిపి నీరు ఇగురువఱకు కాఁచి గాయత్రితో నభిమంత్రించి గర్భిణికి రెండవమాసము మొదలు ఆఱవ మాసమువఱకు ఇచ్చిన-సర్వజ్ఞత్వము-స్ఫుటవాక్కు-పాండిత్యముగల పుత్రుఁడు గలఁగును-వంధ్యయు గర్భము దాల్చి సుపుత్రునింగనును- పురుషులుపుచ్చుకొనిన శుక్రదోషము అవశ్యము హరించును.

## గర్భిణీ దశమాస చికిత్స.

గర్భిణీస్త్రీకి మొదటినెలయందు గర్భవేదనకలిగినపుడు, జైలుతామర,వట్టివేరు, శ్రీగంధము వీనిని సమముగా నావుపాలుతో నూరి ఒకపలముచొప్పున పుచ్చుకొనవలయు—ఇట్టిగర్భవేదన రెండవమాసమునఁ గలిగెనేని-నల్లకలువగడ్డ, తామరతూండ్లు, బ్రొల్లిపూసవిత్తులు, కర్కాటకశృంగి ఇవి సమముగనావుపాలతో నూరి ఒకపలము పుచ్చుకొనవలయు—ఈవేదన మూఁడవమాసమునందుఁ గలిగినయెడల - శ్రీగంధము గ్రంథితగరము, చెంగల్వకోష్టు, తామరతూండ్లు, తామరచిగుళ్ళు, సమభాగముగ చన్నీళ్ళతో నూరి ఒకపలము పుచ్చుకొనవలయు—నాలవమాసమున -నల్లకలువగడ్డలు, తామరతూండ్లు, పల్లేరు, ములుశలగ, వీనిని సమభాగములుగ నావుపాలతో నూరి 2 పలములు పుచ్చుకొనవలయు—అయిదవమాసమున- గలిజేరు, కాకోళి, గ్రంథితగరము



నల్లకలువదుంపలు, వీని నావుపాలతో నూరి 2 పలములు త్రాగవలయు—ఆఱవమాసమున-పంచదార-వెలగపండ్లగుజ్జు, మంజిష్టి వీనిని సమానముగ చన్నీళ్లతోఁగాని ఆవుపాలతోఁగాని నూరి పుచ్చుకొనవలయు— ఏడవమాసమున- కచోరములు - పుష్కరమూలము-నల్లకలువగడ్డలు వీనిని చన్నీళ్లతోఁగాని పాలతోఁగాని నూరి పుచ్చుకొనవలయు—ఎనిమిదవమాసమున-యష్టిమధుకము-బయలుదామెర-గచ్చపలుకులు-తుంగముస్తెలు-ములువెలగ-గజపిప్పళ్లు-నల్లకలువగడ్డలు-వీనిసమముగనావుపాలతో నూరిపుచ్చుకొనవలయు— తొమ్మిదవమాసమున-పాపరవిత్తులు-ఊడుగవిత్తులువీనిని తేనెతో నూరి కడుపుపైఁ బూయవలయు. మఱియు యష్టిమధుకము- దురదగొండి-సుగంధపాల ఈదినుసులను పాలతో నూరి త్రాగవలయు—పదియవమాసమున-పంచదార - ద్రాక్షపండు నల్లకలువగడ్డలు వీనినిపాలతో నూరి తేనెలోఁగలిపి పుచ్చుకొనవలయు.

## సుఖప్రసవోపాయములు.

పిప్పళ్లు-వస వీని నుదకముతో నూరి దానియందాముదముగలిపి బొడ్డుమీఁద బూసిన బాధతొలఁగి సుఖముగఁ బ్రసవించును—మాదీఫలపువేరు- అతిమధురము. వీని చూర్ణమును నేతిలో కలిపి త్రాగిన సుఖముగఁ బ్రసవించును. చెఱకుయొక్కగాని- తాటిచెట్టుయొక్కగాని ఉత్తరప్రక్క వేరును గర్భిణీస్త్రీ, పాదపుగలదారముతో కట్టి నడుమున కట్టుకొనిన సుఖముగ శీఘ్రముగ బ్రసవించును. తెల్లయుత్తరేణివేరునుగాని వేఁపవేరునుగాని - వెలుమసంధివేరునుగాని మంచి దినమునందు శుభముహూర్తమున దెచ్చి నడుమునందు ధరించిన సుఖముగఁ బ్రసవించును.

## గర్భిణీ జ్వరమునకు.

కరక్కాయలు-గూడపాల-చిఱుబొద్ది-కురువేరు- తుంగముస్తెలు-సొంటి, వీనిని సమభాగములుగ గ్రహించి కషాయముగాచి పుచ్చుకొనిన జ్వరము మానును.

## గర్భిణీ అతిసారమునకు.

దురదగొండి-ముత్తవపులగము-చిఱుబొద్దివేరు-సొంటి-తుంగముస్తెలు- ఈవస్తువులను కషాయముంచి పుచ్చుకొనిన అతిసారము నిలుచును.

## గర్భిణీశోఫ (వాపున)కు.

గలిజేరువేరు-అల్లము ఈరెంటిని కషాయముగాచి పాలుగలిపి రాత్రులయందుఁ బుచ్చుకొనిన, వాపు - ఉదావర్తము-గుల్మరోగము - అర్శోరోగము- ఇవియన్నియు మానును. మఱియు-గలిజేరువేళ్ళకషాయమునందు నెయ్యి-బెల్లము కలిపి పుచ్చుకొనిన- వాపులు - ఉదావర్తము మానును.

## గర్భిణీ కాస (దగ్గు) శ్వాస రోగమునకు.

మిరియములచూర్ణము-పంచదార-ఈరెంటిని తేనెయందైనను నేతియందైనను కలిపి పుచ్చుకొనిన దగ్గుమానును. మాదీఫలస్వరసమునందు పిప్పలిచూర్ణము - మిరియములాది ఈరెంటిని కలిపి పుచ్చుకొనిన- శ్వాసము- తొమ్మనొప్పి- దగ్గు మానును.

మఱియు కర్కాటకశృంగి-గంటుభారంగి-వస-సొంటి పిప్పలిమిరియాలు-కావిరాయి-కటుకరోహిణి - కరక్కాయలు ఈవస్తువులను సమానముగనూరి కలకముదీసి దానియందు నేతినైనను తేనెనైనను కలిపి పుచ్చుకొనిన శ్వాసకాస లడఁగును.

## గర్భిణీ ఛర్ది (వాంతి) కి.

మారేడువేళ్ళు-ఏలాలు-కురువేరు-వట్టివేరు వీని కల్కమునుపుచ్చుకొనినను; యష్టిమధుకము-వట్టివేరు ఈరెండువస్తువుల కషాయమందుఁగాని-ద్రాక్ష-యష్టిమధుకము వీని కషాయములోఁగాని పంచదార కలిపి పుచ్చుకొనిన వాంతులు మానును.

## గర్భిణీ అగ్నిమాంద్యమునకు.

ఓమము-పెన్నేరుగడ్డ-జీలకఱ్ఱ-పిప్పళ్ళు-మోడి వీనిని సమముగగ్రహించి చూర్ణముచేసి-యందు-తేనె-బెల్లము కలిపి-లేహ్యపాకముజేసి పుచ్చుకొనవలయును.

## గర్భిణీ వాతమునకు.

మారేడువేరు-కూరనెల్లి వీనినైనను - కలిగొట్టు-సొంటి వీనినైనను పాలయందు వేసి కాఁచిపుచ్చుకొనిన వాతరోగము హరించును.

## సూతికా వాతమునకు-బడబానలరసము.

శుద్ధిచేసినరసము ౧ భాగము-తామ్రభస్మము ౧ భాగము-శుద్ధిచేసిన గంధకము ౨ భాగములు, సొంటి-పిప్పళ్ళు-మిరియాలు-చిత్రమూలము - చెంగల్వకోష్టు ఇవి ఒక్కొకభాగముచొప్పున ఖల్వమందునిచి నమలిచెక్క రసముతో ౭ జాములు నూరి రేఁగుగింజంతమాత్రలుచేసి మిరియాలపొడి ఆవునేయికలిపిన అనుపానమునందుఁగాని-వెల్లుల్లిపాయలరసము-నూనెబొట్టు కలిపిన యనుపానమునందుగాని ఇంక ననుపానవిశేషములతోఁగాని యొకమాత్రను పుచ్చుకొనిన సూతికావాతము హరించును.

## స్తన్యవృద్ధికి.

నేలగుమ్ముడుగడ్డను పాలతోనూరి రసమునుపిండి దానియందు చక్కెర గలిపి త్రాగిన-పాలువృద్ధియగును. పిల్లిపీఁచరవేళ్ళను పాలతోనూరి త్రాగినను- గోరువెచ్చన గల పాలలో పిప్పలీచూర్ణమును కలిపి త్రాగినను స్తన్యము వృద్ధియగును.

---

శ్లో॥ దుష్టవీర్యస్యసంబంధా త్స్త్రీణాం రోగః ప్రజాయతే ।
తస్మాచ్ఛుక్లవిశుద్ధ్యర్థ ముచ్యంతే హ్యౌషధా ఇహ ॥

తా. పురుషుని దుష్టవీర్య సంబంధమువలన స్త్రీలకు అనేకరోగములు జనించును కావున రేతోదోషము హరించుటకై యౌషధంబులు చెప్పఁబడుచున్నవి.

## శుక్రదోషమునకు,శుక్రవృద్ధికి.

ఉసిరికపప్పుచూర్ణమును చెఱకురసమందు చక్కగ నానబెట్టి నీడనెండినపిదప మరల ఈప్రకారము అనేకమార్లుచేసి నీడనెండినచూర్ణమునకు సమముగ, తేనె పంచదారకలిపి భుజించి వెంటనే ఆవుపాలుత్రాగిన శుక్రదోషము నివర్తించి వీర్యవృద్ధిగలుగు. ఇట్లు రెండుమండలములు పుచ్చుకొనిన వీర్యముశుద్ధంబై సత్సంతానముగలుగు.

వీర్యవృద్ధికి:—ములగపువ్వులు - గొబ్బివిత్తులు వీనిని ఉసిరికకాయతోనూరి పాలలో త్రాగిన బలము, వీర్యవృద్ధియు గలుగును.

## నష్టేంద్రియమునకు ఘుటికలు.

అతిమధురము ద్రాక్షపండు ఖర్జూరపండు-ఏలకులు-లవంగపుచెక్క- ఆకుపత్రి-నాగకేసరములు-తేనె-తంగేడువిత్తులు-శ్రీగంధము- నేలతాటిగడ్డలు- మేడిబంక వీనిని సమభాగములుగ తీసికొని అన్నిటికి సమముగ జాజికాయలు-అన్నిటికి రావపాలు సిందూరము వీనినిచేర్చి నూరి చిన్నప్రమాణము మాత్రలుకట్టి తెల్లవాఱ-సాయంకాలము ఒక్కొకమాత్రచొప్పున ఆవువెన్నతో ఒకసంవత్సరము పుచ్చుకొనిన నష్టేంద్రియదోషముహరించి వీర్యవృద్ధియగు. ఆవనూనె పులుసు, స్త్రీసంగము కూడదు.

## కాశీనాథోక్త పూర్ణచంద్రరసము.

శుద్ధిచేసినరసము ముక్కాలు పలము, శుద్ధిచేసినగంధకము ముక్కాలు పలము, లోహభస్మము-జారణము చేయఁబడిన అభ్రకభస్మము ఒక్కొకపలము, రజతభస్మము ౨తులములు, వంగభస్మము ౧౹పలము, సువర్ణభస్మము, తామ్రభస్మము,కంచుభస్మము ఇవి ఒక్కొకతులము,జాజికాయ,లవంగము,ఏలకులు, లవంగపట్ట (దాచినిచెక్క) జీలకఱ్ఱ,పచ్చకర్పూరము,నల్లవిష్ణుక్రాంతము-తుంగముస్తెలు-ఇవి ఒక్కొకపలము చొప్పున నన్నిదినుసులను ఖల్వమందుంచి కలుబందరసముతోనూరి ఆ ముద్దను నీడ నెండించి పిల్లిపీఁచర రసములోనానబెట్టి, దానితిరుగానీడ నెండించి తిరుగా ఆముదపువేళ్ల రసములోనానబెట్టి. యాముద్దను ఆముదపాకులలోచుట్టి ధాన్యరాశియందు దొకయహోరాత్రముంచి దానింగొని తిరుగానూరి రెండుగురిగింజలంతమాత్రలు చేసి నీడనెండించి-ఒకమాత్రను-తమలపాకుతునుకయందుంచి నమలిమ్రింగిన అశేషరోగములు నివారణంబగును. మఱియు నీయౌషధము అత్యంతవీర్యవృద్ధిని, శరీరపుష్టిని, బుద్ధిని, వాక్పాటవమును, ఆనందమును, శరీరకాంతిని, సంభోగశక్తిని కలుగజేయును. వాజీకరణమునకు దీనికి మించినయౌషధం బేదియులేదు; ఈ యౌషధమును భుజించినవానియందు స్త్రీలు మిక్కిలి ప్రేమగలిగియుందురు; మఱియు వార్ధక్యదోషము,అల్పశుక్రదోషము శరీరకార్శ్యము మొదలగు దోషములుతొలఁగి కాంతి, బలము, ఇంద్రియపుష్టి గలుగును. స్త్రీయుంపుచ్చుకొనిన వంధ్యాత్వము నివర్తించి సత్సంతానము గలుగును.

## వసంత కుసుమాకరము.

సువర్ణభస్మము ౨ భాగములు, రజతభస్మము ౨ భాగములు, వంగభస్మము 3 భాగములు, సీసభస్మము 3 భాగములు, కాంతభస్మము 3 భాగములు, రసభస్మము, అభ్రకభస్మము, పగడభస్మము, ముత్తియపు భస్మము ప్రత్యేకముగ నాలుగేసి భాగములు వీనిని ఖల్వమందుంచి, ఆవుపాలు, చెఱకురసము, అడ్డసరపు రసము, చందన కషా

యము, వట్టివేరుకషాయము, కురువేరుకషాయము, పసుపుకషాయము, అరటిగడ్డరసము, తామరదుంపలరసము, జాజిమొగ్గలరసము వీనితో ప్రత్యేకముగ నేడేసిమార్లు భావన జేయవలెను. అనంతరము కస్తూరితోను భావన జేయవలయు. దీనిని ౨ గురిగింజలయెత్తును చక్కెర, తేనె, నేయి వీని యనుపానములతో పుచ్చుకొనిన, మేహము, క్షయము మొదలగు సకలరోగములు తొలంగును. ఈ యౌషధమును భక్షించిన పురుషుఁడు పరిశుద్ధమైన ఇంద్రియముగలిగి సంభోగకాలమున నూరుమంది స్త్రీలనైనను ఓడించువాఁడు అగును. మఱియు సత్సంతానము గలవాఁడగును.

## పూర్ణచంద్రోదయము.

సూక్ష్మముగ కత్తిరించి శుద్ధిచేయఁబడిన కుందనపురేకులు ౧ పలము, శుద్ధిచేసిన పాదరసము ౨ పలములు, శుద్ధిచేసిన ఆమ్లసారశిలగంధకము ౧౬ పలములు వీనిని ఖల్వమందుంచి ఎఱ్ఱప్రత్తిపువ్వులరసముతో నొకదినమునూరి కలబందరసముచే మఱియొక దినమునూరి, సెనగలంతమాత్రలు చేసి ఎండినవెనుక గాజుకుప్పెలోఁబోసి చీలమన్నిచ్చి వాలుకాయంత్రమున మృదు తీక్ష్ణ గాఢాగ్నులచే మూడుదినములు వండి సాంగశీతలమునఁదీసి మాత్రలుచిగురుటాకువలె ఎఱ్ఱనైయుండిన పక్వమైనదని తెలిసికొని, పచ్చకర్పూరము, జాజికాయ, పిప్పళ్లు, లవంగము ఇవిదినుసుకు ౧ పలము, కస్తూరి ౨ మినపగింజలంతను చేర్చినూరి ఆమాత్రలలోఁ చేర్చి కలిపిన నౌషధముసిద్ధమగును; దీనిని మినపగింజంత తమలపాకులో నునిచి పుచ్చుకొనినవాఁడు వీర్యవృద్ధికలవాఁడై రతికాలంబున నూర్గురుస్త్రీలకు గర్వభంగముజేయును. ఈ యౌషధము తీసికొనినవారలకు శీఘ్రముగ ముసలితనము రానేరదు. దీనిని భుజించువాఁడు పేరిననెయ్యి, ఆవుపాలు, మీఁగడ, మినుములు, కలిసిన మధురభక్ష్యములను అనుభవించవలయు. దీనిని ౧ సంవత్సరము సేవించిన సకలవ్యాధులు తొలంగి కృత్రిమస్థావరాది విషంబులును అంటవు.

## తాంబూలరాగోదయయోగము.

ఏలకులు-చందనపొడి-నల్లకలువదుంప-లవంగాలు-జాజికాయ-కస్తూరి-చామంతిపువ్వులు-పచ్చకర్పూరము-తుంగదుంపలు-కుంకుమపువ్వు-చిన్నయేలకులు - తక్కోలపుట్లు-జటామాంసి-తేనె-చందనఅత్తరు వీనిని సమభాగములుగ పన్నీరుతోనూరి సెనగగింజలంతమాత్రలుచేసి తాంబూలములో పుచ్చుకొనిన - వాతము, క్రిములు, కఫము, శూల, నోటికంపు మొదలగు రోగములు పోవును. దంతములు వజ్రాయుధము వలె పటుత్వము గలిగియుండును.

ఇతి శ్రీమద్రాజగోపాలకృపాపరిలబ్ధ పాండిత్యవైభవ శ్రీమద్గౌతమవంశ
సుధాంబుధి పూర్ణసుధానిధి శ్రీమద్వేంకటాచార్య విరచితే
స్త్రీధర్మరత్నభాండాగారే-స్త్రీజాతిభేదాదికథనంనామ
చతుర్థప్రకరణమ్.

---

